# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 12 సంచిక : 7 హైదరాబాద్ 156 జూలై 2014 పేజీలు : 68 రు. 20

- తెలంగాణ విజయ వైఫల్యాలు
- అధికరణం 370 పూర్వాపరాలు
- బదాయున్ అత్యాచారాల నేపథ్యం
- రుణమాఫీ - వ్యవసాయ సంక్షోభం
- ఆదివాసులకు ద్రోహం పోలవరం
- బ్రెజిల్ ప్రపంచకప్ నిరసనలు
- ఇరాక్ లో జాతీయ యుద్ధం

# వీక్షణంకు రాయండి, రాయించండి

పన్నెండు సంవత్సరాలుగా ప్రతినెలా దాదాపు ఇరవై వ్యాసాలతో పాఠకుల, ప్రజల సమాచార, అవగాహనా, విశ్లేషణా అవసరాలను తీర్చడానికి వీక్షణం రాజకీయార్థిక మాసపత్రిక చేస్తున్న కృషి మీకు తెలుసు. అయితే ఎంత కృషి చేసినా చేయవలసిన కృషి మిగిలిపోయేంత వైవిధ్యభరితమైన, వైరుధ్యపూరితమైన సమాజం మనది. ఎంత రాసినా సమాజం తనగురించి తాను ఆలోచించుకోవలసిన విషయాలు, రాయవలసిన విషయాలు, వెలుగు ప్రసరించవలసిన విషయాలు, అవగాహన పెంపొందించుకోవలసిన అంశాలు ఇంకా ఎన్నో మిగిలిపోతూనే ఉన్నాయి. ముఖ్యంగా ఇటీవలి అంతర్జాతీయ, దేశీయ, ప్రాంతీయ పరిణామాలు ఇంకా ఎక్కువ రచనలను, ఆలోచనలను కోరుతున్నాయి.

పేదదేశాలను కబళిస్తున్న ప్రపంచీకరణ, సామ్రాజ్యవాద రాజ్యాల, బహుళజాతి సంస్థల దుర్మార్గాలు, వారు తెచ్చిపెడుతున్న యుద్ధాలు ఎంత రాసిన తరగనివే. మతోన్మాద రాజకీయాల పునాది మీద, అభివృద్ధి భ్రమలతో అధికారంలోకి వచ్చిన నరేంద్ర మోడీ ప్రభుత్వ నేపథ్యంలో దేశ వ్యాప్తంగా రానున్న సంవత్సరాలలో అమలు కానున్న రాజకీయార్థిక విధానాలు నిశితంగా పరిశీలించి, ప్రజలకు తెలియజెప్పవలసినవే. కొత్తగా రూపొందిన రెండు తెలుగు రాష్ట్రాలలోనూ పెల్లుబుకుతున్న ప్రజా సమస్యలు వివరంగా చర్చించుకోవలసినవే. తెలుగుదేశం పాలనలో కొత్త ఆంధ్రప్రదేశ్ లో ప్రకటిస్తున్న విజన్ 2020 అభివృద్ధి నమూనా, గతంలో ఉమ్మడి రాష్ట్రంలో అమలై వినాశకరమైనదిగా రుజువైనదే. తెలంగాణలో ప్రజా ఉద్యమ క్రమంలో ఆకాంక్షలు విపరీతంగా పెరిగిపోయిన నేపథ్యంలో, వ్యవస్థ మార్పు తప్ప మరేదీ ఆ ఆకాంక్షలను తీర్చలేని స్థితిలో ప్రజా అసంతృప్తి పెరిగే అవకాశం ఉంది. అంటే దేశవ్యాప్తంగానూ, రెండు తెలుగు రాష్ట్రాలలోనూ రానున్న కాలంలో తీవ్రమైన ప్రజా సమస్యలు, ప్రజా ఆందోళనలు విస్తరించే అవకాశం ఉంది.

సమాజం తనతో తాను జరుపుకునే సంభాషణకు గళంగా, ప్రజానుకూల చర్చావేదికగా వీక్షణం ఈ సామాజిక స్థితికి అద్దం పట్టదలచుకుంది. ఈ సామాజిక స్థితిని విశ్లేషించదలచుకుంది. గ్రామీణ, స్థానిక, ప్రాంతీయ స్థాయిలలో ఎక్కడెక్కడ ప్రజా సమస్యలు వ్యక్తమయినా, ప్రజా అసంతృప్తి పొడసూపినా, ఉద్యమ రూపం ధరించినా ఆ పరిణామాలన్నిటినీ వీక్షణం ప్రచురించదలచుకుంది. ఈ కర్తవ్య నిర్వహణలో భాగం కావలసిందిగా వీక్షణం తన పాఠకులకూ, అభిమానులకూ, ఆలోచనాపరులకూ, రచయితలకూ అందరికీ విజ్ఞప్తి చేస్తున్నది. ఈ విషయాల మీద రాయడానికి ప్రయత్నించండి. రాయండి, రాయించండి. ప్రధాన స్రవంతి పత్రికలు విస్మరించే అంశాలపై, ప్రధాన స్రవంతి పత్రికలలో వెలువడినా భిన్నమైన ప్రజాకోణం ఉండే అంశాలపై వ్యాసాలు, అన్ని సామాజిక అంశాల మీద ప్రజాదృక్పథాన్ని అందించే వ్యాసాలు ప్రచురించడం వీక్షణం లక్ష్యం. వీక్షణంకు అటువంటి వ్యాసాలు రాయగలిగిందీ, రాయవలసిందీ, రాయించవలసిందీ మీరే. మీరే.

156

ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

జూలై 2014
సంపుటి : 12
సంచిక : 7





## అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు

ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ద్యామర రేణుక; నల్గొండ – జి. వెంకటేశ్వర్లు; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్; అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; నెల్లూరు – బాలగురువయ్య; విశాఖపట్నం – పి.వి. రమణ; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత



**ప్రింటర్స్**
**డక్కన్ ప్రెస్ / చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

**డిస్ట్రిబ్యూటర్స్**
**ఆనంద్ ఏజన్సీస్**
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
మైత్రీ రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్
ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

# పాఠకుల వీక్షణం

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో సూరి (హైదరాబాద్), వరంగల్ మిత్రుడు రు. 5,000, బాలాజీ వరప్రసాద్ రు. 4,000, గాడి నరేష్ ఫౌండేషన్ (నర్సాపురం, పశ్చిమ గోదావరి జిల్లా) రు. 10,000 ఆర్థిక సహాయం అందజేశారు. అందరికీ కృతజ్ఞతలు. - సం.**

వీక్షణం గత మూడు సంచికలలో 'కులం – మార్క్సిస్టు దృక్పథం – ఒక నోటు' పేరుతో ప్రచురించిన వ్యాసం చాలా బాగుంది. నాలాంటి వాళ్లకు చాలా అవగాహన స్థాయిని పెంచింది. ముఖ్యంగా కులం పట్ల దళిత వాదుల దృక్పథం, అంబేద్కర్‌కు కులం పట్ల ఉన్న దృక్పథం – దళితవాదం పట్ల దృక్పథం చాల మంది అభ్యుదయంగా ఆలోచించే దళితులకు ఈ వ్యాసం చాల ఉపయోగపడుతుంది. రవి లాంటి రచయితల వ్యాసాలకు, సిద్ధాంత చర్చలకు వీక్షణం తగిన ప్రాధాన్యతను ఇవ్వాలని కోరుతున్నాను.

**– బి. రామయ్య**
మిర్యాలగూడెం, నల్లగొండ

వీక్షణం జూన్ 2014 సంచికలో ప్రచురితమైన వ్యాసాలు: నటాషా రాసిన 'జనతన సర్కార్లల్లో ప్రజా వైద్యం', విశ్వం రాసిన 'ఈ శతాబ్దపు రైఫిల్' విజ్ఞాన దాయకమైన సమాచారాన్ని అందించాయి. విప్లవ పథంలో – అంతర్జాతీయ శ్రామికవర్గ దృష్టి – ధృక్పథం, సోషలిస్ట్ స్పిరిట్, కమ్యూనిస్ట్ తాత్వికత ఎలా పనిచేస్తాయో ఈ వ్యాసాలు తెలియచేస్తున్నాయి. ఇవి చదువుతూ నేను చాలా భావోద్వేగానికి గురయ్యాను. వ్యాసకర్తలకు, వీక్షణానికి ధన్యవాదాలు.

**– భూసారం శివన్న**
హైదరాబాద్

వీక్షణం మే సంచికలో రాసిన ఉత్తరానికి స్పందనగా ఈ ఉత్తరం రాస్తున్నాను. పునాది, ఉపరితల నిర్మాణం అనేవి విడివిడిగా కాకుండా ఏకకాలంలో వ్యక్తుల సామాజిక అనుభవంలోకి వస్తాయి. ఉపరితల నిర్మాణం అనేది కేవలం సిద్ధాంతం, మతం, తత్వశాస్త్రం వంటి భావ రూపాలే కాకుండా చట్టసభలు, న్యాయస్థానాలు, పోలీస్, సైనికవ్యవస్థలు, మీడియా, విశ్వవిద్యాలయాల వంటి వస్తు నిర్మాణాలు కూడా ఉంటాయి. అన్ని వస్తు నిర్మాణాలలాగే వీటికి నిశ్చేష్టత (ఇనర్షియా) ఉంటుంది. ఆ సంస్థల సభ్యులకు ఉండే అధికారాలు, సౌకర్యాలు, పలుకుబడి వంటి ప్రయోజనాలు వాటిలోని వ్యక్తుల స్థాయిని దాటిన వ్యవస్థీకృత (ఇన్‌స్టిట్యూషనల్) రూపంలో ఈ నిశ్చేష్టత వ్యక్తమవుతుంది. అన్ని స్థాయిల్లో సంఘర్షణ జరపవలసిన అవసరం కూడా దీని నుండే పుడుతుంది. మార్క్స్ చేసిన పునాది, ఉపరితల నిర్మాణం అనే విభజన అనేది అమూర్తవంగా (అబ్‌స్ట్రాక్ట్) విడదీసి చూడవచ్చేమో గాని, ఆచరణలో ఆ విభజనను ఒక అలంకార రూపం (మెటఫర్) గా చూడాలి. సివిల్ ఇంజనీరింగ్‌లో విభజనగా కాదు.

భారతదేశానికి మార్క్సిజం బ్రాహ్మణీయ రూపంలో వచ్చింది అని బహుజన మేధావులు ఆరోపిస్తారు కాని, వాస్తవానికి మన సిద్ధాంతం, ఆచరణ చాలావరకు దిగజారిన రష్యన్ విప్లవం నుండి స్టాలిన్ రూపంలో వచ్చింది. ఉదాహరణకి, కమ్యూనిస్టు పార్టీలో కేంద్రీకృత ప్రజాస్వామ్యం ఉంటుంది. పార్టీ ఏకశిలా నిర్మాణం (మొనొలిత్) వంటి గందరగోళం మనకు చాలా ఉంది. వాస్తవానికి, కమ్యూనిస్టు పార్టీలో ఉండవలసినది ప్రజాస్వామిక కేంద్రీకరణ (డెమోక్రటిక్ సెంట్రలిజం). కేంద్రీకృత ప్రజాస్వామ్యం (సెంట్రలైజ్డ్ డెమోక్రసీ) కాదు. ఈ సూత్రం లెనిన్ కనిపెట్టింది కాదు, బోల్షివిక్ పార్టీకి పరిమితం కాదు. రష్యన్ విప్లవంలోని అన్ని రాడికల్ పార్టీలు ఈ సూత్రాన్ని ఆమోదించాయి.

ఇక రష్యాలో రివిజనిజం విషయంలో స్టాలిన్‌ను తప్పించి, మొత్తం నేరం కృశ్చేవ్ కుట్రలకు పరిమితం చేశారు. వాస్తవానికి రష్యన్ విప్లవం అంతర్జాతీయ విప్లవోద్యమంలో నుండి ఒక దేశ పరిధిలోకి స్టాలిన్ కాలంలోనే కుదించుకుంది (ఒకే దేశంలో సామ్యవాదం అనే నినాదం స్టాలిన్‌ది).

స్టాలిన్ నాయకత్వంలోనే రష్యన్ కార్మికవర్గ ప్రజాస్వామ్యానికి సమాధి కట్టారు. ఉదాహరణకి, లెనిన్ జీవించి ఉండగానే సోవియట్ సమాఖ్యలో దేశాల స్వయం నిర్ణయ హక్కు మీదే స్టాలిన్ నాయకత్వంలోని వారితో లెనిన్ కదలలేని స్థితిలో, ఉత్తరాల ద్వారా పోరాటం జరిపాడు. (చూడండి. ది ఫైట్ ఒపెన్స్ : ది నేషనల్ క్వశ్చన్ అండ్ ది వాలంటరీ యూనియన్ ఆఫ్ సోవియెట్ రిపబ్లిక్స్; లెనిన్స్ ఫైనల్ ఫైట్, పిపి. 77-94).

ఈ వివరాలతో, నాకు పరిచయస్తులైన పార్టీల నాయకులను నిలదీస్తే, వ్యక్తిగతంగా స్టాలిన్ – ట్రాట్స్‌కీ వివాదాన్ని ముగిద్దాం (లెట్ అస్ బరీ స్టాలిన్ అండ్ ట్రాట్స్‌కీ) అని అంటారుగాని ఆ ముగింపు ఏదో ఒక నిర్ధారణతో జరగాలి అని మరచిపోతారు. అదే సమయంలో, సంస్థాగతంగా ఆ పార్టీలు స్టాలిన్ విప్లవ నాయకత్వాన్ని కొనియాడుతూనే ఉంటాయి. రష్యన్ విప్లవం, మూడవ ఇంటర్నేషనల్ పాత్ర, రివిజనిజం గురించి చర్చ జరగాలి. అందుకు అవసరమైన పొలిమిక్స్‌కు వేదికగా వీక్షణం పనిచేయగలిగితే వామపక్ష ఉద్యమాలకు మేలు జరుగుతుంది.

**– నరేంద్రమోహన్**
ఆస్ట్రేలియా

నేను మార్చ్ 2014 సంచికలో రాసిన వ్యాసానికి స్పందన రాస్తూ జూన్ సంచికలో ఎం. గోపాల్ (చెన్నై) నా వ్యాసంలో 'చైనాలో (మావో కాలంలో) రసాయనాలు లేవు, హైబ్రిడ్ విత్తనాలు లేవు' అని రాయడం గతితార్కిక విరుద్ధంగా ఉంది అన్నారు. కొన్ని సంవత్సరాల క్రితమే మావో కాలపు చైనా చరిత్రపై పుస్తకాలు చదివాను. వాటిలో చాలా స్పష్టంగా, ఫొటోలతో సహా మావో కాలంలో రసాయనిక ఎరువులు వాడడం ద్వారా వ్యవసాయం చేసినట్టు రాశారు. కాబట్టి మావో కాలంలో రసాయనిక ఎరువులు, హైబ్రిడ్ విత్తనాలు వాడలేదనేది ఎట్టి పరిస్థితులలో నా అభిప్రాయం కాదు. అయితే, నా వ్యాసంలోని మొదటి పేరా నేను ఏ భావం వ్యక్తపరచాలని రాశానో, ఆ భావం అందులో సరిగ్గా వ్యక్తమవలేదనంటే అది ముమ్మాటికీ రచయితగా నా తప్పే అవుతుంది. దానికి క్షమాపణలు. నేను ఆ పేరాలో ఏమి చెప్పాలనుకున్నానంటే, మావో కాలంలో కొందరు రైతులు మావో తత్వశాస్త్ర రచనలు చదివి, ఆ తత్వశాస్త్రాన్ని వ్యవసాయానికి అన్వయించడం ద్వారా వారు కొన్ని అద్భుత విజయాలు సాధించారు. ఈ విజయాలకు ముందు వారు రసాయనిక ఎరువులను, హైబ్రిడ్ విత్తనాలను వాడినప్పటికీ ఒక స్థాయికి మించి ఉత్పత్తి పెరగలేదు. కేవలం మావో తత్వశాస్త్ర రచనలు చదివి, వాటిని వ్యవసాయానికి అన్వయించి చేసిన ప్రయోగాల ద్వారానే ఈ విజయాలు (అత్యధిక దిగుబడులు) సాధ్యమయ్యాయి తప్పించి, రసాయనిక ఎరువులు, హైబ్రిడ్ విత్తనాల ద్వారా కాదు. మావో తత్వశాస్త్రాన్ని వ్యవసాయానికి అన్వయించి చేసిన ప్రయోగాలలో కూడా సదరు రైతులు రసాయనిక ఎరువులు, హైబ్రిడ్ విత్తనాలు వాడినప్పటికీ, ఆ అత్యధిక దిగుబడి విజయం మాత్రం కేవలం తత్వశాస్త్ర ప్రయోగం వలననే జరిగింది. అదే ప్రతిస్పందనలో 'వందల రకాల' అన్‌సైంటిఫిక్ భావాలు అనే విశేషణంతో రాయడం అవసరమా అన్నారు. అయితే, టెక్నికల్‌గా అలా అనవచ్చా అనే విషయం నాకు తెలవదు కాని, మన ఊహకు కూడా అందనన్ని రకాల అన్‌సైంటిఫిక్ భావాలు ఉన్నాయి. వాటిలో కొన్నింటిని నేను దగ్గరగా చూశాను. అందుకే, అలా రాశాను.

**– లోక సంచారి**
హైదరాబాద్

ఒక ప్రాంతపు భాషను, సంస్కృతిని, ప్రజల్ని అవమానపరిచే, కించపరిచే అహంకార పూరితమైన ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియాను స్వచ్ఛందంగా బహిష్కరించే విధంగా ప్రజల చైతన్యం పెంచాలి. అలాంటి దినపత్రికల్ని కొనడం మానివేయాలి. అలాంటి కంపుకొట్టే టివి చానల్స్ చూడడం మానివేసేలా ప్రచార క్యాంపెయిన్ తీసుకోవాలి. దోపిడి వర్గాల కొమ్ముగాసే మదమెక్కిన కార్పొరేట్ మీడియాకు టిట్ ఫర్ టాట్ యే సరైన జవాబు. స్వాభిమానం కలవాళ్లేవరైనా చేయాల్సిన పని అదే.

**– నటాషా**
(వీక్షణం బ్లాగ్‌పై)

వీక్షణం పత్రికలో సామాజిక, ఆర్థిక, రాజకీయ వ్యాసాలు చాలా మంచిగా ఉన్నాయి. ఇంకా కుల వృత్తులపైనా, కుల అణచివేతపైనా, సామాజిక న్యాయంపైనా ప్రధానంగా బహుళజాతి ప్రపంచీకరణపైనా పాలక వర్గాల కనిపించని కుట్ర రాజకీయాల పైనా ప్రత్యామ్నాయ రాజకీయాల పైనా మరింత అవగాహన కలిగే విధంగా వ్యాసాలు రావాలని కోరుకుంటున్నాను.

**– బెజ్జంకి ప్రభాకర్**
(వీక్షణం మెయిలకు వచ్చిన ఉత్తరం)

వీ

వీక్షణం

# కొత్త రాష్ట్ర ప్రభుత్వాల పాత పద్ధతులు

**ఈ** నెల మొదటి వారంలో రెండు తెలుగు రాష్ట్రాలలోను ప్రభుత్వాలు ప్రమాణ స్వీకారాలు చేసి పాలన ప్రారంభించాయి. మే 16ననే ఎన్నికల ఫలితాలు వెలువడి, తెలంగాణలో తెలంగాణ రాష్ట్ర సమితి, ఆంధ్రప్రదేశ్‌లో తెలుగుదేశం పార్టీ అధికారంలో రాదగిన ఆధిక్యత సంపాదించినప్పటికీ, జూన్ 2 న రాష్ట్ర విభజన తేదీ నిర్ణయం అయినందువల్ల, మూడు వారాల పాటు గవర్నర్ పాలనే కొనసాగింది. చివరికి కల్వకుంట్ల చంద్రశేఖర రావు ముఖ్యమంత్రిగా తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం జూన్ 2న, నారా చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రిగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం జూన్ 8న పదవీబాధ్యతలు చేపట్టాయి. ఇంకా నెల కూడ గడవకుండానే ఈ రెండు ప్రభుత్వాల పని తీరు గురించి వ్యాఖ్యానించడం సముచితం కాదని అనుకునేవారు ఉండవచ్చు. కాని, ఈ ప్రభుత్వాల పాలనా దిశకు కనీస సూచనలు ఇప్పటికే వెలువడుతున్నాయి గనుక ఈ దారి ఎటు వెళ్లనున్నదో చెప్పవచ్చు. ఈ దేశంలో గత ఆరు దశాబ్దాలుగా అన్ని పార్లమెంటరీ రాజకీయ పక్షాలూ అమలు చేసిన రాజకీయార్థిక విధానాల నేపథ్యంలో ఈ రెండు ప్రభుత్వాలూ ఏయే వాగ్దానాలు చేసినప్పటికీ, వాస్తవంగా ఏమి చేయగలవో, ఏమి చేస్తాయో ఊహించవచ్చు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వాన్ని నిర్వహించనున్న ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడుకూ, తెలుగుదేశం పార్టీకీ గతంలో పాలనానుభవం ఉంది గనుక ఈసారి వారి పాలన ఎలా ఉండబోతుందో చూడడం ఆసక్తికరంగా ఉంటుంది. తెలుగు దేశం పార్టీ 1995 నుంచి 2004 వరకు అధికారంలో ఉండి అవలంబించిన విధానాల పట్ల ప్రజా వ్యతిరేకత వల్ల 2004లో గద్దె దిగి పది సంవత్సరాలు గడిచినప్పటికీ, ఆ విధానాల మీద ఎటువంటి సమీక్షా లేదని, చంద్రబాబు నాయుడు పాలనా పద్ధతిలో ఎటువంటి మార్పూ లేదని ఈ మూడు వారాల ప్రకటనలే తెల్పుతున్నాయి. ఎన్నికల ప్రణాళికలో చేసిన ఆడంబరమైన, ప్రజాకర్షకమైన వాగ్దానాలలో ఏ ఒక్కదాన్నీ సంపూర్ణంగా, సమగ్రంగా అమలు చేయదలచుకోలేదని అధికారం చేపట్టిననాటి నుంచీ చేస్తున్న ప్రకటనలు, వాయిదాలు, సాచివేతలు చెపుతున్నాయి. ఎన్నికల వాగ్దానాలను అమలు చేయకపోవడం ఒక ఎత్తు కాగా, ఎన్నికల సమయంలో ఊసే ఎత్తని అంశాలెన్నో గవర్నర్ ప్రసంగంలోకీ, ఈ మూడు వారాలుగా ముఖ్యమంత్రి ప్రకటనలలోకీ ప్రవేశిస్తున్నాయి. అవన్నీ కూడ గత పాలనా కాలంలో అమలయిన విధానాలే. రాష్ట్ర ఆర్థిక స్థితిగతులపై శ్వేతపత్రాలు ప్రచురిస్తామని ఇప్పుడు చెపుతున్న మాట 1995-96ల్లో ప్రపంచబ్యాంకు కనుసన్నల్లో చేసిన పనే. విజన్ 2020ని పునర్ రచిస్తామని ఇపుడు చెపుతున్న మాట గతంలో మెకిన్సీతో రాయించిన ప్రజావ్యతిరేక వినాశకర అభివృద్ధి నమూనాకు కొనసాగింపే. ఇంకా నిర్ధారణ కాకముందే సాగుతున్న రాజధాని ఊహాగానాలు సరిగ్గా గతంలో హైదరాబాద్ రియల్ ఎస్టేట్ ధరలు పెంచడానికి చేసిన ప్రయత్నాల లాగనే కనబడుతున్నాయి. ఇప్పటికే రాయలసీమకు జరిగిన అన్యాయం వల్ల రాజధానిని అక్కడ ఏర్పాటు చేయడమో, హైదరాబాద్ అనుభవంతో గుణపాఠం తీసుకుని వికేంద్రీకృత అభివృద్ధితో పలు నగరాలను అభివృద్ధి చేయడమో కాకుండా కోస్తాలో కేంద్రీకృత రాజధాని ఆలోచనలు సాగుతున్నాయి. గతంలో లాగనే వ్యవసాయాభివృద్ధి, ఉపాధికల్పన, పారిశ్రామికీకరణ, ప్రజానుకూల విధానాలు, అణగారిన వర్గాల సంక్షేమం వంటి అంశాలు విస్మరణకు గురవుతూ తీర రహదారి, పారిశ్రామిక కారిడార్లు, ఓడరేవులు, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, గనుల తవ్వకాలు వంటి దేశదేశాల సంపన్నులకు, బహుళజాతి సంస్థలకు మేలు చేసే పథకాల రచనే జరుగుతున్నది. ప్రతీకాత్మకంగా శాసనసభ ప్రారంభ దినాన బూటకపు ఎన్‌కౌంటర్‌లో ముగ్గురు విప్లవోద్యమ కార్యకర్తలను బలితీసుకోవడం గతంలో లాగనే ప్రజల ప్రజాస్వామిక హక్కుల అణచివేత, ప్రజా ఉద్యమాల అణచివేత సాగుతుందని హెచ్చరించడానికి సూచికగా ఉంది. ఈ ప్రభుత్వానికి కేంద్రంలోనూ రాష్ట్రంలోనూ అధికారం పంచుకుంటున్న హిందూత్వ శక్తుల మద్దతు కూడ ఉంది.

ఇక తెలంగాణ రాష్ట్రానిది మరొక రకమైన అనుభవం. తెలంగాణ రాష్ట్ర సమితికి 2004-05ల్లో అధికారం పంచుకున్న చరిత్ర, చంద్రశేఖర రావుకు రాష్ట్రంలోనూ, కేంద్రంలోనూ మంత్రిగా పనిచేసిన అనుభవం ఉన్నాయి గాని సొంతంగా ప్రభుత్వ పాలనానుభవం లేదు. కనుక తెరాస ప్రభుత్వానివి పాత విధానాలు అనడానికి వీలు లేదు. బలమైన సుదీర్ఘకాలపు ప్రజా ఉద్యమ పునాదిపై ఏర్పడిన ప్రభుత్వంగా ఈ ప్రభుత్వం జాగ్రత్తగా, ప్రజల ఒత్తిడి మేరకు అడుగులు వేయకతప్పదు. ఈ మినహాయింపులు ఉన్నప్పటికీ, వ్యవసాయం, నీటి పారుదల వంటి రంగాల మీద ఆమోదయోగ్యమైన వాగ్దానాలు చేస్తున్నప్పటికీ, హైదరాబాద్‌ను విశ్వనగరంగా మారుస్తామనడం, సమతుల, వికేంద్రీకృత అభివృద్ధి నమూనా బదులు హైదరాబాద్ మీద కేంద్రీకరించే పారిశ్రామిక విధానం గురించి ఆలోచించడం, బ్రాండ్ హైదరాబాద్ తయారు చేస్తామంటూ చంద్రబాబు మార్కు మాటలు మాట్లాడడం, విదేశీ, స్వదేశీ పెట్టుబడులను ఆకర్షించడానికి ప్రయత్నించడం, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ బుడగ మీద ఎక్కువ ఆశలు పెట్టుకోవడం, ఉపాధికల్పన సాధించే పారిశ్రామికీకరణ మీదికన్న ఎక్కువగా ఆడంబర ప్రచారానికి పనికివచ్చే సేవారంగ సంస్థల మీద కేంద్రీకరించడం వంటి సూచనలు ఇప్పటికే కనబడుతున్నాయి. ఉద్యమక్రమంలో ప్రజల ఆకాంక్షలు విపరీతంగా పెరిగిపోయినందువల్ల, పాలకపార్టీ ఎన్నికల ప్రణాళికలో ఎన్నో ప్రజాస్వామిక వాగ్దానాలు చేసినందువల్ల ఆ ఆకాంక్షలను తీర్చడం, వాగ్దానాలను నెరవేర్చడం ప్రభుత్వ ప్రధాన కర్తవ్యం అవుతుంది. ఈ ప్రభుత్వానికి ఆ కర్తవ్యాన్ని పరిపూర్తి చేసే సామర్థ్యం ఉందా, సామర్థ్యం ఉన్నా సంకల్పం ఉందా, సంకల్పం ఉన్నా అది సాకారమవుతుందా వేచిచూడవలసి ఉంది.

మొత్తం మీద రెండు తెలుగు రాష్ట్రాలలోనూ ప్రజాజీవనం సుఖశాంతులతో, ఉపాధితో, ఆత్మగౌరవంతో, ప్రజాస్వామ్యంతో పరిఢవిల్లుతుందని నిస్సందేహంగా చెప్పగలిగిన స్థితిలేదు. నిరంతర జాగరూతతో పాలక విధానాలను కనిపెట్టి ఉంటూ, ప్రజావ్యతిరేక విధానాలను ఎప్పటికప్పుడు ప్రతిఘటిస్తూ ఉండడమే ప్రజల కర్తవ్యం. వీ

# హిందూత్వ అసహనం, కార్పొరేట్ దౌర్జన్యం

నరేంద్రమోడీ నాయకత్వంలోని భాజపా-ఎన్‌డిఎ ప్రభుత్వం ప్రజావ్యతిరేక పాలన నెరపబోతుందని చెప్పడానికి పెద్ద రాజకీయ పరిజ్ఞానం అవసరం లేదు. ఒకవైపు సంఘ పరివారపు హిందూ బ్రాహ్మణీయ దుర్మార్గం, మరోవైపు కార్పొరేట్ లాభాపేక్షా దౌర్జన్యం పునాది మీద అధికారంలోకి వచ్చిన ఆ ప్రభుత్వం ఆ రెండు శక్తుల ప్రయోజనాలను కాపాడడం కోసం ప్రజలను బలిపెట్టక తప్పదు. అయితే మామూలుగా ఏ ప్రభుత్వమైనా గద్దె మీద కుదురుకోవడానికి కొన్నాళ్లు పడుతుంది గనుక, కోరలు సాచడానికి కొంత సమయం తీసుకుంటుంది. కాని నరేంద్ర మోడీ ప్రభుత్వం మాత్రం తన పోషకుల ప్రయోజనాలు కాపాడే పనిలో ఒక్క రోజు కూడ ఆలస్యం చేయదలచుకున్నట్టు లేదు. ప్రమాణస్వీకారం జరిగిన మే 26 నుంచి ఇది రాస్తున్న జూన్ 26 వరకు గడిచిన నెల రోజులలో ప్రత్యక్షంగా ప్రభుత్వం వైపు నుంచీ, పరోక్షంగా ప్రభుత్వ అండతో సంఘ పరివార శక్తుల నుంచీ ప్రజల మీద జరుగుతున్న దాడులు, దేశ సంపద కొల్లగొట్టడానికీ, బహుళజాతి సంస్థలకు దోచిపెట్టడానికీ జరుగుతున్న ప్రయత్నాలు, మతోన్మాదాన్నీ, ప్రజా ఉద్యమాల పట్ల అసహనాన్నీ రెచ్చగొట్టడానికి సాగుతున్న చర్యలు డజన్లకొద్దీ ఉన్నాయి. దేశభక్తికి తామే గుత్తేదార్లమన్నట్టు ప్రగల్భాలు పలికే సంఘ పరివార్ ప్రభుత్వం అధికారంలోకి రాగానే దేశ రక్షణ రంగంలో నూటికి నూరు శాతం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడికి అనుమతిస్తూ తాను సామ్రాజ్యవాద దళారీనని రుజువు చేసుకుంది. ప్రభుత్వరంగ సంస్థలను దేశదేశాల సంపన్నులకు కారుచౌకగా అమ్మిపారేసే పెట్టుబడుల ఉపసంహరణ విధానాన్ని మన్మోహన్ సింగ్ కన్న వేగంగా అమలు జరుపుతానని చూపుకోవడానికి హిందుస్తాన్ జింక్‌ను అడ్డికి పావుసేరుగా అమ్మకానికి పెట్టింది. మౌలిక సౌకర్యాల కల్పన పేరుతో దేశవ్యాప్తంగా లక్షల కోట్ల రూపాయల పథకాలకు పచ్చజెండా ఊపి దారుణమైన విస్థాపనకూ, ప్రజాజీవితాల విధ్వంసానికీ తెరలేపింది. రైల్వే బడ్జెట్ కొద్ది వారాల్లోనే రానుండగా ప్రయాణికుల రైలు ఛార్జీలు, రవాణా ఛార్జీలు ఇబ్బడి ముబ్బడిగా పెంచి తనకు అటు రాజ్యాంగ మర్యాదల మీద, ఇటు ప్రజల జీవనం మీద గౌరవం లేదని ప్రకటించుకుంది. చమురు రంగ సంస్కరణల పేరుతో డీజిల్, కిరోసిన్ సబ్సిడీలు ఎత్తివేసి ప్రజాజీవనాన్ని ఇంకా దుర్భరం చేయడానికి ఎత్తులు వేస్తున్నది. ఇటువంటి అనేక ప్రజావ్యతిరేక ఆర్థిక విధానాలకు తోడుగా నేరుగానూ, తన జేబు సంస్థల ద్వారానూ రాజకీయ, పాలనా రంగాలలో అప్రజాస్వామిక, నిరంకుశ, అహంకారపూరిత నిర్ణయాలు అమలు చేస్తున్నది. స్వచ్ఛంద సంస్థల కార్యకలాపాలు దేశ జాతీయోత్పత్తిని తగ్గించేలా, అభివృద్ధి నిరోధకంగా, దేశద్రోహకరంగా ఉన్నాయని ఇంటిలిజెన్స్ బ్యూరోతో నివేదిక రాయించడం, మావోయిస్టు పార్టీలోకి రహస్య వేగులను ప్రవేశపెట్టాలని హోం మంత్రి రాజనాథ్ సింగ్ ఇంటిలిజెన్స్ బ్యూరోను ఆదేశించడం, దేశవ్యాప్తంగా ముస్లింలకు, మహిళలకు, ప్రజా సంఘాలకు వ్యతిరేకంగా సంఘ పరివార్ దాడులు, సోషల్ మీడియా వ్యాఖ్యలకు ప్రతీకారంగా దాడులు, హత్యలు దేశంలో హిట్లర్ తరహా ఫాసిస్టు పాలన రానున్నదని చూపుతున్నాయి. ఈ ప్రమాదాన్ని విశాల ప్రజారాశుల చేత గుర్తింపజేయడం, ప్రజలను సమీకరించి ఈ ధోరణుల మీద పోరాటాలకు సమాయత్తం చేయడం ప్రజానుకూల శక్తుల, బుద్ధిజీవుల చారిత్రక బాధ్యత. వీ

# ఈ యుద్ధంలోనైనా ఇరాక్ ప్రజలు గెలుస్తారా?

పది సంవత్సరాల లోపే ఇరాక్ మరొకసారి నెత్తురోడుతున్నది. అమెరికా నాయకత్వంలోని దురాక్రమణ శక్తులు 2003 మార్చ్‌లో ఇరాక్ మీద దాడి చేసి సద్దాం హుసేన్ ప్రభుత్వాన్ని కూలదోసి, సైనికాధికారుల ప్రభుత్వాలను, కీలుబొమ్మ ప్రభుత్వాలను, బూటకపు ఎన్నికలలో గెలిచిన ప్రభుత్వాలను ఏర్పరిచి, సద్దాం హుసేన్‌ను ఉరి తీసినప్పటినుంచీ సాగుతున్న అమెరికా వ్యతిరేక ప్రజా ప్రతిఘటన ఈ పది సంవత్సరాలలో అనేక రూపాలు తీసుకుంటూ బలపడుతూ వస్తున్నది. ముఖ్యంగా అమెరికన్ సైనిక బలగాల ఉపసంహరణ జరిగిన 2011 తర్వాత అమెరికా వ్యతిరేక, ఇరాక్ దేశభక్తియుత శక్తులకు ఇతరంగా ఎన్ని భిన్నాభిప్రాయాలు ఉన్నప్పటికీ ఎవరి ప్రాంతాలలో వారు, ఎవరికి తోచిన పద్ధతులలో వారు తిరుగుబాటు ప్రయత్నాలు ముమ్మరం చేశారు. సద్దాంకు చెందిన బాత్ పార్టీ తో సహా కనీసం అరడజను శక్తులు తమ పోరాటాన్ని విడివిడిగానూ, సమన్వయంతోనూ సాగిస్తున్నాయి. మరో వైపు కుర్దులు తమ స్వాతంత్ర్య పోరాటాన్ని కొనసాగిస్తున్నారు. ఈ శక్తులన్నిటిలోకీ ప్రభావశీలంగా ఉన్నదీ, ఇవాళ దేశంలో సగం కన్న ఎక్కువ భూభాగాన్ని, మోసుల్, తిక్రిత్ వంటి ప్రధాన నగరాలను, అనేక చమురు క్షేత్రాలను తన అధీనంలోకి తెచ్చుకున్నదీ, రాజధాని బాగ్దాద్‌ను త్వరలోనే ముట్టడించి ఆక్రమించు కుంటానని ప్రకటిస్తున్నదీ అల్ దావ్లా అల్ ఇస్లామియా ఫి అల్ ఇరాక్ వా అల్ షామ్ (ఇస్లామిక్ స్టేట్ ఆఫ్ ఇరాక్ అండ్ లెవాంట్ – ఐఎస్ఐఎల్ అని గానీ ఐఎస్ఐఎస్ అని గానీ పిలుస్తున్నారు) అనే సున్నీ మత సంస్థ. దీన్ని జిహాదీ సంస్థ అనీ, మతోన్మాద సంస్థ అనీ, ఇరాక్‌లో షియాలను ఊచకోత కోస్తున్న తీవ్రవాద సంస్థ అనీ, ఇప్పుడు ఇరాక్‌లో రెండు మతశాఖల మధ్య అంతర్యుద్ధం సాగుతున్నదనీ సామ్రాజ్యవాద ప్రభుత్వాలు, పాశ్చాత్య ప్రచార సాధనాలు ప్రచారం చేస్తున్నాయి. మరొకసారి ఇరాక్‌లో జోక్యం చేసుకుని, సైనిక బలగాలను పంపాలని బ్రిటిష్, అమెరికన్ యుద్ధనిపుణులు అంటున్నారు. ఐఎస్ఐఎల్ మతవాద సంస్థ అనడంలో సందేహమేమీ లేదు. దురాక్రమణ సైన్యాలు పది సంవత్సరాలుగా సాగిస్తున్న దుర్మార్గాల వల్ల అక్కడ మత విద్వేషాలు పెచ్చరిల్లిన స్థితి కూడ ఉంది. కాని పరాయి దేశాల సైనికులు, సామ్రాజ్యవాద ప్రభుత్వాలు కేవలం తమ చమురు అవసరాల కోసం తమ దేశాన్ని బాంబుదాడులతో భస్మీపటలం చేసి, భయంకర విధ్వంసం సృష్టించి, లక్షలాది మంది తమ కుటుంబ సభ్యులను బలిగొన్న నేపథ్యంలో ఇరాకీ ప్రజలు అమెరికాను ఎదిరించడానికి ఎంత ప్రమాదకరమైన శక్తుల సహాయమైనా తీసుకోవచ్చుననుకుంటున్నారు. ఎవరి నాయకత్వంలోనైనా ఇవాళ ఒక జాతీయ యుద్ధాన్ని, జాతి చెర విడిపించే యుద్ధాన్ని చేయాలనుకుంటున్నారు. ఈ యుద్ధంలో వాళ్లు గెలుస్తారా, సామ్రాజ్యవాద విషకౌగిలి పీడ వదిలించుకుంటారా, చమురు దాహపు బహుళజాతి సంస్థల పెనం మీది నుంచి మతోన్మాదపు పొయ్యిలో పడతారా అనే ప్రశ్నలు వేయవచ్చు. కాని మహత్తర చరిత్ర ఉన్న, సంపన్నమైన సహజవనరులు ఉన్న ఒక జాతిని ఇంత దుర్మార్గంగా బానిసత్వంలో, పీడనలో ముంచి దోపిడీ చేయడానికి సిద్ధపడిన సామ్రాజ్యవాద శక్తుల మీద విసిరే ఏ ఆయుధాన్నయినా సమర్థించ వలసిందే. ఆ ఆయుధం ప్రమాదకరమైనదైతే మళ్లీ దాన్ని కూడ ఎదిరించి ఓడించే శక్తిని ఆ ప్రజలు సమకూర్చుకోవాలని ఆశించవలసిందే. వీ

# వర్తమాన చరిత్ర - రాజకీయార్థిక దృష్టి

**రాజకీయాల ఆర్థిక పునాది**

**భా**రత రాజకీయ వ్యవస్థలోని పాలకవర్గ ముఠాలు భీకరంగా పోరాడుకుంటున్నట్టు పైకి కనిపించినా, ఆ ముఠాలకు ఉమ్మడి రాజకీయ ప్రయోజనాలున్నాయనేది తేటతెల్లంగా కనబడుతూనే ఉంటుంది. నూతన ఆర్థిక విధానాల పేరు మీద భారత ప్రభుత్వం 1991లో ప్రవేశపెట్టిన రాజకీయార్థిక విధానాలు గత రెండు దశాబ్దాలకు పైగా యథాతథంగా కొనసాగుతూ ఉండడం, ఆ విధానాలలోనే రెండవ విడత, మూడవ విడత అని చర్చలు జరగడం అందరికీ తెలుసు. మరి ఈ ఇరవై మూడు సంవత్సరాలలో కేంద్రంలో, రాష్ట్రాలలో అధికారంలోకి రాని రాజకీయ పార్టీ లేదు. ఏదో ఒక కూటమిలో భాగంగానో, మద్దతుదారుగానో ప్రతి పార్టీకీ ఈ రాజకీయార్థిక విధానాలను అమలు చేసిన చరిత్ర ఉంది. ఇంతకీ ఈ విధానాలను తయారు చేసేదీ, ఆ విధానాలు అమలు చేయమని ప్రభుత్వాల మీద ఒత్తిడి చేసేదీ భారత మార్కెట్లను, ముడిసరుకులను కొల్లగొట్టదలచిన బహుళ జాతి సంస్థలు, వాటికొరకు విధానాలు రూపొందించే అంతర్జాతీయ ద్రవ్యసంస్థలు, ఆ విధానాలను అమలు చేయించడానికి సామ దాన భేద దండోపాయాలు ప్రయోగించే సామ్రాజ్యవాద ప్రభుత్వాలు. ఇదంతా ఒక కూటమి. ఈ కూటమి తరఫున ఏయే కార్యక్రమాలు ఎలా నిర్వహించాలో సలహాలు ఇవ్వడం కోసం థింక్ టాంక్‌లు ఉంటాయి. ఆ థింక్ టాంకుల సలహాలు, ఒత్తిళ్లతో పాటు, భారత బడా బూర్జువా పత్రికలు, ఛానళ్లు కూడ ప్రభుత్వానికి ఆ కర్తవ్యాలు నిర్దేశిస్తుంటాయి.

ఉదాహరణకు, ప్రపంచంలోనే రెండో అతిపెద్ద వాణిజ్య పత్రిక అయిన ది ఎకనమిక్ టైమ్స్ భారత ప్రభుత్వానికి ఏమి చేయాలో ఏమి చేయగూడదో నిరంతరం కర్తవ్యబోధ చేస్తూ ఉంటుంది. విద్యా రంగం, రసాయనాల పరిశ్రమలు, ద్రవ్యవ్యాపారాలతో పాటు ప్రచార మాధ్యమాల వ్యాపారం కూడ ఉన్న సాహు జైన్‌ల టైమ్స్ ఆఫ్ ఇండియా గ్రూపుకు చెందిన ఈ ఎకనమిక్ టైమ్స్ దినపత్రిక దేశంలోని పాలకవర్గాల గళంగా, ప్రధానంగా దళారీ బూర్జువావర్గపు గళంగా పనిచేస్తుంది. ఆ పత్రికలో వచ్చిన వార్తలకు, వ్యాఖ్యలకు, సంపాదకీయాలకు ప్రభుత్వ విధానాలకు మధ్య సంబంధాన్ని పరిశీలిస్తే ఎవరు ఎవరిని నడుపుతున్నారో సులభంగా అర్థమవుతుంది. నరేంద్ర మోడీ నాయకత్వంలోని ఎన్‌డిఏ ప్రభుత్వం ఏమేమి చేయాలో గత నెల రోజులుగా దాదాపు రోజూ చెపుతూ వస్తున్న ఆ పత్రిక జూన్ 16న, అంటే సరిగ్గా ఎన్నికల ఫలితాలు వచ్చిన నెల రోజులకు ఏకంగా నరేంద్ర మోడీ చేయవలసిన కార్యక్రమాల జాబితా ప్రకటించింది.

'ఆర్థిక వ్యవస్థను మరమ్మత్తు చేయడానికి కఠిన చర్యలు తీసుకోబోతున్నట్టు ప్రధానమంత్రి నరేంద్ర మోడీ ప్రకటించారు. ఆర్థిక వ్యవస్థను పునరుద్ధరించడమంటే ప్రజలకు రుచించని నిర్ణయాలు తీసుకోవడమేననేది నిస్సందేహం.... అందుకు ఏ అవకాశాలున్నాయో ఎకనమిక్ టైమ్స్ పరిశీలిస్తోంది' అని మొదటి పేజీ పతాకశీర్షికలో ఆ పదిహేను చర్యలనూ సూచించింది.

అవి 1. ఇంధన సబ్సిడీ సంస్కరణలు. 2. ఆహార వ్యయం మార్పు 3. ఎరువుల సబ్సిడీ హేతుబద్ధీకరణ. 4. ద్రవ్య క్రమబద్ధీకరణ. 5. కొత్త పన్నులు లేదా హెచ్చు పన్ను రేట్లు. 6. ద్రవ్యలోటును తగ్గించడానికి ప్రభుత్వ వ్యయం మీద ఆంక్షలు. 7. బ్యాంకుల క్రమబద్ధీకరణ. 8. భూచట్టానికి సవరణలు. 9. కార్మిక సంస్కరణలు. 10. రైల్వే ఛార్జీలను పెంచడం. 11. వ్యవసాయోత్పత్తులకు కనీస మద్దతు ధరల ప్రకటనలో వేగం తగ్గింపు. 12. ప్రభుత్వరంగ సంస్థల సంస్కరణ. 13. భారత ఆహార సంస్థ, కోల్ ఇండియా లిమిటెడ్‌ల పునర్వ్యవస్థీకరణ. 14. వ్యక్తిగత ఆదాయపన్ను మార్పు. 15. జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం మార్పు.

ఈ చర్యల అంతరార్థం సబ్సిడీల తగ్గింపు, ప్రభుత్వ వ్యయం తగ్గింపు, సంక్షేమ కార్యక్రమాల కోత, ధరల హేతుబద్ధీకరణ పేరు మీద ధరల పెంపు, ప్రభుత్వ రంగ సంస్థల అమ్మకం, కార్మిక అనుకూల చట్టాలను మార్చి, పారిశ్రామిక, వ్యాపారవేత్తలకు అనుకూల చట్టాలను ప్రవేశ పెట్టడం, బ్యాంకులను సంఘటితం చేసి పెట్టుబడిదారులకు, బహుళజాతి సంస్థలకు పెద్దమొత్తంలో నిధులను అందుబాటులో ఉంచడం. నిర్దిష్టంగా చెప్పాలంటే రైల్వే ఛార్జీల పెంపు, డీజిల్, కిరోసిన్, ఎరువులు, ఆహార పదార్థాలు వంటి వాటిపై సబ్సిడీల రద్దు,

ఈ కార్యక్రమాలను అమలు చేసే పనిని నరేంద్ర మోడీ ప్రభుత్వం ఈ సూచనలు అచ్చుకావడానికి కొద్ది రోజుల ముందు నుంచే ప్రారంభించి కొనసాగిస్తున్నది. ఈ లోగా, ఈ సూచనలు ఒక పత్రిక చేసినవి మాత్రమేనని ఎవరైనా అనుకుంటారేమోనన్నట్టుగా స్వయంగా ప్రపంచబ్యాంకు జూన్ 20న విడుదల చేసిన గ్లోబల్ ఎకనామిక్ ప్రాస్పెక్ట్స్ 2014లో కూడ వీటిలో కొన్నిటిని మళ్లీ చెప్పారు. అనేకసార్లు అడిగిన ప్రశ్నే – ఇంతకూ ఈ ప్రభుత్వం ఎవరిది? ఎవరి ఆదేశాల మేరకు, ఎవరి ప్రయోజనాల కొరకు పని చేస్తున్నది? ఎవరి ఆర్థిక ప్రయోజనాల కోసం ఈ రాజకీయాలు నడుస్తున్నాయి?

**సామ్రాజ్యవాద దోపిడీ ఆధునిక రూపాలు**

ఒకవైపు దేశదేశాల సంపన్నుల అడుగులకు మడుగులొత్తే విధానాలను అమలు చేస్తూనే, దేశభక్తి గురించి, జాతీయ ప్రయోజనాల గురించి గంభీరంగా మాట్లాడడాన్ని భారత పాలకవర్గాలు ఒక కళగా అభివృద్ధి చేశాయి. సామ్రాజ్యవాద దోపిడీకి అన్ని రంగాలలోనూ మార్గం సుగమం చేస్తూనే, సామ్రాజ్యవాద ప్రభావాన్ని వ్యతిరేకిస్తున్నట్టు మాట్లాడడం 1947 నుంచీ కూడ భారత పాలకవర్గాల ఆనవాయితీ అయింది. ఇటీవల దేశంలో అక్రమధనం పోగుపడడం గురించి, ఆ అక్రమధనం దేశసరిహద్దులు దాటి స్విట్జర్లాండ్ లాంటి పన్ను రహిత స్థావరాలకు చేరడం గురించి వార్తలు వస్తున్న క్రమంలో, అలా పోగుపడిన అక్రమధనం ఎన్ని లక్షల కోట్ల రూపాయలు ఉంటుందని ఊహాగానాలు సాగుతున్న క్రమంలో ఆ ధనం గురించీ, దాన్ని మళ్లీ దేశానికి రప్పించే మార్గాల గురించీ కూడ పాలకవర్గ నాయకులు మాట్లాడుతున్నారు. కాని పోయిన సంపదను తిరిగి తెప్పించడం సంగతి అలా ఉంచి, ప్రతి క్షణమూ దేశ సరిహద్దులు దాటి వెళ్తున్న సంపద తరలింపుకు అడ్డుకట్ట వేయడం గురించి మాట్లాడుతున్నవారు ఒక్కరూ లేరు.

నిజానికి భారతదేశం నుంచి సంపద ఎన్నో మార్గాలలో బైటికి తరలిపోతున్నది. బహుళజాతి సంస్థల సరుకుల మార్కెట్ల నుంచి, ద్రవ్య మార్కెట్ల నుంచి, ముడిసరుకుల మార్కెట్ల నుంచి కొల్లగొట్టుకుపోవడం ఒక మార్గం, మేధోసంపద హక్కు పేరుతో రాయల్టీలు, టెక్నికల్ ఫీ ల రూపంలో కొల్లగొట్టుకుపోవడం మరొక మార్గం. ఇక్కడ పన్ను లెక్కలలో చూపకపోవడం వల్ల మిగులు సంపదగా ఉన్నదాన్ని ఇతర దేశాలకు, ముఖ్యంగా పన్ను రహిత స్థావరాలకు తరలించడం మరొక మార్గం. భారత సమాజం తన సంపద వెచ్చించి అభివృద్ధి చేసిన మానవ వనరులను కొల్లగొట్టడం ఇంకొక మార్గం. చట్టబద్ధంగా దీర్ఘకాలికమైన విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి రూపంలోనో, స్వల్పకాలికమైన విదేశీ మదుపు సంస్థల పోర్ట్ ఫోలియో మదుపు రూపంలోనో దేశంలో ప్రవేశించి లాభాలను, పెట్టుబడిని బైటికి తరలించుకుపోవడం మరొక మార్గం. ఇన్ని రూపాలలో భారత సమాజపు సంపద బైటికి తరలిపోతున్నప్పటికీ, ఈ మార్గాలలో అత్యధికభాగాన్ని అడ్డుకోవడానికి భారత ప్రభుత్వానికి అవకాశం, అధికారం ఉన్నప్పటికీ గత ఆరు దశాబ్దాలలో ఎప్పుడూ ఆ పని జరగలేదు.

కాగా, ఈ రూపాలలో ఒక భాగం భారతదేశం నుంచి ఎగుమతి అయిన సరుకులకు అసలు ధర కన్న కాగితం మీద తక్కువ ధర చూపించి, ఆ మిగులును అక్కడే చేర్చమన్న ఖాతాలకు చేర్చడం ఒక పద్ధతి. భారత దేశం దిగుమతి చేసుకునే సరుకులకు అసలు ధరకన్న కాగితం మీద ఎక్కువ ధర చూపించి ఆ మిగులును అక్కడే చేర్చమన్న ఖాతాలకు చేర్చడం మరొక పద్ధతి. ఈ పద్ధతులలో మొదటి దాన్ని అండర్ ఇన్వాయిసింగ్ అనీ, రెండో దాన్ని ఓవర్ ఇన్వాయిసింగ్ అనీ అంటారు. జాగ్రత్తగా లెక్కగడితే ఈ ఒక్క మార్గంలోనే ఎంత సంపద తరలిపోయిందో అంచనా వేయవచ్చు. ప్రపంచ వాణిజ్య గణాంకాలను జాగ్రత్తగా అధ్యయనం చేసి, భారతదేశానికి పదిహేడు దేశాలతో ఉన్న వాణిజ్యం ద్వారా ఈ రెండు పద్ధతులలో ఎంత సంపద తరలిపోయిందో ఒక అద్భుతమైన, అవసరమైన విశ్లేషణకు పూనుకున్నారు ఆస్ట్రేలియన్ నేషనల్ యూనివర్సిటీకి చెందిన ఇద్దరు అర్థశాస్త్రవేత్తలు రాఘవేంద్ర ఝా, టువాంగ్ డక్ ఎన్గుయెన్. వారు ఏప్రిల్ 2014లో 'ట్రేడ్ మిసిన్వాయిసింగ్ అండ్ మాక్రో ఎకనమిక్ ఔట్ కమ్స్ ఇన్ ఇండియా' అనే పత్రం ప్రచురించారు. ఈ లెక్క కేవలం యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్, బ్రెజిల్, స్విట్జర్లాండ్, చైనా, జర్మనీ, ఫ్రాన్స్, యునైటెడ్ కింగ్‌డమ్, హాంగ్‌కాంగ్, ఇండొనేషియా, ఇటలీ, జపాన్, దక్షిణ కొరియా, కువైట్, నెదర్లాండ్స్, సింగపూర్, యునైటెడ్ స్టేట్స్, దక్షిణాఫ్రికా అనే పదిహేడు దేశాలతో భారతదేశం జరిపిన వాణిజ్యం గురించినది మాత్రమే. అది కూడ 1988 నుంచి 2012 వరకూ దొరికిన గణాంకాల మీద ఆధారపడినది మాత్రమే. ఈ ఇరవై నాలుగు సంవత్సరాలలో 186 కోట్ల డాలర్ల (పదకొండు లక్షల ఇరవై నాలుగు వేల కోట్ల రూపాయల) సంపద తరలిపోయిందని వారు లెక్కవేశారు. ఇది భారతదేశపు మొత్తం విదేశీ రుణానికి రెట్టింపు. ఈ ఒక్క మార్గంలోనే ఇంత సంపద తరలిపోయి ఉంటే, ఇతర మార్గాలన్నీ కలిపి ఎంత సంపద తరలిపోయి ఉండాలి?! నిజానికి ప్రభుత్వాలు తలచుకుంటే ఈ మార్గాన్ని అరికట్టడం ఎంత సులభమంటే అంతర్జాతీయ మార్కెట్‌లో ప్రతి వస్తువుకూ కచ్చితంగా ఎంత ధర ఉందో, అది ఇన్వాయిస్‌లో అంతకన్న ఎక్కువగానో, తక్కువగానో నమోదవుతున్నదో లేదో నిఘావేయవచ్చు. బిల్లులను పరిశీలించవచ్చు. తప్పుడు ఇన్వాయిస్‌లు తయారు చేసిన వ్యాపారస్తుల ఎగుమతి – దిగుమతులపై ఆంక్షలు విధించవచ్చు. వారి బిల్లు చెల్లింపులు రిజర్వ్ బ్యాంక్ ద్వారా జరుగుతాయి గనుక ఆపి వేయవచ్చు. వారి ఆస్తులను, బ్యాంకు లావాదేవీలను స్తంభింప జేయవచ్చు. అయినా ప్రభుత్వాలు ఒక్కసారి కూడ ఆ పని చేయలేదు. తమ చేతిలో ఉన్న ఈ చిన్నపని చేయని ప్రభుత్వాలు విదేశీ ప్రభుత్వాల చేత, బ్యాంకుల చేత రహస్యాలు కక్కించి, అక్కడి నిధులు వెనక్కి తెస్తాయని ఊహించడం, ఆశించడం అత్యాశే.

**తీరరహదారి**

ఆంధ్రప్రదేశ్ విభజన జరిగి, రెండు రాష్ట్రాలలోనూ ఎన్నికలు జరిగి, ఆంధ్రప్రదేశ్‌లో తెలుగుదేశం – భారతీయ జనతా పార్టీ పొత్తు ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన నాటి నుంచీ అక్కడ పెరిగిపోనున్న ప్రజాసమస్యల తీవ్రత ఆందోళన కలిగిస్తున్నది. ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు గతంలో ఆంధ్రప్రదేశ్‌లో చేసినట్టు గానే ప్రపంచ బ్యాంకుకూ, బహుళజాతి సంస్థలకూ అనుకూలమైన రాజకీయార్థిక విధానాలను అమలు చేసి తీరుతారనడంలో సందేహం లేదు. ఆంధ్రప్రదేశ్ ఉభయ సభలను ఉద్దేశించి గవర్నర్ చేసిన ప్రసంగంలో (ఇది గవర్నర్ చదువుతారు గాని నిజానికి ఇది ఎన్నికైన ప్రభుత్వం రాసి ఇచ్చే పత్రం. దానిలో ప్రభుత్వ ప్రాధాన్యతలు మాత్రమే ఉంటాయి) శ్వేత పత్రాలు ప్రవేశపెడతామనీ, విజన్ 2020ని తిరగరాస్తామనీ పాతరోజుల మాటలనే మళ్లీ వల్లెవేశారు. ఇప్పుడు ఆయనకు గుజరాత్ అభివృద్ధి నమూనా అనే ప్రజావ్యతిరేక సూత్రం తోడ్పాటు కూడ ఉంది. గత ప్రభుత్వాలు తలపెట్టిన విశాఖ – కాకినాడ పెట్రో కెమికల్ కారిడార్, వాడరేవు – నిజాం పట్నం వాన్‌పిక్‌లు సరిపోవన్నట్టుగా, ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టం 2014 విశాఖపట్నం నుంచి చెన్నై దాకా పారిశ్రామిక కారిడార్ ఏర్పాటు చేయాలని ప్రస్తావించింది. గుజరాత్‌లో 1600 కిమీ సముద్రతీరానికి 41 ఓడరేవులు (అంటే ప్రతి 40 కిమీ కు ఒకటి) ఉండగా ఆంధ్రప్రదేశ్ లో 1000 కిమీ సముద్రతీరానికి ఇప్పటికి 13 ఓడరేవులే ఉన్నాయని, గుజరాత్ లాగ కావాలంటే రెట్టింపు ఓడరేవులు కావాలనీ ఇప్పటికే ఆలోచనలు మొదలయ్యాయి. పరిశ్రమల పేరుతో, ఓడరేవుల పేరుతో, తీరప్రాంత రహదారి పేరుతో కళింగపట్నం నుంచి తడ దాకా మొత్తం వ్యవసాయ భూమి నుంచి ప్రజలను నిర్వాసితులను చేయడం, మత్స్యకారుల ఉపాధి పోగొట్టడం పెద్ద ఎత్తున జరగడానికి అవకాశం ఉంది. ఇప్పటికే ప్రజాందోళనల వల్ల ఆగిపోయిన కొవ్వాడ అణువిద్యుత్ కేంద్రం, శ్రీకాకుళం, నెల్లూరు జిల్లాలలో పెద్ద ఎత్తున థర్మల్ విద్యుత్ కేంద్రాలు, విశాఖ ఏజెన్సీలో బాక్సైట్ తవ్వకాలు, కడపలో యురేనియం వెలికితీత వంటి ప్రజావ్యతిరేక అభివృద్ధి నమూనా అమలు జరపడానికి అన్ని ఏర్పాట్లూ జరుగుతున్నాయి. దేశదేశాల సంపన్నులకు, బహుళజాతి సంస్థలకు, వారి స్థానిక దళారీలకు, రియల్ ఎస్టేట్ వ్యాపారులకు, అధికారపక్ష ఆశ్రితులకు తప్ప ప్రజలకు ప్రయోజనం లేని అభివృద్ధి నమూనా ఇది. అన్ని వర్గాల ప్రజలకు నష్టదాయకమైన, వినాశకరమైన, ప్రాణాంతకమైన అభివృద్ధి నమూనా ఇది. ఈ నమూనాను ఎదిరించడానికి, ప్రతిఘటించడానికి పెద్ద ఎత్తున పోరాటాలకు సిద్ధపడకపోతే ఆంధ్రప్రదేశ్ ప్రజానీకానికి కనీసం ఊపిరి పీల్చుకోవడానికైనా అవకాశం దొరకదు. ఈ బృహత్తర కర్తవ్యంలో ప్రజల పక్షాన నిలబడి, వాస్తవాలు విప్పిచెప్పి, ప్రజలను పోరాటాలకు ఉద్యుక్తుల్ని చేసి, ఆ పోరాటాలలో భాగం పంచుకోవలసిన బాధ్యత బుద్ధిజీవులందరి మీదా ఉంది. వీ



❖ **అద్వితీయుడు** – అంబేద్కర్ స్మారకోపన్యాసాలు 1986-2013 – హైదరాబాద్ బుక్ ట్రస్ట్, డా. బి.ఆర్. అంబేద్కర్ మెమోరియల్ ట్రస్ట్ - 440 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: హైదరాబాద్ బుక్‌ట్రస్ట్, ప్లాట్ నెం. 85, బాలాజీనగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్ – 500006; ఫోన్ 23521849; hyderabadbooktrust.blogspot.com



❖ **ఆశ్రిత పెట్టుబడిదారీ విధానం** – డి. ప్రసాదు, డి.వి. కృష్ణ – సిపిఐ (ఎం-ఎల్) న్యూడెమోక్రసీ, తెలంగాణ రాష్ట్ర కమిటీ – 52 పేజీలు, 1/8 డెమీ, రు. 10, ప్రతులకు: మార్క్స్ భవన్, 658, విద్యానగర్, 7వ లైన్, హైదరాబాద్ – 500044; రామనర్సయ్య భవన్, కార్ల షెడ్ దగ్గర, క్రీస్తు రాజాపురం, సున్నపుబట్టీల వైపు వీధి, విజయవాడ – 10



❖ **వేటు** – గేయ కవిత్వం – గుండెబోయిన శ్రీనివాస్ – చెలిమి సాహిత్య సాంస్కృతిక వేదిక – 52 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు: గుండెబోయిన శ్రీనివాస్, ఇ.నెం. 3-1-74/1/ఎ, కాకతీయ కాలనీ, హనుమకొండ – 506011; సెల్ : 99851 94697; email: srinivasgundeboina22@gmail.com



❖ **పోలవరంతో విధ్వంసమే** – డా. ఎస్. తిరుపతయ్య – తెలంగాణ పరిరక్షణ వేదిక – 64 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు: డా.ఎస్. తిరుపతయ్య, సహచర పిల్లల హాస్పిటల్, గాంధీచౌక్, జమ్మికుంట, కరీంనగర్; ఫోన్: 08727 – 255466; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు



❖ **యాభై ఏళ్ల వాన – కొప్పర్తి** – కవిత్వం (2003 – 2013) – 111 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్; నవోదయ బుక్‌హౌస్ హైదరాబాద్



❖ **ఆకాశ పుష్పం** – అపూర్వ త్యాగానికి నీరాజనం – రుద్రమ ప్రచురణలు – 41 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: అనిశెట్టి రజిత, 3-12-60, కుమార్‌పల్లి, హనుమకొండ – 506 001; సెల్: 98494 82462; భండారు విజయ, ఎచ్.ఐ.జి. బ్లాక్-1, ఫ్లాట్ -10, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ – 44; సెల్: 88019 10908



❖ **విడనిముడి** (స్వీయ కవితల్లోని ఆత్మీయ అనుబంధాల కవిత్వం) – ముకుంద రామారావు – 117 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు: పాలపిట్ట బుక్స్, 403, విజయసాయి రెసిడెన్సీ, 16-11-20/7/1/1, సలీంనగర్ కాలనీ, మలక్‌పేట్, హైదరాబాద్ – 500036; ఫోన్ 040–27678430; email: palapittabooks@gmail.com



❖ **విద్యార్థులకు సూచనలు** – డి. నటరాజ్ – 28 పేజీలు, 1/8 డెమీ, రు. 10, ప్రతులకు : సెక్యులర్ పబ్లికేషన్స్, డోర్ నెం. 9–37, అడవివరం, సింహాచలం, విశాఖపట్నం – 28; సెల్: 77023 55076; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాల్లో



❖ **ముజఫర్‌నగర్** – మరో మానని గాయం – డెమోక్రటిక్ స్టూడెంట్స్ యూనియన్ రిపోర్ట్ – తెలుగు అనువాదం: ఆర్. శశికళ – విప్లవ రచయితల సంఘం – 29 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు: దిశ పుస్తక కేంద్రం; నవోదయ బుక్‌హౌస్



❖ **గాంధీ నిజస్వరూపం** – హిందీ మూలం: హంసరాజ్ రహబర్, తెలుగు అనువాదం: సమతారావు, సంపాదకుడు: డా. శాంతికుమార్ – జనసాహితి ప్రచురణ – 311 పేజీలు, 1/8 డెమీ, రు. 120, ప్రతులకు: మైత్రి బుక్‌హౌస్, విజయవాడ; మణి బుక్‌స్టాల్, నెల్లూర్; డా. శాంతికుమార్ అరుణ హోమియో వైద్యశాల, ఒంగోలు



❖ **విస్ఫోటనం నుండి విధ్వంసం దాక** – దీర్ఘకవిత – వై. శ్రీరాములు – శ్రీ ప్రచురణలు – 156 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: 12-3-257, 6వ క్రాస్, సాయినగర్, అనంతపురం; సెల్: 9247817167; విశాలాంధ్ర; ప్రజాశక్తి; నవోదయ; దిశ; తెలుగుబుక్‌హౌస్



❖ **జీవ రసాగ్ని సొగసు శ్రీశ్రీ** – ఛాయరాజ్ – కూర్పు: సింగంపల్లి అశోక్‌కుమార్ – శ్రీశ్రీ సాహిత్య నిధి – 45 పేజీలు, 1/8 డెమీ, రు. 25



❖ **అగ్ని సంతకం** – సశ్రీ – కూర్పు: సింగంపల్లి అశోక్‌కుమార్ – శ్రీశ్రీ సాహిత్య నిధి – 29 పేజీలు, 1/8 డెమీ, రు. 20 పై రెండు ప్రతులకు: శ్రీశ్రీ సాహిత్య నిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య వీధి, మారుతినగర్, విజయవాడ – 520 004; ఫోన్: 0866-6617375; సెల్: 98485 04649, 92462 77375; email : srisri_sahityanidhi@yahoo.com



❖ **బంగారం** – వాసిరెడ్డి వేణుగోపాల్ – సీనియర్ జర్నలిస్ట్, ఫైనాన్షియల్ ఎనలిస్ట్ – వాసిరెడ్డి పబ్లికేషన్స్ – 223 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు



❖ **రామయ్యాస్ మెమొరీస్** (ది ఎక్స్‌పీరియెన్సెస్ ఆఫ్ టీచింగ్ లైఫ్) – చుక్కా రామయ్య – ఇంగ్లీష్ అనువాదం : ఆర్‌వీఆర్ (ఆర్. వెంకటేశ్వర రావు) – సంపాదకత్వం – జూలూరు గౌరీశంకర్ – స్పృహ సాహితీ సంస్థ – 79 పేజీలు, 1/8 డెమీ, రు. 150



❖ **చివరంచు** – కవిత్వం ( 1999–2013) యార్లగడ్డ రాఘవేంద్రరావు – శ్రావ్య పబ్లికేషన్స్ – 100 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు: వై. రాఘవేంద్రరావు, శ్రావ్య పబ్లికేషన్స్, బి–22, మధురానగర్, హైదరాబాద్; విశాలాంధ్ర బుక్‌హౌస్ (అన్ని బ్రాంచీలలో)

## తెలంగాణ సిఎంగా కెసిఆర్

తెలంగాణ రాష్ట్ర తొలి ముఖ్యమంత్రిగా కల్వకుంట్ల చంద్రశేఖర్‌రావు చేత రాష్ట్ర గవర్నర్ ఇఎస్ఎల్ నరసింహన్ జూన్ 2న రాజ్‌భవన్‌లో ప్రమాణ స్వీకారం చేయించారు. అలాగే ముఖ్యమంత్రితో పాటు ఇద్దరు ఉప ముఖ్యమంత్రులు మోహమూద్ అలీ, టి. రాజయ్యలతో పాటు 11 మంది మంత్రులు ప్రమాణ స్వీకారం చేశారు. ఈ కార్యక్రమానికి మాజీ స్పీకర్ నాదెండ్ల మనోహర్‌రావు, సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి జస్టిస్ సుదర్శన్‌రెడ్డిలతో పాటు వివిధ పార్టీల నాయకులు, కార్యకర్తలు, ఐఎఎస్, ఐపిఎస్ అధికారులు, రచయితలు, వివిధ రంగాలకు చెందిన ప్రముఖులు హాజరయ్యారు.

## తెలంగాణ గవర్నర్‌గా నరసింహన్

తెలంగాణ గవర్నర్‌గా ఇఎస్ఎల్ నరసింహన్ చేత జూన్ 2న హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ కళ్యాణ్ జ్యోతి సేన్ గుప్తా రాజ్ భవన్‌లో ప్రమాణ స్వీకారం చేయించారు. ఆంధ్రప్రదేశ్, తెలంగాణ రాష్ట్రాలకు గవర్నర్‌గా నియమిస్తూ, అదనపు బాధ్యతలను అప్పగిస్తూ రాష్ట్రపతి ఉత్తర్వులు జారీ చేశారు. ఈ కార్యక్రమానికి ముఖ్యమంత్రి కెసిఆర్‌తో పాటు వివిధ పార్టీల అధ్యక్షులు, నాయకులు హాజరయ్యారు.

## రాష్ట్రపతి పాలన ఎత్తివేత

నూతనంగా 29వ రాష్ట్రంగా ఆవిర్భవించిన తెలంగాణలో కొత్త ప్రభుత్వం ఏర్పాటుకు వీలు కల్పిస్తూ సమైక్య ఆంధ్రప్రదేశ్‌లో విధించిన రాష్ట్రపతి పాలనను పాక్షికంగా ఎత్తివేస్తూ జూన్ 2న కేంద్ర హోంమంత్రిత్వ శాఖ నోటిఫికేషన్‌ను విడుదల చేసింది.

## అసెంబ్లీ సమావేశాలు

తెలంగాణ తొలి రాష్ట్ర శాసనసభ సమావేశాలు జూన్ 9 నుంచి 14 వరకు జరిగాయి. శాసన సభకు ఎన్నికైన ఎంఎల్ఎలు ప్రమాణ స్వీకారం చేశారు. ప్రొటెం స్పీకర్‌గా జానారెడ్డి, స్పీకర్‌గా సిరికొండ మధుసూదనా చారి, డిప్యూటీ స్పీకర్‌గా పద్మదేవేందర్‌రెడ్డిలను ఎన్నుకొన్నారు. ఈ సమావేశాల్లో ముఖ్యమంత్రి కెసిఆర్ కేంద్రం తెచ్చిన పోలవరం ఆర్డినెన్స్ రద్దు చేసి ముంపు గ్రామాలను తెలంగాణలో కొనసాగించాలని, జనాభాలో సగం భాగం ఉన్న మహిళలకు చట్ట సభలో 33 శాతం రిజర్వేషన్లు కల్పించాలని తీర్మానం చేశారు.

## ప్రజా సంఘాల ధర్నా

ఢిల్లీ యూనివర్సిటీ ప్రొ. జి.ఎన్. సాయిబాబా విడుదల కోసం ప్రజా సంఘాల ఐక్య కార్యాచరణ వేదిక ఆధ్వర్యంలో జూన్ 13న ఇందిరా పార్క్ వద్ద ధర్నా నిర్వహించారు. ఈ ధర్నాలో పాల్గొన్న వక్తలు అక్రమంగా అరెస్టు చేసిన సాయిబాబాను ఎలాంటి షరతులు లేకుండా విడుదల చేయాలని డిమాండ్ చేశారు. ఈ ధర్నాలో ప్రొ. హరగోపాల్, ప్రొ. కోదండరాం, పిఒడబ్ల్యు సంధ్య, అరుణోదయ విమలక్క, సిపిఐ నాయకులు కె. నారాయణ, విరసం సభ్యులు వరవరరావు, బొజ్జా తారకంలతో పాటు ప్రజా కళా మండలి, వివిధ ప్రజా సంఘాలు, విద్యార్థి సంఘాలతో పాటు అనేక మంది ప్రజలు పాల్గొన్నారు.

## సినీ నటి శకుంతల మృతి

ప్రముఖ సినీ నటి తెలంగాణ శకుంతల (65) (కడియాల శకుంతల) జూన్ 14న హైదరాబాద్‌లోని ఓ ప్రైవేట్ ఆసుపత్రిలో గుండె నొప్పితో బాధపడుతూ చనిపోయారు. ఆమె మహారాష్ట్రలోని పూణేలో జన్మించారు. ఆమె మొదటి సినిమా మా భూమి. ఆమె 250 పైగా చిత్రాల్లో నటించారు.

## చుండూరు తీర్పుకు నిరసనగా ధర్నా

హైదరాబాద్ కలెక్టర్ కార్యాలయం ఎదుట జూన్ 16న సిపిఎం, సిపిఐ, ప్రజా సంఘాల ఆధ్వర్యంలో చుండూరు సంఘటనపై హైకోర్టు ఇచ్చిన తీర్పుకు వ్యతిరేకంగా ధర్నా నిర్వహించారు. ఈ ధర్నాలో పాల్గొన్న వక్తలు చుండూరులో దళితులపై దాడులకు పాల్పడిన వారిని నిర్దోషులుగా ప్రకటిస్తూ కోర్టు తీర్పు ఇవ్వడం అన్యాయమని దీనిని ప్రజాస్వామిక వాదులందరు ఖండించాలని డిమాండ్ చేశారు. ఈ ధర్నాలో బొజ్జ తారకం, సిపిఎం నాయకులు బి.వి. రాఘవులు, సిపిఐ రాష్ట్ర కార్యదర్శి చాడ వెంకట్ రెడ్డి, అరుణోదయ విమలక్క, పిఒడబ్ల్యు సంధ్యతో పాటు అనేక మంది పాల్గొన్నారు.

## కొల్లూరి కోటేశ్వరరావు మృతి

తెలుగు విద్యార్థి మాస పత్రిక సంపాదకులు కొల్లూరి కోటేశ్వరరావు (81) జూన్ 19న హైదరాబాద్‌లో అనారోగ్యంతో బాధపడుతూ చనిపోయారు. ఆయనది కృష్ణా జిల్లా, మచిలిపట్నం. విద్యార్థులకు విద్యా విజ్ఞానాల సమాచారం అందించే ఆదర్శప్రాయమైన పత్రిక ఉండాలనే ఆకాంక్షతో 1953లో 'తెలుగు విద్యార్థి' మాస పత్రిక స్థాపించారు. ఈ పత్రికకు చిరకాలం సంపాదకులుగా పని చేశారు.

## తెలంగాణలో కొత్త పారిశ్రామిక విధానం

రాష్ట్రంలో కొత్త పారిశ్రామిక విధానాన్ని ప్రవేశపెడుతున్నట్లు జూన్ 11న రాష్ట్ర సచివాలయంలో ముఖ్యమంత్రి కెసిఆర్ వోల్వో వాహనాల ఉత్పత్తి కంపెనీ ప్రతినిధులకు తెలియచేశారు. కొత్తగా పెట్టే పరిశ్రమలకు ప్రభుత్వం పెద్ద ఎత్తున ప్రోత్సాహకాలను, రాయితీలను అందిస్తుందని భరోసా ఇచ్చారు. ఈ పరిశ్రమలకు భూకేటాయింపుల అవగాహన ఒప్పందాలలో కాలయాపన చేయకుండా పరిశ్రమల ఏర్పాటుకు ప్రాధాన్యతను ఇస్తామన్నారు.

## టివి ఛానళ్ల ప్రసారాల నిలిపివేత

తెలంగాణ సంస్కృతిని, సంప్రదాయాలను, శాసనసభను, శాసనసభ సభ్యులను కించపరిచేలా కథనాలను ప్రసారం చేసిన టివి9, ఎబిఎన్ ఆంధ్రజ్యోతి ఛానళ్లపై కఠిన చర్యలు తీసుకోవాలని ముఖ్యమంత్రి కె. చంద్రశేఖర్‌రావు శాసనసభలో జూన్ 14న తీర్మానం ప్రవేశపెట్టారు. ఈ తీర్మానాన్ని శాసన సభ ఏకగ్రీవంగా అమోదించింది. అందువలన తెలంగాణ వ్యాప్తంగా మల్టిపుల్ సిస్టం ఆపరేటర్ యూనియన్, కేబుల్ ఆపరేటర్ల సంక్షేమ సంఘం టివి9, ఎబిఎన్ న్యూస్ ఛానళ్ల ప్రసారాలను జూన్ 15 నుంచి గ్రేటర్ హైదరాబాద్‌తో పాటు తెలంగాణలోని అన్ని జిల్లాల్లో నిలిపివేశాయి. వీ

# బదాయున్ అత్యాచారాల నేపథ్యం

***సమాజంలోని అసమానతలను మార్చకుండా మహిళలపై జరుగుతున్న అత్యాచారాలకు, దాడులకు ఏ చట్టాలూ, ఏ శాసనాలూ పరిష్కారం కావని అంటున్నారు బి. రామకృష్ణ***

ఉత్తరప్రదేశ్ రాష్ట్రం బదాయున్ జిల్లాలోని కాత్రా సాదత్ గంజ్ గ్రామానికి చెందిన 12, 14 ఏళ్ల బాలికలిద్దరు బహిర్భూమికని 27 మే 2014న సాయంకాలం ఏడు గంటలకు వెళ్లారు. తెల్లారే సరికి వారిద్దరి శవాలు చెట్టుకు వేళ్లాడుతూ కనిపించాయి. బహిర్భూమికని వెళ్లిన పిల్లలు చీకటి పడ్డా కూడా తిరిగి రాకపోయే సరికి తల్లిదండ్రులు ఆందోళన పడుతున్నారు. పొలం పనుల నుండి ఇంటికి తిరిగివస్తున్న బాలికల మామ బాబురాంకు ఏవో అరుపులు వినిపించడంతో అటువైపుగా టార్చ్‌లైట్ వేశాడు. అతని కోడళ్లలో ఒకరిని తల వెంట్రుకలు పట్టుకుని పొలాల్లోకి లాక్కెళ్లుతుండడం చూశాడు. వారిని రక్షించే ప్రయత్నం చేశాడు. అయితే అతన్ని బాగా కొట్టారు. నాటు తుపాకితో బెదిరించారు. వారిలో ఒకర్ని బాబురాం గుర్తు పట్టాడు. ఈ విషయం తల్లి దండ్రులకు చెప్పి పిల్లల కోసం వెతికారు. కాని లాభం లేకపోయింది. వారింటి నుండి అర కిలోమీటర్ దూరంలో ఉన్న పోలీస్‌స్టేషన్‌కు వెళ్లి ఈ విషయాన్ని రిపోర్ట్ చేశారు. గుర్తుపట్టిన వ్యక్తి గురించి చెప్పారు. అయితే అతడు మంచివాడని పోలీసులు చెప్పారు. ఎలాగైనా తమ పిల్లలను రక్షించాలంటూ పోలీసుల కాళ్లపై పడి వేడుకుంటున్న తండ్రిని చెంపపై పోలీసులు కొట్టి, రెండు గంటల్లో మీ పిల్లలు మీ ఇంట్లో ఉంటారని చెప్పి పంపించేశారు. కాని తెల్లవారేసరికి అమ్మాయిలిద్దరూ చెట్టుకు వేళాడుతున్నారు. చెట్టుకు ఉరితీయబడే ముందు వారిద్దరు గ్యాంగ్ రేప్‌కు గురయ్యారని, ఉరితీసే ముందు వారికి ప్రాణమున్నట్లు తెలుస్తున్నది. విషయం తెలిసిన వెంటనే పోలీసులు స్పందించి ఉంటే అమ్మాయిలిద్దరూ బతికేవారేననేది వాస్తవం.

బాధితులు మౌర్య కులానికి, నేరస్తులందరూ యాదవ కులానికి చెందినవారు. నేరస్తుల్లో ఒకడు పోలీస్ కానిస్టేబుల్ కూడా ఉన్నాడు. ఈ దారుణ అత్యాచారంలో పోలీసుల భాగస్వామ్యం ఉందని స్పష్టం అయింది. ఈ సంఘటన గురించి ఆ ఊరికి చెందిన ఇద్దరు జర్నలిస్టులు బయటి ప్రపంచానికి, ఎలక్ట్రానిక్ మీడియాకు తెలియపర్చడంతో వెలుగులోకి వచ్చింది. స్థానిక ప్రజల నిరసనలు, ఆందోళనల వల్ల ఇద్దరు కానిస్టేబుళ్లతో సహా మొత్తం ఐదు మందిని అరెస్టు చేసి జైలుకు పంపారు. ఇద్దరు కానిస్టేబుళ్లను టర్మినేట్ చేయడం మొత్తంగా అక్కడి స్థానిక పోలీసులను సస్పెండ్ చేయడం, చీఫ్ సెక్రటరీ, హోంశాఖకు చెందిన ప్రిన్సిపాల్ సెక్రెటరీలను తొలగించారు. ప్రజల నుండి, బాధితుల నుండి వచ్చిన ఒత్తిడి మేరకు సిబిఐ విచారణకు ఆదేశించారు. అయినా భవిష్యత్‌లో ఈ విషయంలో నేరస్తులకు శిక్షలు పడేదెంతో, పడనిదెంతో ఎవరు చెప్పగలరు? ఒకవేళ పడినా బాలికలు బతికి వస్తారా? తల్లిదండ్రుల కడుపుకోత తీరుతుందా?

డిసెంబర్ 2012లో ఢిల్లీలో పారామెడికల్ విద్యార్థిని (నిర్భయ)పై సామూహిక అత్యాచారం దేశ వ్యాప్తంగా సంచలనం కలిగించింది. క్రూరమైన నేరానికి పాల్పడ్డ వారిపై కఠిన శిక్షలు అమలు చేయాలని కోరుతూ వేలాది మంది ఢిల్లీ వీధుల్లో రోజుల తరబడి నిరసనోద్యమాలు జరిపారు. దేశవ్యాప్తంగా పెద్దఎత్తున నిరసనలు నిర్భయ పట్ల సంఘీ భావనలు వెల్లువలా వచ్చాయి. అంతర్జాతీయంగా కూడా ఈ విషయం ఫోకస్ అయింది. యూరపియన్ యూనియన్ అయితే తన పార్లమెంట్‌లో ఆడవారిపై జరుగుతున్న నేరాలపై భారత్ సత్వరమే చర్యలు చేపట్టాలని తీర్మానం కూడా చేసింది. అంతర్జాతీయ ద్రవ్య నిధి సంస్థ (ఐఎంఎఫ్), అమెరికాలు నిరసనలు తెలిపాయి. ఢిల్లీ, ఈశాన్య రాష్ట్రాల్లో పర్యటించి ఆడవారిపై అమానుషాల గురించి ఐక్య రాజ్య సమితి భద్రతా మండలి మానవ హక్కుల కౌన్సిల్‌లో రిపోర్టు చేశారు.

నిర్భయ సంఘటన తర్వాత అంత పెద్ద ఎత్తున జాతీయ అంతర్జాతీయ దృష్టిని ఆకర్షించినది 'బదాయున్' సంఘటన. అయితే అప్పుడు వచ్చిన నిరసనల, సంఘీభావ వెల్లువలు బదాయున్ ఘటనపై రాకపోవడం గమనించాలి. నిర్భయ సంఘటన తర్వాత లైంగిక దాడులకు సంబంధించి చట్టాల్లో మార్పులు వచ్చాయి. క్రిమినల్ లా (అమెండ్ మెంట్) చట్టం 2013, నిర్భయ చట్టం అమల్లోకి వచ్చింది. ప్రొటెక్షన్ ఆఫ్ చిల్డ్రెన్ ఫ్రం సెక్సువల్ అఫెన్సెస్ ఆక్ట్ (పిఒసిఎస్ఒ), 2012 అమల్లో ఉన్నది. చట్టాలెన్నో చేసినా, శిక్షలను కఠినతరం చేసినా కూడా దేశ వ్యాప్తంగా ఆడవారిపై లైంగిక దాడులు జరుగుతూనే ఉన్నాయి.

బదాయున్ సంఘటన తర్వాత వరుసగా ఉత్తరప్రదేశ్‌లో వరుసబెట్టి మరిన్ని లైంగిక దాడులు జరిగాయి. బదాయున్ సంఘటన జరిగి వారం అయిందో లేదో బహరైచ్ జిల్లాలో ఓ 45 ఏళ్ల మహిళ అనుమానస్పద స్థితిలో చెట్టుకు వేలాడుతూ కనిపించింది. ఈ సంఘటనలో కూడా సామూహిక అత్యాచారం ఆపై ఉరి వంటిదే జరిగింది అంటున్నారు. 2014 జూన్ 10న హమీర్‌పూర్ జిల్లాలోని సుమేర్తపూర్ పోలీసులు, పోలీస్ స్టేషన్‌లో ఉన్న భర్తను చూడ్డానికి వచ్చిన 3 నెలల గర్భిణి అయిన 24 సంవత్సరాల మహిళను సామూహిక అత్యాచారం చేశారు. 2014 జూన్ 12న మొరదాబాద్ జిల్లా ఠాకూర్ ద్వారా ప్రాంతంలో 19 ఏళ్ల యువతిని గ్యాంగ్‌రేప్ చేసి చెట్టుకు శవాన్ని వేలాడేసినట్లుగా బంధువులు ఆరోపిస్తున్నారు. ఇవన్నీ ఉత్తరప్రదేశ్‌లో జరిగినవే.

నాగ్‌పూర్‌లో ఇద్దరు బాలికలపై లైంగిక దాడి జరిగింది. పిపా అనే గ్రామంలో ఎనిమిదేళ్ల బాలికను చాక్లెట్లు ఇస్తానని మభ్యపెట్టి 2014 జూన్ 15న రాత్రి తుషార్ మిస్కిన్ అనే వ్యక్తి లైంగిక దాడి చేశాడు. మహారాష్ట్ర బండారా జిల్లాలోని పదోని గ్రామంలో సమిత్‌సతి బాబ్నే అనే వ్యక్తి 17 ఏళ్ల బాలికను అపహరించి నాగ్‌పూర్ జిల్లాలోని బగోలీ గ్రామంలో నిర్బంధించి గతేడాది సెప్టెంబర్ నుండి ఈ ఏడాది జనవరి

నెలల మధ్య లైంగిక దాడికి పాల్పడ్డాడు. మధ్యప్రదేశ్‌లో జతారా పోలీస్‌స్టేషన్ పరిధిలోని 'గరోలి' గ్రామంలో భర్త చనిపోయి బాధలో ఉన్న 22 ఏళ్ల తన కోడలిపై మామ జగదీశ్వర్‌లోధి 2014 జూన్ 15న అత్యాచారం చేసి చంపేశాడు. గుజరాత్‌లోని అహ్మదాబాద్‌లో 5 ఏళ్ల బాలికపై 17 ఏళ్ల బస్ క్లీనర్ అయిన బాలుడు లైంగిక దాడిచేసి, చంపి లగేజీ కంపార్ట్‌మెంట్‌లో దాచి పెట్టాడు. దక్షిణ ఢిల్లీ ప్రాంతానికి చెందిన 25 ఏళ్ల యువతి 2014 జూన్ 11న ఇంటి నుంచి బజారు కెళుతుండగా ముగ్గురు యువకులు బలవంతంగా కారులో ఎక్కించుకుని అందులోనే సామూహిక లైంగిక దాడికి పాల్పడ్డారు. హర్యానాలోని జింద్ జిల్లా మందోఖేరి గ్రామానికి చెందిన 17 ఏళ్ల బాలికను 2014 జూన్ 10న ఒకడు మిత్రుల సహాయంతో కిడ్నాప్ చేసి నిర్మానుష్య ప్రాంతానికి తీసుకెళ్లి లైంగిక దాడి చేశాడు. పంజాబ్‌లో నవ వధువుపై, రాజస్థాన్‌లో 22 ఏళ్ల మహిళపై, తమిళనాడులోని కోయంబత్తూర్‌లో ఇద్దరు యువతులపై సామూహిక లైంగిక దాడులు జరిగాయి. ఇవన్నీ కూడా 2014 జూన్ 12న వెలుగులోకి వచ్చాయి. హైదరాబాద్‌లో 2014 జూన్ 8న రాత్రి తన పక్కన నిద్రిస్తున్న 6 ఏళ్ల స్వంత కూతురిపై కన్న తండ్రి లైంగిక దాడి చేశాడు. ఈ ఘటన అంబర్‌పేట పోలీస్ స్టేషన్ పరిధిలో జరిగింది. హైదరాబాద్ ఫిలింనగర్‌లో ఉంటున్న 28 ఏళ్ల నర్సింహ (జూనియర్ ఆర్టిస్ట్) మద్యం మత్తులో ఇంటికి వస్తున్నపుడు ఆడుకుంటూ కనిపించిన 6 ఏళ్ల బాలికను చాక్‌లెట్ ఇస్తానని మభ్యపెట్టి ఇంట్లోకి పిలిచి 2014 జూన్ 10న లైంగిక దాడి చేశాడు.

ఉత్తరప్రదేశ్‌లో ఇదే క్రమంలో ఓ మహిళా జడ్జిపై ఆమె ఇంట్లోనే లైంగిక దాడి జరిగింది. జడ్జిలకు కూడా రక్షణ లేకుండా పోయింది. ఎవరైతేనేమీ ఆడమనిషా? కాదా? అనే విధంగా పరిస్థితులున్నాయి. దేశ వ్యాప్తంగా, ప్రపంచ వ్యాప్తంగా కూడా ఏ ప్రాంతంలోనైనా ఐదారేళ్ల పసి పిల్లల నుండి నడీడు వయసున్న ఆడవారిపై అఘాయిత్యాలు, అత్యాచారాలు, హత్యలు జరగడం సర్వసాధారణం అయ్యాయి.

ఆడపిల్లలు, మహిళలు ఇంటి బయటే కాకుండా ఇంట్లో, సమీప బంధువులు, తోబుట్టువులు, పరిచయస్తులు, రక్త సంబంధీకులు, నాన్న, అన్న, తాత అనే తేడాలేమీ లేకుండా రకరకాల హింసలు, వివక్షలతో పాటుగా లైంగిక హింసలకు గురవుతున్నారు. వీటిని బయటకు చెప్పుకోలేక లోలోపల నరక యాతనకు, మానసిక, ఉద్వేగాత్మక హింసకు, సంఘర్షణలకు లోనవుతున్నారు. సగానికిపైగా ఆడవాళ్లు ఇలాంటి లైంగిక హింసలకు లోనవుతున్నారని ఎన్నో సర్వేలు తెలుపు తున్నాయి. కులం, మతం, ప్రాంతం, వర్గం, జాతి అనేదానితో సంబంధం లేకుండా సాంఘిక వివక్షకు, అసమానత్వానికి, లైంగిక హింసలకు, దాడులకు గురవుతున్న సార్వత్రిక వర్గం ఉన్నదంటే అది ఆడవాళ్లేనని స్పష్టం అవుతున్నది. ఆడవారిపై పెరుగుతున్న అకృత్యాలను కేవలం కఠినతరమైన చట్టాలు, శిక్షలు మాత్రమే ఆపలేవని పై అనుభవాలెన్నో చెపుతున్నాయి. ఈ నేరాలు చేయకుండా ఉండే సామాజిక పరిస్థితులను సాధించడంపై దృష్టి పెట్టాల్సి ఉంది. నేరస్తులను కఠినంగా శిక్షించాలని, మరింత ముందుకెళ్లి మరణ శిక్షలు విధించాలని, అంగచ్ఛేదనం చేయాలని, నపుంసకులను చేయాలనే వాదనలు ముందుకు వస్తున్నాయి. నిజానికి మరణ శిక్షలు విధించాల్సింది నేరాలను ప్రోత్సహిస్తున్న సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక వివక్షతలు, పీడనలకు, కాని వీటి నుండి దృష్టి మరల్చి నేరస్తులుగా మార్చబడుతున్న వ్యక్తులను నిర్మూలించాలను కోవడం వల్ల ఒరిగేదేమీ లేదు. పైగా ఇది అసలు మూలాలను వదిలి వాటి ప్రతిబింబాలను తొలగించుకోవాలను కోవడం అవుతుంది. శిక్షలు, చట్టాలైనా సక్రమంగా అమలవుతాయా అంటే అదీలేదు. అడుగడుగునా ప్రభుత్వ యంత్రాంగం, అలసత్వం, నిర్లక్ష్యం, పక్షపాత ధోరణి, ఆధిపత్య శక్తుల ప్రభావం అడ్డుకుంటూనే ఉంటున్నాయి.

ఈ నేరాలకు పురికొల్పే అనేక వ్యవస్థాపరమైన విషయాలెన్నో ఉన్నాయి. విచ్చలవిడిగా మద్యం, మత్తు మందులు సరఫరా అవుతున్నాయి. మొన్నటి ఎన్నికల్లో విచ్చలవిడిగా గతంలో ఎన్నడూ లేనంతగా అధిక మొత్తంలో మద్యం, మత్తు మందులు ఉపయోగించ బడ్డాయని అధికారిక లెక్కలే చెపుతున్నాయి. గల్లీ గల్లీకి ఓ మద్యం దుకాణం వెలుస్తోంది. కల్తీ కల్లు, రసాయనిక కల్లు సరఫరా గ్రామాల్లో జరుగుతోంది. మత్తు మందుల వాడకం విపరీతంగా పెరిగిపోతోంది. ఇవి మనిషిలో అసహజ ప్రవర్తనను, లైంగిక దాడులకు, అమానవీయ ఆలోచనలకు, చర్యలకు దారి తీస్తాయి. దీనిపై స్పందించి మద్యం బంద్ చేయించే ఆలోచనగాని, ఆచరణగాని ఏ పాలక వర్గానికి లేదు. సరికదా ఈ వ్యాపారంలో ఉన్నవారే ప్రజా ప్రతినిధులవుతున్నారు. మంత్రులూ అవుతున్నారు. ప్రజలను మద్యానికి, మత్తు పదార్థాలకు బానిసలను చేస్తూ వ్యక్తిగత జీవితాలను విచ్ఛిన్నం చేస్తున్నారు. అలాగే సామాజిక సమస్యలపైన స్పందించకుండా ప్రజల శక్తి సామర్థ్యాలను పీల్చేస్తున్నారు.

సినిమాలు, నీలి చిత్రాలు, యువతపై తీవ్రమైన ప్రభావాన్ని చూపిస్తున్నాయి. సున్నితమైన, మానవ సహజమైన శృంగార స్పందనలను రెచ్చగొట్టే రీతిలో ఎక్స్‌పోజ్ చేయబడుతున్నాయి. ఇంటర్నెట్‌లో ఎన్నో చెత్త సైట్‌లు ఇలాంటి వాటికి ఊతమిస్తున్నాయి. నేడు ఇంటర్నెట్ వాడకం పెరిగిపోతోంది. విద్యార్థులు, యువత ఎక్కువగా వినియోగిస్తున్నారు. ఇంటర్నెట్‌లో విపరీతంగా ప్రసారమవుతున్న విచ్చలవిడి, విశృంఖల శృంగార దృశ్యాలు, కార్యక్రమాలు, సమాచారాలపై, అశ్లీల అంశాలపై కఠిన చర్యలు చేపట్టకపోవడం దేన్ని సూచిస్తున్నది? బాధ్యత లేకుండా సినిమాలు నిర్మిస్తున్న దర్శక, నిర్మాతల పాత్రను, అలాగే నటీనటుల పాత్రను తక్కువ చేసి చూడలేం. ప్రింట్ మీడియాలో కూడా మనిషిలోని సున్నితమైన శృంగార పర భావనలను రెచ్చగొట్టే విధంగా ఫొటోలు వేయడం, నటీనటుల గురించి గాసిప్ రాయడం, చౌకబారు కామెంట్స్, కథనాలు, కథలు ప్రచురించడం దేనికి ఊతమిస్తుంది?

టివిలలో ఇలాంటివే ఎన్నో కార్యక్రమాలు ప్రసారమవుతూనే ఉన్నాయి. సెక్స్, క్రైంల పేరుతో టివిలలో ప్రసారమవుతూనే ఉన్నాయి. వీటి అధిపతులు ఈ సమాజంలో ఏం జరగాలని ఆశిస్తున్నారు? ఎటువైపు మళ్లిస్తున్నారు? (దేశంలో, రాష్ట్రంలో ఏదో ఒక రాజకీయ పార్టీకి అనుబంధంగా లేక అనుకూలంగా సమాచార పత్రికలు, టివిలు మొత్తంగా మీడియా అన్న విషయం తెలిసిందే.) వీటిపై కఠిన చర్యలు తీసుకోవడం అనేది హాస్యాస్పదంగా మారింది. మీడియాలో వస్తున్న ఈ పెడధోరణులను అరికట్టడానికి నిర్దిష్టమైన నియమావళి గురించి చర్చ జరగాల్సి ఉంది. 'కంచే చేను మేసిన' చందంగా వీటన్నింటికి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రభుత్వ యంత్రాంగ అండదండలు ఉంటూనే ఉన్నాయి. అసలు ఈ అధిపతులే కొన్నిసార్లు చట్టసభల్లోకి ఎంపిక అవుతున్నారు. లేదా వారి ప్రతినిధులు ఎంపిక అవుతున్నారు.

మద్యం, మత్తు మందులు, నిలువరించకుండా, పైన వివరించిన మీడియా పెడధోరణులను, టివి, సినిమా, ఇంటర్నెట్‌లను పాలకవర్గాలు, ప్రభుత్వాలు నియంత్రించకుండా మిన్నకుండి పోతున్నాయి. ఇది పాలక వర్గాల ప్రభుత్వాల, చట్టపర, రాజ్యాంగపర సంస్థల వైఫల్యమే కాదు, అది వారు చేస్తున్న నేరం కూడా అని అర్థం చేసుకోవాలి. తమ నేరాలను కప్పిపుచ్చుకోవడమో, అసమర్థతో, అసహాయతో ఏదైతేనేమి ఆడవారిపై

లైంగిక దాడులను అరికట్టడం సాధ్యం కాదని, దానికి వ్యక్తులనే నేరస్తులుగా చూపి, ఆ నేరస్తులను కఠినంగా శిక్షించాలనుకోవడం, కఠిన శిక్షలే పరిష్కారాలుగా చూపే భావజాలాన్ని ప్రజల్లో వ్యాప్తి చేయడం అనేది దారుణమైన విషయం.

పిల్లల సమగ్ర వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దే పాఠశాలలు, ఇతర విద్యా సంస్థలు, ఉన్నత విద్యాసంస్థలు, విశ్వ విద్యాలయాల్లో స్త్రీ, పురుష సమానత్వంపై భావజాల వ్యాప్తి జరగాలి. సాంఘిక దురన్యాయాలపై స్పందించేలా మానవీయ మానవ నిర్మాణం జరిగేలా వాటి పని విధానం ఉండాలి. అటువంటి ముఖ్యమైన విద్యా వ్యవస్థ నేడు మార్కెట్‌లో సరుకు అయింది. మార్కుల, ర్యాంకుల, ఇంగ్లిష్ మాధ్యమం వ్యామోహంలో కొట్టుకుపోతోంది. విద్య సామాజిక బాధ్యతగా, ప్రభుత్వం విధిగా కాకుండాపోతోంది. ఈ విధానాన్ని అరికట్టకుండా పాలక వర్గాలు, ప్రభుత్వాలు దానిని మరింత వేగవంతం చేస్తున్నాయి.

ఇంటర్ విద్యను వ్యాపారమయం చేసి కార్పొరేటీకరణ గావించి కోట్లకు కోట్లు గడించి మొత్తంగా ఇంటర్ విద్యను తమ గుప్పిట పెట్టుకున్న వ్యక్తిని ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు తన మంత్రివర్గంలోకి తీసుకున్నాడు. ఇది దేన్ని సూచిస్తుంది? విద్య ద్వారా సమాజంలోని పిల్లలందరూ సమగ్రమైన జ్ఞానం, మానవీయ విలువలు, సామాజిక స్పందనలు, సమాజ పురోగభివృద్ధిలో తాను భాగస్వామి కావాలనే ఉత్కృష్టమైన భావనలు మనస్సు అంతరాళాల్లో నాటుకునేలా చేయాల్సి ఉంటుంది. కాని అది వ్యాపారమయం కావడం అనేది లాభ నష్టాల విషవలయంలో గిరికీలు కొడుతుండడం అనేది సమాజంలో విలువల పతనానికి దారి తీస్తుంది. దారి తీయడమే కాదు విద్య వ్యాపార సరుకు అవ్వడం అనేది సమాజ పతనానికి సూచిక కూడా. దీని గురించి ఏ ప్రభుత్వమూ పట్టించుకున్న దాఖలాలు లేవు.

బదాయున్ సంఘటనపై తీవ్రంగా స్పందించిన యుఎన్ఓ సెక్రటరీ జనరల్ బాన్ కీమూన్ వ్యవస్థీకృతమైన సాంఘిక, ఆర్థిక, రాజకీయ వివక్షతల గురించి మాట్లాడలేదు. కాని బాధితులకు న్యాయం జరగాలని, ఈ సంఘటన భయం గొలిపేదిగా ఉందని అన్నాడు. ఈ వివక్షతలు మహిళలపై అకృత్యాలకు దోహదం చేస్తున్నాయన్న విషయం గురించి, సామాజిక సంబంధాల్లో సమానత్వ దిశలో జరగాల్సిన మౌలిక మార్పు గురించి అమెరికా, ఐఎంఎఫ్‌లు స్పందిచవు. కాని నిర్భయ, బదాయున సంఘటనలను ఖండిస్తాయి, విచారం నిరసనలు వ్యక్తం చేస్తాయి. ఇంటర్నెట్‌లో విశృంఖల శృంగారాన్ని ప్రచారంచేసే సైట్లపై, యంత్రాంగం పై చర్యల గురించి, వాటి అనుమతుల రద్దు గురించి, అశ్లీల సినిమాల గురించి యుఎన్ మాట్లాడదు, ఐఎంఎఫ్ మాట్లాడదు. వాటిని కట్టడి చేయగలిగే సర్చ్ ఇంజన్‌లు లేదా ఇతరత్ర వాటి గురించి అమెరికా కాని ఇతర పాశ్చాత్య దేశాలు గాని మాట్లాడవు. మద్యం, మత్తు మందుల గురించి మాట్లాడరు. విపరీతంగా భారత్‌లోకి చొచ్చుకు వస్తూ, ఇక్కడ ప్రజల సంపదను అప్పనంగా కబళిస్తూ ప్రజల్లో ఉద్యోగ, ఉపాధి అవకాశా లను కొల్లగొడుతూ, ప్రజల్లో తీవ్రమైన అసమానతలు పెంపొందించే బహుళజాతి సంస్థల దురాగతాల పాత్ర గురించి మాట్లాడవు.

ప్రపంచ వ్యాప్తంగాను, మన దేశంలోను అమలవుతున్న ప్రైవేటైజేషన్, లిబరైజేషన్, గ్లోబలైజేషన్ (ఎల్‌పిజి)లు ప్రజల మధ్య తీవ్రమైన ఆర్థిక అసమానత్వాలకు దారితీస్తున్నాయి. సహజ వనరులు, దేశ సంపద, ప్రజా సంపదలు కొల్లగొట్టబడుతున్నాయి. పర్యావరణానికి తీవ్రమైన హాని తెస్తున్నాయి. వాటితోపాటు విష సంస్కృతిని విస్తరిస్తున్నాయి. సెక్స్ వ్యాపారాన్ని, మద్యం, మత్తు మందుల వ్యాపారాన్ని అలాగే విద్యా వ్యాపారాన్ని ప్రోత్సహిస్తున్నాయి. భూస్వామ్య సంస్కృతితో మిలాఖత్ అయిన పెట్టుబడి దారి, సామ్రాజ్యవాద విష సంస్కృతి వికృత రూపాలు మహిళలపై పెరుగుతున్న లైంగిక దాడులకు, అత్యాచారాలకు ఊతం ఇస్తున్నాయనే దాన్ని విస్మరించరాదు. ఇటువంటి దుర్మార్గ విధానాలను వ్యతిరేకిస్తూ స్వయం పాలన, స్వావలంబన దిశగా నడవడానికి దేశంలోని ఏ ఒక్క పార్లమెంటరీ పార్టీ కూడా సిద్ధంగా లేదు.

ఆడవారిపై లైంగిక దాడులకు సంబంధించి కులం ఒక ముఖ్యమైన అంశంగా ఉంటుంది. కింది కులాలపై పై కులాలవారు అఘాయిత్యాలకు పాల్పడడం గతంలో జరిగింది. నేడు జరుగుతున్నది. ఈ విషయంలో రాజ్య యంత్రాంగం పక్షపాతంగా వ్యవహరిస్తుంటుంది. పోలీసు యంత్రాంగం కింది కులాల వారిపట్ల సరిగ్గా స్పందించకపోవడం సర్వసాధారణమైన అంశం. డబ్బు, పలుకుబడి, అగ్రకుల దురహంకారానికి అనుకూలంగా అవి పనిచేస్తుండడం జరుగుతున్నది. కోర్టులు దీనికి భిన్నంగా ఏమిలేవు. దళితులను అగ్రకులాల వారు రేప్ చేసిన సందర్భాలలో అసలు అంటరాని వారిని అగ్రకులస్తులు తాకనే తాకరు, ఇంకా రేప్ ఎలా చేస్తారని కోర్టులు కామెంట్ చేసిన సందర్భాలూ ఉన్నాయి. ఉదాహరణకు గతంలో హర్యానాలో భన్వారీదేవిపై జరిగిన అత్యాచార సందర్భం, దళితులపై జరిగిన చుండూరు హత్యకాండ, అంతకు ముందు పదిరికుప్పం, నీరుకొండ, కారంచేడు మొన్నటి లక్ష్మింపేట, ఖైర్లాంజి సంఘటనలు అగ్రకులాల దాడులను, హత్యలను దృవీకరిస్తున్నాయి. వీటిపై పోలీసు, న్యాయ యంత్రాంగాలు సరిగ్గా స్పందించి న్యాయం వైపుకు పయనించలేదు. ఫలితంగా దళితులకు అన్యాయమే మిగిలింది. నిమ్న కులాల వారిపై జరిగే అన్యాయాలపై పకడ్బందీగా, నిజాయితీగా, న్యాయ బద్ధంగా స్పందించరు. ప్రజా ఒత్తిడి పెరిగిన సందర్భంలో మాత్రం కేసులు నమోదు చేస్తుంటారు. కాని నేర విచారణలో, శిక్షలు వేయించడంలో ఎన్నో లోపాలకు, నిర్లక్ష్యానికి పాల్పడతారు. లేదా కావాలనే దిగిపోయేలా అన్ని రకాల చర్యలను ప్రభుత్వ యంత్రాంగం తీసుకుంటుంది. దీనికి ఉదాహరణలు కోకొల్లలు. పైన చెప్పిన సంఘటనలన్ని వీటికి సాక్ష్యాలే.

హిందూ మతోన్మాదులచే మైనారిటీ మతస్తులపై జరిగిన అనేక దాడుల్లో మహిళలు లైంగిక దాడులకు లోనయ్యారు. గుజరాత్, ఒడిశాలలో జరిగిన దాడులు వీటికి ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు.

మహిళలపై హింసను ప్రజల్లో ఒక వర్గంపై దాడిగా కూడా చూడాల్సి ఉన్నది. సమానత్వం వైపుగా నడుస్తున్న సామాజిక ఉద్యమాలు, ఆందోళనలను అణచివేయడానికి లేదా అణచివేయడంలో భాగంగా ఆ ప్రాంతంలోని ఉద్యమ శ్రేణులు లేదా సాధారణ ప్రజల్లోని మహిళలపై దౌర్జన్యాలకు, లైంగిక దాడులకు పాల్పడడం ఒక కార్యక్రమంగా జరుగుతున్నది. అది వాకపల్లిలో ఆదివాసి మహిళలపై పోలీసులు జరిపిన గ్యాంగ్‌రేప్ కావచ్చు. కశ్మీర్, ఈశాన్య రాష్ట్రాల్లో జరుగుతున్న ఉద్యమాలపై, నక్సలైట్ లేదా మావోయిస్టు ఉద్యమ ప్రాంతాల్లో కావచ్చు. రాజ్య వ్యతిరేక పోరాట శ్రేణులపై కావచ్చు. ఈ రకమైన దాడులను పోలీసులు, సైనిక బలగాలు, స్పెషల్ పోలీస్ ఆఫీసర్స్, సర్కారీ కిరాయి హంతక మూఠాలు మహిళలపై ఈ రకమైన హింసను, దాడులను ప్రయోగిస్తూనే ఉన్నారు. వీటిపై రావాల్సినంత నిరసన సభ్య సమాజం అనబడే దాని నుండి రావడం లేదు. ఇక్కడ కఠిన శిక్షలు, మరణ శిక్షల మాటే తలెత్తదు.

వీటన్నింటితో పాటుగా సమాజంలోని ఆడవారిపై వివక్ష, హింసలకు

# సుపరిపాలనా? 'స్వ' పరిపాలనా?

***పరిపాలనా విధానాలపై నిర్ణయాలు మంత్రి మండలి తీసుకున్నా, తుది నిర్ణయం తనదేనంటున్న మోడీ తన నిరంకుశత్వాన్ని నిరూపించుకుంటున్నారని అంటున్నారు*** **వి. హనుమంతరావు**

'మంచి రోజులొస్తున్నాయ్' ఎన్నికలలో ఇది మోడీ ప్రచారంలో ఇచ్చిన ఆకర్షణీయమైన నినాదం. ఆ నినాదం 'తడి ఆరకముందే' 'వచ్చే ఒకటి రెండు సంవత్సరాల్లో కఠిన నిర్ణయాలు తప్పవు' అని అదే మోడీ ఒక హెచ్చరికను చేసేసరికి ప్రజలకు సైకిల్ టైర్లో గాలి తీసేసినట్లయింది. ఎవరైనా చట్ట వ్యతిరేక చర్యలకు పాల్పడితే కఠిన చర్యలు తప్పవంటూ ఇంతవరకూ కాంగ్రెస్ పాలకులు అంటూండడమే గానీ కఠినం మాట అటుంచి చర్యలు తీసుకున్న దాఖలాలే లేవు. కాని మోడీ మాటంటే మాటే. చండ శాసనుడు, చండ ప్రచండుడనే ప్రచారం జరిగింది కాబట్టి కఠిన నిర్ణయాలు తప్పకుండా తీసుకుంటారని మనమంతా అనుకుందాం. అనుకోవడమేమిటి, నల్లధనాన్ని విదేశాల నుంచి వెనక్కు తెప్పించు కోవడానికి మోడీ మంత్రివర్గం తన మొట్టమొదటి సమావేశంలోనే ఒక కమిటీని నియమించడమే ఆయన కఠిన చర్యలకు ఒక నిదర్శనమని బిజెపి శ్రేణులనవచ్చు. కాని సుప్రీంకోర్టు ఆదేశాల మేరకే ఆ కమిటీని వేయడం జరిగిందని పాఠకులకు తెలియని విషయం కాదు.

ఇప్పుడు 'కఠిన' నిర్ణయాల విషయానికి వస్తే, కఠినత్వం చూపేది ఎవరి మీద? బిలియన్లు, ట్రిలియన్ల డాలర్ల విలువ కలిగిన ఆస్తులున్నవారి మీదా? మోడీ గెలుపుకోసం కోట్ల రూపాయల నిధులు అందజేసిన వారిమీదా? మోడీ అంత కృతఘ్నుడు కాదు. కాబట్టి వారిమీద కాదు. మధ్య ఉన్నత మధ్యతరగతి వారి పట్ల కఠినత్వం చూపిస్తారా? అయ్యో, మోడీకి పడిన 31 శాతం ఓట్లు ప్రధానంగా వాళ్లు వేసిన ఓట్లే ఆయనను ప్రధాని సింహాసనం మీద కూర్చునే అవకాశాన్నిచ్చాయి. వారు కూడా బిజెపి ఏదోతవ్వి తలకెత్తుతుందని కాదు, కాంగ్రెస్ పాలనతో విసుకెత్తి పోయారు, ప్రత్యామ్నాయంగా వారికి మోడీ కనిపించారు. ఓటేశారు. మోడీకే ఎక్కువ సీట్లు వచ్చాయి. (ఓటు 31 శాతమే) వారిపై కఠినత్వం చూపడమా? అయినా కాస్తో కూస్తో వడ్డింపులుండవచ్చు, లేదా వారి ఆశలు నెరవేర్చకపోవచ్చు. కాగా కఠినత్వం చూపేవారెవరిమీద? రేపో, మాపో బడ్జెట్ ప్రవేశపెడతారు కదా, చూద్దాం. అయినా, అడగందే అమ్మయినా పెట్టదన్నట్లు, మనం అడిగేదేదో అడుగుదాం. వ్యవసాయం లో పెట్టుబడులు పెట్టాలి. చిన్న, సన్నకారు రైతులకు మాత్రమే సహాయపడే చర్యలు తీసుకోవాలి. పట్టణాలు, నగరాల్లో మురికి వాడల స్థానే శాశ్వత ఇళ్లు నిర్మించాలి. ఆస్తులు పెరిగిన కొద్దివారి మీద పన్ను కూడా పెంచాలి. అసమానతలు తొలగించాలి. వీటన్నిటికీ కావాల్సిన నిధులు వచ్చే బడ్జెట్‌లోనే కేటాయించాలనడం లేదు. ఆ దిశగా ప్రభుత్వం అడుగులేస్తుందనే భరోసా కల్పించాలి. ఆ చర్యల ఫలితాలు ఎవరికైతే చేరాలో వారికి చేరేలా ప్రభుత్వ యంత్రాంగాన్ని సంస్కరించాలి.

ఇంట గెలిచి రచ్చ గెలవాలనే సామెత చందంగా ప్రభుత్వ యంత్రాంగ ప్రక్షాళన, కేంద్ర మంత్రుల పనితీరుతో మోడీ శ్రీకారం చుట్టడం అభినందనీయం. తాను 18 గంటలు పనిచేయడం అలవాటు. కేంద్ర

---

సాధికారత, ఆమోదం ఉన్నాయి. అది ఏ ప్రాంతమైనా, ఏ దేశమైనా, జాతి అయినా, మతం అయినా సరే. సర్వనామాలు అయ్యాయి. ఇంట్లో, ఇంటి బయటా హింసలు, అణచివేతలు, నిర్బంధాలు సహజమన్నట్లుగా జరుగుతుంటాయి. అసహాయురాలని, అమాయకురాలని, అస్వతంత్రురా లని, అబల అని వారిని ఏమి చేసినా చెల్లుబాటు అవుతుందనే గట్టి నమ్మకం, విశ్వాసం సమాజంలో వేళ్లూనుకొని పోయింది. దీనికి కులం, మతం, భూస్వామ్య సంస్కృతి తోడ్పడుతున్నాయి. స్త్రీ, పురుష సమానత్వం అనేది వల్లించే ఆదర్శంగా కాకుండా ఆచరణలో సాధించడంపై కృషి జరగాల్సి ఉంది. స్త్రీకి తన శరీరంపై, ఆలోచనలపై తనకు స్వేచ్ఛ ఉండాలి గాని వాటిపై మరొకరి ఆజమాయిషీ, నియంత్రణ, నిర్బంధాలు ప్రయోగించబడడం పోవడం ఎలా అన్నదానిపై దృష్టి కేంద్రీకరించాలి. సామాజిక అంతరాలు, వివక్షతలు, అసమానతలు రూపు మాపితే గాని మహిళలపై అకృత్యాలకు అంతం ఉండదు. భూస్వామ్య, పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద విష సంస్కృతి ఒకదానితో ఒకటి మిలాఖత్ అయిపోయి ఆడవారిపై అఘాయిత్యాలను పెంచి పోషిస్తున్నాయనే విషయాన్ని గుర్తించి వాటిపై పోరాటం సాగించాలి. అటువైపుగా వేసే అడుగులు పరిష్కారానికి చేరువవుతాయి. పుట్టుకతో ఏ మనిషి నేర స్వభావం కలిగి ఉండదు. తాను పెరుగుతున్న సామాజిక సంబంధాల ప్రభావం ఒక్క మనిషిపై ఒక్కోరకంగా ఉంటుంది. ఆ ప్రభావాలను సానుకూల ప్రవర్తనలవైపు, పురోగామి, ప్రగతి దిశలోకి తీసుకెళ్లే భావజాల, ఆచరణాత్మక దిశగా ప్రయాణించడంపై దృష్టి పెట్టాల్సి ఉంది.

ప్రగతిశీల ఉద్యమాలు పాదుకుని కొనసాగుతున్న క్రమంలో, ప్రాంతాల్లో ఆడవారిపై లైంగిక దాడులు క్షీణ దిశలో ఉందనడంలో లేదా ఉంటుందనడంలో సందేహ పడాల్సిందేమి లేదు. ఆడవారికి విద్య, ఆర్థిక స్వేచ్ఛ ఆవశ్యకత ఎంతగానో ఉంది. వీరికి విద్యా, ఉపాధి రంగాలను విస్తృతంగా అందుబాటులోకి తేవడం ద్వారా వారిమీద వారికి విశ్వాసం, ఆత్మగౌరవం పెరుగుతాయి. స్వతంత్రంగా జీవనం సాగించే ధైర్యం అలవడుతుంది. ఇతరులపై ఆధారపడే దైన్యస్థితి నుండి బయటపడతారు. ఇటువైపుగా చేసే ప్రయత్నాల గురించి సమాజంలో చర్చ జరగాలి. పాలక వర్గాలపై ఒత్తిడి పెంచాలి. మొత్తంగా చూసినపుడు సామాజిక సంబంధాల్లోనే మౌలిక మార్పు కోసం జరిగే పోరాటాల్లో, ఆ పోరాట విజయాల్లో ఆడవారిపై అకృత్యాలకు అడ్డుకట్ట పడుతుందన్న విషయాన్ని విస్మరించలేం.

*(రచయిత ఉపాధ్యాయులు, డిటిఎఫ్ సభ్యులు)* వీ

ప్రభుత్వ ప్రధాన కార్యాలయం పరిశుభ్రతతో ప్రారంభించి, మంత్రులంతా టైముకు ముందే వచ్చి, ఆలస్యమైనా సరే పనిపూర్తి చేసి వెళ్లాలి. తనకు, మంత్రులకు మధ్య మంత్రుల కమిటీలను రద్దు చేశారు. ఈ వడబోత అవసరం లేదన్నారు. విధానపరమైన విషయాలపై నిర్ణయాలను తానే తుదినిర్ణయం తీసుకుంటానని, కార్యదర్శులు తనవద్దకే ఫైళ్లు తీసుకురావాలని ఆదేశించారు. మంత్రులు హాజరుకాని కార్యదర్శుల సమావేశం ఏర్పాటు చేసి 'డు అండ్ డోంట్స్' గురించి క్లాసు తీసుకున్నారు. ఇలాంటి ఆదేశాలు మంచిగానే అనిపిస్తున్నాయి గాని, అంతర్లీనంగా చూస్తే ఫ్యూడల్ సమాజంలో రాజుల పరిపాలన, రాజే సర్వస్వం నా నిర్ణయమే తుది నిర్ణయం అనే ధోరణి గోచరించడం లేదూ? పరిపాలనలో కూడా ప్రజాస్వామ్యం ఉండాలి కదా. పార్టీలో, పరిపాలనలో తలలు పండిన పార్టీ నేతలనందరినీ కాదని ఆర్ఎస్ఎస్ నుంచి తన ప్రధాని అభ్యర్థి తత్వానికి క్లియరెన్స్ తెచ్చుకున్నప్పుడే ఈ వ్యక్తిత్వ ధోరణులు కనిపించాయి. అదే ధోరణి పరిపాలనలోనూ వ్యక్తమవుతుంది.

ఇదే ధోరణి ప్రధాని విధులేమిటో రాష్ట్రపతి కార్యలయం నుంచి వెలువడిన పత్రికా ప్రకటనలో కనిపిస్తుంది. ప్రధాని విధులేమిటో అనే పట్టికలో 'అన్ని ముఖ్య విధాన నిర్ణయాలు' అనే బాధ్యత ప్రధానిదేనని ఉంది. సాధారణంగా ఏ శాఖ మంత్రి అయినా, తన శాఖకు సంబంధించిన విషయాలపై నిర్ణయం తీసుకుని, దానిని మంత్రి మండలి లో ప్రవేశపెట్టి ఆమోదం పొందడం, అది మంత్రి మండలి నిర్ణయంగా రూపొందుతుంది. ఇది ప్రజాస్వామ్య పద్ధతి. కాని అన్ని ముఖ్య నిర్ణయాలు ప్రధాని అధికారాల పట్టికలో పొందు పరచడమేమిటి? 'ముఖ్య' నిర్ణయం అంటే నిర్వచనం ఏమిటి? ఏ నిర్ణయమైనా మంత్రి మండలి ఆమోదించిన తర్వాతనే కదా. ప్రజాస్వామ్య సూత్రాల ప్రకారం మంత్రి మండలి ఉమ్మడిగా నిర్ణయం తీసుకుంటుంది. దానిని అమలు పరిచే బాధ్యత తత్సంబంధిత శాఖ మంత్రిది. కాగా 'ముఖ్య నిర్ణయాలు' విషయంలో స్పష్టత అవసరం. ముఖ్య నిర్ణయాల పేరుతో మంత్రులను పక్కనపెట్టి కార్యదర్శులందరూ నేరుగా ప్రధానికే రిపోర్టు చేయాలని ఆదేశించిన తర్వాత మంత్రి మండలి ఎందుకు? ఈ నేపథ్యంలో రాజ్యాంగంలో మొట్టమొదటగా పేర్కొన్న 'ప్రజలమైన మేము' అనే మాటకు అర్థం లేకుండా పోతుంది.

ప్రజాస్వామ్య విరుద్ధమైన నిర్ణయాలతో కొత్త ప్రభుత్వం పనిచేయడం ప్రారంభించడం అవాంఛనీయం. రాష్ట్రపతి భవనంలో ప్రధానిగా ప్రమాన స్వీకారం చేసిన వెంటనే, పార్లమెంట్ మొట్ట మొదటి సమావేశం ప్రారంభం కాకముందే ప్రధాని కార్యాలయంలో ప్రధాని కార్యదర్శిగా నియామకం కోసం ఆర్డినెన్స్‌ను జారీ చేయడంతో పరిపాలన ప్రారంభించడం, అలాగే పోలవరం ప్రాజెక్ట్ విషయంలో మరో ఆర్డినెన్స్ జారీ చేయడం – ఇది సుపరిపాలన కాదు, స్వపరిపాలన అనే అభిప్రాయాన్ని కలగజేస్తుంది. గత ప్రభుత్వం కొన్ని సందర్భాల్లో ఆర్డినెన్స్‌లు జారీ చేసినప్పుడు, 'ఆర్డినెన్స్ రాజ్' అంటూ విమర్శించిన బిజెపి ఇప్పుడెందుకు విమర్శించ లేదు? మన రాష్ట్రంలో పోలవరం ప్రాజెక్ట్ నిర్మాణం గురించి సంవత్సరాలుగా వివాదం కొనసాగుతోంది. ఈ వివాదానికి ఫుల్‌స్టాప్ పెట్టాలంటే ఆ ప్రాజెక్ట్‌కు సంబంధించిన ముఖ్యమంత్రులందరినీ పిలిచి, చర్చించి ఏకగ్రీవ నిర్ణయం చేయడం కేంద్రం బాధ్యత. నేతి బీరకాయలో నెయ్యి ఎంత ఉంటుందో, ఈ ప్రధాని ముఖ్య కార్యదర్శి గురించిన ఆర్డినెన్స్‌లో అంత ప్రజాస్వామ్యం ఉందనిపిస్తుంది. ఈ పదవికి ప్రధాని ఎంపిక చేసిన నృపేంద్ర మిశ్రా పరిపాలనకు కొత్తేమీ కాదు. కేంద్రంలో రకరకాల బాధ్యతలు నిర్వర్తించి 2005లో పదవీ విరమణ చేశాడు. అంటే అంతకు ముందు వాజ్‌పేయి పాలనలో కూడా పనిచేసిన అధికారే. రిటైరైన తర్వాత కూడా వివిధ పదవుల నలంకరిచారు. అందులో ఒకటి ట్రాయ్ టెలికాం రెగ్యులేటరీ అథారిటీ ఆఫ్ ఇండియా అధ్యక్ష పదవి. ట్రాయ్ నిబంధనల ప్రకారం అధ్యక్ష పదవి విరమించిన తర్వాత మరే ప్రభుత్వ పదవి స్వీకరించ కూడదు. ఈ నిబంధనను విధించింది వాజ్‌పేయి ప్రభుత్వ కాలంలోనే. బిజెపి విధించిన నిబంధననే తోసి రాజని ఆర్డినెన్స్ ద్వారా ప్రధాని మోడీ అతనిని ముఖ్య కార్యదర్శిగా నియమించడం చట్టవిరుద్ధమే కాకుండా ముమ్ముందు అలాంటి నియామకాలు చేయడానికి తెర లేపినట్లయింది. ఈ నేపథ్యంలో మంచిరోజులొస్తాయని ఆశిద్దామా?

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)* వీ

## విఎచ్ కాలమ్

### తెలుసుకోదగిన విషయాలు

**బా**ల బాలికలకు కావాల్సింది చాకొలేట్లు, బిస్కట్లు కాదు. జీవితకాలం, ఆరోగ్యం, పోషకాహారం, అభివృద్ధి, విద్యా, రక్షణ – మహిళల బంగారం మోజుతీర్చడానికి దిగుమతి చేసుకుంటున్న ముద్ద బంగారం విలువ 54 బిలియన్ డాలర్లు (సుమారు 102 టన్నులు) – కేరళ నుంచి సౌదీకి ఉపాధికోసం వెళ్లినవారి సంఖ్య 5,74,000 వారిలో 230 లక్షల మంది రాష్ట్రానికి పంపే మొత్తం 5 లక్షల కోట్లు – ప్రతి సంవత్సరం 45 వేల మంది పిల్లలు క్యాన్సర్ వ్యాధిన పడుతున్నారు – దేశంలో మరణాల సంఖ్యలో క్యాన్సర్ రెండవ స్థానంలో ఉంది – మాజీ ప్రధాన మంత్రి మన్మోహన్‌సింగ్ ఆస్తుల విలువ రు. 11.4 కోట్లు (2013) – 1971 బంగ్లాదేశ్ యుద్ధ సమయంలో తూర్పు పాకిస్థాన్‌లో సైనికులు అమాయక ప్రజలను చంపారు. ఉద్యమకారులను చిత్రహింసలకు గురిచేశారు. మేధావులను ఒక క్రమ పద్ధతిలో హింసలకు గురిచేశారు. ఇది జరిగింది పాకిస్థాన్‌లో. మనదేశంలో సల్వాజుడుం హింసాత్మకంగా ప్రవర్తించింది. మావోయిస్టు సానుభూతి పరులనే పేరుతో వారిపై దాడిచేసి క్రూరంగా చంపడం, వారి ఆస్తులను దోచుకోవడం, ఇళ్లను కాల్చి బూడిద చేయడం, క్రూరమైన హత్యలు, స్త్రీలపై విచ్చలవిడిగా అత్యాచారాలు చేయడం, గ్రామాలను తగుల బెట్టడం జరిగింది. దాదాపు 644 గిరిజన గ్రామాలు ఖాళీ అయ్యాయి. సుమారు మూడు లక్షల మంది వలస వెళ్లారు. – కంపెనీలకు లాభాలు వస్తే వాటాదారులకు డివిడెండ్లు ప్రతీ ఏటా ఇస్తారు. కాని చెల్లించకుండా కంపెనీల ఖాతాల్లో మురిగి పోతున్న సొమ్ము రు. 1100 కోట్లు. బడ్జెట్‌లలో వివిధ పద్దులకు కేటాయింపులు చేస్తారు. కాని పూర్తిగా ఖర్చు చేయరు. 2011 – 12 కేంద్ర బడ్జెట్‌లో గ్రామీణాభివృద్ధి పద్దుకింద 28.9 శాతం రోడ్డు రవాణా 25 శాతం, ఆరోగ్య కుటుంబ సంక్షేమం 15.6 శాతం ఖర్చు చేయనేలేదు. 2012 – 2013లో కేంద్రం కొన్ని పన్నులు వసూలు చేసి, రాష్ట్రాల వాటా పంపకుండా కేంద్రంలోనే ఉండిపోయిన మొత్తం రు. 7874 కోట్లు. ఆర్థికమంత్రి చిదంబరం దేశదేశాలు తిరిగి మా దేశంలో పెట్టుబడులు పెట్టండహో అంటూ బిక్షాటన చేస్తున్నారు. కాని చైనా ప్రభుత్వం శ్రీలంక ప్రభుత్వానికి 580 మిలియన్ డాలర్ల రుణం ఇస్తానని, ఇది రహదారులు, మంచినీరు, జాతీయ బిజినెస్ స్కూల్ కోసం ఖర్చు చేయాలని సూచించింది. వీ

# రుణమాఫీ - వ్యవసాయ సంక్షోభం

***వ్యవసాయ సంక్షోభానికి రుణమాఫీ పరిష్కారం కాదనీ, వ్యవసాయాన్ని కార్పొరేట్ రంగం నుంచి పరిరక్షించి సమగ్రమైన దీర్ఘకాలిక చర్యలు చేపట్టాలనీ అంటున్నారు* ఎస్. ఆశాలత**

వ్యవసాయ రుణాల మాఫీ అనేది ఆంధ్రప్రదేశ్‌లో 2014 ఎన్నికల ముందు, రెండు రాష్ట్రాలు విడిపోయి కొత్త ప్రభుత్వాలు ఏర్పడిన తర్వాత కూడా పెద్ద చర్చనీయాంశం అయింది. తెలంగాణ రాష్ట్ర సమితి, తెలుగుదేశం పార్టీలు రుణ మాఫీపై ఎన్నికల మేనిఫెస్టోలలో ఇచ్చిన హామీలు రైతులలో పెద్ద ఎత్తున ఆశలు రేకెత్తించి ఆ రెండు పార్టీలు అధికారంలోకి రావడానికి కొంత వరకు దోహద పడ్డాయనవచ్చు. రుణ మాఫీ నినాదం జనాభాలో 60 శాతం పైగా ఉన్న రైతుల ఓట్లను ఆకర్షించడానికి ఇచ్చినదే తప్ప పేద రైతులకు ప్రయోజనం చేకూర్చాలనే చిత్తశుద్ధితో చేసినది కానీ, వ్యవసాయ సంక్షోభాన్ని పరిష్కరించాలనే ఉద్దేశం కానీ లేదని లోతుగా తరచి చూస్తే అర్థమవుతుంది. పైకి చాలా న్యాయబద్ధమైనదిగా అనిపించే రైతు రుణమాఫీ నిజానికి ఒక పెద్ద కుంభకోణం.

తెలంగాణ రాష్ట్రంలో మొత్తం వ్యవసాయ రుణాలు 2013-14 నాటికి 32,629 కోట్లు కాగా తెలంగాణ రాష్ట్ర సమితి వాగ్దానం చేసిన లక్ష లోపు రుణాలు 20 వేల కోట్ల రూపాయల వరకు ఉంటాయి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో అన్ని రకాల వ్యవసాయ రుణాలు, అనుబంధ రుణాలు, డ్వాక్రా రుణాలు కలిపి 95,991,30 కోట్ల రూపాయల వరకు ఉంటుంది. దీనిలో ఎంతవరకు రుణ మాఫీ చేయాలనే దానిపై కసరత్తు జరుగుతున్నది. ఏది ఏమైనా ఇచ్చిన వాగ్దానం నిలబెట్టుకుంటామని రెండు ప్రభుత్వాలు ప్రకటిస్తున్నాయి.

ఇన్ని వేల కోట్ల రూపాయల రుణ మాఫీ జరిగినా వాస్తవంగా వ్యవసాయం చేస్తూ అప్పులలో కూరుకుపోయిన చిన్న, సన్నకారు రైతులలో అత్యధికులకు జరిగే ప్రయోజనం చాలా తక్కువ. అందులో సింహ భాగం వ్యవసాయ ఉత్పాదకాలు, పనిముట్లు, యంత్రాలు, అమ్మే కంపెనీలు, వ్యాపారులు, డీలర్లు, వ్యవసాయ ఉత్పత్తులను రైతుల వద్ద నుండి కొని ప్రాసెసింగ్ చేసి మార్కెటింగ్ చేసే కంపెనీలు, వ్యాపారులు, వందల ఎకరాల తోటల యజమానులు, వ్యవసాయ భూములను చేతిలో పెట్టుకుని వ్యవసాయ వృత్తులలో కొనసాగుతూ బ్యాంకుల నుండి తక్కువ వడ్డీకి సంస్థాగత రుణాలను పొందుతున్న భూస్వాములకు అందుతుంది. సంస్థాగత రుణపంపిణీ వ్యవస్థలో ఉన్న లొసుగుల వల్ల అత్యధిక శాతం రుణాలు ఈ వర్గాలకే వెళుతున్నాయి. ఇంతవరకు బ్యాంకులు ఇచ్చిన వ్యవసాయ రుణాలలో వివిధ వర్గాలు, సెక్షన్లతో పాటు జిల్లా వారీ పంపిణీలో కూడా చాలా అసమానతలు ఉన్నాయి. రెండు రాష్ట్రాలలోను వెనుకబడిన (అదిలాబాద్, మెదక్, అనంతపురం, కర్నూల్, శ్రీకాకులం, విజయనగరం) జిల్లాలకు తక్కువ రుణాలు అందాయి. తెలంగాణ జిల్లాలకు అందిన మొత్తం 23588 కోట్ల రూపాయల రుణంలో ఒక్క ఎకరం సాగు భూమి కూడా లేని హైదరాబాద్ నగరానికి అన్ని జిల్లాల కంటే ఎక్కువగా 4045 కోట్ల రూపాయల వ్యవసాయ రుణం అందింది.

2008లో యుపిఎ ప్రభుత్వం వ్యవసాయ రుణాల మాఫీ చేసినప్పుడు దాని అమలులో చాలా అవకతవకలు జరిగాయని కాంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ నివేదిక (కాగ్-2013) వెల్లడించింది. దేశ వ్యాప్తంగా 3.45 కోట్ల మందికి 525 వేల కోట్ల రూపాయల రుణ మాఫీ జరిగింది. అవిభక్త ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 77,55,227 మంది రైతులకు 11,35,375 కోట్ల రూపాయలు రుణ మాఫీ రూపంలో అందింది. అయితే ఈ రుణ మాఫీలో 163 కోట్ల రూపాయలు మైక్రో ఫైనాన్స్ సంస్థలకు, 40.76 లక్షల రూపాయలు అనర్హులైన లబ్ధిదారులకు, 26.55 లక్షల రూపాయలు అసలు రుణాలు తీసుకోని వారికి అందిందని కాగ్ నివేదిక పేర్కొన్నది. అప్పుడు జరిగిన రుణ మాఫీ వల్ల వ్యవసాయ సంక్షోభం ఏమాత్రం తగ్గలేదు. రుణ మాఫీ జరిగిన రాష్ట్రాలలో రైతుల ఆత్మహత్యలు కొనసాగుతూనే ఉన్నాయి.

మార్కెట్‌లు నిర్దేశిస్తున్న వాణిజ్య పంటల వైపు పంటల సరళి మారడం వల్ల, ఈ పంటలకు పెట్టుబడులు ఎక్కువ అవసరమై రైతులు అప్పులు చేయక తప్పని పరిస్థితి ఏర్పడింది. ప్రభుత్వ బ్యాంకుల నుండి తక్కువ వడ్డీకి లభించే సంస్థాగత రుణాలను పొందడంలో రైతులు చాలా సమస్యలు ఎదుర్కొంటున్నారు. దీనితో అధిక వడ్డీకి (నూటికి 5 రూపాయలు అంటే 60 శాతం వడ్డీకి) డీలర్ల దగ్గర వడ్డీ వ్యాపారస్తుల దగ్గర ఎక్కువగా అప్పు తీసుకుంటున్నారు. ప్రైవేట్ అప్పులు పత్తి, మిరప, చెరుకు వంటి వాణిజ్య పంటలకే ఎక్కువగా దొరుకుతున్నాయి. పెట్టుబడులు పెరిగిపోయి దిగుబడులు సరిగ్గా లేక, మార్కెట్ ధర లభించక రైతులకు ఆదాయం రాని కారణంగా రైతులు అప్పుల వలయంలో కూరుకు పోతున్నారు. రైతులు వ్యవసాయం కోసం చేస్తున్న అప్పులలో 31 శాతం మాత్రమే బ్యాంకుల నుండి అందుతున్నదని, 69 శాతం ప్రైవేట్ రుణాలపై ఆధారపడుతున్నారని అనేక అధ్యయనాలు, గణాంకాలు తెలియజేస్తున్నాయి. తెలంగాణలో 30 నుండి 40 శాతం ఆంధ్రప్రదేశ్‌లో 60 నుండి 70 శాతం కౌలు రైతులున్నారు. వాస్తవ సాగుదారులైన ఈ కౌలు రైతులకు సొంత భూమి లేకపోవడం వల్ల బ్యాంకు రుణాలు, భీమా సౌకర్యం, ఇన్పుట్ సబ్సిడీలు ప్రకృతి వైపరీత్యాల సందర్భంలో నష్టపరిహారం ఏవి అందడం లేదు. దీనితో వీరు అప్పుల పాలవుతున్నారు. వీరితో పాటు వివిధ ప్రభుత్వ భూ పింపిణీ కార్యక్రమాల కింద భూమిని పొందిన మహిళా రైతులు, దళితులు, ఆదివాసులకు కూడా బ్యాంకు రుణాలు అందడం లేదు. ఆత్మహత్యలు చేసుకుంటున్న రైతులలో ఎక్కువ భాగం సంస్థాగత రుణాలు అందని కౌలు రైతులు, చిన్న, సన్నకారు రైతులే ఎక్కువగా ఉన్నారు. ఇప్పుడు జరగబోతున్న రుణ మాఫీ వల్ల వీరికి ఎటువంటి ప్రయోజనం కలగదు.

మనదేశ వ్యవసాయ రంగంలో 40 సంవత్సరాల క్రితం హరిత విప్లవంతో మొదలైన పరిణామాలు 1990ల తర్వాత ప్రవేశ పెట్టబడిన

# పోలవరం ఆదివాసులకు విద్రోహ దినం

*తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు దినమే పోలవరం ముంపుతో నిర్వాసితులవుతున్న ఆదివాసులకు విద్రోహ దినం అవుతుందంటున్నారు* **వరవరరావు**

తెలంగాణ ఆవిర్భావ దినాన్ని విద్రోహ దినమనవచ్చునా? వినగానే మరీ వితండవాదమనిపిస్తుంది. ఆలోచించి చూడగా ఎవరివైపు నుంచి? ఎంతకాదన్నా మనవైపు నుంచి మనమే ఆలోచిస్తాం గదా. మనమంటే? ఇంతకూ విద్రోహ దినమని ఎవరన్నారు? ఎందుకన్నారు?

ఆదివాసి విద్రోహదినమన్నారు. జూన్ 2న వరరాజపురంలో ఒక ఊరేగింపు, బహిరంగ సభ ఉంది. ఆదివాసులవైపు నుంచి చూస్తే వాళ్లకు జరిగింది విద్రోహమే కదా. కడుపుమండి వాళ్లట్లా భావిస్తే అది న్యాయమే కదా. భద్రాచలం డివిజన్‌లోని భద్రాచలం పట్టణం తప్ప ఏడు మండలాల్లోని గ్రామాలను ఆంధ్ర ప్రాంతంలో కలుపుతున్నారు. తెలంగాణ రాష్ట్రం విడిపోయి ఏర్పడుతున్న ఆంధ్రప్రదేశ్‌లో కలుపుతున్నారు. ఇవి 1959 దాకా భద్రాచలంతో సహా ఆంధ్ర ప్రాంతంలో ఉన్నవే. అయితే అప్పుడు తూర్పుగోదావరి జిల్లాలో తేలి ఉన్నవి. ఇపుడు పోలవరం ప్రాజెక్టు నిర్మాణంలో మునిగిపోతున్నవి.

మునిగిపోయే గ్రామాలను తెలంగాణ నుంచి వేరుచేసి ఆంధ్రప్రదేశ్‌లో కలుపుతున్నారు. కనుక మునిగే వాటి కోసం ఎందుకు పట్టుదల అనుకున్నారా తెలంగాణ నాయకులు?

గత దశాబ్దన్నర ఉద్యమంలోనూ గోదావరి లోయలోని ఆదివాసి సంఘాలు, అటు ఆదిలాబాదు నుంచి ఇటు ఖమ్మం దాకా ప్రత్యేక తెలంగాణ పోరాటంలో క్రియాశీలంగా పాల్గొన్నాయి. అల్లూరి సీతా రామరాజు మన్నె పోరాటం తర్వాత, శ్రీకాకుళ గిరిజన రైతాంగ పోరాటం తర్వాత ఆదివాసి పోరాటాన్ని తెలంగాణ కేంద్రంగానూ, తెలంగాణలో భాగంగానూ జరిగినది. పై రెండు పోరాటాల మధ్య కాలంలో తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటానికి సమకాలీనంగా, ఇటు మైదాన ప్రాంతాల్లో బందగీ, ఐలమ్మల నాయకత్వంలో పోరాటం పదునెక్కకముందే ఆదిలాబాదులోని జోడెన్‌ఘాట్ కేంద్రంగా కొమురం భీం 'మనగూడెంలో మనరాజ్యం' నినాదంతో బ్రిటిష్ అనుకూల నైజాంకు వ్యతిరేకంగా వీరోచితంగా సాయుధ పోరాటం చేశాడు. ఇంద్రవెల్లి పోరాటానికైనా, తెలంగాణలో స్వపరిపాలన పోరాటానికైనా, గోండు ఆదివాసుల

---

నయా ఉదారవాద ఆర్థిక సంస్కరణలు, మార్కెట్ అనుకూల ప్రైవేటీకరణ విధానాల వల్ల వ్యవసాయంలో ప్రభుత్వ పెట్టుబడులు తగ్గిపోయి గత 20 సంవత్సరాలుగా వ్యవసాయ సంక్షోభం తీవ్రమవుతూ వచ్చింది. ఈ సంక్షోభం పరిష్కారానికి జాతీయ స్థాయిలో అనేక కమిషన్లు వేయడం జరిగింది. 2004లో రాష్ట్ర స్థాయిలో జయతి ఘోష్ కమిషన్, జాతీయ స్థాయిలో స్వామినాథన్ కమిషన్‌లు వ్యవసాయ రంగ సమస్యలకు సమగ్ర పరిష్కారాలను సూచించాయి. వాటిని అమలు చేయకుండా ఆయా ప్రభుత్వాలు సంక్లిష్టమైన వ్యవసాయ సంక్షోభానికి ఏమాత్రం సరిపోని రుణ మాఫీ లాంటి పాక్షికమైన, తాత్కాలికమైన సత్వర పరిష్కారాల వైపు మొగ్గుతున్నాయి.

రుణ మాఫీ జరగవలసిందే. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో గత రెండు సంవత్సరాలుగా రైతులు, తమ అప్పుల బాధకు ఇది కొంత మేరకు ఊరట కలిగిస్తుందన్న ఆశతోనే రుణాలు చెల్లించకుండా ఎదురు చూస్తున్నారు. అయితే ఎవరి రుణాలు మాఫీ అవ్వాలి, ఎవరికీ కాకూడదు, సంస్థాగత రుణాలు అందని మెజారిటీ వ్యవసాయ దారులకు ఎట్లా న్యాయం జరుగుతుందని అనేదే ఇక్కడ ముఖ్యమైన అంశం.

రైతులకు ప్రత్యక్షంగా అందిన పంట రుణాలు, చిన్న, సన్నకారు రైతులకు ఇచ్చిన కాలిక రుణాలు, బంగారు తనఖా రుణాలు మాఫీ అవడం వల్ల కొంత మేరకు వాస్తవంగా వ్యవసాయం చేసే రైతులకు ప్రయోజనం కలుగుతుంది. 1998 నుండి ఆత్మహత్యలు చేసుకున్న రైతుల రుణాలను మాఫీ చేసి వారి ప్రైవేట్ రుణాలను వడ్డీలేని ప్రైవేట్ రుణాలుగా మారిస్తే తప్ప రైతు ఆత్మహత్య కుటుంబాలకు ఏమాత్రం న్యాయం జరగదు. ప్రస్తుతం సంస్థాగత రుణాలు అందని కౌలు రైతులు, మహిళా రైతులు, దళిత, ఆదివాసి రైతులు వంటి వాస్తవ సాగుదారుల అధిక వడ్డీ ప్రైవేట్ రుణాలను బ్యాంకు రుణాలుగా మార్చి వారిని కూడా సంస్థాగత రుణ పరిధిలోకి తీసుకురావాలి. వ్యవసాయం చేయని, వ్యవసాయేతర వృత్తులు చేసుకుంటున్న వారికి, తమ భూములను ఇతరులకు కౌలుకు ఇచ్చే గైరు హాజరు భూస్వాములకు రుణ మాఫీ ఉండకూడదు. అటువంటి వారిని గుర్తించి రుణ మాఫీ పరిధి నుండి తప్పించడానికి ప్రభుత్వం ప్రత్యేక వ్యవస్థలను ఏర్పాటు చేయాలి. ప్రస్తుతానికి ఒక్క ఎకరా సాగు భూమి కూడా లేని హైదరాబాద్ జిల్లాను రుణ మాఫీ నుండి మినహాయించి దీనిపై క్షుణ్ణమైన విచారణ జరపాలి.

వ్యవసాయ సంక్షోభానికి రుణ మాఫీ ఏమాత్రం పరిష్కారం కాదు గనుక సమగ్ర పరిష్కారం కోసం దీర్ఘకాలిక చర్యలు చేపట్టాలి. వ్యవసాయ రంగంలోని, రుణాలు, ఉత్పకాల సహాయం, విస్తరణ, మార్కెటింగ్ వంటి అన్ని అంశాలకు సంబంధించి విధాన పరమైన మార్పులు తీసుకురావాలి. వ్యవసాయంపై కార్పొరేట్ల నియంత్రణ తొలగించి రైతుల చేతులలోకి వచ్చే విధంగా పరిష్కార మార్గాలను ఆలోచించాలి. వ్యవసాయ రంగానికి ప్రభుత్వ పెట్టుబడులను పెంచాలి. మొత్తం రాష్ట్ర బడ్జెట్‌లో కనీసం 10 శాతం కేటాయింపుతో ప్రత్యేక వ్యవసాయ బడ్జెట్‌ను ప్రవేశ పెట్టాలి. వాస్తవ సాగుదారుల చేతిలోకి భూమి వచ్చే విధంగా చిరకాలంగా పెండింగ్‌లో ఉన్న భూ సంస్కరణలను అమలు చేసి చిన్న, సన్నకారు రైతుల జీవనోపాధులను పటిష్టం చేయాలి.

(రచయిత రైతుస్వరాజ్య వేదిక రాష్ట్ర కన్వీనర్) వీ

స్వయంపాలన పోరాటానికైనా ఇవ్వాల్టికీ ఆయనే స్ఫూర్తి. ఇంక నక్సల్బరీ, శ్రీకాకుళ రైతాంగ పోరాటాలు రెండూ ఆదివాసి ప్రాంతాల నుంచే రగుల్కోవడం వలన ఆదిలాబాదు నుంచి ఖమ్మం దాకా 1969 – 74 మధ్య కాలంలో నక్సలైట్ ఉద్యమం ఖమ్మం, వరంగల్, కరీంనగర్, ఆదిలాబాదు అడవుల్లోనే అంటుకున్నది.

ఎమర్జెన్సీ ఎత్తివేసిన తర్వాత 'గ్రామాలకు తరలండి' అని రాడికల్స్ పిలుపు అందుకొని రాడికల్ ఇచ్చిన యువజనులు ఖమ్మం జిల్లా ఆదివాసి ఏరియాల్లోనే భూ సంబంధాల సర్వేచేసి ఆదివాసేతరుల ఆధీనంలో ఉన్న ఆదివాసుల భూముల స్వాధీనం కొరకు పిలుపు ఇచ్చారు. శ్రీకాకుళ రైతాంగ పోరాట నేపథ్యంలో వచ్చిన 1/70 చట్టాన్ని అమలు చేయాలని పోరాడారు. ఇప్పుడు ఆంధ్ర ప్రాంతంలో కలుపుకున్న భూభాగమంతా అప్పటి నుంచీ ఇప్పుడు దండకారణ్య పోరాటం దాకా ఈ విప్లవోద్యమ ప్రభావంలో ఉన్నవి.

భౌగోళికంగానే కాదు, పోరాట రాజకీయపటంలోనూ – ఇది ఆదివాసి స్వావలంబన భావంగల పోరాట ప్రాంతం. రాజకీయ పరిపాలన విభాగంలో ఒడిశా, చత్తీస్‌గడ్ సరిహద్దులలోని తెలంగాణ పోరాట ప్రాంతం. ఆదివాసుల స్వయం ప్రతిపత్తి, స్వయం పాలనలను గుర్తిస్తే ఇది మన్నె రాజ్యంలోనో, దండకారణ్యంలోనో భాగమవుతుంది. ఇప్పుడున్న రాజకీయ పరిపాలన విభాగాల రీత్యా తెలంగాణలో భాగమవుతుంది. ఎందుకంటే గత అర్ధ శతాబ్దంపైగా ఇక్కడి ఆదివాసులు తెలంగాణ మైదాన ప్రాంత సుఖ దుఃఖాల్లో, జీవన యాత్రల్లో, పోరాటంలో భాగమయ్యారు. ఉత్తర తెలంగాణ విప్లవోద్యమంగా జగిత్యాల జైత్రయాత్ర (1978) కాలం నుంచి నిర్మాణ రీత్యా 30 ఏళ్లు నిరంతరంగా సాగిన పోరాటంలో తెలంగాణ మైదాన ప్రాంతంలో వీళ్లు విడదీయలేని భాగం. 1969 ప్రత్యేక తెలంగాణ ఉద్యమం కొత్తగూడెం నుంచే ప్రారంభమైంది. అటు శ్రీకాకుళ ఉద్యమాన్ని, ఇటు తెలంగాణ ఉద్యమాన్ని నెత్తురుటేర్లలో ముంచి అందులోనూ, ఇందులోనూ 370 మంది చొప్పున పోరాట యోధులను, యువకులను, విద్యార్థులను చంపిన జలగం వెంగళరావును ప్రతిఘటించడంతోనే కొత్తగూడెంలో రవీంద్రనాథ్ నిరాహార దీక్ష ప్రారంభమైంది.

జగిత్యాల జైత్రయాత్ర మైదాన ప్రాంతం నుంచి విస్తరించిన రూపమే ఇంద్రవెల్లి పోరాటం – ఇప్పుడు గోదావరిలోయ ప్రత్యేక తెలంగాణ ప్రజాస్వామిక స్వయంపాలన ఆకాంక్షల పొత్తిళ్లలో పురివిప్పుతున్న ఆదివాసి స్వయం ప్రతిపత్తి వ్యక్తీకరణ.

అందులోనూ ఖమ్మం జిల్లా నుంచి విడదీసి ఆంధ్ర ప్రాంతంలో కలుపుతున్న ఈ ఏడు మండలాలు అటు దండకారణ్యానికి, అంటే చత్తీస్‌గడ్, ఒడిశా ప్రాంతాలకు సరిహద్దు గ్రామాలు. గ్రీన్‌హంట్ ఆపరేషన్ పేరిట ప్రజలపై యుద్ధంలో భాగంగా ఈ ప్రాంతాలను పోరాట ప్రాంతాల నుంచి విడదీసి పోలవరం ప్రాజెక్టు కింద ముంపునకు గురిచేయాలన్నది ప్రపంచ బ్యాంకు ప్రతినిధిగా కాంగ్రెస్ రాజకీయాల్లోకి వచ్చిన జైరామ్ రమేశ్ పథకం. దండకారణ్యంలో విప్లవోద్యమాన్ని అణచడానికి, విప్లవోద్యమం నాయకత్వంలో పోరాడుతున్న ఆదివాసులను చీల్చడానికి కాంగ్రెస్‌కు చెందిన మహేంద్ర కర్మ ఎట్లా ముఖ్యమంత్రి రమణసింగ్‌కు సాల్వాజుడుం జులుం పథకాన్ని రచించి ఇచ్చాడో అట్లా ఇపుడు జైరాం రమేశ్ బిజెపి వెంకయ్యానాయుడు, టిడిపి చంద్రబాబు నాయుడులకు పోలవరం ముంపు ప్రాంతాలు ఆంధ్రప్రదేశ్‌లో చేర్చే పథకాన్ని రచించి ఇచ్చాడు. తెలంగాణ బిల్లు పాసైన చివరి రోజు చర్చ రాజ్యసభలో గమనించిన వాళ్లకెవరికైనా జైరాం రమేశ్ – వెంకయ్య నాయుడు సంవాదం గుర్తుంటే ఈ షడ్యత్వాన్ని అర్థం చేసుకోవడం కష్టం కాదు.

బిజెపిలోని ఆంధ్ర ప్రాంతం నాయకత్వాన్ని, ముఖ్యంగా వెంకయ్య నాయుడిని, కాంగ్రెస్‌లోని కావూరి వంటివారిని, టిడిపి అధినేత చంద్రబాబు నాయుడును కూడ పోలవరం ప్రాజెక్టును కేంద్ర ప్రభుత్వం చేపట్టే హామీతో మాత్రమే కాదు కొత్తగా అప్పటి దాకా ఎవరూ ఊహించని విధంగా ముంపు ప్రాంతాలను తెలంగాణ నుంచి విడదీసి ఆంధ్ర ప్రాంతంలో కలిపే వ్యూహం ద్వారా ఒప్పించాడు జైరాం రమేశ్. రాజ్య సభలో అమాయకంగా ఒడిశా ప్రతినిధి అడుగుతున్న సందర్భాన్ని అదనుగా తీసుకొని వెంకయ్యనాయుడు పోలవరం బహుళార్థ సాధక ప్రాజెక్టుపై జైరామ్ రమేశ్ నుంచి హామీలు పొందుతున్నపుడు మరి రాజ్యసభలో 'మ్యాచ్ ఫిక్సింగ్' అని నెపంపెట్టి సీతారాం ఏచూరి ఎందుకు వాకవుట్ చేసినట్లు? ఈ మ్యాచ్ ఫిక్సింగ్‌ను టివి ముందుకూర్చున్న లక్షలాది తెలుగు ప్రజల ముందు బట్టబయలు చేసి ఉండవచ్చు కదా. పార్లమెంటు ఆఖరి సెషన్ జరిగినంతకాలం ఢిల్లీలో తెలంగాణ రాజకీయ నాయకులు, వాదులు అందరూ ఉన్నారు. లోక్‌సభలో కెసిఆర్ పోలవరం ప్రస్తావన తేలేదు. రాజ్యసభలో కేశవరావు తేలేదు.

'భద్రతతో కూడిన అభివృద్ధి' (డెవలప్‌మెంట్ విత్ సెక్యూరిటీ) ఇదే జైరాం రమేశ్ నినాదం. ఇప్పుడు మోడీ నినాదం కూడ – సుపరిపాలన అంటే, సైన్యంలో కూడ నూరుశాతం విదేశీ పెట్టుబడులను ఆహ్వానించడం. రైల్వేలను ప్రైవేటు కంపెనీలకు అప్పగించడం. కనుక పోలవరం–కాకినాడ నుంచి విశాఖపట్నం వరకు ఏర్పడనున్న బహుళజాతి కంపెనీల పెట్రో రసాయన కంపెనీలకోసం, పర్యాటక కేంద్రాలు, ఐదు నక్షత్రాల విలాస పరిశ్రమలకోసం, డెల్టా ప్రాంతపు అదనపు భూభాగ నీటి సాగు, మూడో పంట కోసం మాత్రమే కాదు, ముంపు ప్రాంతాన్ని ఆంధ్రప్రదేశ్‌లో కలిపితే పోరాట ప్రాంతం నుంచి, తెలంగాణ, దండకారణ్య సరిహద్దునుంచి దాని పేగు బంధాన్ని తెంచి వేయడం కూడ ఈ వ్యూహం రాజ్యసభలో అద్వానీకి, వెంకయ్య నాయుడుకు, వెనుక చక్రం తిప్పిన చంద్రబాబునాయుడుకు అధికారంలోకి రానున్న సందర్భంలో 'అంతర్గత పెను ప్రమాదం' దృష్ట్యా చాల అవసరమైంది.

దీనికి ప్రత్యేక తెలంగాణ ఉద్యమకాలంలో వచ్చిన కొన్ని సెంటిమెంట్‌లతో, తర్కంతో కూడిన నినాదాలను చంద్రబాబు వంటివాళ్లు వాడుకుంటున్నారు.

'మేం కొత్తగా రాష్ట్రం అడగడం లేదు. 1956 కన్న ముందున్న తెలంగాణనే అడుగుతున్నాం. ఎక్కువ కాదు. తక్కువ కాదు. హైదరాబాదుతో కూడిన పది జిల్లాలు.'

'అవే ఇచ్చాం కదా. పైగా భద్రాచలాన్ని వదిలేశాం' అంటున్నాడు చంద్రబాబు. ఎందుకు భద్రాచలం శ్రీరామచంద్రునికి నిజాం నవాబు ప్రతి శ్రీరామనవమికి ముత్యాలు పంపేవాడు కనుక భద్రాచలం తెలంగాణలో భాగమనే వాదం వలన ఉదారంగా వదిలేసినట్లు.

నిజమే భద్రాచలం రాముడు ఎవరివాడు అన్న విషయంలో ఉన్నంత పట్టుదల మనకెవరికీ శబరి విషయంలో ఉండదు కదా. శబరులు మాత్రమే కాదు, శబరీనది కూడ పోలవరం ప్రాజెక్టులో మునిగిపోనున్నది. అదృశ్యం కానున్నది. శబరీనది మునిగిపోతే మనకేమి నష్టం అని జల నిపుణుడు ఆర్. విద్యాసాగర్‌రావు అననే అన్నారు. ఇది ఆదివాసులకు, అడవికి, నదులకు విద్రోహం కాదా? దీని తీవ్రత మనకెంతవరకు అర్థమవుతుంది?

మనం కోరుకున్న తెలంగాణ రాలేదు. ఆంక్షలులేని తెలంగాణ, నిషేధాలులేని తెలంగాణ, నిర్బంధాలులేని తెలంగాణ, హైదరాబాదు పదేళ్లపాటు ఉమ్మడి రాజధాని, దానిపై గవర్నర్‌కు ప్రత్యేక అధికారాలు. హైదరాబాదులో సెటిలర్లకోసం కేంద్రం ప్రత్యేక చట్టం చేయాలని, అసదుద్దీన్ ఒవైసీ కూడ లోక్‌సభలో కోరాడు కానీ పోలవరం ప్రాజెక్టులో ముంపునకు గురయ్యే ఆదివాసుల విషయంలో ఏ భద్రతనూ ఏ రాజకీయ పార్టీ అడుగలేదు.

తెలంగాణ భూభాగం ఆంధ్ర ప్రాంతంలో కలపడమొక్కటే అభ్యంతరం కాదు. అక్కడ కూడ అది ముంపునకు గురికావడం అన్న అభ్యంతరం. ఆదివాసి ప్రాంతాలకు వాళ్ల అనుమతి, ఆమోదం లేకుండా ఇంకొక ప్రాంతంలో కలపడమే కాకుండా, ముంపునకు గురిచేసే అధికారం మైదాన ప్రాంతాలకు ఎవరిచ్చారు?

ఐక్యరాజ్య సమితి భద్రతామండలి 'ఆదివాసుల భౌగోళిక పరిపాలనా హక్కుల' గురించి తీర్మానం చేసింది. ఆదివాసుల అనుమతి లేకుండా వాళ్ల భూభాగం (టెరిటరి)లోకి ఆదివాసేతరులు ప్రవేశించ రాదని, ఆదివాసేతరులు ప్రవేశించడమేకాదు, వాళ్లు చట్టాలు ప్రవేశించి, రాజ్యాంగం జోక్యం చేసుకొని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వాళ్ల రాజకీయ చిత్రపటాన్నే మారుస్తున్నాయి. వాళ్ల జీవితాలనే ముంచేస్తున్నాయి.

జల్ జంగల్ జమీన్‌లపై ఆదివాసులకు అధికారమివ్వడమంటే ఇదేనా? ఆదివాసుల స్వయం ప్రతిపత్తిని గుర్తించడం అంటే ఇదేనా? ఆదివాసుల జీవించే హక్కును కూడా హరిస్తున్న కేంద్రం ఆర్డినెన్స్ ఆదివాసుల పాలిట విద్రోహమవుతుందా కాదా?

అది కాంగ్రెస్ పాలనలోనే ఆమోదం పొంది ఆర్డినెన్స్‌గా రావలసింది ఎన్నికల కోడ్‌వల్ల రాష్ట్రపతి సంతకం కాక ఇప్పుడు ఎన్‌డిఎ కేంద్ర మంత్రివర్గ తొలి సమావేశంలోనే ఆర్డినెన్స్‌గా రావడమనేది – కేవలం పండిత చర్చ.

ఈ ఆర్డినెన్స్ యుపిఎ, ఎన్‌డిఎ – ముఖ్యంగా కాంగ్రెస్, బిజెపి, టిడిపి వ్యూహంలో భాగం. తెలంగాణ వస్తే చాలనుకున్న వారందరి మౌనంలో భాగం. తెలంగాణ కూడా ఏడు మండలాలు కోల్పోయి, ఆంక్షలతో వచ్చింది.

మద్రాసు ప్రావిన్సు నుంచి ఆంధ్ర రాష్ట్రం విడిపోయినపుడు బళ్లారి ప్రాంతాన్ని కర్ణాటకకు హోసూరు ప్రాంతాన్ని మద్రాసు (ఇప్పటి తమిళనాడు) కు వదులుకోవడమే కాకుండా గంజామ్ జిల్లాలో బరంపురం, పర్లాకిమిడి వంటి తెలుగు ప్రాంతాలను ఒడిశాకు వదులుకున్నాం. భద్రాచలం కోసం ఇపుడు ఏడు ఆదివాసి మండలాలు వదులుకున్నట్లుగానే తిరుపతి కోసం మద్రాసునే వదులుకున్నాం. ఆంధ్ర రాష్ట్రంలో భాగంగాని మద్రాసులో ఉండలేనని మద్రాసు ప్రావిన్స్‌కు ముఖ్యమంత్రిగా కూడ చేసిన ప్రకాశం పంతులు ప్రతిజ్ఞచేసి మద్రాసు వదిలి వచ్చినపుడు 1948లో నేనాయనను బెజవాడ రైల్వేస్టేషన్‌లో చూశాను. ఆ భీషణ ప్రతిజ్ఞకు బెజవాడలో ఎందరో స్వాగతంచెప్పారు.

తాను స్వయంగా సవరలకు చదువు చెప్పి, వాళ్లకోసం లిపి, వ్యాకరణం తయారు చేసి, ఎందరో సవర పిల్లల్ని తన ఇంట్లో పెట్టుకొని సాకిన గిడుగు రామ్మూర్తి పంతులు పర్లాకిమిడి ఆంధ్ర రాష్ట్రంలో చేరితే తప్ప తిరిగి రానని ప్రతిజ్ఞచేసి రాజమండ్రికి వచ్చేశాడు.

పర్లాకిమిడి ఆదివాసి ప్రాంతం. గంజాం జిల్లాలో, బరంపురం మొదలైన ప్రాంతాలన్నీ ఆదివాసి ప్రాంతాలే. ఉత్తరాంధ్ర, దక్షిణ ఒడిశా ప్రాంతాలు ఎక్కువగా ఆదివాసి జనాభా ఉన్న ప్రాంతాలు. కనుక ఆదివాసి ప్రాంతాలను మైదాన ప్రాంత పాలకుల ప్రయోజనాలకోసం బలిపెట్టడం ఇవాళ కొత్త కూడా కాదు.

జూన్ 2న తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రెండు రాష్ట్రాల ఏర్పడినాయి. జూన్ 1 రాత్రికే తెలంగాణలో రాష్ట్రపతిపాలన ముగిసింది. జూన్ 7 రాత్రికి ఆంధ్రప్రదేశ్‌లో ముగిసింది. కాని రెండు రాష్ట్రాలు జూన్ 2ననే ఏర్పడినాయి. అంటే జూన్ 2 నుంచే తెలంగాణలో ఏడు మండలాలలోని ఆదివాసి గ్రామాలు ఆంధ్రప్రదేశ్‌లో భాగమై పోయినాయి. అక్కడ మరొక ఆరు రోజుల పాటు రాష్ట్రపతి పాలన కొనసాగింది. నిజానికి ఆదివాసి ప్రాంతాలపై గవర్నర్‌కు ప్రత్యేక అధికారాలు ఉంటాయి. ఆదివాసి ప్రాంతాలు ఇట్లా వాళ్ల గ్రామ సభల నిర్ణయం లేకుండా వేరే పరిపాలనల్లోకి మార్చబడడమైనా, భారీ ప్రాజెక్టుల నిర్మాణంలో ముంపునకు గురి కావడమైనా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు అతీతంగా సమీక్ష చేసే అధికారం గవర్నర్‌కు రాష్ట్రపతి ప్రతినిధికి ఉంటుంది. కాని మనం పోలీసు అధికారి నరసింహన్ నుంచి ఏం ఆశించగలం? కనుక జూన్ 2 ఆదివాసి విద్రోహ దినంగా ఆదివాసులు భావించడం అసహజమా?

1. ఆనాటి నుంచి ఈనాటి వరకు భద్రాచలం డివిజన్ ఏడు మండలాల్లో ఆదివాసులు ఏదో ఒక రూపంలో పోరాడుతూనే ఉన్నారు.

2. అంతా అయిపోయి తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలు ఏర్పడిన జూన్ 2న భద్రాచలంలో సున్నం రాజయ్య ఎంఎల్‌ఎగా కూడా ఎన్నికై నిరాహార దీక్ష ప్రారంభిస్తే ఏం ప్రయోజనం? ఆరు రోజులు ఆమరణ నిరాహార దీక్ష చేయించాక ఆరోగ్యం క్షీణించి నిమ్స్ అసుపత్రికి తరలిస్తే తెలంగాణ ముఖ్యమంత్రి తరఫున ఒకరిద్దరు మంత్రులు పరామర్శించి నిమ్మరసం ఇవ్వడంతో ముగిసింది. నిరాహారదీక్ష చేసిన సున్నం రాజయ్య ఎంఎల్‌ఎ అయినా, విరమింపజేసిన తెరాస ప్రభుత్వమైనా ఇప్పుడు పెడుతున్న డిమాండ్లు – ముంపు ప్రాంతాలు తెలంగాణలోనే ఉండాలని, పోలవరం ప్రాజెక్టు డిజైన్ మార్చాలని, అంటే ఎత్తు తగ్గించాలని 2006లో పోలవరం ప్రాజెక్టు వ్యతిరేక ప్రజాసంఘాలన్నీ ఐక్యంగా భద్రాచలంలో పదివేల మందితో భారీ సభ పెట్టినపుడు తెరాస అధ్యక్షుడు ఆ సభలో 'పోలవరం ప్రాజెక్టు నిర్మిస్తే పారేది నీళ్లు కాదు, రక్తం' అని భీషణ ప్రతిజ్ఞ చేశాడు. ఆమాటను ఆయన, తెలంగాణకు దళిత ముఖ్యమంత్రిని చేస్తానని ఎన్నిసార్లు అన్నాడో, అన్నిసార్లు అన్నాడు. ఈ రెండూ విషయాల్లో ఆయన వాచ్‌డాగ్ వలె వ్యవహరిస్తానన్నాడు. ఆయన ముఖ్యమంత్రి అయ్యాడు. శాసనసభ జరిగింది. శాసనసభలో ఏకగ్రీవంగా పోలవరం ప్రాజెక్టు ముంపు ప్రాంతాలు తెలంగాణలోనే ఉండాలని, ఆర్డినెన్స్‌ను వ్యతిరేకిస్తూ, అది రాజ్యాంగ విరుద్ధమని పేర్కొంటూ మాత్రమే తీర్మానం చేశారు. డిజైన్ మార్చి ఎత్తు తగ్గించాలన్నారు. డిజైన్ మార్చి ఎత్తు తగ్గించడాన్ని ప్రపంచబ్యాంకు అంగీకరించదని, అంటే ఆ ప్రాజెక్టు వల్ల ప్రయోజనం పొందే కోస్టల్ పారిశ్రామిక కారిడార్‌తో వచ్చే పెట్రోకెమికల్ పరిశ్రమలు, పర్యాటక పరిశ్రమలు ఆమోదించవని తెలియనంత అమాయకమైందేమీ కాదు శాసనసభ. దశాబ్దాలుగా ఆదివాసులు జల సమాధి కావడానికి కూడా సిద్ధపడి ప్రతిఘటిస్తున్నా నర్మదా డ్యాం ఎత్తు పెంచుతూ గుజరాత్ శాసనసభ ఏకగ్రీవ తీర్మానం చేసిన వైనం చూస్తే, అభివృద్ధి సమూనాపట్ల బిజెపి వైఖరి ఎలా ఉండబోతున్నదో ఊహించడం కష్టంకాదు. పైగా కేంద్రమంత్రి వెంకయ్య నాయుడు తాను కేవలం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికే ప్రాతినిధ్యం వహిస్తున్నట్లుగా తెలంగాణ శాసనసభ ఏకగ్రీవ తీర్మానానికి ఏ

విలువలేదని, చెల్లదని, నాకన్నా కేంద్ర ప్రభుత్వం జారీ చేసిన ఆర్డినెన్స్‌యే శిలాశాసనం అంటున్నాడు.

ఇప్పుడు తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ఇటు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంతో అటు కేంద్ర ప్రభుత్వంతో కనీసం తెలంగాణ భూభాగాన్ని తిరిగి సాధించుకోవడానికైనా పోరాడుతుందా? శాసనసభ ఏకగ్రీవ తీర్మానం తో చేతులు దులిపేసుకున్నదా?

ఇక్కడే చరిత్రలోకి వెళ్లి జాతుల గురించి, ఆదివాసుల గురించి కూడా కొంచెం ఆలోచించాలి. హైదరాబాద్ రాష్ట్రంలో తెలంగాణ మాత్రమే లేనట్టు తెలుగువారు మాత్రమే లేరు. అట్లే మరోత్యాగ ప్రాతంలోను, హైదరాబాద్ కర్ణాటకగా ఇప్పటికే పిలుచుకునే కర్ణాటకలో చేరిపోయిన ప్రాంతంలోను గణనీయంగా ముస్లింలున్నారు. రజాకర్ల పేరుతో నలభై వేల నుంచి రెండు లక్షల దాకా ముస్లింలను భారత సైన్యం సైనిక చర్య (13-14 సెప్టెంబర్ 1948) సందర్భంగా చంపిందని సుందర్‌లాల్ మొదలు డా. జయసూర్య ఇచ్చిన నివేదికలలో ఎక్కువ మంది ముస్లింలు మరఠ్వాడ ప్రాంతానికి చెందిన వాళ్లే. తెలంగాణలో మద్దూరు, లద్దునూరు వంటి గ్రామాలే, హైదరాబాద్ నగరానికి చెందిన వాళ్లు. ఇంకా హైదరాబాద్ నగరంతో పాటు తెలంగాణలో ముస్లింలు అప్పటి జనాభాలోనైతే ఐదు వంతైనా ఉండేవాళ్లు. హైదరాబాద్‌లో ఇప్పటికీ 30 శాతం ఉన్నారు. కనుక తెలంగాణ భాషకు అవమానం జరగడం, యాసకు అవమానం జరగడం అనే అంశాన్ని గానీ, తెలంగాణకు అన్యాయం జరిగిడమనే అంశాన్ని కేవలం తెలంగాణలోని తెలుగు మాట్లాడే ప్రజల దృష్టితో అని భావించకూడదు. అంతకన్న ఎక్కువగా తెలుగువాళ్లు, ముస్లింలు కూడా మాట్లాడే ఉర్దూకు జరిగింది. ఇంక ముస్లింలకు సైనిక చర్య దగ్గరి నుంచి మొదలుకొని ఆంధ్రప్రదేశ్ ఆవిర్భావం తర్వాత ఇప్పటి దాకా జరిగిన అన్యాయం గురించి ఎంత చెప్పిన తక్కువే. వారికి కనీసం 4 శాతం రిజర్వేషన్లను కూడా హైకోర్టు అనుమతింకపోవడం మన న్యాయ వ్యవస్థకు చుండూరు తీర్పు దాకా ప్రదర్శితమైన హిందూత్వ స్వభావానికి నిదర్శనమే. అందుకే తెలంగాణ లోని ముస్లింలు డెల్టా సంపన్న పాలకవర్గాల పాలనకు వ్యతిరేకంగా ఇతర సామాజిక బృందాలతో భుజం భుజం కలిపి పోరాడాలి.

దళితులు, అందులోనూ మాదిగల గురించి కూడా ఇదే విశ్లేషణ వర్తిస్తుంది కాని ప్రస్తుతానికి ఆదివాసుల గురించి కనుక ఎక్కువగా ఆ అంశాన్ని పరిశీలిద్దాం. ఇప్పుడు భద్రాచలం డివిజన్‌లో పోలవరం ప్రాజెక్ట్‌కు వ్యతిరేకంగా పోరాడుతున్న ఆదివాసులు, కోయలు, కొండరెడ్లు. కొండరెడ్లు మన్నె ప్రాంతంలో ఉన్నారు. అంటే గోదావరి జిల్లాలో, ఏజెన్సీలో, మిగతా వాళ్లంతా కోయలు. వీళ్లు తెలంగాణ ప్రాంతంలో ఉన్న వాళ్లు కోయ భాషతో పాటు తెలుగు మాట్లాడతారు. వీళ్లు ఒడిశా, చత్తీస్‌గడ్‌కు విస్తరించి ఉన్నారు. అక్కడ కోపదు, కోయకూర్ భాషలతో పాటు ఆయా ప్రాంతాల ఒడిశా, చత్తీస్‌గడ్ భాషలు మాట్లాడతారు. గోదావరి ఎగువన వీళ్లను గొండులంటున్నాం. ఆదిలాబాద్ వైపు తెలుగు, మరాఠి, హిందీలు మాట్లాడతారు. వీళ్లకు గోండు లిపి కూడా ఉన్నట్లు ఇటీవలి పరిశోధనల్లో బయట పడింది. వీళ్లు రాయపూర్ వరకు, ఇంకా మధ్యప్రదేశ్ వరకు విస్తరించి ఉన్నారు. రాంజీ గొండు పరిపాలించిన గోండ్వాన రాజ్యం గానీ, గుండాదర్ పోరాడిన ప్రాంతం గానీ ఇంత సువిశాలమైన స్వపరిపాలన కలిగిందే. కనుక తెలంగాణ ప్రాంతంలో ఉన్న ఆదివాసుల స్వయం ప్రతిపత్తి భావనను కేవలం మైదాన ప్రాంత ప్రజల ప్రత్యేక రాష్ట్ర భావనకు పరిమితం చేసి ఆలోచించడం న్యాయం కాదు. అయితే చారిత్రకంగా, భౌగోళికంగా గోదావరి లోయలో ఆదిలాబాద్ నుంచి ఖమ్మం దాకా విస్తరించి ఉన్న ఆదివాసులపై ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పటి నుంచి పరిపాలనా పరంగానూ డెల్టా సంపన్న పాలక వర్గాల అణచివేత, దోపిడీ దౌర్జన్యాలు కొనసాగాయి గనుక, అందులోనూ ముందే పేర్కొన్నట్లు నక్సల్బరీ జగిత్యాల, ఇంద్రవెల్లి పోరాటాల కాలం నుంచి ఈ లోయలోనే దళారీ పాలక వర్గాలు ఎక్కువగా నెత్తురుటేర్లు పారించాయి. గనుక వీళ్లు ఆదిలాబాద్, కరీంనగర్ పోరాటాల్లోనూ, ఉత్తర తెలంగాణ పోరాటాల్లోనూ, ప్రత్యేక తెలంగాణ తొలి - మలి పోరాటాల్లోనూ అవినాభావంగా కలిసి పోయారు. అంత మాత్రాననే ఆదివాసి జాతి భావనను కేవలం తెలుగు, మరాఠీ, ఒడియా జాతుల ఆకాంక్షలకే పరిమితమై చూడరాదు. వీళ్లు ఇక్కడి దాకా మనతో ఉంటారు. ఇంకా ముందుకు వెళ్లి స్వయం ప్రతిపత్తి కోసం పోరాడతారు. దండకారణ్య భావనను మళ్లీ సిపిఐ ఎంఎల్ పీపుల్స్‌వార్ నూతన ప్రజాస్వామిక విప్లవంలో భాగంగా ముందుకు తెచ్చినప్పుడు ఆదిలాబాద్ కూడా దండకారణ్యంలో ఉంది. ఇప్పటికే మహారాష్ట్రలోని గడ్చిరోలి జిల్లా దండకారణ్య పర్‌స్పెక్టివ్‌లో భాగమే. అట్లే ఇప్పుడు పోలవరం ప్రాజెక్ట్ ముంపునకు గురవుతున్న భద్రాచలం, చత్తీస్‌గడ్, ఒడిశా సరిహద్దులు (కుంటా ప్రాంతం) దండకారణ్యంలో భాగమే. తెలంగాణ మైదాన ప్రాంత ప్రజలు, రాష్ట్ర కాంక్షతో పోరాడిన వీళ్లు ఈ చారిత్రక, భౌగోళిక ఆదివాసి స్వయం ప్రతిపత్తిని గౌరవించాలి. గుర్తించాలి.

అంతేకాదు - ఇది తెలంగాణకు చెందిన వాళ్లు వేరువేరు రాష్ట్రాలలో ఉండడం వలన తెలంగాణ వారవుతారు కదా అనడం వంటిది కూడా కాదు. వాళ్లు ఒక ఆదివాసి జాతిగానే గోండు, కోయల పేర్లతో ఐదు రాష్ట్రాలకు భౌగోళికంగానూ, చారిత్రకంగానూ విస్తరించి ఉన్నారు. (మహారాష్ట్ర, తెలంగాణ, ఆంధ్ర, ఒడిశా, చత్తీస్‌గడ్) మనతో పాటు పరిపాలనా పరంగా మన, మన రాష్ట్రాలలో ఉన్నంత మాత్రాన మన పరిమితులే వాళ్లవి కాజాలవు.

ఇందుకు ఆంధ్రప్రదేశ్ శాసనసభ సమావేశం హైదరాబాద్‌లో జరుగుతున్నప్పుడు చంద్రబాబు నాయుడు ప్రభుత్వం ఎంచుకుని చేసిన ఒక 'ఎన్‌కౌంటర్' వ్యూహాన్నే నిదర్శనంగా చెప్పవచ్చు. ఇది జూన్ 20న జరిగినట్లు చెపుతున్నారు. పాలుట్ల ప్రాంతంలో రానున్న ఆంధ్రప్రదేశ్ రాజధాని ప్రాంతానికి దగ్గర - గుంటూరు ప్రకాశం జిల్లా సరిహద్దు, శాఖమూరి అప్పారావును చంపేసిన పుల్లంచెర్ల ప్రాంతం కూడా. ఈ అడవిలో అత్యంత ప్రాచీన జాతియైన చెంచులు ఉంటారు. వీళ్లు గుంటూరు, ప్రకాశం, కర్నూలు, పాలమూరు జిల్లాల అడవుల్లో కృష్ణా నదికి ఇరువైపుల విస్తరించి ఉన్నారు. వీటినే నల్లమల అడవులని కూడా అంటారు. ఈ నల్లమలలో పాలమూరు చెంచులు విప్లవోద్యమాన్ని తమ గుండెల్లో నిలుపుకున్నారు. కాపాడుకున్నారు. చర్చల కాలం అయిపోయి ఇక్కడ విప్లవోద్యమం పూర్తిగా తుడిచిపెట్టుక పోయిందని భావిస్తున్న కాలంలో ఆంధ్ర ప్రాంతానికి చెందిన జాన్ బాబురావు అనే చెంచు యువకుడు 2006 నుంచి నిన్న అమరుడు అయ్యేదాక కూడ మొండి గానూ, పట్టుదలగానూ ఇక్కడే ఉంటూ వ్యవసాయం చేస్తూ విప్లవోద్యమ ప్రచారం చేస్తున్నాడు. ఇది అక్కడి ప్రాంత ప్రజలకు తెలుసు. పోలీసులకు తెలుసు. జాన్ బాబురావుతో పాటు 'ఎన్‌కౌంటర్' అయిన ఇద్దరు మహిళల్లో ఒకరు కవిత మెదక్ జిల్లాకు చెందిన దళిత యువతి. జాన్ బాబురావు సహచరి పాలమూరు ఆమ్రాబాద్‌కు చెందిన యువతి. ఈ ఇద్దరు మహిళల కెసిఆర్ ఆయన కుటుంబంలోనే దక్షిణ తెలంగాణకు

# చుండూరు హత్యలపై న్యాయస్థానపు అన్యాయం

***చుండూరు మారణకాండలో ప్రత్యేక న్యాయస్థానం దోషులుగా తేల్చి శిక్షలు విధించినవారిని నిర్దోషులుగా విడుదల చేసిన హైకోర్టు తీర్పులోని లోపాలను వివరిస్తున్నారు* ఎడ్ల పోచయ్య**

**చుం**డూరు హత్యాకాండ కేసులో విచారణ జరిపిన ప్రత్యేక న్యాయస్థానం శిక్షలు విధించినవారితో సహా నిందితులందరూ నిర్దోషులేనని ఆంధ్ర ప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తులు జస్టిస్ ఎల్ నరసింహారెడ్డి, జస్టిస్ ఎం ఎస్ కె జైస్వాల్ తీర్పు ఇచ్చి రెండు నెలలు గడిచిపోయింది. ఆంధ్రప్రదేశ్ చరిత్రలో అత్యంత దుర్మార్గమైన మారణకాండలలో ఒకటైన చుండూరు ఘటనలో నేరస్తులకు మొదట ప్రత్యేక న్యాయస్థానమే సరైన శిక్షలు విధించలేదంటే, ఆ శిక్షలను కూడ రద్దు చేసిన హైకోర్టు తీర్పు మరింత దుర్మార్గమైనది. సరిగ్గా ఎన్నికల హడావుడి మధ్య, మరీ ముఖ్యంగా ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఒకదానిమీద ఒకటిగా తోసుకొచ్చిన స్థానిక సంస్థల, శాసనసభ, లోకసభ ఎన్నికల హడావుడిలో అందరూ మునిగి ఉండగా ఒకరకంగా దొంగచాటుగా ఏప్రిల్ 22న ఆ తీర్పు వెలువడింది. ఆ తీర్పు ఎంత అన్యాయమైనదో, సామాజిక పరిస్థితులను విస్మరించి ఇచ్చినదో మళ్లీ కొత్తగా చెప్పనక్కరలేదు. అటువంటి దారుణమైన హత్యాకాండ జరిగినప్పుడు, అది కూడ తరతరాలుగా మన సమాజంలో సాగుతున్న కుల అసమానత, కుల వివక్ష, కుల దురహంకారం, అస్పృశ్యత వంటి దురాచారాల నేపథ్యంలో జరిగినప్పుడు, విచారణలో ఎంత విశాలమైన సామాజిక దృక్పథాన్ని పాటించవలసి ఉంటుందో ఆ పరిశీలన లేకుండా చాల సాంకేతిక కారణాల ఆధారంగా చెప్పిన తీర్పు అది. నిజానికి సాంకేతిక కారణాల వెనుక కుల దురభిప్రాయాలను దాచుకుని తీర్పు ప్రకటించారనాలి. ఈ దేశంలో న్యాయవ్యవస్థ ఎట్లా హైందవ బ్రాహ్మణీయ సంపన్నవర్గ భావజాలంతో పనిచేస్తున్నదో ఆ తీర్పు విస్పష్టంగా తెలియజెప్పింది. కొనసాగుతున్న వ్యవస్థలో ఆ తీర్పు అంత ఆశ్చర్యకరమైనది కాదు గాని, ఆ తీర్పును నిరసిస్తూ, ప్రతిఘటిస్తూ జరగవలసినంత ప్రజాందోళన జరగకపోవడం ఆందోళనకరమైన అంశం. ప్రతిస్పందనల గురించి చర్చించబోయే ముందు అసలు ఆ తీర్పు వెలిబుచ్చిన కొన్ని అభిప్రాయాలను పరిశీలించవలసి ఉంది.

ఏ కేసులో తీర్పులోనైనా ప్రారంభంలోనే అసలు విచారణాంశం ఏమిటో తటస్థమైన వివరణ ఇవ్వడం ఆనవాయితీ. కాని ఈ తీర్పు ప్రారంభం నుంచే తటస్థమైన వివరణ ఇచ్చే బదులు దళితులకు వ్యతిరేకమైన నర్మగర్భమైన వ్యాఖ్యలతో ప్రారంభమయింది. వ్యవసాయ గ్రామమైన చుండూరులో 1940 ల నుంచీ కూడ భూస్వాములకు, భూమిలేని నిరుపేదలకు ('వీరిలో అత్యధికులు షెడ్యూల్డ్ కులాలకు చెందినవారే' అని తీర్పు లోనే గుర్తించారు కూడ) భిన్నాభిప్రాయాలు, ఘర్షణలు ఉన్నాయని, కాని అవి ఎప్పుడూ హద్దు దాటకుండా ఇరుపక్షాల పెద్దలు ప్రయత్నిస్తూ వచ్చారని చరిత్రకు ఒక భాష్యం చెప్పి, ఆ తర్వాత, ఇటీవలికాలంలో యువతరం విప్లవశక్తుల ప్రభావం లోకి వచ్చారని, వారి మెదళ్లను విప్లవశక్తులు చెడగొట్టాయని, గ్రామంలోని శాంతియుత వాతావరణాన్ని చెడగొట్టడానికి అవకాశం కోసం ఆ విప్లవశక్తులు ఎదురుచూస్తూ ఉన్నాయని అంటుంది. ఒకవైపు ఘర్షణలు 1940 నుంచి ఉన్నాయని అంటూనే, గ్రామంలో శాంతియుత వాతావరణం ఉందని, దాన్ని చెడగొట్టడానికి ఎవరో ప్రయత్నించారని అనడం పరస్పర విరుద్ధం. అలా శాంతియుత పరిస్థితులను చెడగొట్టడానికి ప్రయత్నించిన ఫలితంగానే, అంటే దళితులు ప్రశ్నించడం ప్రారంభించి తమ అస్తిత్వాన్ని స్థిరపరచుకునే క్రమంలోనే హత్యలు జరిగాయని చెప్పకనే చెప్పడం ఇది. అంటే ఒకరకంగా జరిగిన హత్యాకాండకు బాధ్యులు బాధితులే గాని నిందితులు కాదని చెప్పే ఎత్తుగడ ఇది.

అలాగే, గ్రామంలో ఘర్షణల చరిత్ర ఇవ్వడానికి చేసిన ప్రయత్నంలో కూడ ఆ తీర్పు, హత్యాకాండకు పది నెలల ముందు 1990 అక్టోబర్ లో గ్రామంలోని తెలగ కులస్తులు ఏర్పాటు చేసిన చింతామణి

---

చెందిన వాళ్లు. చంద్రబాబునాయుడు, వెంకయ్య నాయుడు, మోడీలతో కలిసి ఇప్పటికీ తెలంగాణకు వ్యతిరేకంగా ఎన్ని కుట్రలు, దుర్మార్గాలు చేస్తున్నారో నాకన్నా ఎంతో క్షుణ్ణంగా ఏ తెలంగాణ వాదియైనా చెప్పగలడు. ముఖ్య మంత్రి చంద్రశేఖర్‌రావు గారయితే ఇంకా సమర్థవంతంగా చెప్పగలడు. అలిపిరికి ప్రతీకారంగా పదకొండేళ్ల తర్వాత తాను అధికారంలోకి వచ్చీ రాగానే శాసనసభ నిండు పేరోలగంలో ఉండగా చంద్రబాబు చేసిన ఈ దారుణమైన హత్యలలో ఇద్దరు తెలంగాణ మహిళలున్నారు. ఇంత వరకు ఏ ఒక్క తెలంగాణ వాది కూడా ఈ దుర్మార్గాన్ని ఖండించినట్లు లేదు. ఆంధ్ర ప్రాంతంలో ఒక తెలంగాణ ఉద్యోగిపై దాడి జరిగితేనో, టివి9, ఎబిఎన్‌లో తెలంగాణ శాసనసభ్యులను కించ పరిస్తేనో న్యాయంగా స్పందించిన తెలంగాణ వాదులు – ఈ అన్నిటికన్నా దారుణమైన చర్య తెలంగాణ ఆదివాసి, దళిత మహిళల హత్య స్వయంగా చంద్రబాబు ప్రభుత్వం చేస్తే మిన్నకుండడం న్యాయం కాదు. పోలవరం ప్రాజెక్ట్ నుంచి నిన్నటి పాలుట్ల 'ఎన్‌కౌంటర్' హత్యల దాకా చంద్రబాబు కేంద్ర ప్రభుత్వాల వైఖరి ఆదివాసుల పట్ల ఎట్లా ఉండబోతుందో చూశాం. అది ఆదివాసుల పట్ల విద్రోహం మాత్రమే కాదు విస్థాపన – విధ్వంసక అభివృద్ధి పంథా. అది గోదావరిపై పోలవరం ప్రాజెక్ట్ కావచ్చు. కృష్ణా నదీ తీరాన చెంచుల, దళితుల 'ఎన్‌కౌంటర్' హత్యలు కావచ్చు. అది విద్రోహమే. విస్థాపనే. విధ్వంసమే. మరి తెలంగాణ ప్రభుత్వ విధానం ఆదివాసుల విషయంలో ఎలా ఉండబోతున్నదో ఇది ఒక పరీక్షా సమయం.

*(రచయిత విప్లవ కవి, విప్లవ రచయితల సంఘం నాయకులు)* వీ

నాటకప్రదర్శన దగ్గర దళిత యువకులు ఒక చిన్న విషయం మీద ఘర్షణ పెట్టుకుని, తెలగ కులస్తులను కొట్టారనే దగ్గర ఉద్దేశపూర్వకంగానే ప్రారంభించింది. ఆ మర్నాడు మళ్లీ దళితులు గ్రామంలోని తెలగ కులస్తులమీద దాడి చేశారని, అలాగే ఒక దళిత యువకుడు సినిమా హాల్లో ముందు సీటుపై కాలు పెట్టి రెడ్డి కులస్తుడికి తగిలించడం వల్ల తగాదా జరిగిందని, దళితులే భౌతిక దాడికి దిగారని చెప్పే మూడు సంఘటనలు ఉదహరించారు. అప్పటివరకూ ఐక్యంగా లేని తెలగలూ రెడ్లూ ఈ కారణాలవల్ల దళితులకు వ్యతిరేకంగా ఏకమయ్యారని దళిత వ్యతిరేకతకు సమర్థన వెతకడానికి ప్రయత్నించారు. చరిత్రలో ఇలా కారణాలు వెతుకుతూ పోవడం చాల చిత్రంగా ఉంటుంది. వ్యవస్థాగత కారణాలను, వ్యవస్థీకృతమైన హింసను, చారిత్రక క్రమాన్ని పక్కనపెట్టి, గొలుసు సంఘటనల్లో తాము ఎంపిక చేసుకున్న ఏదో ఒక సంఘటన దగ్గర ప్రారంభించడం ఈ ధోరణికి అలవాటు.

ఇక హత్యాకాండకు రెండు రోజుల ముందు జరిగిన ఘటన గురించి కూడ తీర్పులో ఇచ్చిన వివరణ చాల పాక్షికమైనదీ పూర్తిగా అసత్యమైనదీ. ఆగస్ట్ 4న ఒక దళిత యువకుడు ముగ్గురు రెడ్డి యువతుల భుజాలు రాసుకుంటూ వెళ్లి అసభ్యంగా ప్రవర్తించాడని, దాన్ని ప్రశ్నించినందుకు కృష్ణారెడ్డి అనే యువకుడిని కత్తితో పొడిచాడని తీర్పులో రాశారు. ఆ మర్నాడు దళితులు మరొక దాడి చేశారని రాశారు. అప్పటికే గ్రామంలో పోలీసు శిబిరం ఉన్నప్పటికీ, సెక్షన్ 144 విధించినప్పటికీ రెండు వర్గాలూ రాళ్లు రువ్వుకున్నాయని రాశారు.

నిజానికి చుండూరు మారణకాండపై ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం ఆగస్ట్ 1991లోనే ప్రచురించిన నివేదికలో ఈ ఘటనలూ, ఈ ఘటనలకు ముందు జరిగిన ఘటనలూ, పరిణామాలూ అన్నీ నమోదయ్యాయి. ప్రస్తుతం న్యాయస్థానం తీర్పు ఆ గొలుసు సంఘటనల లోంచి, సుదీర్ఘకాలపు పరిణామాల లోంచి తనకు ఇష్టమైన కొన్ని ఘటనలను ఎంపిక చేసుకుని, తనకు ఇష్టమైన పద్ధతిలో వ్యాఖ్యానించి, నిందితులను నిర్దోషులుగా చూపడానికి ఆ తప్పుడు వివరణను వాడుకుంది. ఏ ఘటన గురించి అయినా ప్రత్యర్థి వర్గాల కథనాలు పరస్పర భిన్నంగా ఉండవచ్చు గాని, నిష్పాక్షిక, చట్టబద్ధ పాలన సాగిస్తామని చెప్పుకునే న్యాయస్థానాలు ఒక పక్షపు కథనాన్ని యథాతథంగా ఉటంకించడం న్యాయస్థానపు పాక్షికతకు అద్దం పడుతుంది.

అలా ఆగస్ట్ 6 హత్యాకాండకు ముందరి సంఘటనల గురించి ఒకవపు కథనాన్నే రాస్తూ వచ్చిన తీర్పు, హఠాత్తుగా హత్యాకాండ విషయంలో మాత్రం 'ఆనాడు ఏం జరిగిందనే విషయంలో భిన్నమైన కథనాలున్నాయి' అని సన్నాయి నొక్కులు నొక్కింది. చిన్న చిన్న ఘర్షణల విషయంలోనేమో ఒకే కథనం ఉంటుంది, దారుణమైన హత్యలు జరిగి ఎనిమిది మృతదేహాలు దొరికిన సందర్భంలోనేమో అసలు హత్యలే జరగలేదనే భిన్నమైన కథనం ఉంటుందన్నమాట. అక్కడ కూడ ఆరోజు ఉదయం రెడ్లమీద దళితులు రెండు వేరు వేరు చోట్ల దాడులు చేశారట. అదేరోజు తెలగ, రెడ్డి కులస్తులు 30 మంది దళితులను వెంటాడుతూ వెళ్లారట. అలా వెళ్లిన గుంపు రెండు చోట్ల దళితులను చంపారనే ఆరోపణతో కేసు నమోదయిందట.

ఇక్కడి దాకా జరిగిన ఘటనకు వివరణ రాసిన తర్వాత, కింది కోర్టులో కేసు విచారణ జరిగిన తీరును తీర్పు వివరిస్తుంది. ఆ వివరణలోనూ అనేక లోపాలు, పొరపాట్లు, పాక్షిక సత్యాలు ఉన్నాయి గాని ప్రస్తుతానికి వాటిని పక్కనపెట్టవచ్చు. మొత్తం మీద 1993లో సెషన్స్ న్యాయస్థానం ముందుకు వచ్చిన కేసు, చుండూరులోనే ఏర్పాటుచేసిన ప్రత్యేక కోర్టులో పద్నాలుగు సంవత్సరాల పాటు సుదీర్ఘంగా సాగి చివరికి 2007 జూలై 31న తీర్పు ఇచ్చింది. మొత్తం 212 మంది నిందితులలో విచారణ క్రమంలోనే 33 మంది చనిపోగా, 123 మందిని నిర్దోషులుగా ప్రకటించి, మిగిలిన యాభై ఆరు మందిని దోషులుగా నిర్ధారించింది. వారిలో కొందరికి యావజ్జీవ శిక్ష, మరి కొందరికి స్వల్ప శిక్షలు, జరిమానాలతో ప్రత్యేక కోర్టు సరిపుచ్చింది.

ఈ స్వల్పమైన శిక్షలను కూడ రద్దు చేయాలని, పునర్విచారణ జరపాలని నిందితులు హైకోర్టును అభ్యర్థించారు. మరొకవైపు ఈ శిక్షలను పెంచాలని, నిర్దోషులుగా విడిచినవారిని కూడ పునర్విచారణ జరిపి శిక్షించాలని ప్రభుత్వం హైకోర్టును అభ్యర్థించింది. విడిగా కొంతమంది ప్రాసిక్యూషన్ సాక్షులు కూడ శిక్షలను పెంచాలని, నిర్దోషులుగా విడిచిపెట్టినవారిని శిక్షించాలని హైకోర్టును అభ్యర్థించారు. ఇలా వచ్చిన అనేక పునర్విచారణ అభ్యర్థనలలో సాంకేతిక కారణాలతో, కేవలం నిందితుల అభ్యర్థనను మాత్రమే పరిశీలనకు తీసుకుంటామని, ప్రభుత్వం, ప్రాసిక్యూషన్ సాక్షులు చేసిన అభ్యర్థనలను ప్రస్తుతం చేపట్టలేమని హైకోర్టు ప్రకటించింది. పునర్విచారణ కోరిన నిందితుల తరఫున న్యాయవాదులు టి బాల్ రెడ్డి, ఒ కైలాసనాథ్ రెడ్డి, ఎన్ విద్యాప్రసాద్, డి ప్రద్యుమ్నకుమార్ రెడ్డి, శ్రీమతి సి వసుంధరా రెడ్డి, శ్రీమతి ఎ గాయత్రి రెడ్డి వాదించగా, ప్రభుత్వం తరఫునా, బాధితుల తరఫునా ప్రత్యేకపబ్లిక్ ప్రాసిక్యూటర్లుగా నియమితులైన బొజ్జా తారకం, వి రఘునాథ్ వాదించారు.

తీర్పులో ఆ తర్వాత, ఆనవాయితీ ప్రకారం, నిందితుల తరఫు న్యాయవాదుల వాదనలను యథాతథంగా నమోదు చేశారు. అసలు హత్యలు జరిగాయో లేదో తెలియదని, వాటి మీద వెంటనే పోలీసులకు సమాచారం అందలేదని, హతుల కుటుంబ సభ్యులు కూడ ఎక్కడా ఫిర్యాదు చేయలేదని, కాని శవాలు దొరికిన తర్వాత దళిత సంఘాల ఒత్తిడితో కుల ప్రాతిపదికపై పోలీసులు కేసులు అల్లారని, పోలీసులు ప్రవేశపెట్టిన ప్రత్యక్ష సాక్షులెవరూ నమ్మదగినవారు కారని, వారి సాక్ష్యాలకు పొంతన లేదని నిందితుల తరఫు న్యాయవాదులు వాదించారు. దాడి జరిగిందని, హతులు చనిపోయారని సాక్షులు చెపుతున్న సమయానికి మూడు నాలుగు గంటల తర్వాత కూడ హతులు బతికి ఉన్నారని చెప్పే సాక్షులు ఉన్నారని, అందువల్ల దాడి కథనం అవాస్తవమని వాదించారు. పోలీసు కథనంలో, ప్రాసిక్యూషన్ సాక్షుల కథనాలలో ఉన్న అసంగతాలను ఎత్తి చూపి, అందువల్ల ఆ కథనాలు నమ్మడానికి వీల్లేదని వాదించారు.

ఈ వాదనలన్నిటినీ ప్రత్యేక పబ్లిక్ ప్రాసిక్యూటర్ ఖండించారు. జరిగిన దారుణ మారణ కాండ సాంకేతిక కారణాలతో కొట్టివేయదగినది కాదని అన్నారు. సాక్ష్యాలలో అసంగతాలు స్వల్పమైన విషయాలలోనే తప్ప, వాస్తవాల మీద కాదన్నారు. గ్రామంలో దళితుల అస్తిత్వ ప్రకటనను అడ్డుకోవడానికి రెడ్డి, తెలగ వర్గాలు సాగిస్తూ వచ్చిన దాడుల చరిత్రను వివరించారు.

ఇరుపక్షాల న్యాయవాదుల వాదనలను వివరించిన తర్వాత తీర్పులో, విచారణాక్రమంలో జరిగిన ఒక వివాదాన్ని ఉటంకించారు. న్యాయస్థానం బెంచి మీద తమకు విశ్వాసం లేదని ప్రాసిక్యూషన్ న్యాయవాదులు అన్నారని, ఒక బాధితుడు లిఖితరూపక ఆరోపణ కూడ చేశారని ప్రస్తావించి, వారి అభిప్రాయాన్ని కోర్టు ధిక్కరణగా పరిగణించాలని తాము భావించినప్పుడు వారు ఆ ఆరోపణను ఉపసంహరించుకున్నారని తీర్పులో రాశారు.

ఇవన్నీ అయిన తర్వాత న్యాయమూర్తులు కేసు మీద చర్చ ప్రారంభించి, సాక్షుల విచారణను, పోలీసు కథనాన్ని చాల సాంకేతికంగా పరిశీలించారు. తమ ముందు ఉన్న వాస్తవాల ఆధారంగా కింది కోర్టు ఇచ్చిన తీర్పును విశ్లేషించారు. ఆ తర్వాత తమ తీర్పు ఇవ్వడానికి ఉపక్రమించి న్యాయమూర్తులు రాసిన మూడు నాలుగు పేరాలు చాల కీలకమైనవి. ఈ దేశంలో న్యాయవ్యవస్థ ఇంకా చాణక్యనీతిని, మనుధర్మాన్ని ఎలా పాటిస్తున్నదో ఆ పేరాలు స్పష్టంగా చూపుతాయి.

ప్రత్యేక న్యాయస్థానం తీర్పు మీద వ్యాఖ్యానిస్తూ 'ఒక హంతక నేరపు కేసులో విచారణ అంటే ఒక గణితశాస్త్ర అభ్యాసం లాగ, వేరు వేరు అంకెల నుంచి కనిష్ట సామాన్య గుణిజాన్ని గ్రహించి అన్నిటికీ ఉమ్మడిగా సూచించడం కాదు. కొంతమంది నిందితుల బృందం హతుడి మీద దాడి చేసిందని ఒక సాక్షి చెప్పిన వాంగ్మూలం నమ్మదగినది కాదని న్యాయస్థానం అనుకుంటే, ఇక ఆ వాంగ్మూలంలోని మరికొన్ని భాగాలను కూడ ఆమోదించగూడదు. ఎందుకంటే ఇతర సాక్షుల సాక్ష్యాలలో కూడ కొంతమంది నిందితుల పేర్లు ఉమ్మడిగా వచ్చాయి. కొంతమంది నిందితులు హతుల మీద దాడి చేశారనే విషయంలో ఒక సాక్షి కథనం నమ్మశక్యంగా లేదని న్యాయస్థానం భావించినప్పుడు, ఆ సాక్షి మొత్తం వాంగ్మూలమే నమ్మశక్యం కానిదైపోతుంది. ఆ సాక్షి చెప్పిన ఒకానొక విషయాన్ని దారపు పోగులాగ విడదీసి విస్తరించి, ఇతర సాక్షుల సాక్ష్యాలలోని అటువంటి పోగులనే కలిపి వస్త్రం అల్లడం సాధ్యం కాదు' అని చాల గంభీరంగా ఏదో లోతయిన విషయం చెపుతున్నట్టుగా, సాక్షుల కథనాల అవిశ్వసనీయత అనే ముసుగు కింద హతులను, హత్యలను కప్పిపెట్టడానికి ప్రయత్నించింది. ఈ గంభీర ప్రవచనపు అసలు ఉద్దేశ్యమేమిటో ఆ తర్వాతి పేరాలో తేటతెల్లమవుతుంది.

'మొత్తం మీద ఫలితమేమంటే, హతులు కచ్చితంగా ఏ సమయానికి చనిపోయారో రుజువు చేయడంలో, వారి మీద దాడి ఏ స్థలంలో జరిగిందో, ఆ దాడి చేసిన వ్యక్తులెవరో గుర్తించడంలో ప్రాసిక్యూషన్ విఫలమయింది. ప్రాసిక్యూషన్ కథనంలో తీవ్రమైన పొరపాట్లు ఉన్నాయని ప్రత్యేక న్యాయస్థానం కూడ గుర్తించింది గాని కొన్ని కారణాలు చూపి వాటిని విస్మరించింది' అని చావుకబురు చల్లగా చెప్పింది. గజం మిథ్య, పలాయనం మిథ్య అన్నట్టు హతులు ఎప్పుడు చనిపోయారో తెలియదు, ఎవరు ఎక్కడ చంపారో తెలియదు, కాబట్టి ఏ శిక్షా అవసరం లేదు అనడానికి మార్గం సిద్ధం చేసుకుంది.

చిట్టచివరికి, 'అందువల్ల ప్రత్యేక న్యాయస్థానం విధించిన శిక్షలన్నిటినీ కొట్టివేస్తున్నాము... ఆ న్యాయస్థానం దోషులుగా నిర్ధారించిన నిందితులు జరిమానా చెల్లించి ఉంటే వారికి తిరిగి చెల్లించవలసిందిగా ఆదేశిస్తున్నాము' అని ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తుల తీర్పు ప్రకటించింది.

అక్కడితో ఆగిపోకుండా, 'ఈ కేసును ముగించే ముందు మేము చుండూరు, మోదుకూరు గ్రామస్తులకు, ప్రత్యేకించి అన్ని వర్గాల పెద్దమనుషులకు ఒక విజ్ఞప్తి చేయదలచుకున్నాము. విభిన్న వర్గాల మధ్య దశాబ్దాలుగా కొనసాగుతున్న సుదీర్ఘకాలపు విభేధాల నేపథ్యంలో దళిత సామాజికవర్గానికి చెందిన ఎనిమిది మంది అమాయక వ్యక్తుల విలువైన ప్రాణాలు చెల్లిపోయాయి. వారి కుటుంబాలు ధ్వంసమైపోయాయి. ప్రభుత్వం ఇచ్చిన సహాయ సహకారాలు ఆ హతుల కుటుంబ సభ్యుల ఆవేదనను తొలగించజాలవు. ఇతర సామాజికవర్గాలకు చెందిన 200 మంది వ్యక్తులపై ప్రతిదాడులు, పదిహేను సంవత్సరాలపాటు సాగిన సుదీర్ఘ విచారణ తప్పనిసరిగా వారి కుటుంబాలపై ప్రభావం వేసి ఉంటాయి. కనీసం ఇప్పుడైనా విజ్ఞతది పైచేయి కావాలి, ఏవైనా భిన్నాభిప్రాయాలు ఉంటే వాటిని భూస్థాపితం చేయాలి. గ్రామస్తులలో ప్రతి ఒక్కరిలో మానవ విలువలనూ, పరస్పర గౌరవాన్నీ పెంపొందించడానికి పెద్దమనుషులు, గ్రామంలో క్రియాశీలంగా ఉన్న సంస్థలు ప్రతి ప్రయత్నమూ చేయాలి. పాత పగలను కొనసాగించడం ఏ ఒక్కరి ప్రయోజనాలకూ ఉపయోగపడదు' అని నీతి వచనాలు పలికారు.

ఒక నేరం, అందులోనూ భయానకమైన దాడి, ప్రాణహరణం, జరిగిన తర్వాత ఆ నేరానికి తగిన శిక్ష విధించడానికే న్యాయవ్యవస్థ ఉంది. నేరం–శిక్ష అనే పద్ధతి ద్వారా శిక్షాభయం కల్పించి సమాజంలో నేరాలు జరగకుండా, లేదా తగ్గిపోయేట్టు చూడడానికే న్యాయవ్యవస్థ ఉంది. కాని ఆ న్యాయవ్యవస్థే 'జరిగిన నేరాన్ని మరచిపోండి, పరస్పర గౌరవంతో కలిసి ఉండండి' అని చెపుతున్నదంటే తన ఉనికిని తాను రద్దు చేసుకుంటున్నదన్నమాట. అలా చెప్పడానికి న్యాయవ్యవస్థ అవసరం లేదు. ఇంతకూ అటువంటి మాట నేరస్తులకు రుచికరంగానే ఉంటుంది, శిక్ష తప్పించుకునే మహదవకాశంగానే ఉంటుంది గాని బాధితులకు, హతుల బంధుమిత్రులకు పుండుకు కారం రాసినట్టుగా ఉండకతప్పదు. వారు తమ సన్నిహితులను పోగొట్టుకున్న దుఃఖాన్ని అనుభవించడానికి తోడుగా, ఆ నేరం ఏ శిక్షా లేకుండా సమసిపోయిందన్న వేదననూ భరించాలన్నమాట. చంపిన మనుషులకు తప్పనిసరిగా 'మానవ విలువలు', 'పరస్పర గౌరవం' నేర్పవలసినవే. ఆ మానవవిలువలు లేనందువల్లనే వారు తోటి మనుషులను అంత దుర్మార్గంగా చంపగలిగారు. కాని చచ్చిన మనుషులు, వారి బంధుమిత్రులు 'మావవ విలువలు', 'పరస్పర గౌరవం' లేనట్టుగా కనబడినదెక్కడ? వారికి అవి నేర్పాలని న్యాయమూర్తులకు ఎందుకు అనిపించింది? హంతకుడినీ హతుడినీ సమానంగా చూసే న్యాయవ్యవస్థ ఏ నైతిక సూత్రాలను పాటిస్తున్నట్టు?

ఆ తీర్పు వెలువడిన సమయం వల్ల దాని మీద రావలసినంత పెద్ద ఎత్తున ప్రతిస్పందన రాలేదు. ఏప్రిల్ 22న తీర్పు వెలువడితే అంతకు కొద్ది రోజుల ముందే శాసనసభ ఎన్నికల నామినేషన్లు మొదలై, మరొక వారంలో మొదటి విడత ఎన్నికలు ఉన్న నేపథ్యంలో ప్రధాన రాజకీయపక్షాలన్నీ ఎన్నికల కోలాహలంలో తలమునకలుగా ఉన్నాయి. పార్లమెంటరీ రాజకీయాలలో ఉన్న దళిత నాయకులు, దళిత ప్రజా సంఘాలు కూడ ఆ ఎన్నికల సంరంభంలో మునిగి ఉన్నాయి. పార్లమెంటరీ ఎన్నికలతో సంబంధం లేని కొన్ని దళిత సంఘాలు, ఇతర ప్రజా సంఘాలు నిరసన ప్రకటించినప్పటికీ, అప్పటికి ఉన్న వాతావరణంలో రాజకీయ పార్టీలకు, ప్రచారసాధనాలకు ఈ తీర్పు పెద్దగా పట్టించుకోవలసిన సమస్యగానే కనిపించలేదు. అప్పటి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తరఫున డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ ఈ తీర్పును వ్యతిరేకిస్తూ, పునర్విచారణ జరపాలని సుప్రీం కోర్టును అభ్యర్థిస్తామని వెంటనే ప్రకటించి, సుప్రీం కోర్టులో స్పెషల్ లీవ్ పిటిషన్ దాఖలు చేశారు. బాధితుల తరఫున, దళిత సంఘాల తరఫున కూడ సుప్రీం కోర్టులో కొన్ని అప్పీళ్లు దాఖలయ్యాయి. సుప్రీం కోర్టు విచారణ ఎప్పటికి జరుగుతుందో, హైకోర్టు చేసిన అన్యాయాన్ని సుప్రీం కోర్టయినా సవరిస్తుందో లేదో వేచి చూడాలి గాని, సమాజంలో తగిన ప్రతిఘటన, చర్చ, ఉద్యమం జరగక పోతే న్యాయస్థానాలకు కూడ న్యాయం వైపు నిలబడాలనే వేడి పుట్టదు.

*(రచయిత పాత్రికేయులు)* వీ

# పెయిడ్ న్యూస్‌తో వాస్తవాలు మాయం

***సమాజంలోని అన్యాయాలను, అక్రమాలను వెలుగులోకి తేవాల్సిన మీడియా విలువలనూ, ప్రమాణాలనూ పూర్తిగా మరిచి కార్పొరేట్ సంస్థల చేతిలో కీలుబొమ్మగా మారిందని అంటున్నారు* పి. సూర్యం**

ప్రజాస్వామ్యానికి తను మూలస్తంభమని గొప్పలు చెప్పుకొంటున్న మీడియా (ప్రింట్, ఎలక్ట్రానిక్) డొల్లతనాన్ని 2014 ఎన్నికలు మరొకసారి మీడియా బహిర్గతపరిచాయి. సమాజంలో ఉండే వెకిలిని కడిగేయాల్సిన మీడియా 2014 ఎన్నికల్లో పత్రికా ప్రమాణాలను, విలువలను పూర్తిగా అపహాస్యం చేసే పనులకు పూనుకొన్నది. ఇలా పేర్కొంటున్నామంటే మీడియాలో పనిచేస్తున్న జర్నలిస్టులందరూ అంతే అని ఎంత మాత్రం కాదు. ఎంతో మంది జర్నలిస్టులు వాస్తవాలు వెలుగులోకి తెచ్చిన సందర్భంలో ప్రాణాలు కోల్పోయిన సంఘటనలెన్నో ఉన్నాయి.

మీడియా యజమానులు 2014 ఎన్నికల సందర్భంలో వారి విధి విధానాలను గంగలో కలిపారు. నిష్పక్షపాతంగా వ్యవహరించాల్సిన మీడియా కార్పొరేట్ శక్తుల అవినీతి డబ్బు ఆడించినట్లు ఆడింది. సమాజంలోని అన్యాయాలకు, అక్రమాలకు వ్యతిరేకంగా కలానికి పదును పెట్టాల్సిన మీడియా గొంతెత్తాల్సిన మీడియా కంచే చేను మేసినట్లుగా ఈ ఎన్నికల్లో అత్యంత దారుణంగా తన పాత్ర పోషించింది.

మీడియాలో పనిచేస్తున్న జర్నలిస్టులకి, యజమానులకి వివిధ అంశాలపై స్వంత వైఖరులుండరాదని ఎంత మాత్రం కాదు. అవి తమ వైఖరులను వాటి సంపాదకీయాలలో, వ్యాసాలలో ప్రచురించు కోవచ్చు. కాని ముందే నిర్ణయించుకొని ఫలానా పార్టీ పత్రికగా, ఫలానా నాయకునికి మద్దతుగా వ్యక్తం చేయడాన్ని ఉద్దేశంతో కూడిందంటారు. నిర్ధారిత ఉద్దేశాలతో నడిచేవి వాస్తవాలను చిత్రీకరించవు. తప్పుని తప్పనవు. ఒప్పుని ఒప్పనవు. తప్పులని ఒప్పంటాయి. ఒప్పుని తప్పంటాయి. మీడియా వారి అవకాశవాద, ద్వంద వైఖరికి అద్దం పడుతున్నాయి. వాస్తవాలను వెలుగులోకి తేవాల్సిన మీడియా అవాస్తవాలకు, అసత్యాలకు, అర్ధ సత్యాలకు అబద్దాలకు, అన్యాయాలకు అక్షర రూపాన్నిస్తోంది.

చట్టం ఉన్నవారి చుట్టమన్నట్లు, అందులో ఏ ఆదేశిక సూత్రాలున్నా అవి ప్రజలకు దోహదపడడం లేవు. 'చెల్లింపు వార్తలు' చట్ట వ్యతిరేకం. ఎన్నికల కమిషన్ (ఇసి) దీనిపై చర్యలు ప్రకటించింది. కాని జరిగింది ఏమిటంటే చెల్లింపు వార్తలను అన్ని పత్రికల యజమానులు, పార్టీలు, నాయకులు కుమ్మక్కై పోటా పోటీగా ప్రచురించారు. ఇందులో ప్రధాన పత్రికలు, ఎలక్ట్రానిక్ మీడియా మినహాయింపు కావు. ఇవి చట్ట వ్యతిరేక చెల్లింపు వార్తలను చట్టబద్దం చేశాయి. నైతికత అంటారు మీడియా యజమానులే సెలవివ్వాలి. సమాజంలోని కుళ్లు, కంపును కడగాల్సిన మీడియా ఇలా దిగజారితే సమాజం ఇంకెంత వెనక్కిపోవాలి? వార్త రూపంలో ప్రకటనలు ప్రచురించడం ఏమి నీతి? ఇలాంటి వార్తలకి ఎలాంటి చట్ట బద్ధత లేదని, ఇది అవినీతిలో భాగమని పత్రికా మీటింగ్‌లో ప్రధాన ఎన్నికల కమిషనర్ వి.ఎస్. సంపత్ ప్రకటించాడు.

2009 ఎన్నికల్లో మహారాష్ట్ర, చత్తీస్‌గడ్ మాజీ ముఖ్యమంత్రులు అశోక్ చౌహాన్, మధుకోడాలపై చెల్లింపు వార్తల కింద కేసులు నమోదు చేయక తప్పలేదు. మహారాష్ట్రకు చెందిన ప్రముఖ దినపత్రిక ఆనాటి ముఖ్యమంత్రి అశోక్ చౌహాన్ 'అశోక్స్ యుగం' అని పేర్కొంది. దీన్ని వ్యతిరేకిస్తూ స్వతంత్ర అభ్యర్థి కినహాల్కర్ ఎలక్షన్ కమిషనర్‌కి రిపోర్టు చేశారు. ఇలా మహారాష్ట్ర కాంగ్రెసు పార్టీకి చెందిన అత్యంత ప్రముఖులు ముగ్గురు, బిజెపికి చెందిన ఒకరిపై చెల్లింపు వార్తల కింద కేసు నమోదైంది. ఎగ్జిట్ పోల్ (ఒపీనియన్ పోల్) రిపోర్టుల్లో పార్టీల వద్ద, నాయకుల వద్ద డబ్బు తీసుకొని తమకి అనుకూలంగా తీర్పులు ఇప్పించుకున్నట్లు బహిర్గతమైంది. ఇలాంటి వాటిని ఎన్నికల ముందు బహిష్కరించాలని ఎలక్షన్ కమిషన్ ఆఫ్ ఇండియా (ఇసిఐ) ప్రకటించింది. కానీ వివిధకోణాల్లో పత్రిక యజమానులు ఎగ్జిట్‌పోల్స్‌ని ప్రచురిస్తున్నారు. ఎన్నికల కమిషన్ ప్రకటనలు, సుప్రీంకోర్టు తీర్పులు ఈ అవినీతి చర్యలను అరికట్టలేకపోయాయి. పైగా మరింత పెచ్చుమీరిపోయాయి.

1999లో ప్రవేశపెట్టిన ప్రైవేటైజేషన్ సరళీకరణల ఫలితంగా మీడియా పూర్తిగా ప్రైవేటీకరణ చెందింది. అప్పటి నుండి మీడియా బ్లాక్ మెయిలింగ్, అవినీతి తారాస్థాయికి పోయింది. 2014 ఎన్నికల్లో చెల్లింపు వార్తల కింద ఏ రాష్ట్రంలో, ఎన్ని కేసులున్నాయో ఎన్నికల కమిషన్ సంఖ్యలతో సహా తెలిపింది. మన రాష్ట్రంలోనే 801 కేసులను బుక్ చేసింది. బిజెపి నాయకుడు, ఎన్‌డిఏ తరుపున ప్రధానిగా ప్రకటించుకొన్న నరేంద్రమోడీ ఎన్‌డిటివిలో ఇచ్చిన ఇంటర్వ్యూ కూడా డబ్బు చెల్లింపులో భాగమే. మోడీ రాష్ట్రం గుజరాత్‌లో 414 చెల్లింపు వార్తల కింద కేసులు బుక్ అయినవి. ఇవి నామమాత్రమే. తప్పించుకోలేనివే ఇవి. ప్రత్యర్థులు రుజువులతో రుజువు చేసినవే ఇవి. కానీ వెలుగు లోనికి రానివి అత్యధికం.

2014 ఎన్నికల సందర్భంలో ప్రభుత్వం తరపున ఎలక్షన్ కమిషన్ ఎన్నికల్లో రెండింతలు ఎక్కువ ఖర్చు చేసుకోవచ్చునని ప్రకటించింది. పార్లమెంటు అభ్యర్థి 75 లక్షలు ఖర్చు పెట్టుకోవచ్చునని చట్టబద్ధం చేసింది. ఇంత డబ్బు దేనికి ఖర్చు పెట్టాలి? ఎందుకు ఖర్చు పెట్టాలి? సామాన్యులకు ఇంత డబ్బు సమకూర్చుకోవడానికి అవకాశమే ఉండదు కదా! అంటే డబ్బున్న వాడే ఎన్నికల్లో పాల్గొనాలి. వాళ్లే ప్రచారం చేసుకోవాలి. డబ్బు లేని వాడు పోటీ చేసినా ప్రచారం చేసే అవకాశమే కోల్పోతాడు. ప్రజల మధ్య వివక్షతను, వ్యత్యాసాన్ని సృష్టిస్తున్న ఈ ప్రభుత్వాలను, ఈ పాలకులను ఎందుకు విశ్వసించాలి? ఎందుకు తిరస్కరించకూడదు?

లోక్‌సభ అభ్యర్థికి ఈ అప్రజాస్వామిక ఎన్నికల విధానంలో ఈ ప్రకటిత 75 లక్షలు కూడా ఏ మూలన సరిపోవు. కోట్లు ఖర్చు పెట్టితే తప్ప గెలవలేక పోతున్నారు. అందులో భాగమే ఈ చెల్లింపు వార్తలు.

ఈ ఎన్నికల్లో 25 హెలికాప్టర్లు బడా బూర్జువా, బడా భూస్వామ్య పార్టీలు, దాని అభ్యర్థులు వినియోగించారు. గంటకు హెలికాప్టర్‌కి కిరాయి 55 వేలు. ఈ ఎన్నికల్లో అన్ని రకాల ఖర్చులు 43 వేల కోట్లు

దాటిందని ఒక పత్రిక పేర్కొంటే, మరో పత్రిక లక్ష కోట్లు దాటాయని ప్రకటించింది. వాస్తవంలో ఇవి అత్యంత అల్పసంఖ్య మాత్రమే. అక్రమంగా దానికి రెట్టింపు ఖర్చు చేశారు. వీటికి లెక్కలు ఇవ్వలేని స్థితిలోనే చెల్లింపు వార్తలను సృష్టించారు.

దేశంలో ప్రధాన పార్టీలైనా కాంగ్రెస్, బిజెపి, టిడిపి, టిఆర్ఎస్, ఇతర రాష్ట్రాల్లోని ప్రాంతీయ పార్టీలు, ఎన్నికల ప్రచారం మొదలైన వద్ద నుండి వేతన కూలీలను రంగంలోకి దింపారు. బస్తీల్లో మగవారికి రు. 400, మహిళలకు రు. 300 చెల్లించారు. గ్రామాల్లో పురుషులకి రు. 200, మహిళలకి రు.100 చొప్పున కూలి చెల్లించి తమ ఎన్నికల ప్రచారం చేపించారు. వీటికెక్కడ లెక్కలుండవు.

ఎన్నికల్లో ఖర్చు పెట్టిన వాస్తవ లెక్కలు చూపించకపోతే, తప్పుడు లెక్కలు చూపిస్తే ఆ అభ్యర్థులపై చర్య తీసుకునే హక్కు ఉందని సుప్రీంకోర్టు ప్రకటించింది. కానీ ఎక్కడ ఇది అమలు జరగలేదు. నిజంగానే అమలుకు ఏ మేరకు పూనుకొన్నా పోటీ చేస్తున్న రాజకీయ పార్టీలు, దాని అభ్యర్థులు ఏ ఒక్కరు తప్పించుకోలేరనేది నిర్ద్వందంగా ప్రతి ఒక్కరు చెప్పగలుగుతారు. ఇలాంటి చట్టాలు ఒట్టివేనని, ప్రజలకు భ్రమలు కల్పించడానికేనని, ఉన్నవారిని కాపాడేవేనని మరోసారి రుజువైంది.

ప్రజాస్వామ్యం పేరిట జరుగుతున్న అవినీతినే ప్రస్తుతం సాగుతున్న చెల్లింపు వార్తలని ప్రెస్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా ఏర్పర్చిన సబ్ కమిటీ తన నివేదికలో వెల్లడించింది.

మీడియా అవినీతిని జర్నలిస్టులు, ప్రజాస్వామిక వాదులు బహిరంగంగానే ఖండిస్తున్నారు. స్వతంత్రంగా ఉండాల్సిన మీడియా, దురుద్దేశాలకు దూరంగా ఉండాల్సిన మీడియా, అవినీతిని ఎండగట్టాల్సిన మీడియా, ప్రజలను చైతన్య పర్చాల్సిన మీడియా, ప్రజాస్వామ్యాన్ని పాటించాల్సిన మీడియా వీటిన్నింటిని పక్కన బెట్టి కుళ్లు సమాజానికి తమ వంతు కుళ్లుని అందచేస్తున్న మీడియానని ప్రముఖ జర్నలిస్టు పరంజాయ్ గుహాలుకుర్తా తీవ్రంగా అసహ్యించుకుంటూ, వ్యతిరేకిస్తు మీడియా బాధ్యతలను గుర్తు చేశాడు.

ప్రపంచీకరణ, సరళీకరణ మూలంగా చిన్న పరిశ్రమలను, మధ్య తరగతి, ఒక స్థాయి పరిశ్రమలన్నీ మూతపడుతున్నాయి. వ్యవసాయ రంగాన్ని పాలకవర్గాలు తీవ్ర సంక్షోభంలోకి నెట్టాయి. కార్మికులకు, రైతులకు, సాధారణ ప్రజలందరికి కొనుగోలు శక్తి పడిపోతుంది. మార్కెట్ సంక్షోభంలో కూరుకుపోయింది. ఈ పరిస్థితిల్లో పోటీ చేస్తున్న ప్రధాన పార్టీల అభ్యర్థుల వద్ద కోట్లకు కోట్లు ఎలా పడగలెత్తుతున్నాయి? పెద్ద కార్పొరేటు సంస్థలు, బహుళ జాతి కంపెనీలు ఈ ఎన్నికలపై తమ డబ్బుతో రాజకీయ పార్టీలపై, నాయకులపై పెద్ద ప్రభావాన్ని కలిగిస్తున్నాయి. కోటీశ్వరులు రాజకీయాలకు, పార్టీలకు అతీతంగా తమ వ్యాపారాలను సాగించడం, పెంచుకోవడం అసంభవంగా మారింది. తమ వ్యాపారాలు సాఫీగా సాగాలన్నా, పెంచుకోవాలన్నా రాజకీయాలతో మిలాఖత్ కాకుండా వ్యాపారస్తులు నిలబడడం అసాధ్యంగా మారిపోయింది. సాధారణ వ్యాపారాల కంటే రాజకీయ పార్టీల వ్యాపారాలే సాఫీగా పెరగడానికి దోహదం చేస్తున్నాయి. రాజకీయాలు, వ్యాపారం వేర్వేరు కావు. ఆ రెండు మిలాఖత్ అయిపోయినాయి. ఎప్పుడైతే డబ్బుకే అన్నీ నిర్ణయించే శక్తి వచ్చేసరికి కార్పొరేట్లు, దళారీలు, రాజకీయాలను శాసించే స్థితికి వచ్చాయి.

వీటికి తోడు ఎలక్ట్రానిక్ మీడియా ఛానల్స్, పత్రికలు రాజకీయాలు నడుపుతున్నాయి. పార్టీ నిలబడాలన్నా, గెలవాలన్నా ఈ రెండు అవసరంగా భావిస్తున్నాయి. వీరి చేతిలో పావులుగా మీడియా ఉంది. ఈ ప్రాధాన్యతని గుర్తించే వైఎస్ఆర్‌సిపి అధ్యక్షుడు జగన్మోహన్‌రెడ్డి తన కోట్ల ఆస్తి పోయినా ఫర్వాలేదు గానీ సాక్షి పత్రిక, సాక్షి ఛానల్ ఉంటే సరిపోతుందని ప్రకటించాడు. టిఆర్ఎస్ పార్టీకి ఛానల్‌తో సరిపెట్టుకోలేం. పత్రిక ఉండాలని నందిని సిదారెడ్డి సూచన దీన్ని గుర్తు చేస్తోంది కూడా. 'ఈనాడు' పత్రిక తెలుగుదేశం కరపత్రంగా మారిపోయింది. మీడియా అవినీతి పేరుతో, అక్రమ సంపాదన కారులకు జేబు సంస్థగా మారిపోయింది.

వాస్తవాలు వెలుగులోకి తేవడంలో మీడియా గొప్ప పాత్రని పోషించింది. ఆ సందర్భాల్లో పత్రిక దాడులకి గురైన సంఘటన లెన్నో ఉన్నాయి. ప్రైవేట్ ఆస్థిపరుల, మాఫియాల నుండే గాక ప్రభుత్వ దాడికి గురైన సందర్భాలెన్నో ఉన్నాయి. అత్యవసర పరిస్థితి చీకటి రోజుల్లో పత్రికా స్వేచ్ఛని పూర్తిగా హరించివేసింది ఆనాటి కాంగ్రెసు ప్రభుత్వం. పత్రికా స్వేచ్ఛతో సహా అన్ని హక్కులను భంగపర్చే 'పోటా'ను కాంగ్రెసు ప్రభుత్వం నియమిస్తే బిజెపి సమర్థించింది. ఎన్‌డిఎ ప్రభుత్వం కాలంలో పోటా అమలు సందర్భం లో ఎన్నో ఘాతుకాలకు పాల్పడింది..

తమ అవినీతిని బయటికి రాకుండా, నొక్కి వేయడానికి ట్యాపింగ్‌కి ప్రభుత్వాలు పూనుకొన్నాయి. వాయిస్ ఓవర్ ఇంటర్ నెట్ ప్రోటోకాల్ (విఒఐపి) పేరిట ఈ దారుణానికి ఒడిగడ్తున్నాయి. కమ్యూనిస్టు విప్లవ సాహిత్యాన్ని నిషేధించాయి. వాక్ హక్కులన్నింటినీ కాల రాసిన సందర్భాలెన్నో ఉన్నాయి. వీటన్నింటిలో మీడియా సాహసంగా ఎదిరించి నిలబడింది. మరీ ముఖ్యంగా 1990లో ప్రైవేటీకరణ, సరళీకరణ నెలకొల్పిన నుండి మీడియా తన బాధ్యులకు తగు న్యాయం చేయలేక పోతోంది. అంతేగాకుండా దగుల్బాజీ పార్టీల, నాయకుల గొంతులో గొంతు కలుపుతోంది. అందులో భాగమే చెల్లింపు వార్తల పేరిట సాగిన దగాకోరు విధానాలు అత్యంత దారుణంగా సాగాయి. మీ వార్తలు గ్యారంటీగా ప్రచురించబడవు. పంపినా నొక్కిపెడుతారు. ఈ విధంగా పత్రికా సమావేశాలకు హాజరై విలేఖర్లు స్పష్టం చేస్తున్నారు. వారికున్న ఆదేశాల మేరకు వ్యవహరించక తప్పదంటున్నారు.

నీతి, న్యాయం ఆశయాల లక్ష్యంగా పనిచేస్తున్న పార్టీ, దాని ప్రతినిధుల వార్తలు మీడియాకు నోచుకోలేనప్పుడు ఎందుకు ఈ ఎన్నికలు? ఇది ఏమి ప్రజాస్వామ్యం? డబ్బే అన్నింటికీ మూలమని మీడియా కూడా భావించాక దేశం ఏ వైపు ప్రయాణిస్తుంది?

ఈ ఎన్నికలు స్వేచ్ఛగా, ప్రజాస్వామ్య బద్ధంగా జరగడానికి తావేలేని విధానాలను న్యాయబద్ధం చేస్తోంది. డబ్బు, మత్తు పానీయాలు, దగాకోరు మాటలే లక్ష్యంగా ఈ ఎన్నికలు సాగాయి. అవినీతి మయమై పోయాయి. సాధారణ ప్రజలు, ప్రజాస్వామిక వాదులు, చిన్న పార్టీలు, నీతి నిజాయితీ పార్టీలు, వ్యక్తులు పోటీ చేయడం కష్టతరంగా ఉంది. వీటికి తోడు గతంలో ఎన్నడూలేనంతగా మీడియా డబ్బు సంపాదన లక్ష్యంగా చెల్లింపు వార్తలకు పూనుకోవడం, అభ్యర్థుల అక్రమ ఖర్చులను బహిర్గతపర్చక పోవడం క్షమించరానిది.

మీడియా పోటీ చేస్తున్న పార్టీలతో, అభ్యర్థులతో ప్యాకేజీలు (స్లాటింగ్) కుదుర్చుకొన్నది. రోజు 17 గంటల చొప్పున ఒక్కొక్క ఎలక్ట్రానిక్ మీడియా చెల్లింపు వార్తల కింద స్లాటింగ్ చేసుకొన్నది. అంటే టైం కొనుక్కోవడం. 17 గంటల్లో ఏ సమయంలో ఎన్ని నిమిషాలు అనే దాన్ని బేరం చేసుకుంటారు. వార్తల బులెటిన్‌లో చెల్లింపు వార్తలకు ప్రాధాన్యత నిస్తారు. ఒక వ్యక్తి గురించి, తన ప్రచారం గురించి, గొప్పగా ఈ వార్తల సందర్భంలో అమ్ముడు పోతున్న మీడియా కొనియాడుతుంది. ఒక అభ్యర్థి, ఒక మీడియాతో 10 లక్షల నుండి 20 లక్షల డబ్బుని కుదుర్చుకొని ప్రచారం చేసుకొన్నారు. ప్రధాన పత్రికలయిన ఈనాడు, ఆంధ్రజ్యోతి, సాక్షి, నమస్తే తెలంగాణ దిన పత్రికలు ఈ ఎన్నికల

# తప్పిన మజ్లిస్ అంచనాలు

***మజ్లిస్ పార్టీ ఓట్లకోసం ఇతర పార్టీలపై, ముస్లిం ప్రజలపై మాత్రమే ఆధారపడి మిగతా తెలంగాణ ప్రజా సమూహాన్ని అంచనా వేయడంలో విఫలమైందని అంటున్నారు టంకశాల అశోక్***

తెలంగాణ సమాజం గురించి మజ్లిస్ పార్టీ నాయకుడు అసదుద్దీన్ ఒవైసీ అభిప్రాయం తప్పని తేలింది.

ప్రత్యేక తెలంగాణ ఏర్పడినట్టయితే టిడిపి బలహీనపడుతుందని, ఆ శూన్యంలోకి బిజెపి ప్రవేశిస్తుందని ఆయన ఉద్యమ కాలమంతా గట్టిగా వాదించారు. అదే మాటలు శ్రీకృష్ణ కమిటీకి ఎంఐఎం పక్షాన ఇచ్చిన నివేదికలో పేర్కొన్నారు. తన భావన సరికాదని అన్నవారితో, 'యు మార్క్ మై వర్డ్' అని నొక్కి చెప్పారు. తెలంగాణకు అనుకూలంగా కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ తీర్మానించిన తర్వాత సైతం వైఖరిని మార్చుకోలేదు. చివరకు బిల్లు తయారై దానిని కేంద్ర క్యాబినెట్ ఆమోదించిన అనంతరం, 'ఇప్పుడు రాష్ట్ర విభజన ఫెయిట్ అకాంప్లీ' అయింది గనుక తప్పనిసరై అంగీకరిస్తున్నామని చెప్పారు.

తీరా ఎన్నికలలో జరిగిందేమిటి? టిడిపి అయితే బలహీన పడిందిగాని, బిజెపి బలం ఎంత మాత్రం పెరగలేదు. టిడిపి సీట్లు తెలంగాణలో సుమారు 40 నుంచి 15కు పడిపోగా, బిజెపి 5 స్థానాలకు పరిమితమైంది. ఈ రెండు విధాలైనా ఫలితాలకు కారణం తెలంగాణ సమాజపు చైతన్యం. ఇది అసదుద్దీన్ అంచనా వేయలేకపోయారు. ఎందుకంటే ఆయనకు అక్కడి సమాజంతో సంబంధం లేదు.

అసదుద్దీన్ తన తర్కాన్ని ముందుకు తెచ్చిన సుమారు నాలుగు సంవత్సరాల క్రితమే, అది సరైనది కాదని, తెలంగాణ సమాజంలో హిందూ మతతత్వానికి తావు లభించడం చాలా చాలా కష్టమని నేను 'వార్త' దినపత్రికలో ఒక వ్యాసం రాశాను. అదే నిజమని ఇప్పుడు రుజువైంది.

తెలంగాణలో బిజెపి గాని, అంతకు ముందు జన సంఘ్‌కు గాని రెండంకెల అసెంబ్లీ సీట్లు ఎప్పుడూ రాలేదు. తనంతట తాను పోటీ చేసినప్పుడు లభించిన అత్యధిక స్థానాలు కేవలం 4. టిడిపితో పొత్తు పెట్టుకున్న సందర్భాలలో గెలిచినవి అత్యధికం 9. ఈసారి కూడా పొత్తున్నది, వచ్చినవి 5. పొత్తు లేనట్లయితే ఇంకా ఎక్కువ వచ్చేవని, టిడిపి పట్ల తెలంగాణలో గల వ్యతిరేకత ప్రభావం తమపై పడిందని ఆ పార్టీ నాయకులంటున్నారు. పొత్తు ప్రభావం వ్యతిరేకంగా ఉండిన మాట నిజం. కాని పొత్తు లేనట్లయితే కొన్ని ఓట్లు ఎక్కువ వచ్చేవేమో గాని, సీట్ల విషయం మాత్రం అనుమానమే. ఒకవేళ పెరిగినా అది కూడా అరకొరే తప్ప చెప్పుకోదగినట్లు మాత్రం కాదు.

అందుకు ప్రధాన కారణం ఏమంటే, ప్రజలు టిఆర్ఎస్‌కు అధికారమివ్వాలని స్పష్టమైన రీతిలో నిర్ణయించుకున్నారు. ఆ స్థితిలో

---

సమయంలో 50 కోట్ల నుండి 75 కోట్ల రూపాయల వరకు అక్రమంగా 'చెల్లింపు వార్తల' కింద సంపాదించాయి. ప్రధాన పార్టీల అభ్యర్థులు రెండు మీడియాల నుండి వార్తలు కొనుకున్నందుకు 15 లక్షల నుండి 25 లక్షలు చెల్లించారు. పార్టీలు రోజుకి గంటల కుదిరించుకుంటారు. ప్రజలు ఎక్కువ చూసే సమయానికి విలువ పెంచుతారు. రాత్రి 9 నుండి 10 గంటలకు టివి ఎక్కువ చూస్తుంటారు. అందుకని ఈ సమయానికి విలువ ఎక్కువ. ఎంత ఎక్కువగా ఒక అభ్యర్థిని పొగుడ్తూ ప్రచారం చేస్తున్నారంటే వారు డబ్బు ఎక్కువ చెల్లించారని అర్థం. ఒక పార్టీది కానీ, ఒక వ్యక్తిది గానీ మీడియాలో ప్రచారం లేదంటే వారు డబ్బు పెట్టలేదని సుస్పష్టం. ఒక వ్యక్తిని ఎంతో కీర్తిస్తూ ప్రచారాన్ని చూపిస్తుంది. ఆయన ఎలా బూట్లు వేస్తాడు, ఎలా పండ్లు తోముకుంటాడు. ఇతనికి భార్య ఎలా సర్ది పెడుతుందీ. పడుకొనే వరకు చేసే పనులన్నింటినీ ఒక డాక్యుమెంటరీగా తయారు చేసి ప్రచారం చేస్తే దానికి అదనపు డబ్బు చెల్లిస్తుందని అర్థం. ప్రకటన వార్త, వార్తలకు మధ్య విభజన రేఖ పూర్తిగా ఈ ఎన్నికల్లో తుడిచిపోయింది.

ఒక వ్యక్తి వ్యతిరేకంగా, పార్టీకి వ్యతిరేకంగా ప్రచారానికి ప్రత్యర్థి పార్టీ టివి వార్తల సమయం కొంటుంది. ఉదా. చంద్రబాబు నాయుడు, జగన్మోహన్‌రెడ్డిని తిడ్తుంటాడు. అలాగే జగన్, చంద్రబాబు నాయుడిని తిడ్తుంటాడు. ఈ తిట్టడానికి కూడా టివిల్లో టైం కొనుక్కొంటారు.

ప్రధాన ఛానల్స్ 20 కోట్ల నుండి అధికంగా సంపాదించినవి. ఎంఎల్ఎ 10 లక్షలు చెల్లిస్తే, ఎంపి 20 లక్షలు చెల్లించారు. వాస్తవంలో వార్తలకు, ప్రకటనలకు తేడా ఉండాలి. ప్రకటనలకు పత్రికల్లో బ్లాకుల్లో అక్షరాలు ముద్రించేవారు. ఇప్పుడు వాటిని పూర్తిగా ఎత్తివేశారు. అంతా వార్తల్లాగ ప్రకటిస్తున్నారు. ఈ అక్రమ సంపాదనకు లెక్క ఉండదు. పూర్తిగా బ్లాక్‌మనీ కిందికి పోతాయి. మీడియా యజమానులు తమ స్వంత ఆస్తులను పెంచు కోవడానికి, ఇతరుల ఆస్తులు పెంచడానికి దోహద పడుతున్నాయి. ఈ ప్యాకేజీల ఫలితంగా పెద్ద పత్రికలు సంపాదించిన డబ్బంత నల్ల ధనంగా మార్చుతున్నారు. వాస్తవిక డబ్బయితే వీటికి ట్యాక్సు చెల్లించాలి. వీటన్నింటి నుండి తప్పించు కొంటున్నారు. ఈ నల్లధనాన్ని వారి స్వంత ఆస్తులుగా మార్చుకొంటున్నారు.

ఈ చెల్లింపు వార్తలను ఎన్నికల నేరంగా ప్రకటించాలని 1951లోనే ప్రజాప్రతినిధుల చట్టం పేరిట జీవో విడుదలయింది. ఇలా వార్తలు రాపించినా, టివిల్లో ప్రకటించినా వారికి 2 సంవత్సరాల కారాగార శిక్షలు విధించాలి. ఈ వార్తలను నిర్ధారించడానికి జిల్లా నుండి ఎలక్షన్ కమిషన్, సబ్ కమిటీని రూపొందించింది. ఇది అనుమానపడినా, నిర్ధారించినా తగిన సమాధానం 48 గంటల్లో ఇవ్వాలి. లేకపోతే ఎలక్షన్ కమిషన్ తగిన చర్యలు తీసుకోవాలి. రాజకీయ ప్రయోజనాల కోసం టివిలను అనుమతించవద్దని 1994లో కేబుల్ టివి నెట్ వర్క్ నిబంధనలను రూపొందించిందీ కానీ ఇవేవి ఉన్నట్లు కూడా ఉన్నతాధికారులకు తెలియవు.

*(రచయిత సిపిఐ (ఎంఎల్) న్యూడెమోక్రసీ)* వీ

బిజెపి, కాంగ్రెస్ రెండూ తేలిపోయాయి. తాము తెలంగాణను మొదటి నుంచి గట్టిగా బలపరిచినందున, ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నందున, బిల్లుకు అనుకూలంగా వ్యవహరించినందున తెలంగాణ ప్రజలు తమకు అనుకూలంగా మారారని బిజెపి నాయకులు విశ్వసించారు. గత జూలైలో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ తీర్మానానికి ముందు ఆ పార్టీ ఊగిసలాడుతుండగా బిజెపి కేంద్ర నాయకులు దానిని అదనుగా భావించి రాష్ట్ర విభజనకు అనుకూలంగా గట్టిగా ముందుకొచ్చారు. ఆ దశలో తెలంగాణలో ఆ పార్టీ పట్ల కొంత అనుకూలత పెరిగిన మాట నిజం.

మజ్లిస్ వైఖరిపై ఈ పరిణామాలన్నీ ప్రభావం చూపాయి. తెలంగాణ ఏర్పడినట్లయితే టిడిపి దెబ్బతినడమన్నది సులభమైన రాజకీయ తర్కం గనుక, ఆ శూన్యాన్ని బిజెపి ఆక్రమించడమన్నది అసదుద్దీన్‌కు ఒక ఆటోమేటిక్ ఫాలో అప్ తర్కంగా కనిపించింది. ఆయన పొరపాటు చేసింది అక్కడే.

ఎందుకంటే, శూన్యం ఏర్పడడమంటే ఏమిటి? సదరు పార్టీ నాయకులు, కార్యకర్తల శ్రేణులు ఇతర పార్టీల వైపు మళ్లడం. అట్లా ఏ పార్టీవైపు మళ్లుతారన్నది పరిస్థితులపై ఆధారపడి ఉంటుంది. అంతేకాదు, మరొక ముఖ్య విషయాన్ని కూడా అర్థం చేసుకోవాలిక్కడ. టిడిపి నుంచి దూరం కావడం మొదలైన పాయింట్ నుంచి ఆరంభించి వారు చిట్ట చివరన నిర్ణాయక దశ అయ్యే ఎన్నికల పాయింట్ వరకు చేరడానికి మధ్య తగినంత దూరం లేదా వ్యవధి ఉంటుంది. పరిస్థితులు తరచు మారుతున్న స్థితిలో వారి ప్రయానమన్నది ఇక్కడ రైలెక్కి సూటిగా వెళ్లిపోయి పలానా స్టేషన్‌లో దిగిపోవడమన్నట్లు ఉండదు. మారే పరిణామాల మధ్య ప్రయాణమన్నది ప్రవహించే నదిలో తెప్ప ప్రయాణం వంటిది. అది ఊగిసలాడుతూ, ప్రవాహ మధ్యంలో ఒకసారి కుడికి, మరొక సారి ఎడమకు పోతూ ఉంటుంది. అటువంటి స్థితిలో, టిడిపి శూన్యమంతా బిజెపి ఆక్రమణలోకి పోతుందనుకోవడం తొందరపాటు అవుతుంది. కనుకనే మజ్లిస్ అంచనాలు తప్పయ్యాయి.

అవి తప్పవడానికి అంతకన్న ముఖ్య కారణం ఉంది. అది తెలంగాణ సమాజపు స్వభావం, చరిత్ర, ఉద్యమాల తీరు, ఉద్యమ శక్తులు, లక్ష్యాలతో రూపుదిద్దుకున్నటువంటిది. ప్రవాహ రాజకీయ పరిణామాల కన్న ఇది మౌలికమైనది. గత జూలైలో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ తీర్మాణానికి ముందు కొంత నిరాశాస్థితి ఏర్పడుతుండిన స్థితిలో తెలంగాణకు అనుకూలంగా గట్టిగా ముందుకొచ్చిన బిజెపి పట్ల ఇక్కడ సానుకూలత కొంత పెరిగినట్లు పైన చెప్పుకున్నాం. కాని, ఆ సానుకూలత స్వభావాన్ని అప్పుడు ఎవరూ తరచి చూసి విశ్లేషించ లేదు. పలువురితో మాట్లాడిన నాకు అర్థమైనంత వరకు అది కేవలం తాత్కాలికమైన ఎత్తుగడ సానుకూలత మాత్రమే. అటువంటిది చూపితే కాంగ్రెస్‌పై ఒత్తిడి పెరగగలదన్నది కొందరైతే, ముందు రాష్ట్రమైతే రానివ్వండి, ఆ తర్వాత బిజెపి సంగతి చూద్దామని అన్నవారు  మరికొందరు.

అంతే తప్పా, మౌలికంగా బిజెపికి అనుకూలంగా మారిపోయిన వారు నాకైతే ఒక్కరు కూడా కనిపించలేదు. ఎక్కడైనా ఉద్యమాలు ఆటుపోట్లను ఎదుర్కొంటున్నప్పుడు ఇటువంటి ఊగిసలాటలు, ఎత్తుగడలు కనిపిస్తూనే ఉంటాయి. వాటిలో దేనినీ ఏ దశలోనూ స్థిరపడిన వాస్తవంగా తీసుకోలేం. తెలంగాణ ఉద్యమ లక్షణాల, నేపథ్యం గురించి పైన చెప్పుకున్న వివిధాంశాలను పరిగణలోకి తీసుకున్నప్పుడు, అక్కడి సమాజం టిడిపి అంతర్ధానం వల్ల ఏర్పడే శూన్యంలోకి బిజెపిని తీసుకు వెళ్లగలిగేటువంటిది కాదని అర్థమవుతుంది.

ఇది మజ్లిస్ నాయకత్వానికి అర్థం కాలేదు. తెలంగాణ సమాజం అటువంటి లక్షణాలు కలది గనుకనే చివరకు బిజెపికి 119లో 5 స్థానాలు మాత్రం ఇచ్చింది. తెలంగాణను అంత కుట్రపూరితంగా వ్యతిరేకించిన టిడిపికి సైతం వెనుకబడిన సెక్యులర్ తరగతులు, కొందరు ఇతరుల మద్దతుతో బిజెపి కన్న మూడు రెట్లు ఎక్కువ సీట్లు లభించాయి. సమాజ స్వభావానికి ఇదొక ప్రతిఫలం వంటిది.

నిజానికి అసదుద్దీన్ చేసిన అతిపెద్ద తప్పు స్వయంగా చొరవ తీసుకుని తెలంగాణ ఉద్యమంలో పూర్తి స్థాయిలో పాల్గొనకపోవడం. ఆయనకు తన సమాజపు సంక్షేమం పట్ల నిజాయితీ ఉంటే, ఆ సంక్షేమమన్నది తక్కిన తెలంగాణ సంక్షేమంలో ఇమిడి ఉన్నట్లు గ్రహించేవాడు. ఈ రెండు సమాజాల సమస్యలు ఒకటి తప్ప భిన్నమైనవి కావు. వాటికి నిష్కృతులు ఒకటి తప్ప వేరుకావు. రెండు సమాజాల చరిత్రలు, వర్తమానాలు, జీవితాలు, ఆర్థికం ఒక్కటైనప్పుడు, ప్రత్యర్థులు ఒకరే అయినప్పుడు, భవిష్యత్తు కూడా ఒకటిగా సాగవలసి ఉన్నప్పుడు, గమన మార్గాలు భిన్నమెట్లా అవుతాయి? ఈ మాటలన్నీ మజ్లీస్ నాయకత్వం గ్రహించలేదో లేక ఇతరేతర కారణాల వల్ల ఆమోదించ నిరాకరించిందో గాని, అంతిమంగా రాజకీయమైన పొరపాటు చేసింది. అంచనాలలో, ఉద్దేశాలలో, వ్యవహారాలలో అన్నింటా తప్పు చేసింది.

మజ్లిస్ నాయకత్వం తన ఎప్పటి తిరోగమన దృష్టితోనే వ్యవహరిస్తూ పాతబస్తీని ఒక ఘెట్టోగా తన గుప్పిట్లోనే కొనసాగించ దలచడం దీనికంతటికీ మూలమనాలి. వారికి ఆధునిక దృష్టి ఉండి తమ సమాజాన్ని భవిష్యత్తులోకి నడపదలచి ఉంటే బిజెపి ప్రమాదాన్ని ఎదుర్కొనే మార్గం అతి తేలికగా కనిపించేది. తక్కిన తెలంగాణ సమాజమంతా ప్రగతిశీలమైంది, సెక్యులర్ దృష్టి గలది అయినందున ఆ సమాజంతో మమేకమై కలిసినడవడమే వారికి బిజెపి నుంచి బీమా వంటిది. కాని ఆ పార్టీ నాయకత్వం ఆపని ఎప్పుడూ చేయలేదు. అది చేయకుండా, తమను కాంగ్రెస్ రక్షిస్తుందా లేక టిడిపియా అన్నట్లు వ్యవహరించారు. ఇదే వైఖరి కొనసాగితే తమ ఏకాకి తనం పెరుగుతుంది. ఇతర పార్టీలు ఉపయోగించుకుంటాయి తప్ప నిజమైన శాశ్వత భద్రత కల్పించలేవు. ఆ పని చేయగలిగింది తక్కిన సమాజమే.

పరిస్థితులను బట్టి ఆయా పార్టీలతో మైత్రి అవసరమే. కాదనడం లేదు. కాని నిజమైన మైత్రి కావలసింది తమ చుట్టుగల తమవంటి సమాజంతో. రక్షణ లభించగలది దాని ద్వారానే. అదే విధంగా మమేకం కావలసింది ఆ సమాజంతో. ఈ అవగాహన ఉండినట్లయితే వారు తెలంగాణ ఉద్యమంలో మొదటి నుంచి పూర్తి స్థాయి భాగస్వాములయ్యేవారు. అది జరిగితే, రాష్ట్రం ఏర్పాటుతో టిడిపి ఉంటుందా ఉండదా, శూన్యం ఏర్పడుతుందా ఏర్పడదా, అందులోకి బిజెపి ప్రవేశిస్తుందా ప్రవేశించదా అనే ప్రశ్నలకు నిమిత్తమే ఉండేదికాదు.

వారు తక్కిన తెలంగాణ సమాజంలో కలిసి కనీసం ఇప్పటి నుంచైనా ఆ దిశలో ప్రయాణిస్తే ముస్లిం సమాజానికి అమితమైన మేలు జరుగుతుంది. భద్రత పరంగానే కాదు, దీర్ఘకాలిక దృష్టితో చూసినప్పుడు బహుశ అంతకన్న ముఖ్యమైన ఆర్థిక – సామాజిక – రాజకీయాభివృద్ధి పరంగా కూడా. ఎందుకంటే, మైనారిటీలకు ఆధునికత, అభివృద్ధి, తక్కిన సమాజంతో మమేకతలలోనే అసలైన భద్రత లభిస్తుంది. అందుకు తెలంగాణ తరహా సమాజంలో పూర్తి అవకాశాలుంటాయి.

మజ్లిస్‌తో నిమిత్తం లేకుండా కూడా అటు నుంచి, ఇతర తెలంగాణ సమాజం నుంచి ప్రజాస్వామిక వాదులు, మేధావులు, ఆధునికులు ఇందుకు గట్టి చొరవలు తీసుకోవాల్సిన అవసరం ఉంది. ఈ పని ఎంత జరిగితే తెలంగాణ అంత అర్థవంతం, పరిపూర్ణం అవుతుంది.

(రచయిత సీనియర్ జర్నలిస్టు) వీ

# భారత రాజకీయ మాయాజూదం

***భారతీయ జనతా పార్టీ విజయానికి కారణాలలో ప్రధానమైనది వామపక్షాల వైఫల్యమేనంటున్నారు***

**బి.ఎస్. రాజు**

**2014** సార్వత్రిక ఎన్నికలు ముగిశాయి. నయా ఉదారవాద కార్పొరేట్ పెట్టుబడి అధిపతులు మరోమారు పార్లమెంటరీ రాజకీయ మాయాజూదంలో గెలిచారు. ఈ దఫా వారి గెలుపు హిందూత్వతో మూడు ముళ్ల బంధం, ఏడడుగుల సంబంధంగా స్థిరపడింది. ఎన్నికల్లో గెలిచి అధికారం చెలాయించే రాజకీయ నాయకులు కార్పొరేట్ వ్యవస్థకు నమ్మినబంటు, సామ్రాజ్యవాద అభివృద్ధికి కంకణ బద్ధులు. నిజానికి ఈ దేశంలో మరో మారు ఓటమి పాలైనది శ్రామిక వర్గం, వామపక్ష శక్తులు మరీ ముఖ్యంగా పార్లమెంటరీ కమ్యూనిస్ట్ పార్టీలు.

1920-22ల్లో గాంధీ ఆధ్వర్యంలో కాంగ్రెస్ చేపట్టిన మొట్టమొదటి సహాయ నిరాకరణోద్యమ కాలంలో బ్రిటిష్ వలసవాదానికి, సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా వెల్లువెత్తిన ప్రజా పోరాటాలు తీవ్రరూపం దాలుస్తున్న తరుణంలో కాంగ్రెస్ తాను తలపెట్టిన ఉద్యమాన్ని తానే ముందుకు సాగనివ్వకుండా నిలిపివేసింది. బ్రిటిష్ వారితో కాంగ్రెస్ ప్రదర్శించిన రాజీ ధోరణివల్ల ఉవ్వెత్తున స్వాతంత్ర్య ఉద్యమంలోనికి వచ్చి చేరిన వేలాది దేశభక్త మధ్యతరగతి ప్రజలు, మేధావులు, కార్మికులు, రైతాంగం ఎంతో నిరాశకు గురై కాంగ్రెస్‌కు ప్రత్యామ్నాయాలను వెతక సాగారు. రాజీలేని, నిలకడగల సామ్రాజ్యవాద వ్యతిరేక జాతి విముక్తి పోరాటానికి ఒక పటిష్టమైన వేదిక లేనిదే స్వాతంత్ర్య సముపార్జన, సోషలిస్ట్ సమాజ రూపకల్పన, నిర్మాణం సాధ్యం కాదనే భావన ఈ మిలిటెంట్ శక్తుల్లో బలంగా నాటుకుంది. దీనికి సోవియట్ మహత్తర అక్టోబర్ సోషలిస్ట్ విప్లవపవనాలు తోడయ్యాయి. కమ్యూనిస్ట్ పార్టీ భారత దేశ రాజకీయ రంగప్రవేశానికి అలా తెర లేచింది.

భారత కమ్యూనిస్ట్ పార్టీ ఆవిర్భవించి ఇప్పటికి రమారమి 90 సంవత్సరాలు కావస్తోంది. బ్రిటిష్ వలసగా రక్తమోడుతున్న భారత దేశ విముక్తికి, దేశ స్వాతంత్ర్యాన్ని సాధించడానికి, భవిష్యత్తు సోషలిస్టు సమాజ నిర్మాణానికి అంకితమవుతూ అక్టోబర్ సోషలిస్ట్ విప్లవ స్ఫూర్తితో 26-28 డిసెంబర్, 1925లో కాన్పూర్ నగరంలో భారత కమ్యూనిస్ట్ పార్టీ రూపుదిద్దుకుంది. అప్పటికి దేశం లోపల, బయట చోటు చేసుకున్న అనూహ్య చారిత్రక పరిణామ క్రమంలోనే భారతీయ జనతా పార్టీ (బిజెపి) ఆవిర్భవించింది.

దున్నేవానికే భూమి, విదేశీ పెట్టుబడుల జాతీయకరణ, వయోజన ఓటు హక్కు, ఆర్థిక స్వావలంబన, రోజుకు ఎనిమిది గంటల పని, వాక్ సభా స్వాతంత్ర్యాలు, ప్రజాస్వామిక పౌరహక్కులు, నిరసన ప్రదర్శన, పని బంద్ హక్కులు, సమాజంలో స్త్రీ సమానత్వం, అంటరానితనం నిర్మూలన, సామాజిక న్యాయం ఇత్యాది అంశాలపై బిజెపి పని చేయాలని, ఈ సమస్యలపై కార్మిక వర్గ పోరాటాలను, విస్తృత ప్రజా పోరాటాలను, ప్రజా సంఘాల నిర్మాణాల ద్వారా దేశవ్యాప్త ఉద్యమాలను నిర్మాణం చేయాలని కంకణం కట్టుకుంది.

ఈ కార్యాచరణలో భాగంగానే అంచెలంచెలుగా అఖిల భారత కార్మిక సంఘ్ కాంగ్రెస్ (ఎఐటియుసి), అఖిల భారత కర్షక (కిసాన్) సభ, అఖిల భారత విద్యార్థి సమాఖ్య (ఎఐఎస్ఎఫ్), అభ్యుదయ రచయితల సంఘం, భారత ప్రజానాట్యమండలి (ఇండియన్ పీపుల్స్ థియేటర్ అసోసియేషన్) ఏర్పడ్డాయి.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తొలి దశాబ్దాల్లో వామపక్ష శక్తులు జమిందారీ వ్యవస్థకు, బడా భూస్వాములకు వ్యతిరేకంగా మధ్య తరగతి రైతాంగాన్ని, ఈ రైతాంగ ప్రాబల్యంలో ఉన్న వ్యవసాయ శ్రామికులను 'దున్నే వానికే భూమి' అనే నినాదంతో సమీకరించి పోరాటాలు చేసిన ఫలితంగా, కార్మిక వర్గ పోరాటాలు నిర్వహించడం మూలంగా ఇటు గ్రామాల్లోనూ, అటు నగరాల్లోనూ కమ్యూనిస్ట్ పార్టీ పరపతి ఇనుమడించింది.

అంతేగాక, వామపక్షశక్తులు కార్మికవర్గ దృక్పథంతో తొణికిసలాడుతూ ప్రజా పోరాటాల, త్యాగాలబాటలో నడిచినకాలంలో ఈ శక్తులు శ్రామిక రాజ్యాధికారాన్ని సాధిస్తాయనే బలీయమైన ఆశను శ్రామిక ప్రజల్లో రేకెత్తించాయి. బూటకపు గాంధీవాద దళారీ కుమ్మక్కు స్వాతంత్ర్యాన్ని సాధించిన కాంగ్రెస్‌ను ఓడించగల సత్తా ఆ నాడు దేశంలో వామపక్ష

**1952 నుండి 2014 వరకు జరిగిన లోక్‌సభ ఎన్నికల్లో మితవాద, వామపక్షాల సీట్లు, ఓట్ల శాతాల వివరాలు**

| లోక్‌సభ వరుస సంఖ్య | ఎన్నికల సం. | జనసంఘ్ లేక బిజెపి సీట్లు | పొందిన ఓటు శాతం | వామపక్ష సీట్లు | పొందిన ఓటు శాతం |
|---|---|---|---|---|---|
| మొదటది | 1952 | 3 | 0.95 | 16 | 3.25 |
| రెండవ | 1957 | 4 | 5.97 | 27 | 8.92 |
| 3వ | 1962 | 14 | 6.44 | 29 | 9.94 |
| 4వ | 1967 | 35 | 9.31 | 42 | 9.39 |
| 5వ | 1971 | 22 | 7.35 | 48 | 9.49 |
| 6వ | 1977 | 295 (జనతా పార్టీ) | 41.32 | 29 | 7.11 |
| 7వ | 1980 | 31 | 18.92 | 47 | 8.73 |
| 8వ | 1984-85 | 2 | 7.74 | 28 | 8.58 |
| 9వ | 1989 | 85 | 11.36 | 45 | 9.12 |
| 10వ | 1991 | 120 | 20.04 | 49 | 8.62 |
| 11వ | 1996 | 161 | 20.29 | 44 | 8.09 |
| 12వ | 1998 | 182 | 25.59 | 41 | 7.15 |
| 13వ | 1999 | 182 | 23.75 | 41 | 6.88 |
| 14వ | 2004 | 138 | 22.16 | 53 | 7.07 |
| 15వ | 2009 | 116 | 18.8 | 20 | 6.76 |
| 16వ | 2014 | 282 | 31.0 | 10 | 4.00 |

# ఎన్నికలలో ఓడిందెవరు? గెలిచిందెవరు?

***2014 ఎన్నికలలో దేశంలో, రాష్ట్రంలో ప్రభుత్వాలు మారాయి గాని అవి అమలు చేస్తున్న ఆర్థిక విధానాల్లో మార్పులేదని, ఈ విధానాల అమలు వల్ల తలెత్తుతున్న సంక్షోభాలకు అంతిమ పరిష్కారం ప్రజా ఉద్యమాలే అని అంటున్నారు* షేక్ కరిముల్లా**

**16వ** సార్వత్రిక ఎన్నికలు ముగిశాయి. ఫలితాలు వెలువడ్డాయి. పదవుల పందరంలో గెలిచిన పార్టీలు తలమునకలై పోయాయి. నిజానికి ఇక్కడ గెలిచిందెవరు? ఓడిందెవరు అనేది ప్రశ్న? గెలిచేది ఎప్పుడు జెండా వేరైనా, ఏజెండా ఒకటే అయిన రాజకీయ పార్టీలే. కానీ ఓడేది ఎప్పుడు ప్రజలే అనేది వాస్తవం. బాధపడ్డదగ్గ విషయం. 'ప్రజలంటే కేవలం ఓటు బ్యాంకులేనా?' అన్నారు చినజీయర్‌స్వామి. అవును ప్రజలంటే పార్టీలకు ఓటు బ్యాంకులే! మనుషులకుండే అనేక రకాల బలహీనతలను ఎన్నికలలో గెలుపుకోసం వాడుకోవడం. డబ్బు, మద్యం పంచడమే కాదు అభద్రతా భావం నుండి వ్యక్తి ఆరాధన దాకా అనేక మానవ సహజమైన గుణాలను, పోకడలను ఎన్నికల ప్రయోజనాల కోసం నిస్సిగ్గుగా పార్టీలు వాడు కుంటున్నాయి. అలాగే మత భేదాలను, విద్వేషాలను భారతీయ జనతా పార్టీ నేర్పుగా వాడుకున్న వైనం తెలిసిందే.

ఈ ఎన్నికలలో డబ్బు చాలా ప్రధాన భూమిక వహించింది. ఇందుకు ఉదాహరణ ఎన్నికల కోడ్ అమల్లోకి వచ్చినప్పటి నుండి రాష్ట్ర వ్యాప్తంగా జరిపిన తనిఖీల్లో కళ్లు చెదిరేలా పట్టుబడిన నగదు రాష్ట్రంలో రు. 122,94,08,385 సీజ్ చేశారు. ఈ మొత్తం దేశవ్యాప్తంగా పట్టుబడిన నగదులో సగానికన్నా ఎక్కువగా ఉండడం విశేషం. అలాగే 89.30 కిలోల బంగారం, 821 కిలోల వెండి స్వాధీనం చేసుకున్నారు. నగదుతో పాటు అక్రమంగా తరలిస్తున్న 32,18,143 బాటిల్స్ మద్యాన్ని కూడా సీజ్ చేశారు. మొత్తానికి ఈ విషయంలో ఆంధ్రప్రదేశ్ మొదటి స్థానంలో నిలవడం సిగ్గుపడాల్సిన విషయం. అంతేకాక అన్ని రాజకీయ పార్టీలు, బడా పారిశ్రామిక కార్పొరేట్ వ్యక్తులకు టికెట్‌లు కేటాయించాయి. సామాన్యులకు, మంచివారికి, విద్యావేత్తలకు, మేధావులకు రాజకీయాలను మరింత దూరం చేశాయి.

ఈ ఎన్నికలలో అంచనాలను మించి దేశవ్యాప్తంగా ఎన్‌డిఎ, తెలంగాణలో టిఆర్ఎస్, ఆంధ్రలో టిడిపి విజయం సాధించాయి. టిడిపి నాయకుడు చంద్రబాబు నాయుడు సీమాంధ్రను సింగపూర్, దుబాయ్ తరహాలో అభివృద్ధి చేస్తాను, స్వర్ణాంధ్రను నిర్మిస్తాను అంటే, తెలంగాణలో టిఆర్ఎస్ నాయకుడు కెసిఆర్ బంగారు తెలంగాణ నిర్మిస్తానంటూ ఈ ఇద్దరు అనేక జనాకర్షక పథకాలతో హోరెత్తించారు. ఇది నమ్మి ప్రజలు వీరికి పట్టం కట్టారు అనుకుంటే అది కచ్చితంగా పొరపాటే. ఒక్కసారి గతాన్ని పరిశీలిస్తే 2004 ఏప్రిల్‌లో భారత పార్లమెంట్‌కు, ఆంధ్రప్రదేశ్

శక్తులు ఓ మేరకు సంతరించుకున్నాయి అనడం అతిశయోక్తి కాదు.

అలా ఉధృత ప్రజాపోరాటాల చరిత్రకు తెరలేపిన భారత కమ్యూనిస్ట్ పార్టీ 2014 నాటికి ఎటువంటి స్థితికి చేరింది? 1925 నాటికి ఇంకా పుట్టని భారతీయ జనసంఘ్, ఇప్పుడు భారతీయ జనతాపార్టీగా రూపాంతరం చెంది, మోడీత్వ హిందూత్వ అభివృద్ధి పహిల్వాన్‌గా ఎదిగి 282 లోక్‌సభ సీట్లను తన ఖాతాలో స్థిరీకరించుకున్న మితవాద పార్టీ ముందు వామపక్షం అత్యంత క్షీణదశలో దిగాలుగా, దీనంగా మిగిలిపోవడం ఓ విషాద వాస్తవం.

1952 నుండి 2014 వరకు 16 దఫాలుగా జరిగిన లోకసభ ఎన్నికల్లో మితవాద, వామపక్ష శిబిరాల బలాబలాలను ఇప్పుడు ఒకసారి పరిశీలిద్దాం. 1952 నుండి 2014 వరకు జరిగిన 16 లోక్‌సభ ఎన్నికల్లో మితవాదుల, వామపక్షాల బలాబలాలు (వివరాలు పట్టికలో).

విజయంలో ఓటమి బీజం ఉంటుంది. ఓటమిలో విజయం ఒదిగి ఉంటుంది. విజయం సాధించిన శక్తి ఓటమి పాలవొచ్చు. ఓటమి పాలైన శక్తి విజయ పథానికి మరలనూ వచ్చు. సామాజిక గతి గమనాలను, వాటి దశా దిశలను అధ్యయన - ప్రజా ఉద్యమ నిర్మాణాల ద్వారా మలుపు తిప్పగల సత్తా వామపక్షాలు సాధించగలగాలి. అలా సాధించ గలిగితేనే భారతదేశంలో నూతనోదయం సాధ్యపడుతుంది. లేకపోతే చీకటే మిగులుతుంది.

6వ లోక్‌సభలో సిపిఐకి 7, సిపిఎంకు 22 స్థానాలు వచ్చాయి. 16వ లోక్‌సభలో సిపిఐకి 1, సిపిఎంకు 9 సీట్లు లభించాయి. 7,8 లోక్‌సభలను మినహాయిస్తే తతిమ్మా అన్ని లోక్‌సభలకు మితవాద బిజెపి తన బలాన్ని నిలకడగా పెంచుకుంది. 1952లో వామపక్షాలు16 సీట్ల వద్ద మొదలై 2004 నాటికి 53 స్థానాలు సాధించాయి. మొత్తం 16 లోక్‌సభ ఎన్నికల్లోనూ వామపక్షాలు చెప్పుకోదగ్గ ఫలితాలను ఎప్పుడూ సాధించలేక పోయాయి. 15వ లోక్‌సభలో 20 స్థానాలకు, 16వ లోక్‌సభలో 10 స్థానాలకు జారిపోయాయి. అంటే భారత రాజకీయార్థిక రూపు రేఖలను అవి ప్రభావితం చేయలేక పోయాయి. నూతన ఆర్థిక విధానాల దాడికి ప్రపంచం మొత్తం మీద కుప్పకూలిన అన్ని కమ్యూనిస్టు పార్టీల గతే ఇక్కడ వామపక్షానిది కూడా. ఇక పార్లమెంటరీ వామపక్ష రాజకీయాలను కాదని సాయుధ పోరాట రాజకీయాలను చేపట్టిన నక్సల్‌బరీ ఎం.ఎల్ రాజకీయ పార్టీలు చీలికలు, పీలికలై కొన్ని పార్లమెంటరీ రాజకీయాల వైపు, కొన్ని మావోయిస్టు పార్టీగాను రూపాంతరం చెందాయి. వామపక్షాలున్నా ఇటువంటి పరిస్థితిలో నూతన ఆర్థిక విధానాలు దూకుడుగా, మార్గం మరింత విశాలమైంది. భారతదేశంలో వనరుల దోపిడీకి గేట్లు బార్లా తెరుచుకున్నాయి. ఈ స్థితిని అధిగమించడానికి అన్ని వామపక్షాలు, గ్రూపులు, వ్యక్తులు పునరాలోచన చేయాలి. కొత్త పద్ధతుల్లో వామపక్ష ఐక్యత సాధించాలి. ఉద్యమ నిర్మాణాలు చేపట్టాలి.

*(రచయిత శ్రామిక నేస్తం పత్రిక సంపాదకులు)* వీ

శాసనసభకు జరిగిన ఎన్నికలలో అటు భారత ప్రజలు, ఇటు ఆంధ్రప్రదేశ్ ప్రజలు (ఓటర్లు) కేంద్రంలో అధికారంలో ఉన్న బిజెపి నాయకత్వంలోని ఎన్‌డిఎ ప్రభుత్వానికి, ఆంధ్రప్రదేశ్‌లో తెలుగుదేశం పార్టీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తీర్పు చెప్పారు. ఈ తీర్పును ప్రపంచ బ్యాంకు కనుసన్నలతో, ప్రపంచీకరణలో భాగంగా అటు కేంద్ర ప్రభుత్వం, ఇటు రాష్ట్ర ప్రభుత్వం ఆర్థిక సరళీకరణకు అనుకూలంగా అనుసరించిన ఆర్థిక సంస్కరణలకు వ్యతిరేకంగా ఇచ్చిన తిరుగులేని తీర్పుగా పరిగణించాల్సి ఉంది.

ఆంధ్రప్రదేశ్‌లో టిడిపి ఆధ్వర్యంలో చంద్రబాబు నాయకత్వంలో తొమ్మిదేళ్ల పాలనలో పాలేరు భూముల కుంభకోణం, నకిలీ స్టాంపుల కుంభకోణం, కాకినాడ పోర్ట్ కుంభకోణం, స్కాలర్‌షిప్‌ల కుంభకోణం, కృషి బ్యాంక్, చార్మినార్ బ్యాంకుల కుంభకోణాలు, పనికి ఆహార పథకం బియ్యం కుంభకోణం, అలాగే ఇతర అనేక కుంభకోణాల్లో ప్రభుత్వం అనుసరించిన వైఖరి లక్షలాది ప్రజల ప్రయోజనాలకు వ్యతిరేకంగా ఉంది. వ్యవసాయ రంగం, చేతి వృత్తులు నిర్లక్ష్యానికి గురై రైతులు, చేనేత కార్మికులు ఆత్మహత్యలు చేసుకున్నారు. వరంగల్ లోని అజంజాహి మిల్లు, రాయలసీమ పేపర్ మిల్లుల మూసివేత, నిజాం షుగర్స్, సహకార రంగంలో ఉన్న చెరుకు ఫ్యాక్టరీలను కారు చౌకగా ప్రైవేటీకరణ, సింగరేణి బొగ్గు గనులను, ఆర్‌టిసిని ప్రైవేట్ రంగానికి ధారాదత్తం చేయాలనే ధోరణి, ప్రభుత్వ ఆసుపత్రులలో యూజర్ చార్జీలు విధించి, సామాన్య ప్రజలకు వైద్యం దూరం చేసి ప్రైవేట్ కార్పొరేట్ ఆసుపత్రులను బలోపేతం చేసే విధానాలకు పాల్పడింది. కరెంటు చార్జీలను పెంచింది. అంగన్‌వాడీ వర్కర్స్ సమస్యల పరిష్కారానికి ప్రజలు పోరాడితే, వారి ఆందోళనలపై పోలీసులను ఉసిగొల్పి, లాఠీ చార్జీలతో, తుపాకీ కాల్పులతో, చివరకు మహిళలపై వాటర్ క్యాననలను ప్రయోగించి, గుర్రాలతో తొక్కించి పాశవికంగా అణచివేత ధోరణిని అవలంభించింది. అంతిమంగా ప్రపంచబ్యాంకు ఆదేశాల కనుగుణంగా, అభివృద్ధి పేరుతో స్వర్ణాంధ్రప్రదేశ్ నిర్మాణం, విజన్ 2020లో పొందుపరచిన విధానాలతో హైటెక్ పాలన పేరుతో, జన్మభూమి అంటూ సాగించిన ప్రజా వ్యతిరేక పాలనకు ఆ ఎన్నికలలో (2004) ప్రజలు టిడిపికి చరమగీతం పాడారు.

ఇక బిజెపి నాయకత్వంలోని ఎన్‌డిఎ కూటమి 'భారత్ వెలిగి పోతుంది! అంతా బాగుంది' అనే భావనలను ప్రచారం చేయడాన్ని ప్రజలు నిర్ద్వందంగా తిరస్కరించారు. ఈ వెలిగి పోవడం, స్వదేశీ, విదేశీ కార్పొరేట్ శక్తులు, ధనస్వాములు, పరిశ్రమాధిపతులకే గాని సామాన్య ప్రజలకు కాదని తీర్పు చెప్పారు. అప్పటి ఎన్‌డిఎ ప్రభుత్వం మన ప్రాథమిక రంగం, నూటికి 70 మంది ఆధారపడిన వ్యవసాయ రంగాన్ని, నీటి పారుదల రంగాన్ని, విద్యుత్ రంగాన్ని నిర్లక్ష్యం చేసి ఆర్థిక రంగాన్ని అస్తవ్యస్తం చేసి రైతు, సామాన్య ప్రజల జీవితాలను దుర్భరం చేసింది. భారత నాగరికత, సంస్కృతులను ధ్వంసం చేస్తూ, మన సెక్యులర్ వ్యవస్థను ఎన్‌డిఎ ప్రభుత్వం ఛిన్నాభిన్నం చేసింది. శతాబ్దాల తరబడి, ఎన్నో మతాలకు నిలయమైన, శాంతి, సామరస్యాలతో భారత సామాజిక వ్యవస్థ భిన్నత్వంలో ఏకత్వం ప్రాతిపదికన నిర్మాణమై, ఘనీభవిస్తున్న వ్యవస్థను విచ్ఛిన్నం చేసే పాలనను సాగించింది. మాటలలో దేశభక్తి జపిస్తూ, ఆచరణలో ఆర్థిక సరళీకరణ పేరుతో ప్రపంచ బ్యాంకు కనుసన్నల్లో దేశ వనరులను (సంపద) సార్వభౌమత్వాన్ని బహుళజాతి సంస్థలకు తాకట్టు పెట్టింది. మన స్వతంత్ర మిశ్రమ ఆర్థిక విధానాలకు తిలోదకాలిచ్చి స్వదేశీ, విదేశీ ప్రైవేట్ పరిశ్రమాధిపతుల, భూస్వాముల చేతుల్లో దేశ ఆర్థిక వ్యవస్థను పెట్టి పేద, సామాన్య, మధ్యతరగతి, వివిధ చేతివృత్తుల ప్రజల జీవితాలను దారిద్ర్యంలోకి నెట్టింది.

ఇది గత సంక్షిప్త చరిత్ర. ఈ విధానాలన్నింటికి వ్యతిరేకంగా నాడు 2004 ఎన్నికల్లో భారత ఓటర్లు కేంద్రంలో ఎన్‌డిఎ ప్రభుత్వాన్ని, రాష్ట్రంలో తెలుగుదేశం ప్రభుత్వాన్ని ఓడించి ప్రజలు బుద్ధి చెప్పారు. కేంద్రంలో కాంగ్రెస్ నాయకత్వంలోని యుపిఎ కూటమికి, రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీకి పట్టం గట్టారు. ఎన్‌డిఎ కూటమికి ప్రత్యామ్నాయంగా అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ పార్టీ కూడా కేంద్ర, రాష్ట్రాలలో ఇందుకు భిన్నంగా నడుచుకోలేదు. అనేక కుంభకోణాలతో చిక్కుకు పోయింది. నిరంతరం ధరల పెరుగుదల, విదేశీ చెల్లింపుల సంక్షోభం, వృద్ధిరేటు మందగించి నిరుద్యోగం విపరీతంగా పెరిగిపోయింది. దేశం ఆర్థిక రుగ్మతలతో కూరుకు పోయింది. మరోవైపు మహిళల భద్రత, సాధికారత, మహిళ రిజర్వేషన్ బిల్లులను గాలికి వదిలేసింది. మొత్తం పాలన అటు కేంద్రలోనూ, ఇటు రాష్ట్రంలోనూ అచేతన స్థితికి చేరుకుంది. ఈ పది సంవత్సరాలు కాంగ్రెస్ పాలనకు విసుగెత్తి పోయిన ప్రజలు సహజంగానే కొత్త ప్రభుత్వాన్ని కోరుకున్నారు. అయితే మూడవ ప్రత్యామ్నాయం లేని కారణంగా తప్పనిసరి స్థితిలో ఎన్‌డిఎ, టిడిపిల గత దుష్ట పాలన అనుభవం ప్రజలకు ఉన్నా వీరికే అధికారం కట్టబెట్టారు తప్పా కార్పొరేట్ శక్తులు ప్రచారం చేసినట్టు చాయ్‌వాలా (మోడీ) ప్రధాని చేయడం ఈ దేశ ప్రజల ఆకాంక్ష అనేది శుద్ధ తప్పుడు ప్రచారం. అలాగే నూతన సీమాంధ్రను తీర్చిదిద్దడానికి చంద్రబాబు పాలన అవసరం అనేది కూడా అంతే తప్పుడు ప్రచారం.

ప్రజలు ఇచ్చిన పాలనా అధికారాన్ని నిలబెట్టుకునే స్థితిలో పాలక పార్టీలు లేవు. ఎందుకంటే ఈ పార్టీలు రిలయన్స్ లాంటి దేశీయ కార్పొరేట్ శక్తలకు, బహుళజాతి కంపెనీల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నందున, ప్రజల మౌలిక సమస్యలు పరిష్కరించ జాలవు. వాటి ఆర్థిక విధానాలు అందుకు అనుమతించవు. కాబట్టి అధికారంలో ఉన్న పార్టీలకు ప్రజల ఛీత్కారం తప్పదు. మరలా ఎన్నికల నాటికి (2019) ఈ ఛీత్కారం ఎన్‌డిఎ, తెలుగుదేశాలకు తప్పదు. ఈ చరిత్ర పునరావృతం అవుతూ ఉంటుంది. కానీ ప్రజల సమస్యలు పరిష్కరింపబడక , మొత్తం సమాజం విష వలయంలోకి నెట్టబడుతూ ఉంటుంది.

మరి ప్రజల ముందున్న మూడవ ప్రత్యామ్నాయం ఏమిటి? ఎన్నికల వ్యవస్థను పూర్తిగా సంస్కరించాలి. ప్రజల ఆకాంక్షలు, సమస్యలు పరిష్కరించని అభ్యర్థులను తిరస్కరించే అవకాశం ఓటర్లకు ఇవ్వాలి. ఎన్నికల వ్యవస్థలో ప్రజానుకూల సంస్కరణలు జరగాలి. అప్పుడే బొమ్మా – బొరుసు రాజకీయాల నుండి దేశాన్ని బయట పడేయగలం. సంస్కరణలకు రాజ్యాంగ బద్ధత ఉండాలి. ఇవి పెద్ద అసాధ్యమైనవేమి కాదు. ఇవి కూడా జరగకపోతే, చరిత్రకున్న సామాజిక నియమాలు, సూత్రాలు ఆచరణలోకి వస్తాయి. ఇందులో భాగంగా ఆర్థిక, రాజకీయ సంక్షోభాలు మరింత అధికమై ప్రజలు ప్రత్నామ్నాయం వైపు చూసే పరిస్థితులు తీవ్రమై, వ్యవస్థ మౌలిక స్వభావాన్ని మార్చే విశాల ప్రజా ఉద్యమాలు పెచ్రేగి ప్రజా రాజ్యాలు, సోషలిష్టు వ్యవస్థలు ఏర్పడే దిశగా చరిత్ర గమనం ఉంటుందనేది, గత చరిత్ర చెప్పిన వాస్తవం. ఆ రోజులు త్వరగా రావాలని ఆశిద్దాం! వీ

*(రచయిత ప్రభుత్వ ఉద్యోగి)*

# పరిహాసం పాలైన 'ప్రజాస్వామ్యం'?

***2014 సార్వత్రిక ఎన్నికలలో అన్ని రాజకీయ పార్టీల వ్యవహార సరళి ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేసే విధంగా ఉందంటున్నారు* అరుణ్**

పార్లమెంటరీ ఎన్నికలు ముగిశాయి. గెలుపు ఓటముల తర్వాత అభ్యర్థులిప్పుడు తమ భవిష్యత్తుకై కొత్త ప్రణాళికలు రచించు కుంటున్నారు. ఓడిన పార్టీలో గెలిచిన అభ్యర్థులు, 'జంప్‌జిలానీ' లవుతున్నారు. (జిలానీ పేరు గల వ్యక్తులు క్షమించాలి). ఎన్నికకు ముందు ఒక పార్టీ, ఎన్నికయ్యాక మరో పార్టీ, ఎవరు, ఎప్పుడు ఏ పార్టీలో ఉంటారో, ఏ పార్టీ ఎప్పుడు, ఏ పార్టీలో విలీనమవుతుందో, ఆ వ్యక్తులకూ, పార్టీలకూ కూడా తెలియనంత ఆకస్మిక సంఘటనలు. గెలిచిన పార్టీలోని అభ్యర్థులు మంత్రి పదవుల కోసం వేట ప్రారంభి స్తుంటే, అందులోని ఓడిన అభ్యర్థులు ఎంఎల్‌సి, కార్పొరేషన్ పదవుల కోసం వెంపర్లాడుతున్నారు.

వారి ప్రచారాన్ని భుజస్కందాన వేసుకొని వేల కోట్ల రూపాయలు పెట్టుబడి పెట్టిన స్వదేశీ, విదేశీ కార్పొరేట్ సంస్థలు తమ ప్రయోజనాల కు అనుకూలంగా విధానాల రూపకల్పన చేస్తూ, వాటిని సజావుగా అమలు చేసే ఎంపి, ఎంఎల్‌ఎలకు కేంద్ర, రాష్ట్ర మంత్రివర్గంలో బెర్త్ ఇప్పించే ప్రయత్నాలతో సతమతమవుతున్నాయి. ఇక వివిధ పార్టీల కార్యకర్తలు, గెలిచిన అభ్యర్థి ద్వారా కొంత మేరకైనా స్వప్రయో జనాలు ఈడేరుతాయా అనే యోచనలో ఉన్నారు.

మీడియా, పార్లమెంటరీ ఎన్నికల రూపును, స్వభావాన్ని పూర్తిగా మార్చి, అధ్యక్ష తరహా ఎన్నికలుగా రూపుదిద్దడంలో సఫలమైంది. ప్రజల్లో ఇంకా బలంగా ఉన్న భూస్వామ్య సంస్కృతిని, 'స్వామిభక్తి'ని చాలా నైపుణ్యంగా మలచుకొని తనకనవసరమైన అభ్యర్థిని దైవాంశ సంభూతునిగా తీర్చిదిద్దడంలో సఫలీకృతమైంది. ఎన్నికల సమయంలో 'ఆయనొస్తున్నాడు', ఇక ప్రజల జీవితం 'మూడు పూవులు – ఆరు కాయలుగా' వర్ధిల్లుతుందని ఎన్నికలలో, ఎన్ని'కల'లో సృష్టించారు. షరామామూలే – ప్రతి ఎన్నికల్లో లాగానే, ఈసారీ ప్రజలు ఓడిపోయారు. కార్పొరేట్ సామ్రాజ్యం గెలిచింది.

'నమో నమః'ను గెలిపించిన కార్పొరేట్ మీడియా, ఆయన ప్రమాణ స్వీకారాన్ని 'పట్టాభిషేకం' చేసింది. ఇప్పుడు దేశాన్ని పాలించేది ప్రధానమంత్రి కాదు, 'బాద్‌షా'. భారత్ బాద్‌షాకు ప్రణమిల్లుతూ పత్రిక అధిపతులు, 'శ్రుతి నీవు – గతి నీవు' అంటూ పాటనందుకుంటున్నారు. పార్లమెంటరీ ప్రజాస్వామ్య మేడిపండు బద్ధలైంది. ప్రజల ప్రయోజనాలకు 'కావలిక్కులా' (వాచ్‌డాగ్) గా ఉండాల్సిన మీడియా ఇంతగా దిగజారడం, పతనం కావడం ప్రజాస్వామ్యవాదులనే వారికి విచారం కలిగించ వచ్చేమో గాని, 'పోలీసుల రాజ్యంలో పోలింగ్ ఒక బూటకం, ఫాసిజం ఆడుతుంది ప్రజాస్వామ్య నాటకం' అన్న శ్రీశ్రీ అనుయాయిలకు, అభిమానులకు మాత్రం ఆశ్చర్యం కలిగించడం లేదు.

రాజ్యాంగ పరిషత్తులో డా. బాబాసాహెబ్ అంబేద్కర్ చేసిన హెచ్చరికను 'భక్తి ఇన్ రెలిజియన్ మే బి ఎ రోడ్ టు సాల్వేషన్, బట్ భక్తి ఇన్ పాలిటిక్స్ ఇజ్ ఎ ష్యూర్ రోడ్ టు డిగ్రెడేషన్' (మతంలో భక్తి అనేది మోక్షానికి దారి తీయవచ్చునేమో గాని, రాజకీయాల్లో భక్తి అనేది పతనానికి తప్పక దారి తీస్తుంది) దేశ రాజ్యాంగంపై విశ్వాసం ఉన్నవారు, అంబేద్కర్ అనుయాయిలుగా చెప్పుకుంటున్నవారు ఖాతరు చేయకపోవడం ఒక విషాదం.

సమాజ గతిని అర్థం చేసుకొని, ఆ విశ్లేషణతో సమాజ పురోగతికి దోహదం చేసే భావజాలాన్ని ప్రచారం చేస్తూ విధానాల అమలుకై ప్రభుత్వాలపై ఒత్తిడి చేయాల్సిన మధ్యతరగతి, విద్యావంతులూ, మేధావులూ, మీడియా ప్రచార హోరుకు సలాంకొట్టి, గులాములు అయ్యారంటే, వీరు మేధావులా లేక అమరుడు కామ్రేడ్ కెవిఆర్ అన్నట్లు 'మేమే తావులా' అనే అనుమానం రాకతప్పదు. కులం, మతం అన్ని వర్గాలపై ప్రభావం చూపిస్తే, ఇక పేదరికం, తక్షణ అవసరాలు, బీదలను ధన ప్రవాహంలో చీపురు పుల్లల చేశాయి. 'డబ్బుకు, సారాకు' లొంగిపోయిన పేద ప్రజల్ని ఈసడించుకునే మధ్యతరగతి, తాను కుల, వ్యక్తిగత ప్రయోజనాలకు దాసోహమైందనే విషయం గుర్తెరగదు. కుల ప్రయోజనాలకు 'ఆపద్బాంధవుల'కు తాకట్టుపెట్టి, తాను రాజ్యమేలాలి అనుకున్న కుల సంఘాల నాయకులూ పెత్తందారీ కుల నాయకుల మోచేతి నీళ్లు తాగడానికి సిద్ధం కావడం మరో విషాదం.

ఇక్కడ పక్షవాతం పాలైన పార్లమెంటరీ వామపక్షం గురించీ చెప్పుకోవాలి. ఏమాట కామాట చెప్పుకోవాలి. వారేమీ తమ దిగజారుడు తనాన్ని, సైద్ధాంతిక లేమిని దాచుకోలేదు. అన్ని పార్టీలతో కలిసి కూటమిగా కొన్ని సీట్లైనా సంపాదించాలి అనుకున్నారు. అవినీతికి ఆలవాలమైన కాంగ్రెస్‌తో ఒకరు జోడికడితే, అవినీతిలో అంతర్జాతీయ ఖ్యాతి పొందిన జగన్‌తో మరొకరు. కాని ఉభయ భ్రష్టత్వం దశాబ్దాల కిందట సిపిఎం గురించి, హైదరాబాద్ కార్పొరేషన్ ఎన్నికల ఫలితాల తర్వాత పతంజలి 'అన్నా సింగిల్ ఎంగిలి మెతుకేనా' అన్న వ్యాఖ్యానానికి కూడా పాపం సిపిఐ, సిపిఎం నోచుకోలేదు. సారీ కామ్రేడ్స్!

'జంప్ జిలానీలను' దానికి వారు చెపుతున్న కారణాలను 'తాను వృత్తి రాజకీయవాదిని కానని', 'తనవి ప్రవృత్తి రాజకీయాలని', 'నియోజక వర్గ ప్రజల ప్రయోజనాల కోసం పార్టీ మారానని' ఒకరంటే, 'తాను పార్టీ మారలేదని, అధికారం చేపట్టబోయే పార్టీలో అసోషియేట్ సభ్యురాలని' మరొకరు కుంటిసాకు చెపుతుంటే, దాన్ని ప్రజాస్వామ్యాన్ని భ్రష్టు పట్టిస్తున్న పనిగా చూడక, 'జగన్ ఝులక్'గా 'జనమే కాదు... నేతలూ నమ్మడం లేదు' లాంటి వ్యాఖ్యానాలతో పైశాచిక ఆనందం పొందుతున్న మీడియా, ఎంతటి దుర్గతి పాలైందోనని విచారం కలుగక మానదు. ఇక్కడే ఫెడరల్ వ్యవస్థ గురించి ఒకమాట. ప్రతిపక్ష ఎంపిలు, ఎంఎల్‌ఎలు తాము తమ నియోజకవర్గ ప్రజల కొరకు పాలకపక్ష పార్టీలో చేరుతున్నామని చెపుతుంటే, పాలకపక్ష పార్టీ వాళ్లు, కేంద్రంతో సఖ్యతగా

ఉండకపోతే రాష్ట్రానికి నిధులు రావని బెదిరిస్తున్నారు. అంటే, పేరుకే ఫెడరల్ అని ఆచరణలో కాదని, రాష్ట్రాలు కేంద్రం దృష్టిలో చివరకు మున్సిపాలిటీలు కూడా కాదు, గ్రామ పంచాయితీల స్థాయి కన్నా కిందికి దిగజారాయని అర్థమవు తుంది. పన్ను వసూలు రాష్ట్రాలది, వాటిపై అధికారం కేంద్రానిది. 'సొమ్మొకరిది, సోకొకరిది'. ఇదీ మన ప్రజాస్వామ్య డొల్లతనం.

శ్రీశ్రీ 'పెట్టుబడికి కట్టు కథలకు పుట్టిన విషపుత్రికలు' అన్నా 'వందకల్లల పంది పిల్లలు' అంటూ 1952 ఎన్నికల సమయంలో అంధపత్రిక, ఆంధ్రపత్రికపై చేసిన వ్యాఖ్యానం నేడు మన దిన పత్రికలన్నింటికీ వర్తిస్తుందనడంలో సందేహించాల్సిన అవసరం లేదు. పోగా, పందులూ, ఈ పత్రికలను తమ పిల్లలతోనే పోలిస్తే కోప్పడు తాయి. అవి వీధులను శుభ్రం చేస్తాయి. కాని, నేటి మీడియా ప్రజల మనసులను కలుషితం చేస్తున్నది. అయినా మీడియా నొక్కడాన్ని తప్పుపట్టడం సరికాదనిపిస్తుంది. 1980ల తర్వాత దేశంలో విస్తరించి, బలోపేతమైన వ్యాపార సంస్కృతి, సామ్రాజ్యవాద సంస్కృతి అన్ని రంగాలను ప్రభావితం చేసింది. భావజాల రంగంలో విలువల వ్యాప్తిని ప్రచారం చేయాల్సిన మధ్యతరగతి పూర్తిగా దిగజారడం ఇందుకు నిదర్శనం. వ్యక్తివాదం ముదరడంతో సమిష్టితత్వం కనుమరుగై, ప్రతి ఒక్కరిలో 'క్విడ్ ప్రొక్వొ' (నీకిస్తా-నాకేమిస్తావ్) అనే ఆలోచన స్థిరపడింది. ఉన్నతాదర్శాలు లుప్తమై, మధ్యతరగతి లక్ష్యాలు కేవలం తమ చుట్టే తిరుగుతున్నాయి. ఈ వాతావరణాన్ని చాలా నేర్పుగా తమ స్వంత ప్రయోజనాలకై వినియోగించుకోవడంలో రాజకీయ నాయకులూ, కార్పొరేట్ సంస్థలూ సఫలీకృతమయ్యాయని చెప్పవచ్చు.

అందుకే 'గుజరాత్ అభివృద్ధి', 'ప్రతి జిల్లా కేంద్రాన్ని హైదరాబాద్ గా మార్చడం' 'రాష్ట్రాన్ని సింగపూర్ చేయడం' లాంటి ప్రచారాలు యువతను భ్రమల్లో ఉంచాయి. గుజరాత్ చూసిన వారు గాని, ఒకవేళ చూసినా, అక్కడి దళితుల, మైనారిటీల, పేదల పరిస్థితులను తెలుసు కున్న వారు గాని ఎవరూ లేరు. ఇక రాష్ట్ర విషయానికి వస్తే 'సింగపూర్' తరహా అభివృద్ధి అది సాధ్యమా? దాని విస్తీర్ణమెంత, జనాభా ఎంత? అక్కడి భౌగోళిక పరిస్థితులు, చారిత్రక నేపథ్యం ఇవేమీ అధ్యయనం చేయకుండా, కనీసం తెలుసుకోకుండా, గతంలో ప్రపంచ బ్యాంక్ విధానాలను తు.చ. తప్పకుండా అమలు చేసి, తన తర్వాతి ముఖ్యమంత్రి రాజశేఖరరెడ్డికి మార్గదర్శకుడుగా నిలిచి, కార్పొరేట్ సంస్థల 'ముఖ్య కార్యనిర్వాహణాధికారి' (సిఇఒ)గా వ్యవహరించిన వ్యక్తి వాగ్దానాలను విద్యావంతులూ విశ్వసించడం దౌర్భాగ్యం, భావ దారిద్ర్యం కూడా. అయితే పార్లమెంటరీ వ్యవస్థలో ప్రత్యామ్నాయాన్ని ఆశించడం అమాయకత్వమే. ఎన్నికల అనంతరం, అవే మాటలు, రాష్ట్రంలో ప్రధాన ఉపాధి కల్పనారంగం, మెజారిటీ ప్రజల బతుకు దెరువు అయిన వ్యవసాయాన్ని గురించి గాని, దానికి దోహదం చేసే నీటిపారుదల గురించి గాని ఎవరూ మాట్లాడడం లేదు. సామాన్య రైతు ఎటూ మాట్లాడలేడు. ఆకాశం వైపు చూడడం తప్ప, మరేమీ చేయలేని దుస్థితి. ఇక యువత, విద్యావంతులు, ఉద్యోగులు అందరూ సింగపూర్ నిర్మాణ కోసం ఎదురు చూస్తున్నారు. కాంట్రాక్టర్లు, రియల్ ఎస్టేట్ వ్యాపారస్తుల మాట సరేసరి!

'నెటిజెన్స్' వాళ్లెటూ 'సిటిజెన్స్' మధ్యన ఉండరు కనుక వాళ్లనలా వదిలేద్దాం. కాని, ప్రగతిశీల శక్తులు, తప్పుడు ప్రచారాల్ని వ్యాప్తి చెందకుండా నిరోధించడంలో విఫలమయ్యారు. హిందూత్వ అనేది కేవలం మత సంబంధమైనదని, అది కేవలం ముస్లింల వ్యతిరేకమని సెక్యులరిస్టు శక్తులు భావిస్తున్నంత కాలం, హిందువులలోని అణగారిన వర్గాల మద్దతు పొందలేరు. మోడీ చాలా తెలివిగా వెనుకబడిన కులాల కార్డును స్వప్రయోజనం కోసం వినియోగించుకున్నాడు. అందుకే బీహార్, ఉత్తరప్రదేశ్‌లలో అత్యధిక ఓట్లు కొల్లగొట్టగలిగాడు. రెండు చోట్ల కుల రాజకీయాలు ఓడిపోయాయి. మత రాజకీయాలు 'మనమంతా హిందువులం – సింధుజాతి బిందువులం' గెలిచాయి. మాయావతి ఘోరంగా ఓడిపోవడం వెనుక కుల రాజకీయాలపై మత రాజకీయాలు ఆధిపత్యం సాధించడమే. ఆ విషయంలో మాయావతికి తోడుగా, ములాయంసింగ్, లల్లూ, నితీష్‌లను చేర్చాలి.

హిందూ మతానికి కుల వ్యవస్థ పునాదని, కులాల నిచ్చెన మెట్లపై బ్రహ్మణీకరణ చెందిన శూద్రులను మాత్రమే ఆహ్వానిస్తుందనే విషయాన్ని ఎవరూ ప్రచారం చేయలేకపోయారు. సామాజిక అంతరాలను పోషించే, హిందూత్వ అభివృద్ధి అజెండా కూడా ఆర్థిక రంగంలో కూడా అంతరాలను పెంచి పోషిస్తుందనే వాస్తవాన్ని సామాన్య ప్రజలు గుర్తెరిగేలా చేయకపోవడం ప్రగతిశీల శక్తుల వైఫల్యమే. అత్యంత పేదరికంలో మగ్గుతున్న ప్రజలకు 'మతతత్వం' అనేది అర్థరహితమైన విషయం. వీరికి ప్రధానంగా కావాల్సింది కూడు, గూడు, గుడ్డ. గత దశాబ్దాల కాలంగా, సెక్యులరిజం పేరుతో ఓట్లు దండుకొని, కోట్లను వెనకేసుకున్న వ్యక్తుల పట్ల, పార్టీల పట్ల ఏహ్యాభావం. 'అభివృద్ధి' అనే మేడిపండు, ఆకలిగొన్న వానికి ఆకర్షణీయంగానే కన్పిస్తుంది. ఆబగా తింటాడు కూడా. అందుకే 'ధనం' ఎన్నికల్లో ప్రధాన పాత్ర వహించింది కూడా. మా మిత్రుడన్నట్లు ఎన్నిసార్లు ఎన్నికలు జరిగితే అంతగా సాధారణ ప్రజలకు మేలు కలుగుతుంది. ఎన్నికల ముందు ప్రచార సామాగ్రి తయారు చేసేవాళ్లు, గోడరాతలు రాసేవాళ్లు, ముద్రణాలయ కార్మికులు, ప్రచారం చేసే చిన్నాచితక జనానికి రెండు పూటలా కడుపునిండా తిండి లభిస్తుంది. దాచిపెట్టిన 'నల్లధనం' బయటికి వస్తుంది. ప్రజలకుపయోగపడే అభివృద్ధి పనులు ఎటూ జరగవు కాబట్టి, పదవీకాలం తక్కువ ఉంటే, మన సోకాల్డ్ ప్రజా ప్రతినిధులూ అభివృద్ధి చెందే అవకాశాలు తక్కువ. ఇలాంటి ప్రజాస్వామ్యంలో ఇది చక్కని ఆలోచనే అనిపిస్తుంది.

సంపూర్ణమైన మెజారిటీ వచ్చింది కాబట్టి, అదానీలు, అంబానీలు, ఇతర స్వదేశీ, విదేశీ కార్పొరేట్ల అభివృద్ధి వేగవంతమవుతుంది. సంస్కరణల రెండవదశ అమలు వేగవంతమవుతుంది. అన్ని రంగాలలో ప్రైవేటీకరణ మరింత పుంజుకుంటుంది. పేద ప్రజలకు ఈ మాత్రమైన అందుతున్న సబ్సిడీలు తగ్గి, కార్పొరేట్ సంస్థలకు రాయితీలు పెరుగుతాయి. స్టాక్ మార్కెట్ ఆకాశానికి ఎగబాకుతూ ఉన్నత, ఉన్నత మధ్యతరగతి వర్గాలకు ఆనందం చేకూరుస్తుంది. ప్రజా పోరాటాలపై ఉక్కుపాదం 'జల్ జంగిల్ జమీన్'లకై జరుగుతున్న ఉద్యమాలు పాశవికంగా అణచబడతాయి. బుల్లెట్ రైళ్లు, బుల్లెట్ ప్రూఫ్ కార్లు విరివిగా కనపడతాయి. సామాన్యుని బతుకు చిందర వందరమవుతుంది. పై అస్తవ్యస్త, అంధకార పరిస్థితులలో, దండకారణ్య ఆదివాసుల పోరాటాలే అందరికీ నమూనా మార్గమవక తప్పదు. 'కాళరాత్రి తర్వాత కూడా సూర్యోదయం ఉంటుంది'. ఆ సూర్యుల కోసం నిష్క్రియాపరులుగా వేచిచూడక, ప్రజలపక్షాన నిలిచే బుద్ధిజీవులు భావజాల రంగంలో చిరు దివ్వెలుగా వెలగాల్సిన సమయమిది–లేకపోతే చరిత్ర మనల్ని క్షమించదు.

*(రచయిత రాయలసీమ విద్యావంతుల వేదిక సభ్యులు)* వీ

# తెలంగాణ ఉద్యమ విజయ వైఫల్యాలు

*మలిదశ తెలంగాణ ఉద్యమం ప్రజాకాంక్షలకు విజయం సాధించి పెట్టడంలో ఏ కృషి చేసిందో, చేయవలసిందేమిటో వివరిస్తున్నారు* **శ్రీధర్ దేశ్‌పాండే**

**1956** నవంబర్ ఒకటి తెలంగాణ చరిత్రలో ఒక దుర్దినం. అప్పటిదాకా తెలంగాణకు ఉన్న స్వతంత్ర రాజకీయ అస్తిత్వం ఆనాటితో అంతమైంది. తెలంగాణలో సీమాంధ్ర వలసాధిపత్యం ఆరంభమైంది. విలీనం ఎందువల్ల జరిగింది? విలీన విద్రోహ రాజకీయాల గురించి చాలానే చర్చించుకున్నాం. ఇప్పుడు తెలంగాణలో ఆ సంగతులు తెలియనివారు ఎవరూ ఉండరు. తెలంగాణ రాష్ట్ర ఆకాంక్షకు ఉన్న ప్రాతిపదికలను చర్చించుకున్నాం. ఇవాళ తెలంగాణ సీమాంధ్ర వలస పాలన నుండి విముక్తం అయి తిరిగి స్వతంత్ర రాజకీయ అస్తిత్వాన్ని, స్వయంపాలనని సంపాదించు కున్న వేళ తెలంగాణ రాష్ట్ర ఆకాంక్షకు ఉన్న ప్రాతిపదికలను మరొక్కసారి మననం చేసుకోవడం అవసరం. ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమం రాజకీయంగా సఫలమైన వేళ ఈ 20 ఏండ్ల మలిదశ ఉద్యమం సాధించిన గుణాత్మకమైన ఫలితాలను మదింపు చేసుకోవాల్సి ఉన్నది. వాటిని మరింత ఉన్నతీకరించుకోవడంతో పాటు ఆ విలువలను స్థిరీకరించుకోవాలి కూడా.

**తాత్విక భూమిక**

తెలంగాణ స్వయంపాలన ఆకాంక్షను ఒక అభివృద్ధి సమస్యగా కుదించేసి ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షను చిదిమేసే ప్రయత్నం సీమాంధ్ర పాలక వర్గాలు చేస్తున్నప్పుడు ఉద్యమం ఆ అభివృద్ధి వాదనని ఖండిస్తూ ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షకు ఉన్న ప్రాతిపదికలను చర్చకు పెట్టింది. 1. తెలంగాణకు ఒక సహస్రాబ్ది కాలం పాటు ప్రత్యేక, స్వతంత్ర రాజకీయ అస్తిత్వం ఉన్నది. 2. తెలంగాణకు ప్రత్యేక భాషా సాంస్కృతిక అస్తిత్వం ఉన్నది. 3. తెలంగాణలో గత 60 ఏండ్లుగా వలస దోపిడి ఉన్నది. 4. తెలంగాణలో సాంస్కృతిక వలసీకరణ అమలవుతున్నది.

పైన పేర్కొన్న ప్రాతిపదికల ఆధారంగా తెలంగాణ ఉద్యమ తాత్విక భూమిక లేదా సైద్ధాంతిక భావన నిర్మాణం అయింది. తెలంగాణ తను కోల్పోయిన స్వతంత్ర రాజకీయ అస్తిత్వాన్ని తిరిగి పొందాలను కుంటున్నది. తెలంగాణ తన ప్రత్యేక భాషా సాంస్కృతిక అస్తిత్వాన్ని పరిరక్షించుకోవాలనుకుంటున్నది. రాజ్యాధికారం ఉంటేనే తెలంగాణలో వనరుల దోపిడిని అంతం చేయవచ్చు, సాంస్కృతిక వలసీకరణను నిలువరించవచ్చు. ప్రత్యేక భాషా సాంస్కృతిక అస్తిత్వాన్ని తిరిగి నిలబెట్టుకోవచ్చు. ప్రొ. జయశంకర్ తెలంగాణ ఉద్యమానికి – నీళ్లు – నిధులు – నియామకాలు – అన్న నినాదాన్ని ట్యాగ్‌లైన్‌గా అందించినాడు. ఆ ట్యాగ్‌లైన్‌ని గద్దర్ తెలంగాణ రాజకీయ ఆర్థిక నినాదంగా మార్చినాడు. – మా నీళ్లు మాగ్గావాలే – మా నిధులు మాగ్గావాలే – మా ఉద్యోగాలు మాగ్గావాలే – మా భూములు మాగ్గావాలే – మా బొగ్గు మాగ్గావాలే… అందుకే మా తెలంగాణ మాగ్గావాలే – తెలంగాణ పోలిటికల్ ఎకానమీ అంతా ఆ నినాదంలో ఉన్నది. ప్రజలకు తెలంగాణ పొలిటికల్ ఎకానమీ చాలా స్పష్టంగానే ఆ నినాదం ద్వారా అర్థమైంది. తెలంగాణ బుద్ధిజీవులు తమ సృజనాత్మకతకు పని చెప్పి అద్భుతమైన ప్రతీకలను అందించినారు. తెలంగాణ కవులు, రచయితలు, బుద్ధిజీవులు తెలంగాణ ఉద్యమానికి ఒక బలమైన తాత్విక భూమికను ఏర్పర్చినారు. 1969 ఉద్యమానికి ఇటువంటి తాత్విక భూమిక లేకపోవడం చేత పాల పొంగులాగా లేచిన ఉద్యమం రాజకీయ విద్రోహం వలన నీళ్లు చల్లితే పాల పొంగు చల్లారి పోయినట్లు కుప్పకూలిపోయింది. మళ్లీ అది లేవడానికి 25 ఏండ్లు పట్టింది. ఈ 25 ఏండ్ల కాలంలో తెలంగాణ ఉద్యమదీపం ఆరిపోకుండా చేతులు అడ్డంపెట్టి కాపాడిన వ్యక్తుల్లో ప్రొ. జయశంకర్, ప్రొ. కేశవరావ్ జాదవ్‌లు ప్రముఖులు. తెలంగాణ ఇన్ఫర్మేషన్ ట్రస్ట్‌ను స్థాపించిన ప్రభాకర్, ప్రొ. హరినాథ్ తదితరులు మలిదశ ఉద్యమం రాజుకోవడానికి నిప్పును కాపాడినారు. తెలంగాణ మలి దశ ఉద్యమం 1969 ఉద్యమ వైఫల్యాల నుంచి గుణపాఠాలు నేర్చుకొన్నది. ఉద్యమానికి ప్రజా పునాది లేకపోతే అది సుదీర్ఘకాలం నిలబడలేదు అన్న సత్యాన్ని ప్రొ. జయశంకర్ గ్రహించి నారు. అందుకే మలిదశ ఉద్యమానికి ఒక బలమైన సైద్ధాంతిక భావన, ఒక స్పష్టమైన కార్యాచరణ రూపొందించినాడు. తెలంగాణ ఉద్యమానికి తాత్విక లేదా సైద్ధాంతిక భూమికను కల్పించడానికి ఆయన చేసిన కృషి అనితర సాధ్యమైనది.

ప్రొ. జయశంకర్ ఉద్యమానికి మూడు అంచెల కార్యాచరణని ప్రతిపాదించినాడు. 1. భావ ప్రచారం. 2. ఉద్యమం 3. రాజకీయ ప్రక్రియ. 1996లో పునరుజ్జీవనం పొందిన తెలంగాణ ఉద్యమం తొలి రోజుల్లో భావ ప్రచారాన్ని విస్తృతంగా చేపట్టింది. సభలు, సమావేశాలు, సదస్సులు, కరపత్రాలు, పుస్తకాల ప్రచురణ, సాంస్కృతిక దళాల నిర్మాణం. ఈ కార్యకలాపాల వలన 2001 నాటికి తెలంగాణ సాధన కోసమే ఒక రాజకీయ పార్టీ ఏర్పాటు కావడానికి ఒక నేపథ్యం ఏర్పడింది. తెలంగాణ జన సభ, తెలంగాణ మహాసభ, తెలంగాణ స్టూడెంట్స్ ఫ్రంట్, సెంటర్ ఫర్ తెలంగాణ స్టడీస్ మొదలైన సంస్థలు తొలి నాటి ఉద్యమానికి వేదికలైనాయి. ఆ పునాది మీదనే తెలంగాణ రాష్ట్ర సమితి (టిఆర్ఎస్) ఆవిర్భవించిందని చెప్పడానికి ఎవరికి అభ్యంతరం ఉండనవసరం లేదు. టిఆర్ఎస్ ఆవిర్భావం తర్వాత తెలంగాణ ఉద్యమం గుణాత్మకమైన మలుపు తీసుకున్నది. అప్పటి దాకా రాజ్యం అమలు చేసిన తీవ్ర నిర్బంధానికి గురై తెలంగాణలో ప్రజా సంఘాలు పని చేయలేని పరిస్థితిలో టిఆర్ఎస్ ఆవిర్భావంతో తెలంగాణ ఉద్యమ రాజకీయ కార్యకలాపాలకు ఒక ప్రజాస్వామిక వాతావరణం ఏర్పడింది. కొత్త తెలంగాణ ప్రజా సంఘాల ఏర్పాటుకు వెసులుబాటు ఏర్పడింది. 2001 తర్వాత అట్లా ఏర్పడిన తొలి ప్రజా సంఘాల్లో తెలంగాణ రచయితల వేదిక, తెలంగాణ సాంస్కృతిక వేదిక, తెలంగాణ ఉద్యోగుల సంఘం, తెలంగాణ విద్యావంతుల వేదిక, తెలంగాణ ఐక్య వేదిక, తెలంగాణ జర్నలిస్టుల ఫోరం చెప్పుకోదగ్గవి. రచయితల వేదిక, సాంస్కృతిక వేదికలు సాంస్కృతిక రంగంలో, తెలంగాణ ఉద్యోగుల సంఘం ఉద్యోగ రంగంలో, తెలంగాణ విద్యావంతుల వేదిక, తెలంగాణ ఐక్య వేదిక మరింత విస్తృతంగా తెలంగాణ రాజకీయ, సామాజిక అంశాల్లో తమ

కృషిని కొనసాగించినాయి. పత్రికల్లో పని చేస్తున్న తెలంగాణ జర్నలిస్టులు మెనేజ్‌మెంట్ తరపు నుంచి ఆంక్షలు, పరిమితులు ఎన్ని ఉన్నా తెలంగాణ ఉద్యమ వార్తలను ప్రచురించినారు. ఎడిటర్లుగా ఉన్నవారు సాధ్యమైనంత మేరకు తెలంగాణ వార్తలకు, వ్యాసాలకు చోటు కల్పించారు. వాళ్లు స్వయంగా భావజాల ప్రచారం చేసినారు. ఆ తర్వాత అనేక ప్రజా సంఘాలు ఆవిర్భవించి తెలంగాణ భావ ప్రచారానికి, ఉద్యమానికి గణనీయంగా దోహదం చేసినాయి. ఈ సంఘాలలోని నాయకులు, ప్రజా ఉద్యమంలో ఉన్న అనేక మంది మేధావులు తమ ప్రభావశీలమైన ఉపన్యాసాల ద్వారా చేసిన భావ ప్రచారం, ఉద్యమానికి కల్పించిన సైద్ధాంతిక భూమిక ప్రత్యేకంగా స్మరించుకోదగినది.

తెలంగాణ భావప్రచారానికి అనేక పద్ధతులను ప్రజలు వినియోగించు కున్నారు. నెటిజన్లు ఫేస్‌బుక్, ట్విట్టర్ లాంటి సోషల్ మీడియాల ద్వారా, మిషన్ తెలంగాణ వెబ్‌సైట్ ద్వారా, మూసీ టివి డాట్ కాం ద్వారా, టిడిఎఫ్ ఈ మెయిల్ గ్రూప్ చర్చల ద్వారా, టిఆర్‌సి వారు ప్రతి శనివారం నిర్వహిస్తున్న చర్చా కార్యక్రమాలు, డిస్కవర్ తెలంగాణ, తెలంగాణ డాట్ ఒఆర్‌జి, మన తెలంగాణ వంటి వెబ్‌సైట్లు తెలంగాణ భావ ప్రచారానికి వేదికలైనాయి.

ఈ ప్రక్రియ అంతా తెలంగాణ ఉద్యమానికి బలమైన తాత్విక, సైద్ధాంతిక భూమికను కల్పించింది. దీని ఫలితంగా ప్రజలు ఉద్యమ కార్యాచరణలోనికి వచ్చినారు. ఉద్యమానికి ప్రజా పునాదిని ఏర్పర్చింది. అటు రాజకీయరంగంలో టిఆర్‌ఎస్ కృషి, ఇటు ప్రజా క్షేత్రంలో భావప్రచారం, ఉద్యమ కార్యాచరణ తెలంగాణ ఏర్పాటుకు అంతిమ మెట్టు అయిన రాజకీయ ప్రక్రియను వేగవంతం చేసింది. 2009లో కెసిఆర్ ఆమరణ దీక్ష అనంతరం తెలంగాణలో భావ ప్రచారం – ఉద్యమం – రాజకీయ ప్రక్రియ ఏకకాలంలో కొనసాగడం ఇటీవలి చరిత్ర. అంతిమంగా 2014 మార్చిలో రాష్ట్ర విభజన బిల్లు ఆమోదం పొందడంతో తెలంగాణ ప్రజల 60 ఏండ్ల కల సాకారం అయినట్లైంది.

### సాంస్కృతిక పునరుజ్జీవనం

20 ఏండ్ల మలిదశ ఉద్యమం తెలంగాణ అంతటా ఒక సాంస్కృతిక పునరుజ్జీవనానికి ఊపిరి పోసింది. జాతీయ ఉద్యమం సందర్భంగా దేశ వ్యాప్తంగా వందేమాతరం – నినాదం ప్రజల్లో ఎటువంటి ఉత్తేజాన్ని నింపిందో జై తెలంగాణ నినాదం కూడా అట్లనే తెలంగాణను తట్టి లేపింది. మరుగున పడిపోయిన చరిత్రను తవ్వి తీయడానికి అనేక మంది చరిత్ర పరిశోధకులు పలుగూ పారా పట్టుకొని పురా తవ్వకాలు చేసి ఘనమైన తెలంగాణ చరిత్రను వెలికి తీసినారు. తెలంగాణ వైతాళికులు అనేక మంది వెలుగులోకి వచ్చినారు. తెలంగాణపై మగ్దూం చెప్పిన – ఇంక్విలాబ్ కా పైగంబర్ తెలంగాణ, దాశరథి చెప్పిన – నా తెలంగాణ కోటి రతనాల వీణ, కాళోజీ చెప్పిన – మాటొక్కటి భాషొక్కటి, భారతాన వెలసి నిలుచు తెలంగాణ – అన్న కవితా పాదాలు ప్రజల్లో విస్తృతంగా ప్రచారం పొందినాయి. దాశరథి కవితా పాదాలను అన్వయించి సాగునీటి ఇంజనీర్లు – మా తెలంగాణం కోటి ఎకరాల మాగాణం – అన్న నినాదాన్ని రూపొందించారు. ఆ నినాదమే ఇవాళ ప్రభుత్వానికి ఒక ప్రధాన ఎజెండాగా మారింది. ఈ క్రమంలో తెలంగాణ చరిత్ర, తెలంగాణ సాహిత్య చరిత్ర, నిజామాంధ్ర మహాసభల చరిత్ర, హైదరాబాద్ విమోచనా చరిత్ర, దానిపై భిన్న దృక్పథాలు, హైదరాబాద్ రాజ్యంపై పోలీస్ చర్య పేరుతో జరిగిన సైనిక చర్యపై ప్రత్యక్ష కథనాలు, ఆపరేషన్ పోలో సందర్భంగా ముస్లింలపై జరిగిన ఊచకోతపై పండిట్ సుందర్ లాల్ నివేదిక, 1969 ఉద్యమ చరిత్ర, ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు విద్రోహ చరిత్ర, భారత రాష్ట్రాల ఏర్పాటు పరిణామ చరిత్ర. ఇట్లా తెలంగాణ చరిత్రపై ప్రభావశీలమైన పుస్తకాలు వెలువడినాయి. మల్లెపల్లి లక్ష్మీరాజం మెమోరియల్ ట్రస్ట్ వారు ప్రొ. జయశంకర్ – తెలంగాణలో ఏం జరుగుతోంది – పుస్తకం తెలంగాణ సమాజాన్ని జాగృతం చేయడం లో అనితరసాధ్యమైన పాత్రను పోషించింది. తెలంగాణ విద్యావంతుల వేదిక ప్రచురించిన – కమ్యూనిజమా – కోస్తావాదమా సిపిఎం తెలంగాణ వ్యతిరేక వైఖరిపై వ్యాసాల పుస్తకం వామపక్షాలపై, ముఖ్యంగా సిపిఐ, న్యూ డెమోక్రసీలపై తీవ్ర ప్రభావాన్ని కలుగజేసింది. ఆ పార్టీలు తెలంగాణపై తమ వైఖరిని మార్చుకోవడంలో దోహదం చేసింది. తెలంగాణ విద్యావంతుల వేదిక ప్రచురించిన ఆర్. విద్యాసాగర్ రావు నీళ్లు–నిజాలు పుస్తకం నీటి దోపిడి రాజకీయాలను ప్రజలకు వివరించడం లో సఫలమైంది. తలాపున గోదావరి, కృష్ణా నదులు పారుతున్నా తెలంగాణకు న్యాయంగా అందవలసిన నీటి వాటా ఎందుకు అందడం లేదో ఆయన వ్యాసాలు, ప్రసంగాలు ప్రజలకు విప్పి చెప్పినాయి.

సీమాంధ్ర సాంస్కృతిక వలసీకరణలో అవహేళనకు, చిన్న చూపుకు బలి అవుతున్న తెలంగాణ భాషను సాహిత్య భాషగా మన కవులు, కథా రచయితలు నిలబెట్టినారు. మట్టిగొట్టుక పోయిన అద్భుత పద సంపదను, మన పలుకుబడులను, మన సామెతలను పని గట్టుకొని వెలికి తీసినారు. నలిమెల భాస్కర్ 'తెలంగాణ పదకోశం', రవ్వా శ్రీహరి 'నల్లగొండ జిల్లా మాండలిక పదకోశం', వేముల పెరుమాళ్లు రాసిన 'తెలంగాణ సామెతలు' తదితర పుస్తకాలు తెలంగాణ భాష సాహిత్య భాషగా స్థిరపడడానికి దోహదం చేసినాయి. ఒకవైపు సాంస్కృతిక సామ్రాజ్యవాదం మరొక వైపు అంతర్గత సాంస్కృతిక వలసవాదం దెబ్బకు అనేక జానపద కళారూపాలు అంతరించిపోయినాయి. తమలో ఉన్న అంతర్గత శక్తి వలన కొన ఊపిరితో బతికి ఉన్న కళారూపాలు చావుకు దగ్గరైనాయి. ఉద్యమం సందర్భంగా వీటన్నిటికి ప్రాణ ప్రతిష్ట జరిగింది. అపురూపమైన తెలంగాణ జానపద కళారూపాలు తిరిగి ప్రజలకు దగ్గరైనాయి. వందలాది జానపద బాణీలు తెలంగాణ ఉద్యమ పాటలకు బాణీలైనాయి. ఒగ్గు కళాకారులు చుక్కా సత్తయ్య, మిద్దె రాములు, చిందు కళాకారిణి చిందుల ఎల్లమ్మలను తెలంగాణ సాంస్కృతిక ప్రతీకలుగా ఉద్యమం నిలబెట్టింది. వందలాది మంది ప్రతిభావంతులైన పాట కవులను వెలికితీసింది. ప్రతి గ్రామంలో గోసి గొంగడి కళాకారు లను ఉద్యమం తయారు చేసుకున్నది. ఎందరో కళాకారులు అద్భుతమైన కళా ప్రదర్శనలతో, రూపకాలతో, ఆటా పాటలతో, ధూంధాంలతో తెలంగాణ జనాన్ని ఉద్యమ బాటలోకి నడిపినారు. తెలంగాణ సాంస్కృతిక ఉద్యమంలో అమరులైన 'తెలంగాణ కళా సమితి' వ్యవస్థాపకులు బెల్లి లలిత, ఐలయ్య సదా స్మరణీయులు. ఈ కళాకారుల ధూంధాంలు, ఆటా పాటా కార్యక్రమాలు తెలంగాణ గ్రామాలను, పట్టణాలను కదిలించి ఉద్యమ బాటను ఎక్కించినారు. క్రమంలో తెలంగాణలో వందలాది పాటల క్యాసెట్లు, సిడిలు వెలువడినాయి. వందలాది కవితా, కథా సంకలనాలు ప్రచురణ అయినాయి. జూలూరి గౌరిశంకర్ ప్రచురించిన పొక్కిలి, తెలంగాణ సాంస్కృతిక వేదిక ప్రచురించిన మత్తడి, ఇటీవలే వెలువడిన మునుం, జిగర్, ఊపిరి, 69–73 తెలంగాణ ఉద్యమ కవితా సంకలనాలు తెలంగాణ కవుల ఉద్యమ చైతన్యానికి గీటురాయిగా నిలచినాయి. తెలంగాణ సాంస్కృతిక వేదిక వారే ప్రచురించిన తెలంగాణ తొవ్వలు పుస్తకం ఆనాడు ఒక సంచలనం. ఈ ఉద్యమ కాలంలోనే పెద్దింటి అశోక్‌కుమార్ భారతీయ కథా సాహిత్యంలో రచయితగా సుస్థిరంగా నిలబడడం గర్వ కారణం. వాసిరెడ్డి నవీన్, పాపినేని శివశంకర్ సంపాదకులుగా గత పుష్కర కాలంగా వెలువరిస్తున్న కథా సంకలనాల్లో తెలంగాణ కథలకు ప్రాతినిధ్యం తగినంతగా లేకపోవడంతో కర్ర ఎల్లారెడ్డి తెలంగాణ కథా సంకలనాలు ప్రచురించి ఎందరో మెరికల్లాంటి తెలంగాణ కథా రచయితలను తెలుగు కథా సాహిత్యానికి పరిచయం చేసినాడు.

ఈ సాంస్కృతిక వెల్లువలో చిత్రకారులు, కార్టూనిస్టులు తమవంతు కృషి చేసినారు. వివిధ పత్రికల్లో పని చేస్తున్న కార్టూనిస్టులను కూడా ఉద్యమం తయారు చేసుకున్నది. శేఖర్ వేసిన ఉద్యమ కార్టూన్లు అందరి ప్రశంసలు పొందినాయి. ఫోటోగ్రాఫర్లు తెలంగాణ జీవనాన్ని, సాంస్కృతిక ఔన్నత్యాన్ని అద్భుతంగా కెమెరా కంటితో రికార్డు చేసినారు. ఇదే కాలంలో తెలంగాణ సినిమా కూడా తన ఉనికిని చాటుకున్నది. సినిమాల్లో తెలంగాణ భాషను గూండాలకు, రౌడీలకు, సంఘ విద్రోహ శక్తులకు వాడడాన్ని ఉద్యమం తీవ్రంగా నిరసించింది. తెలంగాణ సినిమా రంగం మీదకు రావడానికి ఉద్యమ వాతావరణం ఎంతగానో దోహదం చేసింది.

ఈ సాంస్కృతిక వెల్లువలో భాగంగానే బతుకమ్మ పునరుజ్జీవనం పొందడం, బోనాల పండుగ, పీర్ల పండుగ, నాగోబా జాతర, సమ్మక్క సారలమ్మ జాతర, కొమురవెల్లి జాతర, ఏడుపాయల జాతర, తెలంగాణలో ఉన్న దేవాలయాలు, పర్యాటక ప్రదేశాలు, జలపాతాలు, సాంస్కృతిక విశేషాలు అన్నీ వెలుగులోకి వచ్చినాయి. టిఆర్ఎస్ పార్టీ నిజాం కాలేజీ మైదానంలో ఏర్పాటు చేసిన తెలంగాణ సంబురాలు ఒక సంచలనం. ఒక అపురూప సంరంభం. అక్కడ ప్రదర్శింపబడిన కళారూపాలు ప్రజలకు కనువిందు చేసినాయి. తెలంగాణ వంటకాల రుచి ఆహా అనిపించింది. జొన్నరొట్టే, జొన్న గట్కా, పచ్చి పులుసు, సకినాలు, అప్పాలు, పత్తర్ కా గోష్, మేక తలకాయ కూర ప్రజలు సగర్వంగా ఆరగించినారు. ఇక అప్పటి నుండి అన్నీ ఉద్యమ సభల సందర్భంగా భోజనాల్లో జొన్న రొట్టె, జొన్న గట్కా, పచ్చి పులుసు మెనూలో తప్పనిసరి అయినాయి.

ఉద్యమ అవసరాల కోసమే తెలంగాణకు ఒక పత్రిక (నమస్తే తెలంగాణ), ఆదివారం సంచికకు బతుకమ్మ అని పెట్టడం తెలంగాణ అస్తిత్వ భావనలో భాగమే. తెలంగాణ ఉద్యమ తొలినాళ్లలో తెలంగాణ రచయితల వేదిక ప్రచురించిన తెలంగాణ సోయి, తెలంగాణ విద్యావంతుల వేదిక ప్రచురించిన తెలంగాణ టైమ్స్ పత్రికలు గొప్ప ప్రభావాన్ని కలుగచేసినాయి. ఆ పత్రికలు అనివార్య కారణాల వలన నిలిచిపోయినా ఆ తర్వాత నడుస్తున్న తెలంగాణ, దెక్కన్ ల్యాండ్ పత్రికలు నిలదొక్కుకొని తెలంగాణ ఉద్యమ చైతన్యాన్ని వ్యాప్తి చేస్తున్నాయి. తెలంగాణపై నలువైపుల నుండి ఏకదాటిగా విషం చిమ్ముతున్న సీమాంధ్ర టివి చానళ్ల థాట్ పోలిసింగ్‌ని నిలువరించ దానికి తెలంగాణ టివి చానళ్ల అవసరాన్ని తెలంగాణ పెట్టుబడి దారులు కొంత మేరకు తీర్చగలిగినారు. టి న్యూస్, వి6, హెచ్ఎంటివి వంటి శాటిలైట్ ఛానళ్లు, టిఎన్ఎన్, దక్కన్ టివి లాంటి కేబుల్ ఛానళ్లు తెలంగాణ ఆకాంక్షను ఎత్తిపట్టినాయి. సీమాంధ్రుల కుట్రలను, తప్పుడు ప్రచారాలను ఎప్పటికప్పుడు భగ్నం చేసినాయి.

స్థూలంగా వ్యాఖ్యానించినప్పుడు ఈ 20 ఏండ్లల్లో తెలంగాణలో కనిపించిన సాంస్కృతిక పునరుజ్జీవనం లేదా సాంస్కృతిక వెల్లువ దేశంలో మరెక్కడా కానరాదు. ఇది ఉద్యమం సాధించిన అద్భుతమైన ప్రజా విజయంగా చెప్పుకోవచ్చు. అణగారిపోయిన ఒక జాతి లేచి నిలబడి తనని తాను నిలబెట్టుకున్న అపురూపమైన చారిత్రక సంఘటన ఈ తెలంగాణ సాంస్కృతిక పునరుజ్జీవన ఉద్యమం.

**తెలంగాణ జాతి భావన**

తెలంగాణోల్లం మేమంతా ఒక్కటే అన్న భావన ఉద్యమం సందర్భంగా ఉన్నతంగా వ్యక్తమైంది. తెలంగాణకు సంబంధించిన దేనినైనా ఎత్తిపట్టడం, తెలంగాణేతరమైన దాన్ని తిరస్కరించడం అతివాదంగా కనిపించినా అస్తిత్వ ఉద్యమాలకు ఉండే సహజ లక్షణంగా మాత్రమే దాన్ని చూడాలి. తెలంగాణ రాష్ట్ర ఆకాంక్ష నెరవేరింది కనుక ఇప్పుడు విచక్షణతో ఏది మంచి ఏది చెడు, మనలో తిరస్కరించ వలసినది, పరిహరించుకోవలసినది ఏమిటి బేరీజు వేసుకోవాల్సిన సమయం. ఈ ఉద్యమ సందర్భంలో వ్యక్తమైన సామూహిక భావన, తామంతా ఒక్కటే అన్న జాతి భావనని మరింత ఉన్నతీకరించుకోవలసి ఉన్నది. కుల మతాలకు, సామాజిక హోదాలకు అతీతంగా ఉద్యమంలో వ్యక్తం అయిన సోదర భావం నిజంగా అపూర్వం. తెలంగాణలో శతాబ్దాలుగా ప్రజల ఆచరణలో ఉన్న సంబోధనలు – అన్నా, తమ్మి, బిడ్డా, ఏమె, రావే, పోవే – ఇటువంటివి సర్వ సాధారణమైన సంబోధనలుగా వయసుతో, సామాజిక హోదాతో నిమిత్తం లేకుండా స్థిరపడిపోయినాయి. ఇక్కడ అటువంటి కొన్ని అనుభవాలను పంచు కోవడం వాటిని కొనసాగించుకోవడానికి, ఉన్నతీకరించుకోవడానికి ఉపకరిస్తాయి.

ఎర్రమంజిల్‌లో ఉన్న సాగునీటి శాఖ ప్రధాన కార్యాలయం జలసౌధ హైదరబాద్‌లో ఒక ఉద్యమ కేంద్రంగా ఉండేది. సహాయ నిరాకరణ, సకలజనుల సమ్మె సందర్భంగా జలసౌధ ఉద్యమ కార్యక్రమాలతో సందడిగా ఉండేది. ఆ సందర్భంగా తరచుగా కనబడే దృశ్యం స్త్రీల బతుకమ్మ. చీపుర్లతో పనిచేసే కాంట్రాక్ట్ లేబర్లతో కలిసి వైట్‌కాలర్ ఉద్యోగులు, మహిళా ఇంజనీర్లు బతుకమ్మ ఆడుతూ కనిపించేవారు. సాధారణ సమయంలో మనం చూడలేని అపురూప దృశ్యం అది. అట్లనే కోదాటి శ్రీను – అస్సోయిదులా హారతి కాళ్లగజ్జల గమ్మతి పాటకు, గద్దర్ – పొడుస్తున్న పొద్దు మీద... పాటకు డ్రైవర్లు, అటెండర్లు, ఇతర నాలుగవ తరగతి ఉద్యోగులు, ఎన్‌జిఒలు, ఇంజనీర్లు కలిసి ధూలా ఆడడం అతి సాధారణ దృశ్యంగా ఉండేది. ఇటువంటి దృశ్యాలే అన్నీ ఆఫీసుల్లో కనిపించినాయి. ఆఫీసులో సబార్డినేట్ కానీ ఉద్యమంలో నాయకుడు. ఎన్‌జిఒల నాయకత్వంలో గజిటెడ్ ఆఫీసర్లు, క్లాస్ 1 ఆఫీసర్లు, ఇంజనీర్లు, డాక్టర్లు కలిసి పని చేసినారు. ఎక్కడా హోదాకు లేదా ప్రోటోకాల్‌కు సంబంధించిన అంశాలు కలిసి పని చేయడానికి అడ్డంకి కాలేదు. ఉద్యమానంతరం కూడా ఈ సోదర భావం కొనసాగాలి. అందరం సమానమే అన్న ఈ విలువను తెలంగాణ సమాజం నిలబెట్టు కోవాలి. అట్లనే తెలంగాణ జెఎసి ఇచ్చిన రోడ్లపై వంటా వార్పు కార్యక్రమం కూడా గ్రామాల్లో ప్రజలను కుల మతాలకు అతీతంగా ఐక్యం చేసింది. బడుల్లో పిల్లలకు పగటిపూట భోజనం దళిత స్త్రీలు వండితే తిరస్కరించిన సందర్భాలు తెలంగాణలో ఎన్నో ఉన్నాయి. అయితే వంటా వార్పు కార్యక్రమంలో ఈ భేద భావాలు మర్చిపోయి ప్రజలందరూ కలిసి వండుకున్నారు, కలిసి సహపంక్తి భోజనాలు చేసినారు. ఘంటా చక్రపాణి నాతో పంచుకున్న తన అనుభవాన్ని ఇక్కడ ప్రస్తావించ దలచాను. శామీర్‌పేట వద్ద రహదారి మీద గ్రామస్తులు అందరూ కలిసి వంటా వార్పు కార్యక్రమం నిర్వహిస్తున్నారు. కొందరు కూరగాయలు తరుగుతున్నారు. కొందరు అన్నం వండుతున్నారు. అన్నం వండుతున్న వ్యక్తిని – మీరేమిటోల్లే ? అని చక్రపాణి అడిగితే, మేము హరిజనులం సార్ అని చెప్పిండట. మీరు వండితే రెడ్డోల్లు, కాపోల్లు తింటరానే అని సార్ మరో ప్రశ్న అడిగితే, ఉత్తప్పుడు తినరు గాని ఇప్పుడు తింటరు సార్ అని ఆయన జవాబు. ఉద్యమంలో ఇటువంటి దృశ్యాలు సాధారణమైనవే. మనుషులు వాళ్లే. కానీ సందర్భం వేరైనప్పుడు వారి వ్యవహారంలో మార్పు ఎందుకు చోటు చేసుకుంటుంది? ఉద్యమం మనిషిని డిక్లాసిఫై చేస్తుంది. ఉద్యమానంతరం కూడా ఈ విలువను తెలంగాణ సమాజం నిలుపుకోవాలి. అప్పుడు మాత్రమే ఉద్యమానికి నిజమైన సాఫల్యత. తెలంగాణలో సామాజిక న్యాయానికి గట్టి పునాది పడుతుంది. ఇది అనుకున్నంత సులువైనదేమి కాదు. ఒక్కరోజుతో సాధించేది కాదు. నిరంతరంగా ఈ భావన, ఈ ఉద్యమ స్ఫూర్తి నదీ ప్రవాహంలాగా కొనసాగాలి.

**విశాల ప్రజా ఐక్య సంఘటన ప్రయోగం – టిజెఏసి**

తెలంగాణ ఉద్యమంలో జాయింట్ యాక్షన్ కమిటీ ఏర్పాటు కావడం ఒక గొప్ప మలుపు. ప్రలందరిని ఒక్క గొడుగు కిందకి చేర్చి తెలంగాణ సమాజాన్ని ఒక ముద్దగా మార్చిన అపూర్వ ప్రయోగం. తెలంగాణలో సామాజిక న్యాయానికి బీజరూపంలో ఉన్న జెఏసి నిర్వహించిన పాత్ర చారిత్రాత్మకం. ప్రొ. కోదండరాం నాయకత్వంలో జెఏసి మూడు విభిన్నమైన సైద్ధాంతిక విశ్వాసాలు కలిగిన రాజకీయ పార్టీలను (టిఆర్ఎస్, బిజెపి, న్యూడెమోక్రసీ), భిన్న ప్రయోజనాలు, పరిమితులు కలిగిన అనేక ప్రజా సంఘాలను ఒక్క తాటిమీద నడిపించడం అసాధారణం. ఈ ప్రయోగం తెలంగాణలో సఫలమైంది. ప్రొ. జయశంకర్ ఆశించిన రాజకీయ ప్రక్రియ వేగవంతం కావడానికి జెఏసి ప్రయోగం ఉపకరించింది. తెలంగాణలో పనిచేస్తున్న అన్ని రాజకీయ పక్షాలను తెలంగాణ రాష్ట్ర డిమాండ్‌ని సమర్థించకుండా ఉండలేని అనివార్య పరిస్థితిని జెఏసి సృష్టించగలిగింది. ప్రజల్లో దేనికైనా తెగబడే సాహసాన్ని పెంచింది. ఎన్నికల కోడ్‌ని కాదని ఉద్యోగులు ఉప ఎన్నికల్లో టిఆర్ఎస్‌కు ప్రచారం చేయగలిగినారు. సహాయ నిరాకరణ, సకల జనుల సమ్మె సందర్భంగా జీతాలు రాకపోయినా ఉద్యమం నడవాలని కోరుకున్నారు. ఎర్రమంజిల్‌లోని రోడ్లు భవనాలశాఖలో కేంద్రమంత్రి జైపాల్‌రెడ్డి సహా తెలంగాణ మంత్రుల శవయాత్ర చేసి పాడెను దహనం చేసి నెల తర్వాత మాసికం ఏర్పాటు చేసి పిండ ప్రదానం చేసిన సాహసం ఉద్యోగులది. ఆ సాహసం చేసే తెగువను ఇచ్చింది జెఏసినే. మిలియన్ మార్చ్‌లో సీమాంధ్ర సాంస్కృతిక ఆధిపత్యానికి చిహ్నాలుగా ఉన్న విగ్రహాలను కూల్చివేసే సాహసం, మానుకోట ప్రతిఘటనా పోరాటంలో, నకిరేకల్ రోడ్డు రోకో పోరాటంలో, సాగరహారం, అసెంబ్లీ ముట్టడి పోరాటాల్లో ప్రజల తెగువ, నిర్బంధాలను ఎదిరించే సాహసం ప్రజలు చేయగలి గారంటే జెఏసి, అందులో ప్రధాన భాగస్వామిగా ఉన్న టిఆర్ఎస్ తమకు అండగా ఉంటుందన్న భరోసా వల్లనే. సకల జనుల సమ్మె సమయంలో ప్రజలు కరెంటు లేక పంటలు ఎండిపోయినా, బస్సులు నడవకపోయినా సహించినారు.

ఇటువంటి స్ఫూర్తినే సమ్మెలో ప్రతిఒక్కరూ ప్రదర్శించినారు. సహాయ నిరాకరణ ఉద్యమం నిలిపివేసినప్పుడు ఉద్యోగులు తమ ప్రియతమ నాయకత్వం మీదనే తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేసినారు. అయిదారు చోట్లల్లో నాయకుల దిష్టి బొమ్మలు తగులబెట్టినారు. (ఉద్యోగుల ఆ సహజ ప్రతిస్పందనకు బాధ్యుడిగా నేను ఉద్యోగుల జెఏసి నుండి, టిజెఏసి నుండి జీవిత కాలపు నిషేధానికి గురి కావడాన్ని గుర్తు చేసుకోవడం వ్యక్తిగతంగా నాకు ప్రస్తుతమే) ఎవరి మీదనైనా ఆగ్రహం వ్యక్తం చేయగలగడం, ఎంతటి వారినైనా ప్రశ్నించడం, నిలదీయడం ఉద్యమం సందర్భంగా జరిగినాయి. ఫణికర మల్లయ్య చంద్రబాబుని ప్రశ్నించిన తీరుని మరువగలమా? ఒయు విద్యార్థుల నాలుగేండ్ల యుద్ధకాండ ఎంత చెప్పుకున్నా వొడువని ముచ్చటే. ఇదంతా జెఏసి ప్రయోగం వల్లనే సాధ్యపడింది. ప్రజలు గ్రామ స్థాయి వరకు జెఏసిలను నిర్మించుకున్నారు. అన్నీ కులాల వారు, మతాల వారు, వృత్తుల వారు, సంఘటిత కార్మికులు, అసంఘటిత కార్మికులు, కాంట్రాక్ట్ ఉద్యోగులు, రాష్ట ప్రభుత్వ ఉద్యోగులు, ఇంజనీర్లు, డాక్టర్లు, శాస్త్రవేత్తలు, పారిశ్రామిక వేత్తలు, ఐటి ఉద్యోగులు, నెటిజెన్లు, ప్రవాస తెలంగాణీయులు, విద్యార్థులు, వలసబోయి ఇతర రాష్ట్రాల్లో బతుకుతున్న తెలంగాణ బిడ్డలు, రిటైర్డ్ ఉద్యోగులు, సీనియర్ సిటిజెన్లు, సెటిలర్లు, రచయితలు, కవులు, కళాకారులు, కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులు, రైల్వే ఉద్యోగులు, బ్యాంకు ఉద్యోగులు, ఎల్ఐసి ఉద్యోగులు, రక్షణ శాఖ ఉద్యోగులు, మహిళలు, పేపర్లు అమ్ముకునే హాకర్లు, చెత్త ఎరుకునే వారు, బిచ్చగాళ్లు, హిజ్రాలు జెఏసిలు ఏర్పాటు చేసుకున్నారు. ఆఖరికి 'తెలంగాణ బాలల సంఘం' కూడా ఏర్పాటు అయింది. ఇట్లా తెలంగాణలో విశాల ఐక్య సంఘటన నిర్మాణం జరిగింది. ఇటువంటి విశాల ప్రజా ఐక్య సంఘటన ఎట్లా సాధ్యమైంది? ఇది మరింత విస్తృతంగా అధ్యయనం చేయవలసిన అంశం.

అయితే తెలంగాణ చరిత్రలో ఇటువంటి ఐక్య సంఘటన ఏర్పాటు అయిన సందర్భం మరొకటి కనిపిస్తుంది. 1930, 40 దశకాల్లో ఆంధ్ర మహాసభ ఏర్పాటు ఆనాటి చారిత్రక సందర్భంలో తెలంగాణలోని అన్నీ వర్గాలను కూడగట్టి విశాల ఐక్య సంఘటనకు ప్రాణం పోసింది. ఆంధ్ర మహాసభ తెలంగాణలో తీసుక వచ్చిన సామాజిక రాజకీయ చైతన్యం తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటానికి దారి తీసింది. తెలంగాణ గ్రామాల్లో భయంకరంగా ప్రజలను పీడిస్తున్న భూస్వామ్య వ్యవస్థను బలహీన పర్చగలిగింది. 10 లక్షల ఎకరాల భూములను భూస్వాముల నుండి స్వాధీనం చేసుకొని భూమిలేని పేద ప్రజలకు పంచారు. అయితే కారణాలు ఏవైనా ఆంధ్ర మహాసభ సాధించిన ఫలాలను, అది తీసుకు వచ్చిన విలువలను అనంతర కాలంలో తెలంగాణ నిలుపుకోలేక పోయింది. ఇప్పుడు ఆంధ్ర మహాసభ వైఫల్యాల నుంచి గుణపాఠాలు తీసుకోవాల్సిన సమయం. జెఏసి అనే విశాల ప్రజా ఐక్య సంఘటన సాధించిన సోదర భావం, ఏక జాతి భావన, ప్రజాస్వామిక విలువలు, ప్రశ్నించే తత్వం, సాంస్కృతిక ఐక్యత, తెలంగాణ అస్తిత్వ భావన ఇలా ఇవన్నీ కొనసాగాలి. ఈ విశాల ప్రజా ఐక్య సంఘటన తెలంగాణ పునర్ నిర్మాణానికి ప్రజలను భాగస్వాములను చేయాలి. అప్పుడే తెలంగాణ ఏర్పాటుకు సార్థకత.

జర్మన్ రచయిత్రి, పరిశోధకురాలు దాగ్మార్ బెర్న్ స్టార్ఫ్ మాటలను మళ్లొకసారి యాది చేసుకుందాం. తమ తోటి ఆంధ్రులతో పోల్చినప్పుడు తెలంగాణీయులు తాము విస్పష్టమైనవారీగా భావిస్తారు. తెలంగాణ ఉద్యమ సమర్థకుల దృష్టిననుసరించి – తెలంగాణ వ్యక్తిత్వం – ఉన్నతమైన సంస్కారం, సాంస్కృతిక పరిణామంపై ఆధారపడిన సర్వ సమభావవాదం. తెలంగాణ వాసుల విశిష్ట లక్షణాలలో ముఖ్యమైనవి మనోహరమైన మర్యాదలు, చతురతతో కూడిన ఉపాయశీలత, దానశీల ఆతిథ్యం . ఈ విశిష్ట లక్షణాలు, శిష్ట జ్ఞానం కులీనుల్లోనే కాదు సామాన్య రైతు కుటుంబాల్లో కూడా స్పష్టంగా గోచరిస్తాయి. కానీ విలువల క్రమానుగత శ్రేణిలో తెలంగాణీయుల్లో వ్యావహారిక విజయం కన్నా మానవ సంబంధాలకు ఎక్కువ ప్రాధాన్యత ఉంటుంది. తెలంగాణ వాసులు ఏదో సాదాసీదా జీవితం గడపాలనే కోరుకునే వాళ్లు తప్పా వ్యాపార దృష్టి ఉన్న అత్యాశపరులు కాదు. (ఆంధ్రప్రదేశ్ రాజకీయ వ్యవస్థ – తెలంగాణ రాజకీయాలు : పేజీ 140)

దాగ్మార్ ఇంకా ఇలా అంటారు. – తెలంగాణ అస్తిత్వం స్పష్టంగా భాష మీద గాని, మతం మీద గాని ఆధారపడ్డ విషయం కాదు. అది చరిత్రపై ఆధారపడిన అంశం. చరిత్రలో భాగంగా తెలంగాణ సమాజ నిర్మితి, సంస్కృతీ లక్షణాలు ఎదిగినవి. ఇవి తెలుగుదేశంలో ఇతర ప్రాంతాల లక్షణాల కన్నా, నిర్మాణాల కన్నా భిన్నమైనవి. (పేజీ 143). దాగ్మార్ అభిప్రాయాలను విశ్లేషించినప్పుడు తెలంగాణ విషయంలో ఆమె చేసిన వ్యాఖ్యానాలు అక్షర సత్యాలుగా తోస్తాయి. ఆమె పేర్కొన్న లక్షణాలు తెలంగాణ ఉద్యమంలో కూడా ప్రస్ఫుటంగా కనిపించినాయి. ఇంతకు ముందు పేర్కొన్నట్లుగా ఉద్యమం నిలబెట్టిన విలువలను, తెలంగాణ జాతి సహజ లక్షణాలను సమున్నతంగా నిలబెట్టవలసిన బాధ్యత తెలంగాణ బుద్ధిజీవులది, తెలంగాణ సమాజానిది. తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడినా తెలంగాణలో వలశాధిపత్యం ఇంకా అంతం కాలేదని గుర్తించాలి. తెలంగాణ సమాజం తెలంగాణలో వలసాధిపత్యాన్ని అంతం చేయడానికి, తెలంగాణను వలసవాద ప్రభావాల నుంచి బయట పడేయడానికి పోరాటాన్ని కొనసాగించ వలసిందే.

*(రచయిత తెలంగాణ విద్యావంతుల వేదిక నాయకులు)* వీ

# రక్షణ రంగంలో విదేశీ పెట్టుబడులు

***రక్షణరంగంలో వంద శాతం విదేశీ పెట్టుబడులకు అనుమతినిస్తూ మోడీ ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాలు భారత ప్రజలకు ఎలాంటి నష్టాలు కలిగించనున్నాయో విశ్లేషిస్తున్నారు* భాస్కర్ ఏంపెల్లి**

మోడీ అధికారంలోకి వచ్చాక తీసుకున్న అతి ముఖ్యమైన నిర్ణయాల్లో ఒకటి, రక్షణరంగంలో 100 శాతం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు అనుమతించేందుకు ప్రయత్నాలు మొదలు పెట్టడం. వాణిజ్య, పరిశ్రమల శాఖ మంత్రి నిర్మల సీతరామన్ మంత్రిగా చార్జి తీసుకున్న రెండు రోజుల్లోనే, ఇందుకోసమే మంత్రి అయినట్టుగా, రక్షణ రంగంలో 100 శాతం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు అనుమతించేందుకు కేబినెట్‌కు నోట్ పంపించి, దాని మీద స్పందించాల్సిందిగా వివిధ శాఖలను కోరారు. దీంతో రక్షణరంగంలో 100 శాతం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల చర్చ మళ్లీ ఒకసారి ముందుకు వచ్చింది.

ప్రస్తుతం ప్రపంచంలో 40 ఆర్డినెన్సు ఫ్యాక్టరీలతో, అతి పెద్ద ప్రభుత్వ రంగ రక్షణ పరిశ్రమ కలిగిన భారతదేశం, రక్షణ పరికరాల దిగుమతిలో ప్రపంచంలో రెండవ అతిపెద్ద దేశం. భారతదేశం ఉపయోగిస్తున్న మొత్తం రక్షణరంగ పరికరాలలో దాదాపు 70 శాతం రక్షణ పరికరాలు విదేశాల నుండి దిగుమతి చేసుకోవడం జరుగుతుంది. అంటే దేశరక్షణ అవసరాల్లో కేవలం 30శాతం దేశీయ రక్షణ పరిశ్రమలు సమకూరుస్తున్నట్లుగా కనిపిస్తుంది. అయితే మొత్తం ఉపయోగిస్తోంది ఎంత, ఎందుకు, ఎవరి మీద అనేది తెలిస్తే తప్ప ఈ శాతాల లెక్కలు అర్థం కావు.

**రక్షణరంగంలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు**

మే 2001లో వాజపేయి ప్రభుత్వం భారత దేశరక్షణ పరికరాల పరిశ్రమల్లో ప్రైవేట్ పెట్టుబడులను అనుమతిస్తూ, విదేశీ పెట్టుబడులను 26 శాతానికి పరిమితి విధించారు. రక్షణ పరికరాల దిగుమతిలో చైనా తర్వాత, (8 బిలియన్ డాలర్ల దిగుమతులతో) భారతదేశమే అతిపెద్దది. రక్షణ వ్యయం 2006-07 బడ్జెట్ నుండి సంవత్సరానికి 13.4 శాతంగా పెరుగుతోంది. దేశీయ రక్షణ పరిశ్రమల్లో ఉత్పత్తి చేసే వాటిలో కూడా విడిభాగాలు చాలా వరకు దిగుమతి చేసుకోవడం జరుగుతోంది. స్టాక్‌హోమ్ ఇంటర్నేషనల్ పీస్ రిసెర్చ్ సెంటర్ ప్రకారం 2009 నుండి 2013 వరకు భారతదేశమే ప్రపంచంలో అతి ఎక్కువ ఆయుధ పరికరాలను దిగుమతి చేసుకుంది. అది మొత్తం ప్రపంచ ఆయుధ వ్యాపారంలో 14 శాతం. భారతదేశ దిగుమతుల మొత్తంలో ఇది 70 శాతం. అయితే ఈ 26 శాతం పెట్టుబడులు అంతగా విదేశీ కంపెనీలకు లాభదాయకంగా అనిపించలేదు. ఎందుకంటే కంపెనీ మీద పూర్తి అధికారం ఈ వాటాతో సాధ్యం కాదు. అందుకే ఈ కంపెనీలు పెట్టుబడులు పెట్టడానికి ముందుకు రాలేదు. డిపార్టుమెంట్ ఆఫ్ ఇండస్ట్రియల్ పాలసీ, ప్రమోషన్ (డిఐపిపి) ప్రకారం జనవరి 2001 నుండి సెప్టెంబర్ 2012 వరకు రక్షణరంగ పరిశ్రమల్లోకి వచ్చిన విదేశీ పెట్టుబడులు 4.12 మిల్లియన్లు లేదా 19.89 కోట్లు. ఇది ప్రభుత్వం ఆశించిన దానికంటే చాలా తక్కువ. కాబట్టి రక్షణ రంగంలో 50 శాతం లేదా అంతకంటే ఎక్కువ అనుమతించాలనే వాదనలు ముందుకు వచ్చాయి.

యుపిఎ ప్రభుత్వం హయాంలో అప్పటి కేంద్ర వాణిజ్య, పరిశ్రమల శాఖ మంత్రి ఆనంద్ శర్మ రక్షణరంగంలో విదేశీ పెట్టుబడులు పరిమితి పెంచే ప్రతిపాదనలు తీసుకొచ్చినప్పటికి, రక్షణమంత్రి ఆంటోనీ ఈ ప్రతిపాదనలను వ్యతిరేకిస్తూ వచ్చారు. (ఇందులో ఆయన ప్రయోజనాలు ఆయనకు ఉండవచ్చు!). దానికి ప్రతిగా 1000 కోట్ల టర్నోవర్‌తో దేశంలోని పెద్ద ప్రైవేటు పరిశ్రమలకు, ప్రభుత్వ రంగ పరిశ్రమల హోదా ఇచ్చి రక్షణ ఉద్యోగ రత్నాలుగా తయారు చేయడానికి యుపిఎ ప్రభుత్వం పథకం చేసింది. ప్రభీర్‌సేన్ గుప్త కమిటీ, టిఎటిఎఎస్, డబ్లుఐపిఆర్ఒ, ఎచ్‌సిఎల్, జిఒడిఆర్ఇజె, బిఒవైసిఇ లాంటి సంస్థలను అందుకు అనుకులమైనవిగా గుర్తించింది. ఆంటోని మాటల్లో ఈ రక్షణ ఉద్యోగ రత్నాలు రక్షణరంగంలో ఆరోగ్యకరమైన పోటీని ప్రోత్సహిస్తాయి. రెండు సంవత్సారాల తర్వాత ఈ కార్యక్రమం అనేక కారణాలతో మూలపడింది.

మోడీ ప్రభుత్వం వచ్చి రాగానే, రక్షణ రంగంలో 100 శాతం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు అనుమతించేందుకు కేబినేట్‌కు ప్రతిపాదనలు పంపించారు. అందులో వాణిజ్య, రక్షణ మంత్రిత్వశాఖ విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు గ్రేడులుగా ప్రతిపాదిపాదించారు. సాంకేతిక పరిజ్ఞానం బదిలీ చేయని కంపెనీలో 49 శాతం, పాక్షికంగా సాంకేతిక పరిజ్ఞానం బదిలీ చేసే కంపెనీలు 79 శాతం, ఆధునికీకరణకు సంబధించి స్టేట్ ఆఫ్ ఆర్ట్ మాన్యుఫ్యాక్చరింగ్ కంపెనీలు 100 శాతం పెట్టుబడులు పెట్టవచ్చు. ఈ కంపెనీలు ప్రభుత్వ కంపెనీలను కూడా టేకోవర్ చేయవచ్చు. ఇక్కడ ముఖ్యమైన విషయం ఏంటంటే ఈ పెట్టుబడులు విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల రూపంలో, విదేశీ సంస్థాగత పెట్టుబడుల రూపంలో 'వివరాలు తెలుపడం ఇష్టంలేనివి' కూడా ఇందులో పెట్టుబడులు పెట్టవచ్చు. ఇదంతా ప్రభుత్వంలోని అతి కొద్దిమంది 'పెద్దలు' ఉండే ఫారిన్ ఇన్వెస్ట్‌మెంట్ ప్రమోషన్ బోర్డ్ కనుసన్నల్లో నడుస్తుంది.

రక్షణ రంగంలో 100 శాతం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు అనుమతించాలని నిర్ణయం తీసుకున్న తర్వాత భారతీయ పరిశ్రమలు తమ వ్యతిరేకతను ప్రధాన మంత్రికి, ఎఎస్ఎస్ఒసిఎచ్ఎం (అసోచామ్) లాంటి సంస్థల ద్వారా తెలియ చేశారు.

ఎఫ్ఐసిసిఐ తన జూలై 2010 రిపోర్ట్‌లో, 100 శాతం విదేశీ పెట్టుబడులు అనేవి దేశీయ సాంకేతిక పరిజ్ఞానాన్ని పెంచుతుంది అనేది వాస్తవం కాదు. పైగా అది దేశీయ పరిశ్రమలు, వాటి నవ్యత్వం మీద ప్రతికూల ప్రభావం చూపిస్తుంది. విదేశీ పెట్టుబడుల పేరు మీద విదేశీ మదుపరులను నమ్ముకోవడం దేశీయ పరిశ్రమల అభివృద్ధిని దెబ్బతీసి,

వాటిని సమూలంగా తుడుచి వేస్తుంది. టెలికాం రంగంలో విదేశీ పెట్టుబడులు, దేశీయ పరిశ్రమల సామర్థ్యం పెంచలేనప్పుడు, వ్యూహాత్మకంగా చాలా సున్నితమైన రక్షణరంగంలో, సాంకేతిక పరిజ్ఞానం వాటి మాతృదేశాల చెప్పుచేతల్లో ఉండే 100 శాతం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు ఏ విధంగా దేశీయ పరిశ్రమల పనితీరును అభివృద్ధి చేసి, వాటి సమర్థవంతంగా మార్చగలగడం నమ్మదగినది కాదని పేర్కొన్నారు.

ఆయుధ వ్యాపారంలో లాభాలే రక్షణరంగంలో ఎఫ్‌డిఐల అనుమతికి కారణం. రక్షణరంగంలో 100 శాతం వీదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను అనుమతించడం అంటే, విదేశీ పెట్టుబడిదారులకు ఇక్కడ ఉత్పత్తి చేసుకుని, లాభాలు సంపాదించే అవకాశం ఇవ్వడం. ఇక్కడ ఉత్పత్తి చేసిన ఆయుధాలు ఆయా కంపెనీలు ఎక్కడ, ఎవరికి అమ్ముకుంటాయి? ప్రపంచంలో ఆయుధాలకు అంత డిమాండ్ ఉందా? లేకపోతే ఈ కంపెనీలు ఏమి చేస్తాయి అనేది తెలియాలంటే, శ్రీలంకలో చైనా ఏమి చేసిందో గుర్తుకు తెచ్చుకోవాలి.

శ్రీలంకకు, ఎల్‌టిటిఇకి మధ్య జరిగిన అంతర్యుద్ధంలో చైనా పాత్ర ప్రధానమైనది. చైనా మిలిటరీ, ఆర్థికపరంగా సహాయం అందించే ఒప్పందంతో శ్రీలంకను ఎల్‌టిటిఇ పైకి ఉసిగొల్పింది. చైనీస్ జైన్-7 ఫైటర్ జెట్లు, యాంటి ఎయిర్‌క్రాఫ్ట్ గన్స్, జెవై-11 3డి ఎయిర్ సర్వేలెన్స్ రాడార్లు ఎగుమతితో పాటు, 1 బిలియన్ డాలర్ల ఆర్థిక సహాయం చేసి శ్రీలంక ఎల్‌టిటిఇ మీద విజయం సాధించడానికి, నలభై వేల మంది (ఐక్యరాజ్య సమితి అంచనా) మరణానికి, మరెంతో మంది క్షతగాత్రులు కావడానికి, నిరాశ్రయులు కావడానికి కారణమైంది. రాజకీయాలను, వ్యాపారాన్ని కలగలిపి సుడాన్, జింబాబ్వే, జాంబియ, ఉజ్బెకిస్తాన్, నార్త్ కొరియాలలో చైనా సృష్టించిన మారణహోమం తక్కువేమీ కాదు. ఇదంతా ఆయుధ వ్యాపారం చేసి ఉద్యోగాలను సృష్టించుకొని, 'అభివృద్ధి' సాధించి, ప్రపంచ ఆర్థికశక్తిగా ఎదగడం కోసమే.

అలాగే భారతదేశానికి కూడా మధ్యభారతంలో, ఈశాన్య రాష్ట్రాలలో, కశ్మీర్‌లో వెల్లువెత్తుతున్న ప్రజా ఉద్యమాలను అణచివేయడానికి, అమాయక ఆదివాసులను సంఘ వ్యతిరేక శక్తులుగా చూపించి 'ఆపరేషన్ గ్రీన్‌హంట్' లను సృష్టించడానికి, మరికొంతమంది కశ్మీర్ యువకులను మాయం చేయడానికి, ఈశాన్య రాష్ట్రాల్లో మహిళలపై యథేచ్ఛగా అఘాయిత్యాలు చేయడానికి ఇంకా చెప్పాలంటే మరిన్ని గుజరాత్‌లను, ముజఫర్‌నగర్‌లను సృష్టించడానికి ఈ రక్షణరంగంలో 100 శాతం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు ఉపయోగపడగలవు.

ఇవాళ ప్రపంచ ఆర్థికశక్తిగా ఎదగాలనుకుంటున్న చైనా, వాపును చూసి బలుపనుకొని తాను ఆర్థిక శక్తినని చూపాలనుకునే భారత్‌కు మిలిటరీ శక్తిగా ఎదగాల్సిన అవసరముంది. ఎందుకంటే ఇవాళ ఆర్థికంగా బలహీనపడి కూడా అమెరికా ఇంకా ప్రపంచ ఆర్థిక శక్తిగా మన గలుగుతుంది. అంటే దాని మిలిటరీ శక్తి, దాన్ని చూపించి పెట్రోల్ ఉత్పత్తి చేసే అరబ్ దేశాలలో అది సృష్టిస్తున్న మారణహోమమే కారణం.

ప్రపంచ వ్యాప్తంగా, నయా ఉదారవాద, పెట్టుబడిదారీ విధానాల మూలంగా నిర్వాసితులుగా, నిరుద్యోగులుగా మారిన ప్రజలు, దీంతో విసిగి వేసారిన యువత లేవనెత్తుతున్న ఉద్యమాలు అణచివేయడానికి ఈ దేశాలకు ఆయుధాలు సరఫరా చేయడం లాభదాయకంగా ఉంటుంది. ప్రపంచంలో రక్షణ పరికరాల దిగుమతిలో ముందున్న భారతదేశం రేపు ఈ విదేశీ కంపెనీలు ఉత్పత్తిచేసి ఎగుమతిలో ముందుకు తీసుకుపోవడానికి, దాని ద్వారా లాభాలు పొందడానికి ఈ వీదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు ఉపయోగపడగలవు.

రక్షణశాఖ అనుభవజ్ఞులు భరత్ వర్మ, హిందూస్థాన్ ఏరోనాటికల్ లిమిటెడ్. చైర్మన్ ఆర్.కె. త్యాగి లాంటి ఏ ఎండకు ఆ గొడుగు పట్టి ప్రభుత్వంలో తమ ఉనికిని కాపాడుకునే ఆధికారులు ఈ నిర్ణయం చాలా గొప్పదిగా, సాహసోపేతమైనదిగా కీర్తించడం మొదలు పెట్టారు. వీరి దృష్టిలో ఈ విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు రక్షణ రంగంలో పరిశోధనకు అవసరమైన శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానాన్ని తీసుకువస్తుంది. భవిష్యత్తులో యుద్ధ విమానాలను ఎగుమతి చేసే స్థాయికి దేశాన్ని తీసుకువెళ్తుంది.

అలాగే దేశీయ రక్షణ పరిశ్రమలకు కూడా ప్రోత్సాహకరంగా ఉంటుంది. అయితే టెలికం రంగంలో విదేశీ పెట్టుబడులు చెప్పుకోదగిన సాంకేతిక పరిజ్ఞానాన్ని తేకపోగా అనేక స్కాంలకు దారితీశాయనేది గత అనుభవం. ఈ రక్షణరంగంలో 100 శాతం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు ఇంతకంటే గొప్ప అనుభవాన్ని ఇవ్వగలవని అనుకోవడం భ్రమ.

విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల రూపంలో శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానాన్ని తీసుకువచ్చి చేసేది ఏమంటే, ఆయుధాలను, యుద్ధ విమానాలను తయారు చేసి ఆయుధ వ్యాపారంలోకి దిగి లాభాలు గడించడం తద్వారా దేశాన్ని అభివృద్ధి చేయగలమని కళలుకనడం. దాంతో ఇప్పుడు ఆయుధాలు దిగుమతి చేసుకుంటున్న హోదా నుండి ఎగుమతి చేసే స్థాయికి భారత దేశం ఎదుగుతుంది.

*(రచయిత ఆర్థికశాస్త్ర పరిశోధక విద్యార్థి, సెంట్రల్ యూనివర్సిటీ)* వీ

**రాబోయే సంచికలలో...**

- **గతితర్కం ఒక వివరణ - వై.వి. రమణారావు**
- **మహిళలపై దాడులను ఖండించిన 'అగ్నిశిఖ' - గోమతి**
- **వియత్నాం పయనమెటు? - ఎం.కె. కుమార్**
- **ఆర్థికాభివృద్ధి ప్రక్రియలో సహజ వనరుల ప్రాధాన్యత - డా. తడికమల్ల శేఖర్**
- **చేతి వృత్తుల్లో మార్పులు - వి. వెంకట్రావ్**
- **రాష్ట్రంలో కౌలు రైతుల సమస్యలు - డా. డి. రవీందర్**

# అధికరణం 370 పూర్వాపరాలు

*భారత రాజ్యాంగంలో 370 అధికరణం ప్రవేశపెట్టడానికి కారణమైన జమ్ము కశ్మీర్ ప్రత్యేక చారిత్రక నేపథ్యాన్ని వివరిస్తున్నారు* **ఎ. నర్సింహారెడ్డి**

మోడీ అధికారం చేపట్టిన వెంటనే అధికరణ 370 రద్దు చేస్తామనడం దేశవ్యాప్తంగా చర్చనీయాంశమైంది. మన రాజ్యాంగంలో జమ్మూ కశ్మీర్‌కు స్వయం ప్రతిపత్తి కల్పించే 370 అధికరణ, ఆ అధికరణకు మన పాలకులు ఏ విధంగా తూట్లు పొడిచారో అర్థం చేసుకోవాలంటే, ఆ అధికరణ పూర్వాపరాలు తెలుసుకోవడం అవసరం.

భారతదేశానికి బ్రిటిష్ ప్రభుత్వం 1947 జూలైలో స్వాతంత్ర్యం ప్రకటించింది. భారత స్వాతంత్ర్య చట్టం 1947 ప్రకారం, ఆగష్టు 15 నుంచి ఇండియా, పాకిస్థాన్ స్వతంత్ర దేశాలుగా అవతరించాయి. స్వదేశీ సంస్థానాలు తమ ఇష్ట ప్రకారం ఏ దేశంలోనైనా కలువ వచ్చునని ఆ చట్టం పేర్కొంది. జమ్మూ కశ్మీర్ సంస్థానాధీశుడు సర్ హరిసింగ్ కశ్మీర్‌ను స్వతంత్ర రాజ్యంగా కొనసాగిస్తానని, రెండు దేశాలలో దేనితోనూ కలువనని ప్రకటించాడు. పాకిస్థాన్, భారత్ రెండూ కశ్మీర్ తమతో కలిసిపోవాలని కోరుకున్నాయి. కశ్మీర్ సంస్థానంలో అత్యధిక ప్రజలు ముస్లింలు కాగా, పాలకుడు హిందువు. కశ్మీర్ లోయలో ముస్లింల జనాభా ఎక్కువ కాగా, జమ్మూ ప్రాంతంలో హిందువుల జనాభా ఎక్కువ.

కశ్మీర్ మహారాజా హరిసింగ్ రాచరిక నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా ప్రజల్లో అసంతృప్తి తీవ్రంగా ఉంది. 1933 నుంచే రాజుకు వ్యతిరేకంగా అన్ని మతాల మధ్య ఉద్యమ ఐక్యత కొనసాగింది. కుల, మత వివక్షలేని రాజకీయ కార్యాచరణ సంస్థగా, బాధ్యతాయుత ప్రభుత్వ ఏర్పాటు లక్ష్యంతో 1939లో అఖిల జమ్మూ కశ్మీర్ నేషనల్ కాన్ఫరెన్స్ అనే ఉద్యమ సంస్థ ఆవిర్భవించింది. సెప్టెంబర్ 1944లో ప్రజా అసంతృప్తికి ఆందోళన నిర్మాణ రూపం ఇచ్చింది. నిరంకుశ రాచరిక పాలకుడి స్థానంలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని స్థాపించడం లక్ష్యంగా కాన్ఫరెన్స్ ఆందోళన చేపట్టింది. ఈ ఆందోళనలో రైతాంగం, కార్మికవర్గం, పేదలు పాల్గొన్నారు. అయితే హిందూ మత శక్తులు ఈ ఉద్యమాన్ని హిందూ వ్యతిరేకమైనదిగా చిత్రీకరించాయి. ఈ దుష్ప్రచారాన్ని ఆదిలోనే చెరిపి వేయడానికి షేక్ అబ్దుల్లా ప్రయత్నాలు చేశాడు. మత విశ్వాసాలేవయినప్పటికీ, ప్రగతి శీల భావాలు గల కశ్మీరీలందరినీ కాన్ఫరెన్స్ పతాకం కింద సమీకరించడానికి ఆయన ప్రయత్నించాడు. మైనారిటీలకు అన్ని రక్షణలు కల్పిస్తామని ఆయన భరోసా ఇచ్చాడు. ఆయన నాయకత్వాన్ని సిక్కులు, హిందువులు అంగీకరించారు.

1947 అక్టోబర్ 22 నాటికి కశ్మీర్, పాకిస్థాన్‌ల సరిహద్దులోని పష్తూన్ గిరిజన తెగలు కశ్మీర్‌లోకి చొరబడడం ప్రారంభించాయి. అక్టోబర్ 24 నాడే హరిసింగ్ భారత ప్రభుత్వం సహాయం కోరాడు. పరిస్థితిని స్వయంగా పర్యవేక్షించేందుకు రక్షణ కమిటీ తరపున వెళ్లిన వి.పి.మీనన్ అక్టోబర్ 26న ఢిల్లీ చేరి 'కశ్మీర్‌ను చొరబాటుదారుల నుంచి రక్షించాలని సూచించాడు. అయితే అప్పటికి స్వతంత్ర దేశంగా ఉన్న కశ్మీర్‌లోకి భారత ప్రభుత్వ సైన్యాలు ప్రవేశించడం సరైనది కాదనే వాదనను మౌంట్ బాటన్ ముందుకు తెచ్చాడు. కశ్మీర్ సంస్థానం గనుక భారతదేశంలో విలీనం కావడానికి అంగీకరిస్తే, అప్పుడు కశ్మీరు భారతదేశంలో అంతర్భాగమవుతుందని, భారత సైన్యాలు కశ్మీర్‌లోకి నిరభ్యంతరంగా వెళ్లవచ్చునని మౌంట్ బాటన్ అన్నాడు. సంస్థానం లోంచి చొరబాటుదారులను తరిమివేసి, శాంతి భద్రతలు నెలకొనగానే ప్రజాభిప్రాయ సేకరణ జరపాలని, ఆ షరతు మీదనే విలీనం జరగాలని ఆయన అన్నాడు. నెహ్రూ, ఇతర మంత్రులతో సహా అందరూ ఈ ప్రతిపాదనకు అంగీకరించారు.

'శాంతి భద్రతల స్థితి అనుకూలించగానే సంస్థానంలో ఐక్యరాజ్య సమితి లాంటి అంతర్జాతీయ సంస్థల నేతృత్వంలో ప్లెబిసైట్ (ప్రజాభిప్రాయ సేకరణ) నిర్వహించడం జరుగుతుంది' అని నెహ్రూ తెలిపారు. కశ్మీర్‌పై 1947 నవంబర్ 2న నెహ్రూ రేడియో ఉపన్యాసంలో కూడా ప్రజాభిప్రాయ సేకరణ జరుపుతామని హామీ ఇచ్చాడు. 1948 నుంచి 1957 వరకు ఐదుసార్లు భద్రతా సమితి కశ్మీర్‌లో ప్లెబిసైట్ నిర్వహించాలని తీర్మానాలు చేసింది. భారత ప్రభుత్వం ఆ తీర్మానాలను ఖాతరు చేయలేదు. మొత్తం మీద 1947 అక్టోబర్ 26న విలీన ఒప్పందం మీద సంతకాలు చేసినప్పటి నుంచీ తాము చేసిన వాగ్దానాలన్నిటినీ, ముఖ్యంగా ప్రజాభిప్రాయ సేకరణ వాగ్దానాన్ని భారత ప్రభుత్వం, కాంగ్రెస్ పార్టీ నాయకులు తుంగలో తొక్కుతూ వచ్చారు. ప్రతిపక్షాలు కూడ పాలక పక్షానికి వంతపాడడం ప్రారంభించాయి.

1947లో జరిగినటువంటి విలీనానికి ముందు షరతులు రెండు. ఒకటి భారతదేశంలో ఉన్నంతకాలం ఆ రాష్ట్రానికి స్వయం ప్రతిపత్తి ఉంటుంది. రెండు, భారతదేశంలో ఉండదలుచుకున్నదీ లేనిదీ నిర్ణయించుకోవడానికి అక్కడి ప్రజానీకానికి ప్లెబిసైట్ ద్వారా అవకాశం ఇవ్వడం జరుగుతుంది. తత్ఫలితంగా వచ్చిందే రాజ్యాంగంలోని 370 అధికరణం. భారత రాజ్యాంగంలోని ఒకటో అధికరణాన్ని మినహాయించి మిగతా అధికరణలు జమ్ము కశ్మీర్‌కు వర్తిస్తాయా లేదా అనే సందేహం వస్తే రాష్ట్రపతి రాష్ట్రప్రభుత్వాన్ని సంప్రదించిన తర్వాతనే నిర్ణయం తీసుకోవాల్సి ఉంటందని ఈ అధికరణం చెపుతుంది. కేంద్ర జాబితాలో అయినా, రాష్ట్ర జాబితాలో అయినా, ఉమ్మడి జాబితాలో అయినా, రాష్ట్రం మీద పార్లమెంటరీ శాసనాధికారం చెల్లే అంశాలు విలీన ఒప్పందానికి లోబడి మాత్రమే ఉంటాయి. అంటే విలీన ఒప్పందం ప్రకారం రక్షణ, విదేశీ వ్యవహారాలు, సమాచార సంబంధాలలో మాత్రమే కేంద్ర ప్రభుత్వ అధికారం జమ్మూ కశ్మీర్‌లో చెల్లుతుంది.

షేక్ అబ్దుల్లా 1948మార్చ్‌లో ప్రధాని అయ్యాడు. అధికారం చేజిక్కిన

వెంటనే భూసంస్కరణలు అమలు చేశాడు. జాగీర్‌దారీ, చాక్‌దారీ హక్కులను నష్టపరిహారం లేకుండా రద్దు చేసి గరిష్ట పరిమితి చట్టాన్ని తీసుకొచ్చాడు. దీని వల్ల ముస్లిం జాగీర్‌దార్లు కూడ నష్టపోయినప్పటికి ప్రధానంగా ఈ చట్టం వల్ల జమ్మూ ప్రాంతపు డొగ్రా భూస్వాములు, కశ్మీర్ పండిట్లు భూములు కోల్పోయారు. 396 పెద్ద జాగీర్లను రద్దు చేసి 9 వేల మంది భూస్వాముల నుండి 4 లక్షల ఎకరాలను స్వాధీనం చేసుకున్నారు. కశ్మీర్ లోయకే పరిమితమైన ఒక సైనిక బలగాన్ని రూపొందించాడు. హరిసింగ్ పాలన యంత్రాంగంలో నిరాకరించబడిన ముస్లింలకు సముచిత స్థానం కల్పించాడు. గ్రామీణ రుణభారం తగ్గించాడు. గతంలో జరిగిన అన్యాయాలను సవరించడానికి అబ్దుల్లా చేపట్టిన చర్యలను హరిసింగ్ తాబేదార్లు, భూములు కోల్పోయిన భూస్వాములు, హిందూ మతోన్మాదులు ఆయన చర్యలన్నింటిని మతవాద చర్యలుగా విమర్శించడం మొదలు పెట్టారు.

1952 జూలైలో ఢిల్లీలో నెహ్రూకు షేక్ అబ్దుల్లాకూ మధ్య చర్చలు జరిగాయి. చర్చల ఫలితంగా వెలువడిన ఢిల్లీ ఒప్పందంలో 'విలీన ఒప్పందంలో ప్రస్తావించిన అంశాలు మినహా మిగిలిన అన్ని అంశాల లోను రాష్ట్రానికే సార్వభౌమాధికారం ఉంటుంది' అనే అంగీకారం కుదిరింది. పాక్ ఆక్రమిత కశ్మీర్ నుంచి జమ్మూ - కశ్మీర్‌కు వచ్చేవారిని పూర్తిస్థాయి పౌరులుగా గుర్తిస్తామని, భారతదేశంలోని ఇతర ప్రాంతాల నుంచి వచ్చే వారికి కశ్మీర్‌లో స్థిరాస్తులు సంపాదించే వీలు లేదని ఈ ఒప్పందం నిర్దేశించింది. ఈ సమయంలోనే రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్ కశ్మీర్‌కు వ్యతిరేకంగా జాతీయ దురహంకారాన్ని రెచ్చగొట్టడానికి, కశ్మీర్ సమస్యను మత సమస్యగా చూపడానికి ప్రయత్నాలు ప్రారంభించింది. ఒకే దేశంలో ఇద్దరు ప్రధానులు, రెండు రాజ్యాంగాలు, రెండు పతాకాలు చెల్లవని, కశ్మీర్‌ను భారతదేశంలో పూర్తిగా భాగం చేయాలని అర్ఎస్ఎస్ ఉద్యమం చేపట్టింది.

ఈ నేపథ్యంలో నెహ్రూ ప్రభుత్వం షేక్ అబ్దుల్లాపై విరుచుకుపడి 1953 ఆగస్టు 9న ఆయనను అరెస్టు చేసింది. బక్షీ గులాం మహమ్మద్ ప్రధానమంత్రిగా కొత్త ప్రభుత్వం ఏర్పాటయింది. కశ్మీర్ శాసన నిర్మాణ సభలోని చాల మంది సభ్యులు జైలు పాలయ్యారు. 1954 ఫిబ్రవరిలో కశ్మీర్ శాసన నిర్మాణ సభ సమావేశమయింది. నెహ్రూ ప్రభుత్వ కనుసన్నల్లో మెలిగే బక్షీ గులాం మహమ్మద్ నాయకత్వాన విలీన ఒప్పందాన్నీ ఏకగ్రీవంగా అంగీకరించింది. కశ్మీర్ శాసన నిర్మాణసభ చేసిన ఈ తీర్మానం ఆధారంగా 1954 మే 14 నుంచి అమలులోకి వచ్చేలా భారత రాజ్యాంగాన్ని జమ్మూ-కశ్మీర్‌లకు అన్వయింపజేసే ఉత్తర్వును రాష్ట్రపతి జారీ చేశాడు. ఈ ఉత్తర్వు ప్రకారం కేంద్ర ప్రభుత్వ అధికారం కేవలం మూడు అంశాలకు మాత్రమే గాక కేంద్ర జాబితాలోని అన్ని అంశాలకూ వర్తిస్తుంది. ఈ ఉత్తర్వుకు కాలక్రమంలో పలు సవరణలు చేసి కేంద్ర ప్రభుత్వం తన అధికారాలను విస్తృతమూ, పటిష్టమూ చేసుకుంది. ఈలోగా 1957 నవంబర్ 17న కశ్మీర్ శాసన నిర్మాణసభ తన స్వంత రాజ్యాంగాన్ని ఆమోదించుకుంది. సొంత రాజ్యాంగం ఆమోదించడంతో శాసన నిర్మాణ సభ పని తీరినట్టే గనుక అది రద్దయిపోయింది. భారత రాజ్యాంగంలోని 370 అధికరణం ప్రకారం రాష్ట్రపతి కశ్మీర్ శాసన నిర్మాణ సభ సిఫారసుపైన మాత్రమే నిర్ణయాలు తీసుకోవలసి ఉంది గనుక 1957 తర్వాత రాజ్యాంగంలోని 370 అధికరణం ఒక చిక్కుముడి అయిపోయింది.

1956 మార్చ్ 29న లోక్‌సభలో చేసిన ప్రసంగంలోనూ, ఏప్రిల్ 2న ఢిల్లీలో ఏర్పాటు చేసిన పత్రికా సమావేశంలోనూ నెహ్రూ స్పష్టంగా తాను ప్లెబిసైట్‌కు వ్యతిరేకమని మాటమార్చాడు. నెహ్రూ అనుకున్నట్టు గానే కశ్మీర్ శాసన నిర్మాణ సభ ఆమోదించిన రాజ్యాంగంలో మూడో అధికరణం 'జమ్మూ-కశ్మీర్ రాష్ట్రం భారత యూనియన్‌లో అంతర్భాగం గా ఉన్నది, ఉంటుంది' అని ప్రకటించారు. ప్రజాందోళనను, ఆ ఆందోళనకు నాయకత్వం వహించిన నేషనల్ కాన్ఫరెన్స్‌ను బలహీనం చేయడానికి ఢిల్లీ పాలకులు ఒకవైపు అణచివేత చర్యలను, మరోవైపు నాయకత్వాన్ని లొంగతీసుకోవడం సాగించారు. షేక్ అబ్దుల్లాను మొదట ప్రివెంటివ్ డిటెన్షన్ కింద అరెస్టు చేసి 12 సంవత్సరాల పాటు జైలు పాలు చేశారు. 1964లో కొద్దికాలం పాటు విడుదల చేసి మళ్లీ 1965లో భారత రక్షణ నిబంధనల కింద అరెస్టు చేశారు. 1971లో రాష్ట్ర బహిష్కరణ విధించారు. చివరికి 1975 ఫిబ్రవరి 24న షేక్ అబ్దుల్లాకు, ఇందిరాగాంధీకి మధ్య కుదిరిన ఒప్పందం ప్రకారం ప్లెబిసైట్ డిమాండ్‌ను ఉపసంహరించుకొంటానని షేక్ అబ్దుల్లా ప్రకటించాడు. అయితే, జమ్మూ కశ్మీర్ ప్రత్యేక ప్రతిపత్తిని కొనసాగించడానికి ఉభయులు అంగీకరించారు.

షేక్ అబ్దుల్లా అరెస్టయిన తర్వాత అధికారానికి వచ్చిన బక్షీగులాం మహమ్మద్ కూడ 1963లో బర్తరఫ్ అయి, అరెస్టయ్యాడు. తర్వాత సయ్యద్ మీర్ ఖాసీం గద్దె ఎక్కాడు. 1982 వరకు అధికారంలో ఉన్న షేక్ అబ్దుల్లా తర్వాత ఆయన కొడుకు ఫరూఖ్ అబ్దుల్లా అధికారానికి వచ్చాడు. 1984లో ఫరూక్ అబ్దుల్లాను కూడా బర్తరఫ్ చేసి గులాం మహమ్మద్ షా చేతికి అధికారం ఇచ్చారు. షా కూడ అధికారం పోగొట్టుకున్న తర్వాత హఠాత్తుగా రాజీవ్ గాంధీకీ, ఫరూఖ్ అబ్దుల్లాకూ మధ్య మంతనాలు సాగి కాంగ్రెస్(ఐ) కీ, నేషనల్ కాన్ఫరెన్స్‌కూ పొత్తు కుదిరింది. నేషనల్ కాన్ఫరెన్స్ ప్రజావిద్రోహ మార్గాన్ని అర్థం చేసుకున్న ప్రజలు కశ్మీర్‌లో ఎన్నికలను పెద్ద ఎత్తున బహిష్కరిస్తూ వస్తున్నారు.

1976-77ల్లో జమ్మూ కశ్మీర్ లిబరేషన్ ఫ్రంట్ (జెకెఎల్ఎఫ్) అమానుల్లా ఖాన్ నాయకత్వంలో ఏర్పడింది. పాకిస్థాన్ ప్రోద్బలంతో పని చేస్తున్న సంస్థలు, కశ్మీర్‌ను పాకిస్థాన్‌తో విలీనం చేయాలనే కోరికతో పనిచేస్తున్న సంస్థలు లేకపోలేదు. కాని అత్యధిక సంఖ్యాక కశ్మీరీలకు ప్రాతినిధ్యం వహిస్తున్న జెకెఎల్ఎఫ్ కశ్మీర్ విమోచన లక్ష్యంగా పెట్టుకుంది. రెండు దేశాల ఆక్రమణలోను ఉన్న కశ్మీర్‌ను విముక్తం చేసి స్వతంత్ర కశ్మీర్ ఏర్పరచాలనేది జెకెఎల్ఎఫ్ లక్ష్యం. జెకెఎల్ఎఫ్ మత వ్యవహారాలలో కూడ సెక్యులర్ వైఖరి తీసుకుంటున్నది. 'కశ్మీరియత్'గా ప్రసిద్ధమైన కశ్మీరీ సాంస్కృతిక జాతీయ ఐక్యతను ఇది పునాదిగా భావిస్తున్నది.

1987 నాటికి తమకు హామీ ఇవ్వబడిన స్వయం నిర్ణయాధికారం ఇక ఎప్పటికీ శాంతియుత మార్గం ద్వారా పొందడం సాధ్యం కాదు అనే నిర్ణయానికి వచ్చారు కశ్మీరీ యువకులు. కావున సాయుధ పోరాట పంథాను ఎంచుకున్నారు. పాలకుల నిర్లక్ష్య ఆధిపత్య విస్తరణ వాద విధానాల ఒత్తిడి వల్లనే కశ్మీర్ ప్రజల జన్మహక్కు అయిన స్వయం నిర్ణయాధికార హక్కు కోసం సాగుతున్న ఉద్యమం 1988 జూలై 31 నుండి సాయుధ పోరాటంగా మారింది.

1990 జనవరి 19న జగ్‌మోహన్‌ను కశ్మీర్ గవర్నర్‌గా నియమించారు. జగ్‌మోహన్ కశ్మీర్‌కు వెళ్లిన వెంటనే ఆందోళనను మత కల్లోలంగా చిత్రించడానికి ప్రయత్నాలు ప్రారంభించారు. కశ్మీరీ

పండితులకు, ముస్లింలకు మధ్య ఘర్షణలు జరుగుతున్నాయనే అబద్ధపు ప్రచారం సాగించాడు. కశ్మీర్ లోయలో హిందువులకు రక్షణ కల్పించలేమని, వాళ్లకు జమ్మూకు గాని, ఇతర రాష్ట్రాలకు గాని వెళ్లే ఏర్పాట్లు చేస్తామని ప్రచారం చేసి, మత విద్వేషాన్ని రెచ్చగొట్టాడు. జమ్మూ వెళ్లిన హిందూ ఉద్యోగులకు పని చేయకపోయినా జీతాలు ఇస్తూ, శ్రీనగర్‌లోని ముస్లింల పట్ల వివక్ష ప్రదర్శించారు. కశ్మీర్‌లోయను రోజుల తరబడి కర్ఫ్యూ పాలు చేసి, పౌర జీవనాన్ని స్తంభింపజేశాడు. కశ్మీర్ గుర్తింపును ధ్వంసం చేసి, దాని స్థానంలో ముస్లిం గుర్తింపులు నిలబెట్టి, దాన్ని దుష్ప్రచారం ద్వారా, అణచివేత ద్వారా ఎదుర్కొనే వ్యూహం భారత పాలక వర్గాలు రూపొందించాయి. ఫలితంగా హిందువులు, ముస్లింలు దగ్గర కావడాన్ని నివారించి, ఇరువురి మధ్య ద్వేషాన్ని పెంచడంలో సఫలం అయ్యాయి. భారత పాలకుల, జగ్‌మోహన్ చర్యల వల్ల కశ్మీరీల జాతీయకాంక్షలు భారతదేశంలో నెరవేరవని, జాతీయ విముక్తి పోరాటం తీవ్రంగా సాగించవలసిందేనని నిర్ధారణకు వచ్చారు. 1995లో అవుట్ లుక్ పత్రిక కశ్మీర్‌లో జరిపిన ఒక సర్వేలో 72 శాతం స్వతంత్ర కశ్మీర్‌ను కోరుకోగా, 19 శాతం పాకిస్థాన్‌లో కలువాలని కోరుకోగా, 84 శాతం కశ్మీర్ సమస్యకు భారత రాజ్యాంగ పరిధిలో పరిష్కారం లేదని చెప్పారని, 66 శాతం కశ్మీర్‌లో పెరుగుతున్న ఇస్లామిక్ మతవాదాన్ని నిర్ద్వందంగా ఖండించారని ప్రకటించింది. ఈ గణాంకాలు కశ్మీరీల మనోభావాలకు చక్కని నిదర్శనం.

**జమ్మూ కశ్మీర్ రాష్ట్రం ప్రత్యేక ప్రతిపత్తి లక్షణాలు**

జమ్మూ కశ్మీర్ శాసనసభ ఆమోదం లేకుండ పార్లమెంట్ ఆ రాష్ట్రానికి సంబంధించిన కొన్ని శాసనాలు చేయడానికి వీలులేదు. ఉదాహరణకు– ఎ) ఆ రాష్ట్ర భూభాగ సరిహద్దులు మార్చడం, బి) ఆ రాష్ట్రంలోని ఏ ప్రాంతానికైనా సంబంధించి అంతర్జాతీయ ఒడంబడికలు చేసుకోవడం. సి) ఆ రాష్ట్ర స్వతంత్ర ప్రతిపత్తిని కాపాడుటకు కొన్ని పరిమితులు కేంద్ర కార్యనిర్వాహక వర్గంపై విధించారు. డి) రాష్ట్ర ప్రభుత్వ సమ్మతి లేకుండా రాష్ట్రపతి తన అధికారంలో ఉన్న 352వ అధికరణను జాతీయ అత్యవసరం పరిస్థితిని ఆ రాష్ట్రంలో విధించరాదు. ఇ) 365వ నిబంధన ప్రకారం ఏ రాష్ట్రంలోనైనా రాష్ట్రపతి పాలనను విధించే అధికారం రాష్ట్రపతికి ఉన్నప్పటికి జమ్మూ కశ్మీర్ రాజ్యాంగాన్ని రద్దు చేసే అధికారం కేంద్రానికి లేదు. ఎఫ్) 360 నిబంధన ప్రకారం కేంద్రం విధించే ఆర్థిక అత్యవసర పరిస్థితి జమ్మూ కశ్మీర్ రాష్ట్రానికి వర్తించదు. మనదేశంలో ఏ రాష్ట్రానికి ఇవ్వని ప్రత్యేక హక్కులను జమ్మూ కశ్మీర్ రాష్ట్రానికి కల్పించారు.

భారత రాజ్యాంగం ప్రకారం.. 370వ అధికరణ జమ్మూకశ్మీర్ రాష్ట్రానికి ప్రత్యేక స్వయం ప్రతిపత్తి కల్పించే 'తాత్కాలిక నిబంధన' అయినందువలన రాజ్యాంగం ద్వారా ఇతర రాష్ట్రాలన్నింటికీ వర్తించే అధికరణలన్నీ జమ్మూకశ్మీర్‌కు వర్తించవని ఈ అధికరణ స్పష్టం చేస్తోంది. రక్షణ, విదేశీ వ్యవహారాలు, ఆర్థిక, సమాచార అంశాలు మినహా.. భారత పార్లమెంట్ చేసే ఏ చట్టాలనైనా జమ్మూకశ్మీర్‌కు వర్తింప చేయాలంటే.. అందుకు పార్లమెంట్ ఆ రాష్ట్ర ప్రభుత్వ ఆమోదాన్ని తీసుకోవాలి. అందుకే మిగతా భారతదేశంతో పోలిస్తే ఈ రాష్ట్రంలో పౌరులకు పౌరసత్వం, ఆస్తిపై యాజమాన్యం, ప్రాథమిక హక్కులు వంటి వాటితో సహా ప్రత్యేక చట్టాలు ఉంటాయి. భారతదేశంలో ఏ రాష్ట్రానికి లేని విధంగా జమ్మూ కశ్మీర్‌కు సొంత రాజ్యాంగం, సొంత జెండా, సొంత శిక్షాస్మృతి ఉన్నాయి. రాజ్యాంగం ప్రకారం కశ్మీర్‌కు ప్రత్యేక ప్రతిపత్తి ఉన్నప్పటికీ కాలం గడిచేకొద్ది ఆచరణలో భారత పాలకవర్గం కశ్మీర్ స్వయం ప్రతిపత్తిని హరించింది.

మొత్తంగా చూస్తే గడిచిన ఆరు దశాబ్దాల కాలంలో 370 అధికరణ కరి మింగిన వెలగపండులా మారింది. కశ్మీర్ తన స్వంత రాజ్యాంగాన్ని సవరించే అధికారం కశ్మీరీలకు లేకుండా నిషేధించారు. జమ్మూ కశ్మీర్ రాష్ట్రానికి శాసనసభ్యులు ఎన్నుకున్న ప్రధానమంత్రి ఉంటారు. కాని ప్రధాని స్థానంలో ఇప్పుడు గవర్నర్, ముఖ్యమంత్రి వచ్చారు. కశ్మీర్‌కు స్వంత జాతీయ పతాకం ఉండేది. ఇప్పుడు జాతీయ అనే పదాన్ని తొలగించి ప్రభుత్వ పతాకం అని పేరు పెట్టారు. 370 ప్రకారం జమ్మూ కశ్మీర్ ప్రజలు భారతదేశ పౌరులు కారు. కాని ఇప్పుడు వారు భారత పౌరులు. భారతదేశ పౌరులు జమ్ము కశ్మీర్‌లో పర్యటించాలంటే కస్టమ్స్ అధికారుల అనుమతి తీసుకోవాలి. కాని ఇప్పుడు అటువంటి నిబంధనలు లేవు. భారతీయ సమగ్రతను, సార్వభౌమత్వాన్ని గౌరవించ వలసిన అవసరం జమ్మూ కశ్మీర్ ప్రజలకు లేదు. కాని ఇప్పుడు అది తప్పనిసరి. జమ్మూ కశ్మీర్‌కు సంబంధించి పార్లమెంట్ కేంద్ర జాబితాలోని అంశాలపైనే చట్టాలు చేయాలి. కాని ఇప్పుడు ఉమ్మడి జాబితా, రాష్ట్ర జాబితాలోని అంశాలపై కూడా చట్టాలు చేస్తున్నది. జమ్మూ కశ్మీర్‌కు సంబంధించి సుప్రీంకోర్టు పరిధి ఆర్టికల్ 131కి మాత్రమే పరిమితం, కాని ఇప్పుడు సుప్రీంకోర్టు కశ్మీర్ పరిపాలన వ్యవహారాలను, రాష్ట్ర చట్టాలను కూడా సమీక్షిస్తున్నది.

మన పాలకుల అపసవ్య విధానాలు కాలం గడిచే కొద్దీ వారిలో విశ్వాసాన్ని దెబ్బతీయడానికి దారితీశాయి. ఫలితంగా విశ్వాసం స్థానంలో సందేహాలు, అనుమానాలు, అపనమ్మకాలు వారిలో వేళ్లూనుకున్నాయి. దీన్ని ఆసరా చేసుకొని పాకిస్థాన్ పాలకులు కాశ్మీరీయుల్లో మతోన్మాదాన్ని, వేర్పాటువాదాన్ని రగుల్కొల్పేందుకు నిరంతరం కృషిని కొనసాగిస్తూ వస్తున్నారు. పరిస్థితి చేయి దాటిపోతున్నా కశ్మీర్ స్వయం ప్రతిపత్తిని గౌరవించే నిజాయితీని భారత ప్రభుత్వం ప్రదర్శించక పోవడం మూలానా సమస్య జటిలమవుతూ వచ్చింది. జటిలమైన సమస్యకు ప్రజాస్వామ్య పరిష్కారాన్ని వెతికే బదులు, ప్రజల ఆకాంక్షల్ని అణచి వేసేందుకు 1957లో సైన్యాన్ని పంపితే ఇప్పటి దాకా కశ్మీర్ సైనిక ఉక్కుపాదాల కింద నలుగుతూ ఉంది. నిజానికి కశ్మీర్ ప్రజలది విషాధకరమైన, ఆవేదనా భరితమైన, సుదీర్ఘ అణచివేత చరిత్ర. ఇలా మన దేశ రాజకీయ, ఆర్థిక, సాంఘిక జీవన ప్రధాన స్రవంతిలోకి న్యాయసమ్మతమైన, గౌరవ ప్రదమైన పద్ధతిలో కశ్మీర్ ప్రజలను భాగం చేసుకునేందుకు అవసరమైన చర్యలను భారత ప్రభుత్వాలు తీసుకోవడంలో విఫలమయ్యాయి.

ఆర్టికల్ 370ను రద్దు చేసినట్లయితే 'పాలనా యంత్రాంగం' అనే అంశం అంతర్ధానమై, కశ్మీర్ భారత్ ఆక్రమిత ప్రాంతమవుతుంది. దాంతో కశ్మీర్ ఆక్రమణపై ఐక్యరాజ్యసమితి చేసిన అనేక తీర్మానాలు అమలులోకి వచ్చే ప్రమాదం పొంచి ఉంది. ఈ ఇబ్బందులకు తోడు రాజ్యాంగ సభ అవసరం లేదని భావిస్తే తప్ప 370ను రద్దు చేయడం సాధ్యం కాదని ఆ అధికరణంలోని మూడవ క్లాజు చెపుతోంది. ఆ రాజ్యాంగసభ ఇప్పుడు ఉనికిలో లేదు కాబట్టి ఆ అధికరణాన్ని రద్దు చేయడం సాధ్యమయ్యే పని కాదని రాజ్యాంగ నిపుణుల అభిప్రాయం. అయితే 368 అధికరణ ప్రకారం మూడింట రెండువంతుల మెజారిటీ ఉంటే రాజ్యాంగాన్ని సవరించే అధికారం పార్లమెంట్‌కు ఉంటుంది. ఉభయ సభల్లో ఎన్‌డిఏకి

అలాంటి మెజారిటీ లేదు. కనుక 370 అధికరణ రద్దు ఇప్పటికిప్పుడైతే అసాధ్యం. పైగా ఈ పాటి రాజ్యాంగ పరిజ్ఞానం బిజెపికి కొరవడిందని భావించలేం. అయినా, ఈ రాద్ధాంతం ఎందుకంటే త్వరలో వివిధ రాష్ట్రాల్లో ముఖ్యంగా డిసెంబర్‌లో జమ్మూకశ్మీర్‌లో జరుగనున్న ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని మాత్రమే అనే సందేహం కలుగకమానదు.

కేంద్రంలో మోడీ ప్రభుత్వం అధికారంలోకి వచ్చీరాగానే తమ హిందూత్వ ఎజెండా అమలుకు ఆర్ఎస్ఎస్ ప్రోద్బలంతో కసరత్తు మొదలు పెట్టింది. అయోధ్యలో రామమందిర నిర్మాణం, ఉమ్మడి పౌర స్మృతి, జమ్మూ కశ్మీర్‌కు ప్రత్యేక ప్రతిపత్తి కల్పించే 370 అధికరణ రద్దు... ఈ మూడు అంశాలు బిజెపి ఎజెండాలో ఎంతో కీలకమైనవి. సందర్భాన్ని బట్టి వీటిని తెరపైకి తేవడం లేదా తెర వెనక్కి నెట్టడం చేస్తుంటుంది. ఇప్పుడు జమ్మూ కశ్మీర్‌కు ప్రత్యేక హోదా కల్పిస్తున్న రాజ్యాంగ అధికరణం 370 మళ్లీ చర్చనీయాంశమైంది. జమ్మూకశ్మీర్‌కు ప్రత్యేక ప్రతిపత్తి కల్పిస్తున్న ఆ అధికరణం రద్దుకు విస్తృత చర్చ చేపడతామని జమ్మూ-కశ్మీర్ ఎంపి, మోడీ కేబినెట్ శాస్త్ర సాంకేతిక శాఖ సహాయమంత్రి జితేంద్రసింగ్ ప్రకటించడంతో రాజకీయ దుమారం మొదలయింది. బిజెపి ఎజెండాను ఎన్‌డిఎ భాగస్వామ్య పక్షాలతో పాటు కాంగ్రెస్, వామపక్షాలు తదితర రాజకీయ పక్షాలన్నీ తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాయి. ఈ సారి సార్వత్రిక ఎన్నికల్లో బిజెపి సొంతంగానే మెజారిటీ సాధించడంతో తన రహస్య ఎజెండాను ప్రారంభంలోనే ముందుకు తెచ్చేందుకు సాహసం చేస్తున్నది.

జమ్మూ - కశ్మీర్‌లో ఆస్తి హక్కు కల్పించి బయట నుంచి హిందువులను పెద్దసంఖ్యలో అక్కడకు తరలించి, అక్కడి ముస్లింలను మైనారిటీలుగా మార్చాలన్నది బిజెపి, ఆర్ఎస్ఎస్ ప్రధాన ఉద్దేశం. భారత్, కశ్మీర్ ప్రజల మధ్య భావ సమైక్యత కొరవడిందని, అందుకు 370 అధికరణమే అడ్డంకిగా ఉందని బిజెపి నేతలు వాదిస్తున్నారు. 370అధికరణం రద్దు, కశ్మీర్ సమస్యపై ఇప్పటికే చర్చలు మొదలైనాయని జితేంద్రసింగ్ పేర్కొన్నారు. చర్చలకు ముందు అక్కడి ప్రజల పౌర, ప్రజాస్వామిక హక్కులకు భంగం కలిగిస్తున్న ప్రత్యేక సైనికాధికార చట్టాన్ని తొలగించి, ఆ ప్రాంత అభివృద్ధికి పాటు పడితే మంచిది. ఒకపక్క యుపిఎ హయాంలో హరించిన రాష్ట్రాల హక్కులను పునరుద్ధరిస్తామని ఎన్నికల సందర్భంగా బిజెపి చెప్పింది. ఇప్పుడు కశ్మీర్ అనుభవిస్తున్న ప్రత్యేక హక్కుల్లో కొన్నింటిపై బిజెపికి అభ్యంతరం ఉండొచ్చుగానీ వాటిల్లో చాలా భాగం ఇతర రాష్ట్రాలకు వర్తింపజేయవలసినవి ఉన్నాయని గుర్తించాలి. ఒక్క యుపిఎ పాలనలో మాత్రమే కాదు... ఇందిరాగాంధీ పాలనాకాలం నుంచి 'రాష్ట్రాల జాబితా' క్రమేపీ చిక్కిపోతూ వస్తున్నది. కేంద్రం ఏదో సాకుతో ప్రతి రంగంలోనికీ చొరబడి రాష్ట్ర ప్రభుత్వాలను మున్సిపాలిటీల స్థాయికి దిగజార్చింది.

భారత సమాఖ్య విధానంలో రాష్ట్రాలకు స్వతంత్ర ప్రతిపత్తి అంటూ లేదు. రాజ్యాంగం ప్రకారం కేంద్రానికి అత్యధిక అధికారాలను కేటాయించడం వల్ల రాష్ట్రాలు తమ స్వేచ్ఛను కోల్పోతున్నాయి. రాష్ట్రాల అధికారాలలో పునర్విభజన చేయాలని, రాష్ట్రాలకు స్వతంత్ర ప్రతిపత్తి కల్పించాలని రాష్ట్ర పార్టీలు, నేతలు డిమాండ్ చేస్తూనే ఉన్నారు. కేంద్ర రాష్ట్రాల మధ్య పలు అంశాల పట్ల వివాదాలు తలెత్తుతున్నాయి. ఇందిరాగాంధీ 1983 జూన్ 9న ఆర్.ఎం. సర్కారియా అధ్యక్షతన కేంద్ర, రాష్ట్ర సంబంధాలను పరిశీలించడానికి ముగ్గురు సభ్యులతో ఒక కమిషన్‌ను నియమించింది. ఆ కమిషన్ చేసిన సూచనలు ఏవీ అమలు కాలేదు. యుపిఎ ప్రభుత్వం 2007లో సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి మదన్‌మోహన్ పూంచి నాయకత్వంలో ఐదుగురు సభ్యులతో కూడిన ఒక ప్రత్యేక కమిటీని ఏర్పాటు చేసింది. ఆ కమిటీ సర్కారియా కమిషన్ సూచనల అమలు తీరును పరిశీలించింది. ఇటీవల మనదేశంలో సంభవించిన మార్పులకు దృష్టిలో ఉంచుకొని కేంద్ర రాష్ట్ర సంబంధాలలో కొత్తగా చేపట్టవల్సిన మార్పులను పూంచి కమిటీ సూచించింది. అయినా ఇప్పటి వరకు రాష్ట్రాల డిమాండ్స్ ఏవీ అమలు కాలేదు. అన్ని రాష్ట్రాలకు, అన్ని జాతులకు స్వయం ప్రతిపత్తి కల్పించడం ఫెడరల్ నీతి. జాతుల స్వయం నిర్ణయాధికారం అనేది అంతర్జాతీయంగా గుర్తింపు పొందిన రాజకీయ హక్కు.

మన రాజ్యాంగంలోని ఒకటో ఆర్టికల్ ప్రకారం మన దేశంలోని ప్రతి రాష్ట్రానికి మన రాజ్యాంగం అన్వయిస్తుంది. అయితే ఆర్టికల్ ఒకటి మాత్రం జమ్మూ-కశ్మీర్‌కు వర్తించదు. దాని అర్థం జమ్మూ-కశ్మీర్‌కు మన రాజ్యాంగం అన్వయించదని కాదు. ఈ అన్వయింపు మన రాజ్యాంగంలోని ఆర్టికల్ 370 ప్రకారం జరుగుతుంది. జమ్మూ-కశ్మీర్ రాజ్యాంగంలోని మూడో నిబంధన ప్రకారం ఆ రాష్ట్రం భారత యూనియన్‌లో భాగమని తెలుపుతుంది. మన రాజ్యాంగంలోని ఒకటో ఆర్టికల్ జమ్మూ-కశ్మీర్‌కు అన్వయించడం సాధ్యం కానప్పుడు 370 ఆర్టికల్‌ను రద్దుచేస్తే భారత రాజ్యాంగం జమ్మూ-కశ్మీర్‌కు అన్వయించకుండా పోయి రాజ్యాంగ సంక్షోభం తలెత్తే ప్రమాదం ఉంది. 370పై రాద్ధాంతం గమనిస్తే రెండు అంశాలు గోచరిస్తాయి. ఒకటి, ఈ దశలో కశ్మీర్ అంశంపై తొందరపాటు తగదనేది, మరొకటి మన సమాజంలోని వైవిధ్యానికి హాని కలుగుతుందనే ఆందోళన కూడా ఉంది. ఎందుకంటే భారతీయ సమాజాన్ని ఏకశిలా స్వరూపంగా భావించే ఆర్ఎస్ఎస్, బిజెపిలు కశ్మీర్ దగ్గరే ఆగరని, ఆ తర్వాత మిగతా భాషలు, సంస్కృతుల ఉనికికి హాని కలిగిస్తారన్న ఆందోళన సర్వత్రా వ్యక్తమవుతున్నది. దేశాన్ని రెండు (హిందు, ముస్లిం) జాతులుగా విభజించి రాజకీయంగా లబ్ధిపొందాలనుకోవడం దారుణం. కశ్మీర్ ప్రజల మనోభావాలను గౌరవించి, వాళ్లకు స్వయం ప్రతిపత్తిని కల్పించడం సముచితంగా, ప్రజాస్వామికంగా ఉంటుంది.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమనాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

*వీక్షణంకు వచ్చే రచనలలో కొన్ని జిరాక్స్ కాపీలు వస్తున్నాయి. జిరాక్స్ నాణ్యత సరిగా ఉండడంలేదు. కొన్నిటిలో చేతి రాతలు కూడా కష్టంగా ఉంటున్నాయి. అందువల్ల అర్థం చేసుకొని టైప్ చేయడంలో చాలా ఇబ్బందులు, సమస్యలు ఎదురవుతున్నాయి. అక్షరాలు అర్థమయ్యేలా రాయండి. జిరాక్స్ మీరు ఉంచుకుని ఒరిజినల్స్ మాకు పంపి సహకరించండి. - సం.*

# ఇరాక్‌లో జాతీయ యుద్ధం

***సంచార గెరిల్లా దశ నుంచి స్థావర గెరిల్లా దశకు చేరి రేపు సంభవించే తాత్కాలిక ఓటములను అధిగమించి అంతిమ విజయం పొందే శక్తి సామర్థ్యాలు, వ్యూహాలు ఇరాక్ ప్రజలకు ఉన్నాయని అంటున్నారు* పి. ప్రసాదు**

**యు**ద్ధంలో తొలుత సమాధి చేయబడేది సత్యమే! విదేశీ దురాక్రమణ యుద్ధాల చేత గాయపడ్డ శతాబ్దాల చరిత్ర గల ఇరాక్‌కి ఇది మరింత ఎక్కువగానే వర్తిస్తుంది. నేడు ఇరాక్‌లో ఏం జరుగుతుందో తెలుసుకోవడానికి ప్రపంచ ప్రజలకు గల ఏకైక మార్గం అంతర్జాతీయ ప్రచార మాధ్యమాలే! అవి యుద్ధోన్మాద దేశాల (ముఖ్యంగా అమెరికా, బ్రిటన్) చేతుల్లో ఉన్నాయి. ఇంకా చెప్పాలంటే, ఇరాక్‌ను దురాక్రమించిన సామ్రాజ్యవాద దేశాల చేతుల్లోనే ఉన్నాయి. అందుకే ఇరాక్ నుంచి సత్యాలు వెలుగు చూసే అవకాశం ఉండదు. యుద్ధోన్మాదుల ప్రయోజనాలకు ఉపయోగపడే అసత్యాలు, అర్ధసత్యాలు, వక్రీకరణలే ప్రపంచ ప్రజలకి అందుతాయి. అలా అసత్యీకరించబడిన సంపూర్ణ సత్యమే తాజా 'ఇరాక్ అంతర్యుద్ధం'!

ఇరాక్‌లో అంతర్యుద్ధం జరుగుతున్నదంటూ నేడు అంతర్జాతీయ ప్రచార మాధ్యమాలు విస్తృతంగా ప్రచారం చేస్తున్నాయి. ఫలితంగా ప్రపంచ ప్రజలు కూడా అది అంతర్యుద్ధమని అపోహలు పడే అవకాశాలు మెండుగా ఉన్నాయి. ప్రచార మాధ్యమాలకు నేడు వార్తల (న్యూస్) కంటే అభిప్రాయాలే (వ్యూస్) ప్రథమ ప్రాధమ్యంగా మారాయి. ప్రచారానికి ఇరుసుగా ఉండాల్సిన వార్తలను వెనుక సీటులోకి అవి నెట్టి వేశాయి. తమ స్వంత అభిప్రాయాలను (వ్యాఖ్యలు, వ్యాఖ్యానాలు, విశ్లేషణలు వగైరా) ప్రథమ స్థానంలోకి తెచ్చాయి. వార్తలలో కూడా అనేక పాక్షికతలు, వివక్షతలు చోటు చేసుకున్నప్పటికీనీ అందులో మిగిలిన కొన్ని పాక్షిక సత్యాలను కూడా మీడియా తన స్వంత అభిప్రాయాలతో సమాధి చేస్తున్నది. నేడు వక్రీకరించబడుతున్న 'అంతర్యుద్ధం' వెనుక దాగిన నిప్పులాంటి నిజమే 'ఇరాక్ జాతీయ విమోచనోద్యమం'!

తాజా ఇరాక్ రాజకీయ పరిణామాలను విదేశీ సామ్రాజ్యవాద శక్తుల దృక్కోణం నుంచి గానీ ఇస్లాం తీవ్రవాద సంస్థల దృక్కోణం నుంచి గానీ పరిశీలించడం సరికాదు. ఇరాక్ దేశం మౌలికంగా ఇరాక్ ప్రజలదే! ఇరాక్ చరిత్ర నిర్మాతలు వాళ్లే! అలాంటి ఇరాక్ దేశ ప్రజల దృక్కోణం నుంచి ఇరాక్ రాజకీయ పరిణామాలను విశ్లేషించడం శాస్త్రీయమవుతుంది. అది ఆచరణీయం, అనుసరణీయం!

నేడు ఇరాక్ అంతర్యుద్ధం అంచున ఉందంటూ జరిగే విస్తృత ప్రచారానికి రహస్య ఎజెండా ఉంది. ఇరాక్ పై మరోసారి విదేశీ సేనల దాడికి ప్రపంచ ప్రజల చేత ఆమోదం పొందే కుట్ర ఉంది. అందుకు కారణాలున్నాయి. ఇరాక్ ప్రజలను ఇస్లాం ఉగ్రవాద శక్తులు ఊచకోత కోస్తున్నాయనీ ఇరాక్ ప్రభుత్వం తన ప్రజలకు రక్షణ కల్పించలేని నిస్సహాయస్థితిలో ఉందనీ ప్రధానంగా ఆంగ్లో - అమెరికన్ మీడియా నేడు ప్రచారం చేస్తున్నది. ఇరాక్ ప్రజలూ, ఇరాక్ ప్రభుత్వమూ జంట బాధితశక్తులు అన్న భావనను ప్రపంచ ప్రజల మనస్సులలో కలిగించే విధంగా యీ ప్రచారం సాగుతోంది. ఈ ప్రచార లక్ష్యం బాధిత ఇరాక్ ప్రజలనూ, ప్రభుత్వాన్నీ రక్షించేశక్తులు ఇరాక్‌లో లేవని సందేశమివ్వడమే! విదేశీ శక్తులు జోక్యం చేసుకునైనా, ఇరాక్ ప్రజలను రక్షించాలన్న డిమాండు ప్రపంచ ప్రజల నుంచి తెప్పించే లక్ష్యం గలదే! అదే సమయంలో తమకు మాత్రం ఇరాక్‌లో జోక్యం చేసుకునే ఉద్దేశం లేదని ముఖ్యంగా అమెరికా, బ్రిటన్‌లు పదేపదే నంగనాచి ప్రకటనలు చేస్తుండడం గమనార్హం! అంతేకాకుండా ఇరాక్ భవితవ్యం ఇరాక్ ప్రజల చేతుల్లోనే ఉందని అవి వేదాలు కూడా వల్లిస్తున్నాయి. వీటి చిలక పలుకుల ఆంతర్యం తెలియనిది కాదు. ఓ వైపు తమకు తాము రక్షించుకోలేని జీహాదు మారణకాండకు బలవుతున్న బాధితుల దుస్థితిని చూపిస్తూ, మరోవైపు తమ రక్షణ తామే చేసుకోవాలనడంలో ఆంతర్యం ఉంది. మరోసారి సైనిక దురాక్రమణ చర్యకు ప్రపంచ ప్రజల నుంచి పూర్తిస్థాయి 'సమ్మతి'ని నిర్మించిన తర్వాత, (ముఖ్యంగా అమెరికా ప్రజాభిప్రాయాన్ని కూడా) తమ రహస్య ఎజెండా ప్రకారం ఏదో ఓ రకమైన విదేశీ సైనిక చర్యకు ఉపక్రమించడమే!

చమురు వనరులతో కూడిన ఇరాక్‌ను 2003లో అమెరికా దురాక్రమించిన విషయం తెలిసిందే. అట్టి ఆక్రమిత ఇరాక్ ఆర్థిక, రాజకీయ వ్యవస్థలను తన పూర్తి అదుపులోకి తెచ్చుకునేంత వరకూ సుమారు రెండు లక్షల సైన్యాన్ని అమెరికా అక్కడ కొనసాగించింది. అందులో ప్రధాన విభాగం 'దాడి బలగాలు' (కంబాట్ ఫోర్సెస్)కాగా ద్వితీయ విభాగం 'స్థిరీకరణ బలగాలు' (స్టెబిలైజేషన్ ఫోర్సెస్)గా ఉండేవి. మొదటి విభాగం ఇరాక్ గెరిల్లా ఉద్యమ అణచివేతను చేపడితే రెండో విభాగం ఆక్రమిత చమురు బావులు, చమురు శుద్ధి కేంద్రాలు, పాలనా కేంద్రాలను స్థిరపరచుకునే పనిని చేపట్టాయి. అమెరికాలో వెల్లువెత్తిన ప్రజా నిరసన, ఇరాక్‌లో తన సైనిక తర్ఫీదుతో రెండు లక్షల మంది ఇరాక్ దేశీయ సైన్యం ఏర్పాటుల నేపథ్యంలో 2011 నాటికి అమెరికన్ సైన్యాలు ఇరాక్ నుంచి నిష్క్రమించాయి. దీనికి ముందు బూటకపు ఎన్నికల తంతు జరిపింది. తద్వారా నౌరీ - అల్ - మల్కి కీలుబొమ్మ ప్రభుత్వాన్ని కూడా ఇరాక్‌లో నియమించింది. తన కీలుబొమ్మ సర్కారు ద్వారా ఇరాక్ ఆయిలు లూటీకి 'సుస్థిర పరిస్థితుల'ను ఏర్పరచుకొని అమెరికా కుహనా సైనిక నిష్క్రమణను చేపట్టింది. అలా నిష్క్రమణ చర్య ద్వారా ఇరాక్ స్వతంత్ర దేశం అని అపోహపడే విధంగా ప్రపంచ ప్రజల మనోభావాలను మలిచింది. తిరిగి మూడేళ్ల తర్వాత ఇరాక్ 'స్వాతంత్ర్యం' విదేశీ ఇస్లాం తీవ్రవాదుల చేతుల్లో బలౌతున్నట్లు ప్రపంచ

ప్రజల మనోభావాలను మలుస్తున్నది. తాను ఇరాక్‌కు స్వాతంత్ర్యదాతగా, ఇస్లాం తీవ్రవాద సంస్థలు స్వాతంత్ర్య భక్షకులుగా చిత్రిస్తున్నది.

మీడియా కళ్లద్దాలను తొలగించి, వాస్తవిక దృష్టితో చూసినపుడు తాజా ఇరాక్ పరిణామాలు మనలను దిగ్భ్రాంతికి గురి చేయక తప్పదు. మన కళ్లను మనమే నమ్మలేని దిగ్భ్రాంతికర వాస్తవాలను నేటి ఇరాక్‌లో చూడగలం. ప్రపంచాన్ని గడగడ లాడించగల సైనిక, శక్తి సామర్థ్యాలు అమెరికాకు ఉన్నాయన్న ఓ ప్రచారాన్ని ఇరాక్ ప్రజలు నేడు పటాపంచలు చేస్తున్నారు. అది కాగితం పులేనని మరోసారి నిరూపిస్తున్నారు. మానవ రహిత విమానాలు, స్టార్ వార్ సామర్థ్యం, అత్యాధునిక ఆయుధ సంపత్తి, హైటెక్ సైనిక కళలలో ఆరితేరిన అమెరికా అండదండలు గల కీలుబొమ్మ ప్రభుత్వాన్ని ఎదిరించి నిలబడడం సామాన్య విషయం కాదు. అడవులూ, లోయల వంటి వ్యూహాత్మక రక్షణ ప్రాంతాలు లేని ఎడారి దేశంలో ఈ విజయాల ప్రాధాన్యత తెలియనిది కాదు. మట్టి మనుషుల అండదండలు లేకుండా ఏ తీవ్రవాద శక్తులు కూడా ఇలా ఎదిరించి నిలబడడం సాధ్యం కాదు. పట్టణాలూ, నగరాలూ, వరసగా విముక్తి చేసుకోవడంతో పాటు, వాటిని సుస్థిరపరచుకుంటూ పురోగమించడం అసామాన్యమైనదీ, సాహసోపేతమైనదీ! ఇది ముమ్మాటికీ ప్రజల ప్రమేయంతో సాగే యుద్ధమే! అంతేకాదు, వర్తమాన ప్రపంచంలో అదో సాహసోపేత యుద్ధం కూడా! అయితే అది ఏ తరహా యుద్ధమనేది రాజకీయంగా వర్గీకరించాల్సి ఉంది.

సరిగ్గా నూరేళ్ల క్రితం రచించిన తన 'పెట్టుబడిదారీ ఉన్నత దశే సామ్రాజ్యవాదం' అనుగ్రంథంలో ఆధునిక యుగంలో భూగోళంపై జరిగే యుద్ధాలను అంతిమ పరిశీలనలో నాలుగు రకాలుగా లెనిన్ వర్గీకరించాడు. ఏ యుద్ధానైనా' దాని గమనం, గమ్యాలను బట్టే విశ్లేషించాలన్నాడు. యుద్ధ మూలాలతో సంబంధం లేకుండా పైకి కనిపించే నినాదాలను బట్టి నిర్ధారించడం సరికాదు. ఇరాక్ వాస్తవ భౌతిక పరిస్థితులలో నుంచే ఇరాక్‌లో తాజా యుద్ధాన్ని విశ్లేషించాల్సి ఉంది. లెనిన్ పేర్కొన్న నాలుగు రకాల యుద్ధాలకూ, నాలుగు రకాల వేర్వేరు భౌతిక, రాజకీయ పరిస్థితులు ప్రాతిపదికగా ఉండి తీరాలి. ఇది రెండు సామ్రాజ్యవాద దేశాల మధ్య జరిగే 'సామ్రాజ్యవాద యుద్ధం' కోవలోకి రాదు. సోషలిజానికీ, సామ్రాజ్యవాదానికీ మధ్య సంభవించే 'ప్రజాయుద్ధం' కోవలోకీ రాదు. పెట్టుబడిదారీ విధానానికీ, కార్మికవర్గానికీ మధ్య జరిగే 'వర్గయుద్ధం' (వర్గ పోరాటం) కోవలోకి కూడా రాదు. ఇక మిగిలిన దొక్కటే! అదే వలస, నయావలస, అర్ధవలస దేశాలకూ, సామ్రాజ్యవాదానికీ మధ్య జరిగే 'జాతీయ యుద్ధం'! ప్రస్తుతం జరిగే ఇరాక్ యుద్ధం ముమ్మాటికీ ఈ కోవలోకే వస్తుంది.

ఇరాక్ నుంచి 2011లో అమెరికన్ సైనిక బలగాల ఉపసంహరణ జరిగింది నిజమే! అయితే అది సమగ్ర సైనిక ఉపసంహరణ కాదు. కొంత భాగం 'స్థిరీకరణ బలగాలు' ఇంకా ఇరాక్‌లో కొనసాగుతూనే ఉన్నాయి. అంతేకాకుండా అమెరికన్ సైనిక నిపుణులూ, సలహాదారులూ, పర్యవేక్షకులూ వేలల్లో ఉన్నారు. ఇంకా ప్రైవేట్ విదేశీ కాంట్రాక్టు సేనలూ ఉన్నాయి. నిజానికి 2011కి ముందున్న వలస దేశ స్థితి నుంచి, సైనిక ఉపసంహరణ తర్వాత నయా వలస దేశంగా ఇరాక్ మారిందని అంతర్జాతీయ రాజకీయ పరిశీలకులందరూ ఏకగ్రీవంగా అంగీకరిస్తున్నదే ! ఈ వాదనతో విభేదించే వాళ్లూ ఉన్నారు. ప్రత్యేకంగా 'దాడి సైనిక బలగాల' ఆవశ్యకత తీరిపోయిన ఒక నిర్దిష్ట పరిస్థితులలో మాత్రమే సైనిక ఉపసంహరణ జరిగిందన్నది వీరి భిన్న వాదనగా ఉంది. క్రూర అణచివేత నిర్ణయాత్మక దశకు చేరి, దేశ జనాభాలో ముప్పై శాతం మంది నిర్వాసితులైన ఒకానొక దశలో శ్మశాన ప్రశాంతత ఏర్పడింది. అలాంటి ఒకానొక నిర్దిష్ట కాలంలో సైనిక ఉపసంహరణ జరిగిందన్నది వీరి వాదన! అందుకే అది వాస్తవ ఉపసంహరణ కిందికి రాదన్నది కూడా వీరి భావన! తన నియంత్రణలో ఇరాక్‌ను ఉంచగల ఇరాక్ దేశీయ సేనని అమెరికా తీర్చిదిద్దిందనీ, దానికి ప్రత్యక్ష పర్యవేక్షణ గల సైనిక నిపుణ వ్యవస్థను నేటికీ అమెరికా కొనసాగిస్తున్నదనీ వీరు వాదిస్తున్నారు. అందుకే నేటికీ ఇరాక్ ప్రత్యక్ష వలస దేశమే తప్ప, నయావలస దేశంగా మారలేదని వీరు బలంగా వాదిస్తున్నారు. అసలు విషయమేమిటంటే అది వలస దేశమైనా, నయావలస దేశమైనా రెండింటి మధ్య మౌలిక భేదం లేదు. అది స్వతంత్ర దేశం కాజాలదని అందరూ అంగీకరిస్తారు. అందుకే నేటి ఇరాక్ స్వతంత్ర దేశం కాజాలదు. అక్కడి విదేశీ కీలుబొమ్మ ప్రభుత్వ వ్యతిరేక పోరాటం సారాంశంలో స్వాతంత్ర్య పోరాటమే.

ఇరాక్ దేశ జనాభాలో సున్నీలు సుమారు ఇరవై శాతం మంది ఉన్నారు. షియాలు అరవై శాతం కంటే ఎక్కువే ఉన్నారు. వీరిద్దరూ అరబ్ జాతీయులే! వీరందరూ అరబిక్ భాషీయులే! వీరు కాకుండా కుర్దు జాతీయులు కూడా 17 శాతం మంది ఉన్నారు. (మతపరంగా కుర్దులు కూడా సున్నీశాఖకు చెందుతారు). షియా - కుర్దూ ఐక్య సంఘటనా ప్రభుత్వం నేడు ఇరాక్‌ను పరిపాలిస్తున్నది. దీనర్థం షియా మత పెద్దలు, కుర్దూ జాతి పెద్దలు ఒకే తాటి మీదికి వచ్చి అమెరికా కీలుబొమ్మ సర్కారును స్థాపించడం మాత్రమే! అంతర్జాతీయ ప్రచార మాధ్యమాల ప్రకారం ఆల్-మల్కి సర్కారుకు షియా, కుర్దూ ప్రజల అండదండలు కూడా పుష్కలంగా ఉన్నాయి. ఇదే నిజమైనచో 80 శాతం జనాభా అండదండలు గల ప్రభుత్వంగా భావించాలి. కేవలం సున్నీలు (అరబిక్ సున్నీలు మాత్రమే సుమా! కుర్దూ సున్నీలు ఇందులో లేరు) మాత్రమే ప్రభుత్వాన్ని వ్యతిరేకిస్తున్నారట. అంటే, అల్పసంఖ్యాక సున్నీల చేతుల్లో అది ఓటమి ఎలా పొందుతుంది? ఈ ప్రశ్నకు సమాధానం లేదు.

సమారా పట్టణంలో సుమారు ఆరేడు ఏళ్ల క్రితం అతి ప్రాచీన చరిత్రగల ఒక షియా మసీదుపై ఓ రాత్రి ఓ ఆగంతక మురాచే ఓ దాడి జరిగింది. మసీదు కూల్చివేయబడింది. అది సున్నీ తీవ్రవాదుల చర్యగా అమెరికా ప్రచార సాధనాలు చిత్రించాయి. ఆ వెంటనే సున్నీ-షియాల ఘర్షణలను పనిగట్టుకొని అమెరికా ప్రోత్సహించింది. కానీ అమెరికన్ మీడియా భూతద్దంలో చూపించినంత స్థాయిలో సున్నీ, షియా ఘర్షణలు ఇరాక్‌లో జరగలేదు. కొద్ది ప్రాంతాలో కొద్ది మేరకి జరిగాయి. ఆ తర్వాత అసలు నిజం వెల్లడైనది. అమెరికన్ సైనికులే సున్నీ అరబ్ దుస్తుల్లో ముసుగు మనుషులుగా షియా మసీదును కూల్చినట్లు బహిర్గతమైనది. అమెరికా ఆశించిన స్థాయిలో సున్నీ-షియాల మధ్య ఘర్షణలు జరగని పరిస్థితులలో ఇలా వెల్లడి కావడం అగ్రరాజ్యాన్ని మరింత ఇబ్బంది పాలు చేసింది. అక్కడ సున్నీ-షియా ప్రజల మధ్య యుద్ధం జరుగుతున్నదన్న ప్రచారంలో వాస్తవం లేదు. అరబ్ జాతీయవాదం బలంగా లేని చోట కొన్ని వెనుకబాటు శక్తులు, కొన్ని ప్రత్యేక ప్రాంతాలలో సున్నీ-షియాల మధ్య ఒక మేరకు ఘర్షణలు జరిగాయి. వాటిని మీడియా భూతద్దంలో

ప్రపంచానికి చూపించింది. కానీ పలచని నూనె పొర క్రింద తొట్టిలోని నీటివలె ఇరాక్‌లో అరబ్ జాతీయవాదం వర్ధిల్లుతున్నది. దాన్ని ప్రపంచానికి వక్రీకరించి చూపిస్తున్నదే 'సున్నీ-షియా' అంతఃకలహం! దాని ఆధారంగా నేడు చిత్రిస్తున్నదే 'అంతర్యుద్ధం'!

కూడు, గూడు, గుడ్డ, రహదారులు, మంచినీరు, విద్య, వైద్యం, ఆరోగ్యం, విద్యుత్ వంటి మౌలిక వసతులలో ఇరాక్ ఒకనాడు అమెరికా, యూరప్‌లను తలతన్నింది. ఏ ఆసియా, ఏ ఆఫ్రికా, ఏ లాటిన్ అమెరికా దేశంలో లేని అభివృద్ధిని అది సాధించింది. సద్దాం ప్రభుత్వాన్ని నియంతృత్వ సర్కారుగా విమర్శించే రాజకీయ ప్రత్యర్థులు సైతం ప్రజలకు మౌలిక వనరులతో కూడిన ప్రగతిని అది అందించిందని అంగీకరిస్తారు. ఇతర ఇస్లాం దేశాలకి భిన్నమైన లౌకిక పాలనను అది అందించిందని కూడా అంగీకరిస్తారు. ఈ రెండూ నేడు మృగ్యమయ్యాయి. నేడు భౌతికంగా అది 'శిథిల ఇరాక్'గా, 'వల్లకాడు రాజ్యం'గా మారిందని తెలిసిందే! దానికి షియా, సున్నీ, కుర్ద్ భేదం లేకుండా దేశ ప్రజలందరూ బాధితులే! ఈ నిప్పులాంటి నిజాన్ని ప్రపంచ ప్రజల ఎదుట దాచి పెట్టడానికి అమెరికా చేస్తున్న మోసం అంతా, ఇంతా కాదు. అతి ప్రాచీన నాగరికత గల ఒక ఇస్లాం లౌకిక దేశాన్ని అనాగరికంగా దురాక్రమించిన నేరాన్ని కప్పి పెట్టుకునేందుకే అది నేటి ఇరాక్‌ను అనాగరిక, అరాచక, అలౌకిక దేశంగా చిత్రించడం గమనార్హం.

వాదన కోసం ఇరాక్ ప్రజలు నేడు ఇస్లాం తీవ్రవాద శక్తులను అనుసరిస్తున్నారనుకుందాం! అందుకు కారకులెవరు? ఇస్లాం దేశాలన్నింటికి భిన్నంగా ఆదర్శ లౌకిక రాజ్యంగా పేరొందిన ఇరాక్‌ను దురాక్రమించిన విదేశీ సామ్రాజ్యవాదమే అందుకు కారణమవుతుంది. నిన్నటి లౌకిక జాతిని విధ్వంసానికి గురిచేసిన దురాక్రమణ పాలనే నేటి అలౌకిక పరిస్థితులకు దారి తీసింది. అలాంటి అలౌకిక సామాజిక, రాజకీయ పరిస్థితులే ఇరాక్ ప్రజలను లౌకిక మార్గం నుంచి తప్పిస్తాయి. వారు గతంలో అనుసరించిన లౌకిక రాజకీయ శక్తులనూ, సంస్థలనూ విదేశీ ఫాసిస్టు పాలన విధ్వంసం చేసిన పరిస్థితులను పరిగణనలోకి తీసుకోవాల్సి ఉంటుంది. ఈ నూతన అవాంఛనీయ పరిస్థితులే ఇరాక్ ప్రజలను నూతన రాజకీయ శక్తులనూ, సంస్థలనూ అనుసరించేందుకు కారణమవుతాయి. ఒకవేళ గత లౌకికవాద బాత్ పార్టీకి బదులు, నూతన ఇస్లాం మత రాజకీయశక్తులను ఇరాక్ ప్రజలు నిజంగానే అనుసరించారనుకుందాం! అందుకు అవాంఛనీయమైన నూతన పరిస్థితులను తప్ప ప్రజలను తప్పు పట్టాల్సింది లేదు. సుదీర్ఘ లౌకిక, ప్రజాతంత్ర సంప్రదాయ చరిత్రగల భారతదేశ ప్రజలు నేడు పచ్చి హిందూత్వ పునరుద్దరణ పార్టీకి పట్టం కట్టడానికి కూడా పరిస్థితులే కారణం! అందుకు కుహనా లౌకికవాద కాంగ్రెసు సర్కారు విఫలం చెందడం, సరైన ప్రజాతంత్ర, లౌకిక ప్రత్యామ్నాయం లేక పోవడం, బూటకపు వాగ్దానాలు ప్రజల న్యాయమైన ఆకాంక్షలను ప్రతిబింబించడం వంటి అనేక కారణాలున్నాయి. ఈ నూతన పరిస్థితులతో సంబంధం లేకుండా నేడు హఠాత్తుగా భారతదేశ ప్రజలు హిందుత్వవాదులుగా మారారనుకోవడం అశాస్త్రీయమవుతుంది. ఇదే సూత్రం ఇరాక్ ప్రజలకు కూడా వర్తిస్తుంది.

ఏ వలస దేశం ప్రజలు ఏ మార్గంలో, ఏ పతాకం కింద తమ దేశ విముక్తి కోసం పోరాడతారన్నది ఆ నిర్దిష్ట పరిస్థితుల మీద ఆధారపడి ఉంటుంది. ఈ సందర్భంగా చరిత్ర నిర్మాణం గూర్చి 'లూయీ బోన పార్టీ బ్రూమైర్ 18వ తేదీ' అను గ్రంథంలో కారల్ మార్క్స్ చేసిన ఒక వ్యాఖ్యను ఈ కింద పేర్కొంటున్నాను. 'ప్రజలు తమ చరిత్రను తామే నిర్మించుకుంటారు. అయితే దాన్ని వారు తమ ఇష్టం వచ్చినట్లు నిర్మించుకోలేరు. తాము కోరుకున్న పరిస్థితులలో కాకుండా, తమకి తటస్థపడ్డ గతం నుండి తమకు లభించిన పరిస్థితుల్లో దాన్ని వాళ్లు నిర్మించుకుంటారు. గతించిపోయిన తరాలన్నింటి సంప్రదాయం ప్రస్తుతం జీవించి వున్న తరం మెదళ్ల మీద భూతంలా స్వారీ చేస్తుంది. ప్రజలు సరిగ్గా ఎప్పుడైతే తమనూ, తమ పరిస్థితులనూ విప్లవకరించడం లోనూ పూర్తిగా మార్చివేయడంలోనూ అంతవరకూ ఎన్నడూ లేనిదాన్ని సృష్టించడంలోనూ నిమగ్నులై వున్నట్లు కనిపిస్తారో సరిగ్గా అట్టి విప్లవాత్మక సంక్షోభ దశలలో గత భూతాలను ఆత్రుతగా తమకు ఊడిగం చేసేందుకు ఆవాహన చేస్తారు.... లూథర్ ఆ విధంగానే క్రీస్తు ప్రధాన శిష్యుల్లో ఒకడైన సెంట్‌పాల్ వేషం ధరించాడు. ఈ మార్క్స్ వ్యాఖ్యను నేటి ఇరాక్ పరిస్థితులకి కూడా అన్వయించుకోవాల్సి ఉంది. ఒకవేళ ఇరాక్ ప్రజల మెదళ్లలో ఆధునిక కాలపు లౌకికవాద ఆకాంక్షలు కొనసాగినా, వాటి మీద ప్రాచీన మతభూతం స్వారీ చేసే నూతన పరిస్థితులు ఏర్పడవచ్చు. తమ లౌకిక వాద మార్గంలో జాతీయ విమోచనకు పూనుకోలేని పరిస్థితులు ముందుకు రావచ్చు. అప్పుడు, తమ చరిత్రను అప్పుడున్న నూతన పరిస్థితులకు అనుగుణంగానే ఇరాక్ ప్రజలు నిర్మించుకోగలరు. అంతే తప్ప, తమ స్వీయాత్మక మానసిక ఆకాంక్షల కనుగుణంగా చరిత్ర నిర్మాణం చేసుకోలేరు. ఈ దృష్టితో ప్రస్తుత ఇరాక్ పరిణామాలను అర్థం చేసుకోవాలి.

పైన పేర్కొన్న వివిధ అంచనాలు, ఊహాగానాలకు తావులేకుండా ప్రస్తుత ఇరాక్ జాతీయ విమోచనోద్యమ వెల్లువ వెనుక బాత్ పార్టీ ప్రధాన నాయకత్వ శక్తిగా ఉందన్న నూతన వార్తలు ప్రపంచ లౌకికవాద ప్రజలకు ఉత్తేజాన్ని కలిగిస్తాయి. సద్దాం నాయకత్వంలోని బాత్ పార్టీ తీవ్ర హత్యాకాండకు ఘోరమైన నష్టాలను చవి చూసిన మాట నిజమే! అయినా అది ఇరాక్ ప్రజల అండదండలతో పునర్నిర్మాణమై బలపడింది. ఆల్‌ఖైదాతో తెగదెంపులు చేసుకున్న కొన్ని ఇస్లామిక్ తీవ్రవాద శక్తులను నేడు బాత్ పార్టీ కలుపుకున్నది. బాత్‌పార్టీ నేతృత్వంలో ఏర్పడిన 'ఇస్లామిక్ స్టేట్ ఆఫ్ ఇరాక్ అండ్ సిరియా' (ఐఎస్ఐఎస్) ఐక్య సంఘటనా సంస్థ తాజా తిరుగుబాటుకు నాయకత్వం వహిస్తున్నది. అందులో అత్యధిక ప్రజాదరణ గల బాత్ పార్టీయే ప్రధాన పాత్రదారిగా ఉంది. అయితే తాజా ఐఎస్ఐఎస్ ఫ్రంట్‌లో బాతిష్టు శక్తులే ప్రధాన నాయకత్వ స్థానంలో ఉన్న వాస్తవం ప్రపంచానికి వెలుగు జూడకూడదనేది అమెరికా వ్యూహంలో భాగమే! అది వెలుగు చూస్తే, ప్రపంచ వ్యాప్తంగా లౌకిక శక్తులన్నీ తాజా సాయుధ తిరుగుబాటును స్వాగతిస్తాయి. అందుకే తాజా తిరుగుబాటును మరోసారి రక్తసిక్తంగా సైనిక జోక్యంతో అణిచివేయాలంటే, అది ఇస్లాం ఛాంధసవాద శక్తుల నాయకత్వాన సాగుతున్నదని ప్రపంచ ప్రజల ఎదుట చిత్రించాల్సి ఉంది.

నేడు 'సున్నీ తిరుగుబాటుదార్లు', 'సున్నీ తీవ్రవాదులు', 'సున్నీ ఉగ్రవాదులు', 'సున్నీ పోరాటయోధులు', 'సున్నీ జీహాదిస్టులు' మీడియా డిక్షనరీలోని పదాలుగా మారాయి. తాజా తిరుగుబాటును సున్నీలదిగా ఎందుకు చిత్రిస్తున్నట్లు? దీని వెనుక కూడా ఓ నేపథ్య పరిస్థితి ఉంది. అమెరికా సైన్యాలపై గెరిల్లా పోరాటం సాగించిన ప్రధాన ప్రాంతాలలో సున్నీలు ఎక్కువ శాతం ఉన్నారు. అమెరికా సైన్యాలకు శ్మశాన స్థలిగా మారిన అంబర్ ప్రావిన్స్ (ఇది ఇరాక్‌లో అతిపెద్ద రాష్ట్రం)లో

# బ్రెజిల్ ప్రపంచ కప్ నిరసనలు

***బ్రెజిల్ పాలక వర్గాలు క్రీడాభిమానం పేరుతో స్వేచ్ఛా వాణిజ్యానికి తలుపులు తెరిచి అన్ని రంగాల్లో ప్రత్యక్ష పెట్టుబడులను ఆహ్వానించడానికే ఈ ప్రపంచ కప్ నిర్వహిస్తున్నాని అంటున్నారు ఎం.కె. కుమార్***

బ్రెజిల్‌లో ప్రపంచ కప్ పోటీలు అట్టహాసంగా ప్రారంభమ య్యాయి . నాలుగేళ్లకోసారి వచ్చే సాకర్ క్రీడా పోటీలు సావో పాలో నగరంలోని ఎరీనా కొరింథ్ఛియన్స్ ఫుట్‌బాల్ స్టేడియంలో జరుపు కున్నాయి. ప్రపంచంలోని చాలా మంది అభిమానులకు సాకర్ ఫీవర్ అంటుకుంది. ప్రపంచ ఫుట్‌బాల్ క్రీడను అందరూ హర్షిస్తుంటే బ్రెజిల్ లోని శ్రామికులు, కార్మికులు, మధ్యతరగతి, బ్రెజిల్ దేశాభిమానులు ఈ ప్రపంచకప్ వద్దు అని పెద్ద ఎత్తున ఆందోళనలు జరుపుతున్నారు. ఆ ఆందోళనలను అణచడానికి పోలీసులు టియర్‌గ్యాస్, వాటర్‌కేన్‌లను ప్రయోగించడమే గాకుండా, గాలిలో కాల్పులను జరిపారు.

గత సంవత్సరకాలంగా బ్రెజిల్‌లో ప్రపంచ కప్‌ను జరప కూడదనే ఆందోళనలు జరుగుతున్నాయి. ఆరంభ వేడుకల నాటికి వీటి రూపం తీవ్రరూపం దాల్చింది. ప్రజల సంక్షేమాన్ని గాలికొదిలేసి, ప్రజాధనాన్ని విచ్చలవిడిగా ప్రభుత్వం ఖర్చుచేయడాన్ని వారు ఆక్షేపిస్తు న్నారు. ప్రారంభ వేడుకలకు ఆతిథ్యమిచ్చే ప్రధాన స్టేడియానికి రవాణా సదుపాయం కలిగించే సావోపాలో సబ్‌వే కార్మికులు సమ్మెకు పూను కున్నారు. తమ వేతనాలను పెంచాలనే వారి ఆందోళనను ప్రభుత్వం ఇన్నాళ్లు పెడచెవిన పెట్టడంతో వారు ఈ సందర్భాన్ని తమకు అనుకూలంగా మలుచు కున్నారు. ప్రభుత్వం కనీసం తమను చర్చలకు కూడా పిలువలేదని సబ్‌వే కార్మికుల యూనియన్ అధ్యక్షుడు అల్టినో ప్రెజర్స్ పేర్కొన్నాడు. తాము సమ్మెను ఆపినట్టు వస్తున్న వార్తలను ఖండిస్తూ, కొంచెం వెసులుబాటును మాత్రమే ప్రభుత్వానికి కల్పించామని, ప్రారంభ వేడుకలకు అంతరాయం కలుగకుండా మాత్రమే సడలింపు జరిగిందని ప్రకటించాడు. ఫుట్‌బాల్ క్రీడ ప్రారంభమైన నుంచే రియో డి జనీరో విమానాశ్రయ సిబ్బంది పాక్షిక మెరుపు సమ్మెకు దిగారు. బ్రెజిల్ న్యాయస్థానం విమానాశ్రయ రంగాన్ని అత్యవసర సేవారంగంగా గుర్తించిన దరిమిలా 70 శాతం మంది విధులు నిర్వర్తిస్తూ, మిగిలిన సిబ్బంది సమ్మెను జరిపారు. 12 శాతం జీతాల పెంపును, మెరుగైన జీవన పరిస్థితులను, ప్రపంచకప్ సందర్భంగా ప్రత్యేక బోనస్‌ను కల్పించాలనే పలు డిమాండ్లను ఈ సందర్భంగా వారు ప్రభుత్వం ముందుంచారు.

---

సున్నీలెక్కువ! అందులోని ఫలూజా నగరం 2004-05లలో పలు తిరుగుబాట్లతో 'మినీ స్టాలిన్ గ్రాడ్'గా పేరొందింది. అంబర్ రాజధాని 'రమాధి' నగరం కూడా అదే కోవలోకి వస్తుంది. ఈ రెండు నగరాల (ఫలూజా, రమాది) ప్రజలు బాతిష్టులతో కూడిన ఐక్య సంఘటన నేతృత్వంలో ఈ ఏడాది జనవరి మొదటి వారంలోనే ప్రభుత్వ పాలనను కూలదోశారు. నేటికీ తమను తామే పాలించుకుంటున్నారు. నెవినెన్ ప్రావిన్స్, సలాహుద్దీన్ ప్రావిన్స్‌లు కూడా ప్రతిఘటనలో ముందంజలో ఉన్నాయి. అవీ ప్రధానంగా సున్నీ ప్రావిన్స్‌లే! అయినంత మాత్రాన యిది కేవలం సున్నీల తిరుగుబాటు కానేకాదు.

భారత స్వాతంత్ర్యోద్యమంలో మొదటి వరుసలో బెంగాలీలు, మరాఠీలు, పంజాబీలున్నారు. అయినంత మాత్రాన అది బెంగాలీ తిరుగుబాటో, మరాఠీల జాతీయోద్యమమో, సిక్కుల స్వాతంత్రోద్యమమో కాదు. అది భారత స్వాతంత్ర్యోదమమే! మిగిలిన రాష్ట్రాల ప్రజలు బెంగాలీ, పంజాబీ, మరాఠీ ప్రజలను ఆదర్శంగా తీసుకున్నారు. ఇప్పుడు బాగ్దాద్‌లో ఆంతరంగిక తిరుగుబాటు జరుగుతుందన్న అభద్రతతో మల్కి ప్రభుత్వం రకరకాల సైనిక విన్యాసాలు జరపడంలోనే అసలు వాస్తవం బోధపడుతున్నది. ఇది మొత్తం ఇరాక్ బాధిత ప్రజల తిరుగుబాటు తప్ప సున్నీల తిరుగుబాటు కానేకాదని గుర్తించాల్సి ఉంది.

నేడు స్వాధీనమైన ప్రాంతాలూ, విముక్తి పొందిన నగరాలూ రేపో, మాపో దురాక్రమణ సేనల చేజిక్కవని చెప్పలేం. గెరిల్లా యుద్ధంలో జయాపజయాల పరంపరతోనే అంతిమ విజయం లభిస్తుంది. చివరి విజయానికి ముందు అనేక ఎదురు దెబ్బలుంటాయి. తాత్కాలిక ఓటము లుంటాయి. వీర వియత్నాం, కంపూచియా, లావోస్, కొరియా జాతీయ విమోచనోద్యమాల అనుభవాలివే! అంతిమ విజయం వెనుక నూరు పురోగమనాలూ, తొంబై తిరోగమనాలూ వుంటాయి. 'ఒక అడుగు ముందుకు – రెండడుగులు వెనక్కి' వేసే సందర్భాలుంటాయి. 'ఒక అడుగు వెనక్కి – రెండడుగులు ముందుకు' వేసే సందర్భాలు కూడా ఉంటాయి. ఏది ఏమైనా ఒకటి మాత్రం నిజం! సంచార గెరిల్లా పోరాట దశ నుంచి స్థావర యుద్ధం సాగించే దశకు తాజా ఇరాక్ జాతీయోచ నోద్యమం చేరింది. రేపు పొందే తాత్కాలిక ఓటములను అధిగమించి అంతిమ విజయం వైపు పురోగమించే శక్తి, సామర్థ్యాలు కూడా దానికి ఉన్నాయి. అది వర్తమాన ప్రపంచ పీడిత ప్రజలకి విప్లవ స్ఫూర్తినిస్తుందని ఆశిద్దాం! అట్టి స్ఫూర్తి పొందుతూనే వీరోచిత ఇరాక్ జాతీయ విమోచనోద్యమానికి అండదండలందిద్దాం! రెండు శతాబ్దాల పాటు విదేశీ వలసవాదంపై ఉద్యమించిన ఉజ్వల జాతీయోద్యమ వీరోచిత వారసత్వం మన భారతీయులకి ఉంది. మన సాటి వలస బాధిత ప్రజలైన ఇరాక్ జాతికి అండగా నిలబడడం మన చారిత్రిక కర్తవ్యం!

*(రచయిత ఇఫ్టూ జాతీయ కార్యదర్శి)* వీ

ఫిఫా ప్రపంచ కప్ సందర్భంగా బ్రెజిల్‌లోని చాలా నగరాల్లో వందల కొద్దీ నిర్మాణాలు చేపట్టారు. ఈ సందర్భంగా అక్కడ నివాసముంటున్న వేలకొద్దీ పేద ప్రజలను ప్రభుత్వం బలవంతంగా గెంటివేసి, వారిని నిర్వాసితుల్ని చేసింది. పట్టణాల్లో నివసిస్తున్న పేద ప్రజలను బ్రెజిల్ ప్రభుత్వం చాలా సందర్భాల్లో తరిమివేసింది. పట్టణాల్లో నేర సంప్రదాయాన్ని కొనసాగిస్తున్నారని, పట్టణ సౌందర్యాన్ని ఆటంక పరుస్తున్నారనే నెపాలతో వారి జీవించే హక్కును బ్రెజిల్ కాలరాసింది.

పోప్ జాన్‌పాల్ 2 బ్రెజిల్ సందర్శనార్థం వచ్చిన సందర్భంలోను ఇదే జరిగింది. బ్రెజిల్ నగరంలో జరిగే ప్రతి నిర్మాణానికి ఆ పేదవారే కూలీలుగా పనిచేశారు. నగరంలోని వన సంరక్షణకు, మురుగుదొడ్లలను శుభ్రపర్చడానికి వారి సేవలనే ప్రభుత్వం ఉపయోగించుకుంది. వీరికి శుభ్రమైన నివాస ప్రాంతాలను కట్టిస్తామని ఎన్నికల సందర్భంగా పాలకవర్గాలు వాగ్దానం చేసినప్పటికీ, నగర విస్తీర్ణం జరుగుతున్న ప్రతి సందర్భంలోను, వారిని నగర సరిహద్దుల నుండి గెంటివేయడం జరుగుతూనే ఉంది.

నగరాల్లోని మురికివాడల్లో నివసిస్తున్న బ్రెజిల్ ప్రజలు 1.5 మిలియన్ల వరకు ఉన్నారు. వీరందరూ బలవంతంగా కొన్ని సంవత్సరాలుగా నివసిస్తున్న తమ స్వగృహాల నుండి బలవంతంగా గెంటివేయబడ్డారు. నగరాల సౌందర్యం, క్రమ బద్ధీకరణ పేరుతో పాలకవర్గాలు వీరికి వేరేచోట కనీస గృహ వసతిని కల్పించకుండానే వీరిని తరిమివేస్తున్నారు. నివాస గృహాల కోసం పోరాటం అక్కడ దశాబ్దాలుగా జరుగుతున్నా ప్రభుత్వాలు మాత్రం కనికరించడం లేదు. ఈ నిర్వాసితుల్లోని యువతలో చాలా మంది లంపెన్ ప్రొలిటేరియన్లుగా మారుతున్నారు. సరైన ఉపాధిని, సంస్కృతిని ప్రభుత్వాలు కల్పించక పోవడంతో వీరిని డ్రగ్ మాఫియా నేరగాళ్లుగా తయారు చేస్తూ, ప్రమాదకరమైన గ్యాంగ్‌లుగా మారుస్తోంది.

సామాజికంగా, ఆర్థికంగా బలహీనవర్గాల ప్రజలను బ్రెజిల్ ప్రభుత్వం అణచివేయడమే గాకుండా, వారు చేపట్టిన ఆందోళనలను సైతం విస్మరిస్తూ, ప్రపంచమే గర్వించే విధంగా జరుపుతున్న ప్రపంచకప్ పోటీలకు అడ్డు తగులుతూ వారు దేశద్రోహానికి పాల్పడుతున్నారని ఆడిపోసుకుంటున్నాయి. ఖాళీగా ఉన్న వేల ఎకరాల స్థలాలను విదేశీ గుత్త కార్పొరేట్ సంస్థలకు అప్పనంగా, సకల సౌకర్యాలతో కట్టబెడుతున్న ప్రభుత్వం, తమ దేశ ప్రజల పట్ల వివక్షతను ప్రదర్శిస్తూ, తమకు దేశభక్తి లేదని ప్రకటించడాన్ని నిరసన కారులు తప్పుపడుతున్నారు. 11 బిలియన్ల డాలర్లను ప్రపంచ కప్‌ను నిర్వహించడానికి బ్రెజిల్ ఖర్చుపెడుతోంది. ప్రస్తుత సంక్షోభంలో ఇది బ్రెజిల్ ఆర్థిక సామర్థ్యాన్ని బాగా దెబ్బతీస్తుంది. దీనివల్ల బ్రెజిల్ సగటు పౌరునిపై అప్పు భారం మరింత పెరిగిందని ఆర్థిక నిపుణులు పేర్కొంటున్నారు.

ప్రపంచ కప్ వేడుకల సందర్భంగా నిర్మించిన నిర్మాణాలన్నీ చాలా వరకు తాత్కాలికమే. వీటిపై పెట్టిన లక్షలకొద్దీ డాలర్లు బూడిదలో పోసినట్టే. బ్రెజిల్ ప్రభుత్వ వాదన మరోరకంగా ఉంది. ఫిఫా ప్రపంచకప్‌ను ఎంత ఆడంబరంగా నిర్వహిస్తే, ఆ మేరకు పెట్టుబడులను పెద్ద ఎత్తున ఆహ్వానించొచ్చని, పెట్టుబడుల రాకతో పోలిస్తే, ప్రస్తుత నిర్వహణ ఖర్చు చాలా స్వల్పమని అభిప్రాయ పడుతోంది. గతంలో దక్షిణాఫ్రికాలో ప్రపంచకప్ నిర్వహించిన సందర్భంగా ఆ దేశ ఆర్థికవృద్ధి రేటు 0.5 శాతం పెరిగిన విషయాన్ని ప్రభుత్వం ప్రస్తావిస్తోంది. ప్రపంచకప్ నిర్వహించే అవకాశం బ్రెజిల్‌కు రావడమే గొప్ప విషయంగా ప్రభుత్వం భావిస్తోంది.

అంతర్జాతీయ కార్పొరేట్ సంస్థలను ఆహ్వానించడానికి దీన్నొక అవకాశంగా మలుచుకునే దానికి ప్రభుత్వం సన్నాహాలు చేస్తోంది. దీనివల్ల దేశంలోని దారిద్ర్యం ఎలా తగ్గుతుందో, ద్రవ్యోల్బణం తగ్గుదల, ధరల స్థిరీకరణ, యువతకు ఉపాధి ఎలా సాధ్యమో ప్రభుత్వం వివరించడం లేదు. ఎగువ మధ్యతరగతి ప్రజలతో పాటు క్రీడాభిమానులు ఫిఫా వేడుకలను స్వాగతిస్తున్నారు. మెజారిటీ బ్రెజిల్ ప్రజలు ఈ వేడుకల వల్ల దేశం వెలిగి పోవచ్చేమో గాని, తమ బతుకులు మాత్రం కాదని స్పష్టం చేస్తున్నారు.

ఫిఫా సాకర్ వేడుకల రోజులలో బ్రెజిల్‌లోని అన్ని నగరాల్లో బార్‌లు 24 గంటలు పని చేసుకోవచ్చని, ఆ మేరకు నిబంధనలు సడలించామని ప్రభుత్వం ప్రకటించింది. దరిమిలా మద్యం దుకాణ యజమానులు సిండికేట్‌గా మారి మద్యం ధరలను అమాంతం పెంచేశారు. అన్ని నగరాల్లో రెస్టారెంట్లు, హోటల్లలో సామాన్యుడు అడుగు పెట్టలేని పరిస్థితి. దేశంలో అన్ని నిత్యావసర ధరలు విపరీతంగా పెరిగాయి. షేర్ మార్కెట్‌తో పాటు ధరలు పెరగడంతో ప్రజలకు నవ్వాలో, ఏడ్వాలో తెలియని వింత పరిస్థితి. అర్ధరాత్రుల్లో మ్యాచ్‌లు జరుగుతున్న సందర్భంగా క్రీడాభిమానులు తాగుతూ, ఆటలను వీక్షించవచ్చని ప్రభుత్వం ఈ సందర్భంగా ప్రకటించింది. పబ్‌లు, డిస్కోతెక్‌ల సంఖ్య పెరగడంతో పాటు వ్యభిచారం ఎక్కువైంది. సందర్శకులను ఆనందానికి గురిచేయడానికి ప్రభుత్వం అన్ని నిబంధనలను పాటించలేక పోతుందని క్రీడాశాఖా మంత్రి ప్రకటించి, తన క్రీడాభిమానాన్ని చాటుకున్నారు. రాత్రివేళల్లో మద్యం దుకాణాలు, పబ్‌లు తెరవడం వల్ల నేరాలు పెరిగి పోయాయని, మహిళలు, పిల్లలు తీవ్ర ఇబ్బందులకు గురవుతున్నారని, స్థానిక మీడియా కథనాలను ప్రసారం చేస్తోంది. గ్రామీణ ప్రాంతాల్లోని మహిళలను పెద్ద ఎత్తున వ్యభిచార గృహాలకు తరలిస్తున్నారని మీడియా పేర్కొంటోంది. సుమారు 8 లక్షల మంది సందర్శకులు బ్రెజిల్‌కు రావచ్చని అంచనా వేస్తున్నారు.

ప్రపంచ సాకర్‌కు బ్రెజిల్ సాంప్రదాయక ఫుట్‌బాల్ కేంద్రంగా విరజిల్లుతోంది. 20వ ప్రపంచకప్ ఫుట్‌బాల్ క్రీడల సందర్భంగా విశ్వవిజేతగా నిలవాలని బ్రెజిల్ కలలు కంటోంది. విజయం కన్నా, ఘనంగా ప్రపంచకప్‌ను నిర్వహించడం మీదనే ప్రభుత్వం దృష్టి పెట్టింది. 12 నగరాల్లో ప్రపంచకప్ వేడుకలను నిరసిస్తూ ఆందోళన కారులు కార్యక్రమాలను చేపట్టారు. సాకర్ పట్ల తమకు అభిమానం ఉన్నప్పటికీ, అట్టహాసంగా వేడుకలను నిర్వహిస్తూ, పెద్ద ఎత్తున ధనాన్ని ఖర్చు పెట్టడాన్ని తాము నిరసిస్తున్నట్టు ఆందోళనకారులు పేర్కొంటున్నారు.

దేశంలోని 12 నగరాలు ఈ వేడుకలకు సిద్ధం చేయబడ్డాయి. 2016 ఒలింపిక్స్‌ను రియో డి జనియిరో నగరంలో నిర్వహించడానికి ఏర్పాట్లు చురుగ్గా సాగుతున్నాయి. దేశంలోని 55 లక్షల మందికి స్వంత గృహాలు లేవు. 1.5 కోట్ల గృహాలకు మౌలిక వసతులు కల్పించబడలేదు. ఒలింపిక్ చట్టం 12.035/2009 ప్రకారం ప్రభుత్వ స్థానిక ప్రజల

హక్కులకు, ఆస్తులకు, నష్టం లేకుండా మాత్రమే ఒలింపిక్ క్రీడలను నిర్వహించాలి. ఫెడరల్ చట్టం 11.124/2005 ప్రకారం ప్రభుత్వ స్థలాలను భూమిలేని నిరుపేదలకు, సామాజిక అవసరాలకు మొదటగా కేటాయించాలి. కాని దీనికి భిన్నంగా స్థానిక మున్సిపల్ కోర్టులో ప్రభుత్వమే పిల్‌లు వేసి డిక్రీలను పొందింది. రియో నగర మున్సిఫ్ కోర్టు డిక్రీ 30.379/2009 ప్రకారం నగరంలోని భూములను ఒలింపిక్ క్రీడల అవసరాల కోసం వినియోగించవచ్చు. ఆ స్థలాలలో స్థానిక ప్రజలు నివాసమున్నప్పటికీ వాటిని ప్రభుత్వం తన అధీనంలోకి తీసుకునే దానికి హక్కును కలిగుంది.

ఈ తీర్పు న్యాయస్థానాలు రియల్‌ఎస్టేట్ వ్యక్తులకు, బడా కార్పొరేట్ కంపెనీలకు, దళారీ ప్రభుత్వాలకు ఎలా వంత పాడుతాయో అర్థమవుతోంది. అన్ని చట్టాలకు, రాజ్యాంగ నిబంధనలకు నగరాలు లోబడి ఉండాల్సిన అవసరం లేదనే కొత్త వాదనను ప్రభుత్వం వినిపిస్తోంది. ఒలింపిక్స్, ప్రపంచకప్ లాంటి క్రీడలను నిర్వహించాలంటే ఇది తప్పనిసరని ప్రభుత్వం వాదిస్తోంది. 2007లో బ్రెజిల్ అధ్యక్షుడు లుల దసిల్వా, క్యాబినెట్‌లోని 11 మంది మంత్రులతో కలిసి ప్రభుత్వ, ప్రైవేటు భాగస్వామ్యం (పిపిపి) లో భాగంగా ఫిఫాతో ఒలింపిక్, ప్రపంచకప్ క్రీడలకు సంబంధించిన కీలక ఒప్పందం చేసుకుంది. ఈ ఒప్పందం ప్రకారం క్రీడల పేరుతో ఫిఫా చేసే ఎటువంటి భూ ఆక్రమణలకు, ప్రజల హక్కుల ఉల్లంఘనకు, అన్ని రకాల అరాచకాలకు ప్రభుత్వం జోక్యం చేసుకోకూడదు. ఫెడరల్ రాజ్యాంగంలోని ఆర్టికల్ 49, క్లాజు 1 ప్రకారం ఒప్పంద వివరాలను బహిర్గతం చేయాల్సిన అవసరం ఉంది.

కాని ప్రభుత్వం ఇప్పటివరకు వాటి వివరాలు తెలియచేయలేదు. ఇవే నగర అతిథి ఒప్పందాలుగా చెలామణీ అవుతున్నాయి. రాజ్యాంగం ప్రజలకు ప్రసాదించిన ప్రాథమిక హక్కులను కూడా ఫిఫా అనేక సార్లు ఉల్లఘించింది. ఫిఫాకు వ్యతిరేకంగా అనేక కేసులు జాతీయ కోర్టులలో పెండింగ్‌లో ఉన్నాయి. నగరాలలోని అన్ని బార్లు, రెస్టారెంట్లు, హోటల్ గదులు సమస్తం ఫిఫా ఆధ్వర్యంలో నడుస్తున్నాయి. ఫిఫా అధిక ధరలను అమలు చేస్తూ విపరీతమైన లాభాలను గడిస్తోంది. చివరకు వాలంటీర్ల సేవల కోసం వీసా నిబంధనల సడలింపులకు కూడా బ్రెజిల్ ప్రభుత్వం పాల్పడింది. స్థానిక నిరుద్యోగుల సేవలను కాదని ఫిఫా విదేశాల నుండి కార్మికులను తెచ్చుకుంటోంది.

స్థానిక మున్సిపాలిటీలు తమ బడ్జెట్‌తో సంబంధం లేకుండా పెద్ద ఎత్తున అప్పులు చేసి మరీ ఫిఫా కోర్కెలను తీర్చాలని డిక్రీ 7.578/ 2011 సెలవిస్తోంది. బ్రెజిల్ స్థానిక సంప్రదాయాలు, ఆచారాలు పేరుతో ఫిఫా నిర్వహిస్తున్న ప్రస్తుత ప్రపంచ కప్ వేడుకలు బ్రెజిల్ స్థానిక ఆచారాలకు వ్యతిరేకంగాను, కొన్ని అగౌరపర్చేవిగాను ఉన్నాయంటే అతిశయోక్తి కాదు.

బ్రెజిల్ ఫెడరల్ రాజ్యాంగం ప్రసాదించిన కంజ్యూమర్ హుక్కులు (ఆర్టికల్ 5, క్లాజు 5), పని హక్కు (ఆర్టికల్ 5, క్లాజు13), ఎక్కడికైనా వెళ్లి వచ్చే హక్కు (ఆర్టికల్ 5, క్లాజు15), బ్రెజిల్ వారసత్వ సంస్కృతి హక్కు (ఆర్టికల్ 216), విద్యా హక్కు (ఆర్టికల్ 216), భావ ప్రకటనా స్వేచ్ఛా హక్కు (ఆర్టికల్ 5, క్లాజు 9), ప్రెస్ స్వేచ్ఛా హక్కు (ఆర్టికల్ 220), ప్రభుత్వ ఆస్తుల పరిరక్షణ (ఆర్టికల్ 23, క్లాజు 1)లను పూర్తిగా ఉల్లంఘిస్తూ ఫిఫా ప్రపంచ కప్ వేడుకలను నిర్వహిస్తోంది. వీటన్నిటిపై వందల సంఖ్యల్లో స్థానిక కోర్టులో ఫిఫాకు వ్యతిరేకంగా కేసులు నడుస్తున్నాయి. బెలో హరిజంటె నగరంలో సాకర్ ట్రెనింగ్ సెంటర్‌ను, 400 కుటుంబాలను నిర్వాసితుల్ని చేస్తూ, 18 మిలియన్ డాలర్ల ప్రభుత్వ సొమ్ముతో ఫిఫా నిర్మించింది. 50 సంవత్సరాలుగా నివాస గృహాలకు రిజిస్ట్రేషన్ కోసం పోరాడుతున్న 300 కుటుంబాలను, తమ ఇళ్లనుండి వెళ్లగొట్టి ఫితఫా ఐసొడరొ అటవీ ప్రాంతంలో 75,000 అపార్ట్‌మెంట్లను ప్రపంచ కప్ సందర్శకుల వసతి కోసం నిర్మించింది. ఫోర్టాలిజా ప్రాంతంలో 3,500 కుటుంబాలను నిర్వాసితుల్ని చేస్తూ, ఎక్స్‌ప్రెస్ హైవేని ప్రభుత్వం నిర్మించింది.

ప్రపంచకప్ పేరుతో ప్రస్తుతం బ్రెజిల్‌లో జరుగుతున్న క్రీడలు పూర్తిగా ధనవంతుల, పెట్టుబడిదారుల ఆనందం కోసం జరుగు తున్నవే. కాని పేరుకి క్రీడాభిమానం, జాతీయాభిమానం, దేశభక్తి పేరుతో బ్రెజిల్, ప్రజలను మభ్యపెట్టాలని చూస్తోంది. బ్రెజిల్ పాలకవర్గం స్వేచ్ఛా వాణిజ్యానికి తలుపుల్ని తెరిచి అన్ని రంగాలలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను ఆహ్వానించడానికే ప్రస్తుత ప్రపంచకప్ నిర్వహిస్తోందని ప్రపంచ ప్రజలకి తెలిసిపోయింది. ఒక్క రియో స్టేడియానికే ఫిఫా 100 కోట్ల డాలర్లను ఖర్చు చేసి, స్థానిక నిర్మాణ సంప్రదాయాలను తుంగలో తొక్కి, యూరోపియన్ మోడల్‌లో అభివృద్ధి పరిచింది. ఇది పూర్తిగా ప్రైవేట్ యాజమాన్యం కంట్రోల్‌లో ఉంటుంది. ఇందులో ఎగువ మధ్యతరగతి పౌరుడు కూడా టికెట్ కొనలేని పరిస్థితి ఉంది. బ్రెజిల్‌లో జరిగే ఆటలను బ్రెజిల్ పౌరులు మనలాగే టీవీల్లో వీక్షించాల్సిందే.

దేశంలోని అన్ని స్టేడియాలలోని నిర్మాణ యాజమాన్యం స్థానిక కార్మికులచేత వెట్టి చాకిరి చేయించుకుంటోంది. వేతనాల కోసం సమ్మెలు చేస్తే, ప్రపంచకప్ వ్యతిరేకులుగా ముద్రవేస్తూ, దేశ ద్రోహుల చట్టం కింద కేసులు నమోదు చేస్తున్నారు. 90 శాతం ప్రభుత్వ నిధులతో ఫిఫా ప్రపంచకప్‌ను నిర్వహిస్తోంది. స్టేడియం చుట్టుపక్కల స్థానికులు అనవసరంగా నిలబడి ఉంటే వారిని ఒట్టి అనుమానం పేరుతో అరెస్టు చేసే అధికారం పోలీసులకు ఇవ్వబడింది. గత వారం లోనే బలవంతంగా మహిళలను విదేశీ సందర్శకులను సంతోషపెట్టే నెపంతో స్థానిక మాఫియాపై పోలీసులు కాల్పులు జరిపితే నలుగురు మరణించారు. బ్రెజిల్ టీమ్ స్టేడియంలోకి రావడానికి సుమారు 2000 మంది పోలీసులతో పటిష్ట బందోబస్తు ఏర్పాటు చేశారు. దీన్ని బట్టే బ్రెజిల్ ఆటగాళ్లు ఎవరి ఆనందం కోసం రాత్రింబవళ్లు ప్రాక్టీసు చేశారో అర్థమవుతోంది.

బ్రెజిల్ ప్రపంచంలోని 7వ అతిపెద్ద ధనికదేశం. ప్రతి సంవత్సరం దాని జిడిపి ఐదు శాతం పెరుగుతోందని ఐఎంఎఫ్ నివేదిక తెలియజేస్తోంది. పెట్టుబడిదారీ వ్యవస్థ శరవేగంతో పాకుతున్న బ్రెజిల్, అభివృద్ధి పేరుతో అమలుపరుస్తున్న ఆర్థిక విధానాలు ఆ దేశ ప్రజల విస్థాపనకు, హక్కుల విధ్వంసానికి ఉపయోగపడుతున్నాయి. పెట్టుబడి దారీ అభివృద్ధి నిర్వాసితుల్ని, మిగులు ప్రజలను ఉత్పత్తి చేస్తుందనే చారిత్రక సత్యాన్నీ బ్రెజిల్ ప్రపంచ కప్ సందర్భంగా మరోమారు రుజువు చేస్తోంది.

*(రచయిత పౌరహక్కుల కార్యకర్త)* వీ

# ముందున్నది అనూహ్య మార్పుల కాలం

*వాతావరణ మార్పులు ప్రపంచ వ్యాప్తంగా తిరుగుబాట్లకు కారణమవుతున్నాయనీ, అవి భవిష్యత్తులో ఎన్నో యుద్ధాలకు దారితీస్తాయనీ అంటున్నారు* **నర్సింహ**

గ్లోబల్ వార్మింగ్ (భూతాపం – భూమి మరింతగా వేడెక్కుతూ పోవడం) వలన ఏర్పడుతున్న క్లైమేట్ చేంజ్ (వాతావరణ మార్పులు) కారణంగా ప్రపంచ వ్యాప్తంగా విప్లవాలు వచ్చే అవకాశాలు ఉన్నాయని ఐక్యరాజ్య సమితి పరిశోధనలో తేలింది. అమెరికా సామ్రాజ్యవాదుల మిలిటరీ నిర్వహించిన పరిశోధనలో కూడా ఈ విషయం ధృవీకరించ బడింది.

ఆఫ్రికాలోని కొన్ని దేశాల్లో, పశ్చిమాసియా దేశాల్లో జరుగుతున్న వివిధ విప్లవాల వెనుక క్లైమేట్ చేంజ్ వలన వచ్చిన కరువు కాటకాలు కూడా ప్రధాన కారణాల్లో ఒకటిగా ఇప్పుడు వెలుగులోకి వస్తున్నది. గ్లోబల్ వార్మింగ్, క్లైమేట్ చేంజ్‌లు సృష్టిస్తున్న నష్టాలు మన కళ్ల ముందు కనిపిస్తున్నాయి. సమీప భవిష్యత్‌లో వీటి ప్రభావం మొత్తం ప్రపంచంపై తీవ్ర స్థాయిలో ఉండబోతున్నది. ఇది అర్థం చేసుకోవడానికి మనం పర్యావరణ శాస్త్రజ్ఞులమే కానవసరం లేదు.

వాస్తవాలు ఇంత స్పష్టంగా కనబడుతుంటే, తమకు తాము మార్క్సిస్టు మేధావులుగా పిలుచుకునే కొందరు వ్యక్తులు గ్లోబల్ వార్మింగ్, క్లైమేట్ చేంజ్‌లు సామ్రాజ్యవాదుల కుట్ర సిద్ధాంతాలుగా కొట్టి పారేస్తున్నారు. వీరి వాదన ఎంత హేతు విరుద్ధమో, సిరియా లాంటి తమ ప్రత్యర్థి దేశాలను కూల్చడానికి కృత్రిమ తిరుగుబాట్లు సృష్టిస్తున్న అమెరికా, యూరప్ సామ్రాజ్యవాదులు, సిరియా అంతర్యుద్ధానికి క్లైమేట్ చేంజ్ వలన ఏర్పడిన దుర్భిక్ష పరిస్థితులు కారణంగా చూపడం కూడా అంతే హేతు విరుద్ధం. అయితే, సిరియాలో క్లైమేట్ చేంజ్ ప్రతికూల ప్రభావం లేదా? ముమ్మాటికీ ఉంది. ఇతర పశ్చిమాసియా దేశాల వలె అక్కడా దుర్భిక్ష పరిస్థితులున్నాయి. ఆహార ధరలు పెరుగుతూ ఉన్నాయి. ప్రజలలో పాలక వర్గాలపై తీవ్ర అసంతృప్తి ఉన్నది. ఇవి వాస్తవాలే అయినప్పటికీ, సిరియాలో అంతర్యుద్ధంను ఉసిగొల్పినది సామ్రాజ్యవాద దేశాలు (ప్రధానంగా అమెరికా) అనే దానికి అన్ని ఆధారాలు స్పష్టంగా ఉన్నాయి.

సామ్రాజ్యవాదులు తమ తొత్తులుగా ఉండే ఎన్‌జిఒ (ప్రభుత్వేతర సంస్థ)ల ద్వారా, మేధావులు, పరిశోధకుల ద్వారా ఏమి ప్రచారం చేస్తున్నారంటే పెట్టుబడిదారీ వ్యవస్థను కూల్చాల్సినంత పెద్ద లోపాలు ఆ వ్యవస్థలో ఏమీ లేవని, ఈ వ్యవస్థను వివిధ సంస్కరణల ద్వారా చక్కదిద్దవచ్చని, అయితే వివిధ దేశాల్లో వస్తున్న విప్లవాలకు కారణం క్లైమేట్ చేంజ్, మత ఛాందసవాదం లాంటివి కారణమవుతున్నాయనే ప్రచారం చేస్తున్నారు. పెట్టుబడిదారీ వ్యవస్థలో ఉన్న సంస్థాగత లోపాల్ని (కార్మిక వర్గం పెట్టుబడిదారీ వ్యవస్థను కూల్చితే తప్పించి పరిష్కరించ బడని లోపాల్ని) కప్పిపెట్టే ప్రయత్నం చేస్తున్నది కూడా వాస్తవమే. అయినప్పటికే క్లైమేట్ చేంజ్ ప్రపంచ ప్రజలపై చూపుతున్న ప్రతికూల ప్రభావం ప్రజలను విప్లవాల వైపు నెట్టుతున్న ప్రధాన కారణాలలో ఒకటిగా మారిందనేది కూడా వాస్తవమే.

నిజానికి, క్లైమేట్ చేంజ్ ప్రతికూల ప్రభావాన్ని ఎదుర్కొంటున్న దేశాల్లో అమెరికా ముందు వరుసలో ఉన్నది. గత కొన్ని సంవత్సరాలుగా అమెరికాలో ప్రధానంగా దక్షిణ, పశ్చిమ రాష్ట్రాలు ప్రతి ఏటా మరింతగా కరువు ప్రాంతాలుగా మారుతున్నాయి. వర్షాభావం తగ్గుతూ, చెరువులు, నదులు ఎండిపోయే దశకు చేరుకున్నాయి. నీటి ఎద్దడికి ప్రతి ఏటా లక్షలాది ఎకరాలలో పంటలు ఎండిపోయి, వ్యవసాయం నష్టదాయకంగా మారిపోతూ ఉన్నది. మొత్తం అమెరికా జనాభాలో ఒక్క శాతం లోపు ప్రజలే వ్యవసాయంపై ఆధారపడి (గత కొన్ని దశాబ్దాలుగా) బతుకుతున్నప్పటికీ, క్లైమేట్ చేంజ్ ప్రభావం అమెరికా ఆర్థిక వ్యవస్థపై పెద్ద స్థాయిలోనే ఉంది. ఇప్పటికే పెద్ద ఎత్తున నిరుద్యోగం ఉంది. ఒక్క కుటుంబ సభ్యునికి కూడా ఉద్యోగం లేని కుటుంబాలు అమెరికాలో 20 శాతం ఉన్నాయి. మిగితా 80 శాతంలో ఆదాయం కన్నా అప్పులే అధికం ఉన్న వారు దాదాపు 60 శాతంగా ఉంటారు. కేవలం 20 శాతం కుటుంబాల (అమెరికాలో ఉన్న ప్రవాస భారతీయుల్లో మెజారిటీ ఈ క్యాటగిరీలోకి వస్తారు) జీవితాలే మెరుగ్గా ఉన్నాయి.

ప్రపంచంలో అత్యంత అప్పుమయమైన అమెరికా ఆర్థిక వ్యవస్థ కూలిపోక తప్పదని బూర్జువా (అమెరికా) ఆర్థికవేత్తలే ఖరాఖండిగా చెపుతున్నారు. కూలుతుందా లేదా అనే ప్రశ్న వేయడం ఆపేశారు. ఎప్పుడు కూలబోతుందనేదే నేడు వారు వేస్తున్న ప్రశ్న. కూలడానికి సిద్ధంగా ఉన్న అమెరికా ఆర్థిక వ్యవస్థ, పేలడానికి సిద్ధంగా ఉన్న ప్రజలు ఒకవైపు, ఈ సంక్షోభాన్ని వేగవంతం చేస్తున్న క్లైమేట్ చేంజ్ ప్రభావం మరోవైపు. పెట్టుబడిదారీ దేశాలు రకరకాల ఆర్థిక జిమ్మిక్కుల ద్వారా తమ ఆర్థిక వ్యవస్థలు కూలకుండా తాత్కాలికంగా నెట్టు కొస్తున్నాయి. అయితే, క్లైమేట్ చేంజ్ కలిగించే దుష్ఫలితాలకు వారి వద్ద ఏ మందూ లేదు. ఎందుకంటే అది నేరుగా ప్రజల కడుపుపై ప్రభావం చూపుతుంది. పైపెచ్చు, క్లైమేట్ చేంజ్ దుష్పరిమాణామాలను ఎదుర్కొవాలంటే పర్యావరణానికి, ప్రకృతికి చేస్తున్న నష్టాన్ని ఈ క్షణమే ఆపివేయడం మొదటి పరిష్కారం. ఇప్పటికే జరిగిన నష్టాన్ని క్రమంగా పూడ్చడం రెండవ పరిష్కారం. అయితే, పర్యావరణాన్ని, ప్రకృతిని నాశనం చేయకుండా ఒక్క రోజు కాదు కనీసం ఒక్క నిమిషం కూడా బతకలేని స్థితిలో పెట్టుబడిదారీ వ్యవస్థ ఉంది. పెట్టుబడిదారీ వ్యవస్థ కూలకుండా, విచ్చలవిడి పారిశ్రామికీకరణ కొరకు మిగిలిన ఈ కాస్తా ప్రకృతిని, పర్యావరణాన్ని నాశనం చేసే ఆలోచన మానుకోకుండా క్లైమేట్ చేంజ్ దుష్పరిణామాలను తగ్గించడం అసంభవం.

దాదాపు రెండున్నర దశాబ్దాల క్రితం ఎడారి ప్రాంత దేశాలపై ప్రతికూల ప్రభావాలను చూపడం మొదలు పెట్టిన క్లైమేట్ చేంజ్, క్రమంగా భారతదేశం లాంటి దేశాలకూ విస్తరించింది. భారత పర్యావరణ శాస్త్రజ్ఞుల హెచ్చరికల ప్రకారం 2030 సంవత్సరం వరకే దేశంలోని చాలా ప్రాంతాల్లో నీరు అధికంగా అవసరమయ్యే వరి,

గోధుమ, చెరుకు పంటలను పండించడానికి కావలసిన నీటి మట్టం భూమిలో ఉండని కారణాన ఆ పంటలను పండించడం ఆపివేయాల్సిన పరిస్థితి వస్తుందని అన్నారు. ఇప్పటికే చాలా గ్రామాల్లో వరి పంట వేయడం ఆపేశారు. ఆనకట్టల కింద కాలువల ద్వారా వ్యవసాయం చేసే రైతులకు రెండవ పంటకు నీరు లేకపోవడం వలన స్వచ్ఛందంగా లేదా ప్రభుత్వ ఉత్తర్వుల వలన కాని రైతులు పంట సెలవులు ప్రకటిస్తున్న వాస్తవం కొన్ని సంవత్సరాలుగా చూస్తున్నాం.

క్లైమేట్ చేంజ్ వలన వర్షాభావ పరిస్థితులు ఏర్పడతాయని శాస్త్రజ్ఞులు చేసిన హెచ్చరికలు రుతుపవనాల అతి ఆలస్యం వలన నిజమని తేలాయి. జూన్‌లో కూడా వర్షాలు లేవు. ఒకవైపు వర్షాభావం, ఇంకోవైపు పంట కోతకు సిద్ధంగా ఉన్నప్పుడు అకాల వర్షాలు పడి పంట నాశనం కావడం ప్రతి ఏటా పెరుగుతున్నది.

ఇదే కాకుండా, పారిశ్రామికీకరణ, అభివృద్ధి అనే ఆకర్షణీయ పదజాలంతో మనదేశంలో విచ్చలవిడిగా ప్రకృతిని నాశనం చేయడం, నదులను, భూగర్భ జలాలను కలుషితం చేయడం, పంట పొలాలను వాణిజ్య పంటల కొరకు, వ్యవసాయేతర పనులకు వినియోగించడం భవిష్యత్తులో తీవ్ర ఆహార కొరతకు దారి తీస్తున్నది. అంతే కాదు. ప్రాజెక్టులు, మైనింగ్‌ల కొరకు అడవులను నరకడం కూడా రానున్న రోజుల్లో పెద్దస్థాయిలో వర్షాభావ పరిస్థితులను సృష్టించనున్నాయి. స్వదేశీ, విదేశీ కార్పొరేట్ కంపెనీలు ప్రతిరోజు కోట్ల లీటర్ల నీటి వ్యాపారం చేస్తున్నాయి. ఈ కంపెనీలు అత్యంత శక్తివంతమైన బోర్‌వెల్స్ మెషన్‌ల ద్వారా బోర్లు వేసి పాతాళం నుండి కూడా నీటిని గుంజుతూ చుట్టు పక్కల ప్రాంతాలలో నీటి ఎద్దడికి కారణమవుతున్నాయి. ఆ ప్రాంతంలో భూగర్భ జలాలు అడుగంటగానే ఇతర ప్రాంతాలకు వెళ్లిపోతున్నారు. కార్పొరేట్ కంపెనీలు, రాజకీయ నాయకులు, అధికారుల నేరపూరిత సంబంధాలకు ఇది చక్కటి ఉదాహరణ. మనదేశం నీటిని అక్రమంగా బోర్ల ద్వారా తీస్తూ, మనకే అధిక ధరలకు అమ్ముతున్నారు. మనదేశ ప్రభుత్వం చేత డాలర్ల కొరకు అప్పు చేయించి(మెజారిటీ ప్రజలకు నష్టం కలిగించే షరతులను ప్రభుత్వం అంగీకరిస్తూ) తాము నీటిని అమ్మగా వచ్చిన కోట్లాది డాలర్ల లాభాలను ప్రతి ఏటా తమ దేశాలకు తరలించి, తమ కంపెనీ పెట్టుబడిదారులకు లాభాలుగా తీసుకెలు తున్నారు.

ప్రతి ఏటా వాతావరణం అనూహ్య (అన్‌ప్రెడిక్టెబుల్) మార్పులకు గురవుతున్నది. ఆహార భద్రత పేరు మీద పేదలకు సబ్సిడీల రూపేనా గోధుమలనో, బియ్యంనో ప్రభుత్వం ఇస్తున్నా, ప్రభుత్వ గోధాములలో ఆహార నిల్వలను దాచి ఉంచినా అది కేవలం ఒకటి, రెండు సంవత్సరాల పరిస్థితిని ఊహించి వేసిన ప్రణాళిక. అయితే, వాతావరణం ప్రెడిక్టెబుల్ (ఊహించగలిగే) పరిస్థితి నుండి అన్‌ప్రెడిక్టెబుల్ పరిస్థితికి చేరుకున్నది. పాలకులు వరల్డ్ క్లాస్ సిటీగా పిలుస్తున్న హైదరాబాద్‌లోనే నాకు తెలిసిన కొన్ని ప్రాంతాల్లో వారం రోజుల కొకసారి (ఎండాకాలంలో) తాగునీటిని ఇస్తున్నారు. కొన్ని ప్రాంతాలకు అసలు మంచినీటి సౌకర్యం కూడా లేదు. వర్షాలు బాగానే పడినప్పటికీ ఇలాంటి పరిస్థితి ఉంటే, రెండు సంవత్సరాలు వరుసగా వర్షాభావం ఏర్పడితే, పంట నీరు కాదు కనీసం తాగు నీరు కూడా అందించలేని అనూహ్య పరిస్థితులలోకి వెళుతుంది ప్రభుత్వం.

జూన్ రెండవ వారంలో కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలకు ఒక సర్క్యులర్ పంపింది. వర్షాభావ పరిస్థితులు నెలకొన్నందున ప్రాజెక్టుల నుండి నీటిని సాగుకొరకు ఇవ్వడం ఆపివేయాలని, వాటిని తాగునీటి కొరకు మాత్రమే వాడాలని సూచించింది. నిజానికి, ఇరాక్‌లో అకస్మాత్తుగా ప్రజలు తిరగబడడానికి గల ప్రధాన కారణాలలో ఒకటి 2004 తర్వాత అమెరికా తొత్తు ప్రభుత్వం (సద్దాం చేసిన దానికి విరుద్ధంగా) ప్రజలకు నీటి సరఫరా తగ్గించి, ఫైవ్‌స్టార్ హోటళ్లకు, స్విమ్మింగ్ పూల్‌లకు, పరిశ్రమలకు, మాల్స్‌లకు నీటిని తరలించడం తో, ప్రజలకు నెల కొకసారి తాగు నీరు దొరకడం కూడా గగనమైంది. దాంతో, అనూహ్యంగా అక్కడ ప్రజలు విప్లవం వైపు మళ్లారు.

ప్రపంచంలోని ఏ ప్రభుత్వమైనా తిరుగుబాటుదారులను ఎదుర్కొవ డానికి వేసే ప్రణాళికలు కేవలం ప్రెడిక్టెబుల్ పీరియడ్ ఆధారంగానే వేస్తారు. అయితే, 90 శాతం ప్రజలను దోచుకుంటూ, వారి జీవితాలను మరింతా కష్టాల్లోకి, అప్పుల్లోకి నెడుతున్న ఒక అన్యాయ దోపిడీ వ్యవస్థ శాశ్వతంగా ప్రెడిక్టెబుల్ పీరియడ్‌లోనే ఉంటుందని అనుకుంటే అది మూర్ఖత్వం అవుతుంది. అన్‌ప్రెడిక్టెబుల్ పీరియడ్‌లో వచ్చే విప్లవాలను ఎదుర్కొవడానికి ఎంత గొప్ప మిలటరీ ప్లానర్‌లు ఉన్నా, ఎంత ఆయుధ సంపత్తి ఉన్నా చేయగలిగింది ఏమీ లేదు. ఉదాహరణకు జూన్ నెలలో ఇరాక్‌లోని మోసుల్ పట్టణంపై తిరుగుబాటుదారులు దాడి చేయగానే భద్రత బలగాలు, సైనికులు తమ ఆయుధాలను వదిలి, తమ డ్రెస్సులను తీసిపారేసి మామూలు ప్రజల వలె దుస్తులను వేసుకొని పారిపోయారు. ప్రెడిక్టెబుల్ పీరియడ్‌లో వందలల్లో ఉన్న తిరుగుబాటుదారులు, అన్‌ప్రెడిక్టెబుల్ పీరియడ్‌లో వేలు, లక్షల సంఖ్యలో పెరుగుతారు. నిజానికి విప్లవాలు అనూహ్యమైన ప్రగతి సాధించేది అన్ ప్రెడిక్టెబుల్ పీరియడ్‌లోనే. దీన్నే మరో మాటలో విప్లవాల విజయం పీరియడ్ అని కూడా అనవచ్చు.

ప్రపంచ ఆర్థిక సంక్షోభాల ప్రభావం రీత్యా చూసినా లేదా క్లైమేట్ చేంజ్ దుష్పరిణామాల ప్రభావం రీత్యా చూసినా దాదాపు 2020 సంవత్సరం నుండి భారతదేశం అన్‌ప్రెడిక్టెబుల్ పీరియడ్‌లోకి దిగుతుంది. కొందరు పాశ్చాత్య ఆర్థికవేత్తల మాటల్లోనే వారి ఆర్థిక వ్యవస్థ ఎప్పుడైనా కూలిపోవచ్చు. అంటే, వారి ఆర్థిక వ్యవస్థతో విడదీయ లేనంత పెనుబంధం వేసుకున్న భారత ఆర్థిక వ్యవస్థ కూడా కూలిపోతుంది.

అలాగే, 2020 తర్వాత భారతదేశం వివిధ అంతర్జాతీయ సంస్థల నుండి తెచ్చిన అప్పులను తిరిగి కట్టవలసి ఉంటుంది. జూన్ 14 నాడు 'హిందూ' దిన పత్రికలో ప్రముఖ పెట్టుబడిదారుడు కుమార్ మంగళం బిర్లా చెప్పినట్టు 'ప్రస్తుతం భారతదేశం బడ్జెట్‌లో మూడవ వంతుకు మించి కేవలం వడ్డీ చెల్లింపులకే ప్రభుత్వం కేటాయిస్తున్నది'. అంటే, భారత ప్రభుత్వం 2020 తర్వాత చెల్లించాల్సిన అప్పులోని ప్రిన్సిపుల్ అమౌంట్ (అసలు) ఎంతగా ఉంటుందంటే దానికి బడ్జెట్ సరిపోదు. దాంతో ప్రజలపై ఇష్టారాజ్యంగా పన్నులు విధించడం, సంక్షేమ పథకాలను, సబ్సిడీలను తీసివేయడం చేస్తారు. దాంతో, దేశంలో అన్‌ప్రెడిక్టెబుల్ పీరియడ్ మొదలవుతుంది. అదనంగా, దీనికి పెట్టుబడిదారీ దేశాల ఆర్థిక వ్యవస్థ సంక్షోభం తోడవుతుంది. దాంతో, మరింత అన్‌ప్రెడిక్టెబుల్‌గా మారుతుంది. ఈ రెండింటికి క్లైమేట్ చేంజ్ దుష్పరిణామం కూడా తోడైతే, జరుగబోయే పరిణామాలు ఎవరి ఊహకు కూడా అందనివి. ఇరాక్‌లో తిరుగుబాటు సంస్థలలో చేరడానికి లైన్లలో నిలబడుతూ, మమ్మల్ని చేర్చుకోండంటూ ప్రజలు బతిమాలుతున్నారట. 2020 తర్వాత భారతదేశంలో అదే పరిస్థితి రాబోతున్నది.

(ఈ వ్యాసం రాయడానికి ఉపయోగపడిన వెబ్‌సైట్ల లింక్‌లను వీక్షణం జూలై సంచిక కింద ఉండే కామెంట్స్ పేజీలో ఉంచడం జరిగింది)

*(రచయిత పరిశోధకులు)* వీ

# ప్రాథమిక విద్యలో దళితులపై వివక్ష

***భారతదేశంలో ప్రాథమిక విద్యను పొందడంలో దళితులు, గిరిజనులు, మైనారిటీలు, ఇతర బలహీన వర్గాలకు చెందిన బాలబాలికలు ఎదుర్కొంటున్న వివక్షత గురించీ, వ్యతిరేకత గురించీ వివరిస్తున్నారు ఎం. గంగాధర్***

'మేం మురికిగా ఉన్నాం అని వాళ్లంటారు' అనే శీర్షికతో హ్యూమన్ రైట్స్ వాచ్ అనే సంస్థ భారతదేశంలోని ఎలిమెంటరీ విద్య (ఒకటవ తరగతి నుండి ఎనిమిదవ తరగతి వరకు) తీరుతెన్నుల గురించి ఒక నివేదికను తయారు చేసింది. ఇది 2014 ఏప్రిల్‌లోనే విడుదల చేయబడిన ఒక తాజా నివేదిక. భాతరదేశ సమాజంలోని దళితులు, గిరిజనులు, మైనారిటీలు, ఇతర అత్యంత బలహీనవర్గాలకు చెందిన బాలబాలికలు ఎలిమెంటరీ విద్యను పొందడంలో ఎదుర్కొంటున్న వివక్షను గురించి, వెలివేతను గురించి ఈ నివేదిక పరిశీలించింది. మనదేశంలో దళితులు, గిరిజనులు, మైనారిటీలు, ఇతర అత్యంత బలహీనవర్గాలకు చెందిన బాలబాలికలు చదువుకోవడానికి ప్రభుత్వ పాఠశాలలు మాత్రమే మిగిలాయి. కాబట్టి ఈ నివేదికను తయారు చేయడానికి అవసరమైన సమాచారాన్ని సేకరించడానికి, ధోరణలను పసిగట్టడానికి, అభిప్రాయాలను తెలుసుకోవడానికి, విధానాల అమలు తీరుతెన్నులను అంచనా వేయడానికి ప్రభుత్వ పాఠశాలల మీదనే నివేదికా రచయితలు ఆధారపడ్డారు.

హ్యూమన్ రైట్స్ వాచ్ ఈ నివేదికను తయారు చేయడానికి, అందుకు అవసరమైన పరిశీలనలను చేయడానికి, నిర్ధారణలకు రావడానికి, అంతిమంగా కొన్ని సిఫారసులను చేయడానికి చట్టబద్ధమైన పరిమితులను విధించుకున్నది. దళితులు, గిరిజనులు, మైనారిటీలు, ఇతర అత్యంత బలహీన వర్గాలకు చెందిన బాలబాలికలు చదువు కోకపోవడానికి, బడిలో చేరినా ఎలిమెంటరీ విద్యను పూర్తి చేసేటంత వరకైనా బడిలో ఉండలేకపోవడానికి, చదువులో ఇతరుల కంటే వెనకబడి ఉండడానికి, బడిలో నుండి జారిపోయినవారు తిరిగి బడిలో చేరలేకపోవడానికి, అన్నింటి కంటే ముఖ్యంగా వివక్షను, వెలివేతను ఎదుర్కోవడానికి దారి తీసిన సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక కారణాల వైపు ఈ నివేదిక దృష్టిని సారించలేదు. అందువలన ఈ నివేదిక భారత ప్రభుత్వానికి, రాష్ట్ర ప్రభుత్వాలకు చేసిన సిఫారసుల్లో చట్టాలను సమర్థవంతంగా అమలు చేయడమనే ఉపరితల అంశమే కనిపిస్తుంది.

ప్రపంచ వ్యాప్తంగా ప్రజల హక్కులను రక్షించడం కొరకు, హక్కుల ఉల్లంఘన జరిగినప్పుడు దాన్ని ఎత్తిచూపడానికి, హక్కులను గౌర వించాలని అధికారంలో ఉన్న ప్రభుత్వాల మీద ఒత్తిడిని తేవడానికి, తద్వారా ప్రజలకు న్యాయాన్ని అందించడానికి కృషి చేస్తానని హ్యూమన్ రైట్స్‌వాచ్ తన గురించి చెప్పుకున్నది. తనది స్వతంత్ర సంస్థ అని, అంతర్జాతీయ సంస్థ అని చెప్పుకున్న హ్యూమన్ రైట్స్ వాచ్‌కు ప్రపంచంలో 40కి పైగా దేశాల్లో సిబ్బంది ఉంది. వివిధ దేశాలకు చెందిన 21 నగరాల్లో దానికి కార్యాలయాలు ఉన్నాయి. భారతదేశంలో మాత్రం దానికి కార్యాలయం లేదు.

**పరిశోధన పద్ధతి**

ఈ నివేదికను తయారు చేయడానికి అవసరమైన పరిశోధన మూడు రాష్ట్రాల్లో, రెండు నగర ప్రాంతాల్లో జరిగింది. ఉత్తరప్రదేశ్, బీహార్, ఆంధ్రప్రదేశ్‌లు ఆ రాష్ట్రాలు. హర్యానా, ఢిల్లీలు ఆ నగర ప్రాంతాలు. ఈ మూడు రాష్ట్రాల్లోనూ ఉత్తరప్రదేశ్, బీహార్‌ల్లోనే ఎక్కువ పరిశోధన జరిగింది. నగర ప్రాంతాల్లోని వలస కార్మికుల పిల్లల ఎలిమెంటరీ విద్యాభ్యాస స్థితిగతులను తెలుసుకోవడానికి పరిమితమై హర్యానా, ఢిల్లీల్లో పరిశోధన జరిగింది.

సుమారు 162 మందితో మాట్లాడడం ద్వారా పరిశీలనాంశానికి చెందిన సమాచారాన్ని, అభిప్రాయాలను, ధోరణులను ఈ పరిశోధన రాబట్టింది. ఇందులో 85 మంది విద్యార్థులు. ఈ 85 మందిలో ఉత్తరప్రదేశ్‌కు చెందినవారు 35 మంది, బీహార్‌కు చెందిన వారు 16 మంది, ఆంధ్రప్రదేశ్‌కు చెందినవారు 15 మంది, హర్యానాకు చెందినవారు నలుగురు, ఢిల్లీకి చెందినవారు 15 మంది. 45 మంది తల్లిదండ్రులతో, 32 మంది ఉపాధ్యాయులు, ప్రిన్సిపాళ్లతో మాట్లాడారు. పరిశోధకులు పిల్లల హక్కుల సంస్థల, విద్యావేత్తల, నిపుణుల సహాయాన్ని తీసుకున్నారు. ఈ నివేదిక కొరకు ప్రత్యేకంగా సర్వేలను చేయలేదు. 2012 అక్టోబర్, 2013 సెప్టెంబర్ మధ్య కాలంలో ఈ పరిశోధన జరిగింది. 2009లో పార్లమెంట్ చేత ఆమోదింపబడి, 2010 ఏప్రిల్ ఒకటవ తేదీ నుండి అమల్లోకి వచ్చిన విద్యా హక్కు చట్టం అమలవుతున్న తీరును, అందుకు ఎదురవుతున్న ఆటంకాలను గురించి తెలుసుకోవడం ఈ పరిశోధన లక్ష్యం.

ఉత్తర భారతదేశంలోని రెండు రాష్ట్రాల్లో, రెండు నగర ప్రాంతాల్లో పరిశోధన చేసిన తాను దక్షిణ భారతదేశంలోని ఆంధ్రప్రదేశ్‌లో కూడ పరిశోధన చేయడానికి కారణం దేశంలో ఉత్తరప్రదేశ్ తరువాత ఆంధ్ర ప్రదేశ్‌లోనే ఎక్కువ మంది బడి బయటి పిల్లలు, బాల కార్మికులు ఉండడం ఒకటని, ఆంధ్రప్రదేశ్‌లో ఎలిమెంటరీ స్థాయిలో ఎన్‌రోల్ మెంట్, తదితర విషయాల్లో తీసుకున్న చర్యల వలన గత దశాబ్ద కాలంలో పరిస్థితి కొంత మెరుగుపడడం మరొకటని హ్యూమన్ రైట్స్ వాచ్ చెప్పింది.

**అక్షరాస్యతలో పెరుగుదల – నిధుల లభ్యతలో కొరత**

దేశంలో ప్రస్తుతం అందరికి అక్షరాస్యతను కల్పించడంలో ఎదురవు తున్న సమస్యలను తెలుసుకోవడానికి పూనుకున్న ఈ నివేదిక అక్షరాస్యతా స్థితికి సంబంధించిన గతాన్ని కొంత తడిమింది. 1947లో దేశంలో 14 శాతం అక్షరాస్యత ఉంది. మహిళల అక్షరాస్యత 8 శాతం మాత్రమే.

1950లో అమల్లోకి వచ్చిన భారత రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాల్లో 14 ఏళ్లలోపు బాలబాలికలందరు పదేళ్లకాలంలో నిర్బంధోచిత విద్యాభాసంలో ఉండేలాగా చూడడం అనే లక్ష్యాన్ని కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల ముందు ఉంచారు. (45వ అధికరణం) 60 ఏళ్ల తరువాత కూడా ప్రభుత్వాలు ఆ లక్ష్యాన్ని చేరుకోలేదు. ఈ నివేదిక ఈ విషయాన్ని ప్రస్తావించలేదు. అయితే 1947లో 14 శాతం ఉన్న అక్షరాస్యత 2011లో 74 శాతానికి చేరుకున్నదని, మహిళల అక్షరాస్యత 65

శాతానికి చేరుకున్నదని, ప్రస్తుతం 6 నుండి 14 ఏళ్లలోపు బాలబాలికలు బడిలో చేరడం దాదాపు 100 శాతానికి చేరుకున్నదని పేర్కొని, ఈ 100 శాతం ఎన్‌రోల్‌మెంట్ నిలకడగా ఉండలేకపోవడంలో ఉన్న సమస్యలను నివేదిక విశ్లేషించింది.

ఎలమెంటరీ విద్యను సార్వజననం చేయడం కొరకు తీసుకో వలసిన చర్యల మీద 1990ల నుండి కేంద్ర ప్రభుత్వం తీవ్రమైన ఒత్తిళ్లకు లోనయింది. 1993లో ఉన్ని కృష్ణన్ కేసులో సుప్రీంకోర్టు తీర్పు చెపుతూ గౌరవప్రదంగా జీవించే హక్కులో మంచి విద్యను పొందే హక్కు ఇమిడి ఉందని వ్యాఖ్యానించింది. ఇది తరువాత కాలంలో విద్యను ప్రాథమిక హక్కుల్లో చేర్చాలనే డిమాండ్‌కు ఊతాన్ని ఇచ్చింది. 2002లో 86వ రాజ్యాంగ సవరణగా 6 నుండి 14 ఏళ్ల మధ్యనున్న బాలబాలికలకు విద్యను ప్రాథమిక హక్కుగా ఇస్తూ 21ఎ అధికరణను చేర్చారు.

దాదాపు ఇదే సమయానికి 2001 నుండి సర్వశిక్ష అభియాన్ అమల్లోకి వచ్చింది. ఎలమెంటరీ విద్యను సార్వజనీనం చేయడం కొరకు కేంద్ర ప్రభుత్వం ప్రారంభించిన పథకం ఇది. నిజానికి మన దేశంలో ప్రపంచీకరణ క్రమం ప్రారంభం కావడానికంటే ముందుగానే ఎలమెంటరీ విద్యను సార్వజనీనం చేయడం కొరకు ఎస్ఎస్ఎ కంటే ముందే ప్రభుత్వాలు మరికొన్ని పథకాలను అమలు చేశాయి. ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించి ఆపరేషన్ బ్లాక్ బోర్డు, ఆంధ్రప్రదేశ్ ప్రాథమిక విద్యా పథకం, జిల్లా ప్రాథమిక విద్యా పథకం ఎస్ఎస్ఎ కంటే ముందే అమలైన పథకాలు. ప్రపంచీకరణ క్రమానికి సార్వజనీన విద్యా వ్యాప్తికి మధ్యన ఉన్న సంబంధం గురించి ప్రత్యేకంగా చెప్పవలసి ఉంది. ఈ నివేదిక మాత్రం ఎస్ఎస్ఎ గురించి మాత్రమే ప్రస్తావించింది. 2001లో ప్రారంభమైన ఎస్ఎస్ఎ ద్వారా కొత్త పాఠశాలల నిర్మాణానికి, కొత్త తరగతి గదుల నిర్మాణానికి, టాయ్‌లెట్ల నిర్మాణానికి, తాగునీటి వసతిని కల్పించడానికి, ఉపాధ్యాయులకు వృత్త్యంతర శిక్షణను ఇవ్వడానికి నిధులను విడుదల చేశారు.

విద్యకు నిధుల కేటాయింపును పెంచడమనేది కనీసం ఐదు దశాబ్దాల నుండి మనదేశంలో కొనసాగుతున్న సమస్య. విద్యారంగానికి స్థూల జాతీయోత్పత్తిలో ఆరు శాతం నిధులను కేంద్ర ప్రభుత్వం కేటాయించాలని, బడ్జెట్‌లో 30 శాతం నిధులను రాష్ట్ర ప్రభుత్వాలు కేటాయించాలని 1966లో కొఠారి కమిషన్ సిఫారసు చేసింది. కాని ఈ 50 ఏళ్లలో విద్యారంగానికి కేంద్ర ప్రభుత్వం కేటాయించిన నిధులు మూడు శాతానికి నాలుగు శాతానికి మధ్యనే ఉన్నాయి. ఇటీవలి దశాబ్దాల్లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం విద్యారంగానికి కేటాయించిన నిధులు బడ్జెట్‌లో 15 శాతానికి అటూఇటూగా ఉన్నాయి. వాజ్‌పేయి ప్రధానిగా ఉన్న కాలంలో కేంద్ర ప్రభుత్వం ఒక విచిత్రమైన వాదనను ముందుకు తెచ్చింది. కేంద్ర ప్రభుత్వం విద్యారంగం మీద పెడుతున్న ఖర్చును ప్రైవేట్ పాఠశాలల్లో , కళాశాలల్లో తమ పిల్లల చదువు కోసం తల్లిదండ్రులు పెడుతున్న ఖర్చును కలుపుకుంటే విద్యారంగం మీద మొత్తంగా జరగుతున్న ఖర్చు ఆరు శాతానికి చేరుకుంటుందని అప్పటి ప్రభుత్వం వాదించింది.

ఎలమెంటరీ విద్యను ప్రాథమిక హక్కుగా మార్చుస్తూ 2002లో రాజ్యాంగ సవరణ జరిగింది. కాని 2009 వరకు దాని అమలుకు సంబంధించిన చట్టాన్ని కేంద్ర ప్రభుత్వం చేయలేకపోయింది. కాని యుపిఎ - 1 ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తరువాత 2004 - 2005 నుండే విద్యారంగానికి నిధుల కేటాయింపును పెంచడం కోసమని పన్నుల మీద 2 శాతం లెవీని విధించడం ప్రారంభించింది. ఉన్నత విద్యారంగానికి నిధుల కేటాయింపును పెంచడం కోసమని 2008 - 2009 నుండి పన్నుల మీద ఒక శాతం లెవీని అదనంగా విధించడం ప్రారంభించింది. కాని ఆయా స్థాయిల్లో విద్యారంగానికి నిధుల కేటాయింపు పెరిగినట్లుగా మాత్రం కనిపించదు.

భారతదేశంలో ఎలమెంటరీ విద్యను సార్వజననం చేయడం మీద దృష్టి సారించిన ప్రపంచ బ్యాంకు భారత ప్రభుత్వానికి ఈ విషయంలో ఆర్థిక సహాయం చేయడం ప్రారంభించింది. బ్యాంకుకు సంబంధించిన ఇంటర్నేషనల్ డెవలప్‌మెంట్ అసోషియేషన్ 2004-2012 మధ్య కాలంలో 11,100 కోట్ల రూపాయల (1.85 బిలియన్ డాలర్లు) సహాయాన్ని చేసింది. బ్రిటన్‌కు చెందిన డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఇంటర్నేషనల్ డెవలప్‌మెంట్ నుండి 2008 - 2012 మధ్యకాలంలో 2778 కోట్ల రూపాయలను (463 మిలియన్ డాలర్లు) భారత ప్రభుత్వం స్వీకరించింది. యూరోపియన్ కమిషన్ నుండి 2000 - 2008 మధ్యకాలంలో 1584 కోట్ల రూపాయలను (264 మిలియన్ డాలర్లు) స్వీకరించింది.

భారత ప్రభుత్వం గాని, భారతదేశంలోని రాష్ట్ర ప్రభుత్వాలు గాని భారత రాజ్యాంగం ప్రజలకు ప్రసాదించిన హక్కులను ఏనాడూ ఒత్తిడి లేకుండా అమలు చేయలేదు. ఆ హక్కులను అమలు చేయడం వలన పాలకవర్గాల ప్రయోజనాలు దెబ్బతినే పరిస్థితి ఉన్నప్పుడు ఒత్తిడి ఉన్నప్పటికీ అమలు చేయలేదు. దేశంలోని 14 ఏళ్ల లోపు బాల బాలికలందరికి నిర్బంధోచిత విద్యను 1960 నాటికే అందించాలని 45వ అధికరణం భారత ప్రభుత్వం మీద, రాష్ట్ర ప్రభుత్వాల మీద బాధ్యతను ఉంచినప్పటికి ఆ ప్రభుత్వాలు 60 ఏళ్లుగా ఆ బాధ్యతను నెరవేర్చలేదు. ఉన్ని కృష్ణన్ కేసులో 1993లో వెలువడిన సుప్రీంకోర్టు తీర్పు, ఆ తీర్పును అనుసరించి కేంద్ర ప్రభుత్వం మీద పెరుగుతూ వచ్చిన ఒత్తిడి వల్లనే 86వ రాజ్యాంగ సవరణను తీసుకవచ్చి భారత ప్రభుత్వం ఎలమెంటరీ విద్యను ప్రాథమిక హక్కుగా గుర్తించింది.

ఎలమెంటరీ విద్యను సార్వజననం చేయడం అనే లక్ష్య సాధనలో భాగంగానే వండిన ఆహారాన్ని మధ్యాహ్న భోజనంగా విద్యార్థులకు ఉచితంగా అందించాలని సుప్రీంకోర్టు చెప్పిన తరువాతనే భారత ప్రభుత్వం 1995లో మధ్యాహ్న భోజన పథకాన్ని ప్రారంభించింది. 2013 - 2014 నాటికి ఈ పథకం దేశంలో 12 కోట్ల మంది విద్యార్థులకు విస్తరించింది. అయితే ఈ మధ్యాహ్న భోజనాన్ని మరింత పుష్టికరంగా అందించాలని, మధ్యాహ్న భోజనానికి అనుబంధంగా ఉదయం, సాయంత్రం వేళల్లో అల్పాహారాన్ని అందించాలని వస్తున్న డిమాండ్లను కేంద్రప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలు పట్టించుకోవడం లేదు.

తమ పిల్లలను చదివించడం పట్ల తల్లిదండ్రులకు గతంలో కంటే ఇప్పుడు పెరిగిన చైతన్యం వల్లగాని, సర్వశిక్షా అభియాన్ పథకం వల్లగాని, మధ్యాహ్న భోజన పథకం వల్లగాని 6 నుండి 14 ఏళ్ల మధ్యనున్న బాలబాలికల ఎన్‌రోల్‌మెంట్ దాదాపు 100 శాతానికి చేరుకున్నది. బడిలో చేరిన పిల్లలు బడిలో నిలకడగా ఉండడం కూడా గతంలో కంటే పెరిగింది. అయినా హ్యూమన్ రైట్స్ వాచ్ తాను చేసిన పరిశోధన ఫలితాలను వెల్లడించే నివేదికకు 'మేం మురికిగా ఉన్నాం అని వాళ్లు అంటారు' అనే శీర్షికను పెట్టింది. దాదాపు 100 శాతం మేరకు చేరుకున్న ఎన్‌రోల్‌మెంట్‌కు వేరే ముఖం ఉంది. నిజానికి ఆ ముఖాన్ని చూపడమే ఈ నివేదిక ఉద్దేశం.

**కాగితాల మీద చట్టాలు - ఆచరణలో ఉల్లంఘనలు**

భారతదేశంలో ఎలమెంటరీ స్థాయిలో ఎన్‌రోల్‌మెంట్ విషయంలో, అంత కంటే ముఖ్యంగా బడిలో చేరిన విద్యార్థులందరు బడిలో నిలకడగా ఉండే విషయంలో, ఎదురవవుతున్న సమస్యలను రెండు స్థాయిలలో

చూపడానికి ఈ నివేదిక ప్రయత్నించింది. ఎలమెంటరీ విద్యకు సంబంధించిన చట్టాలు ఎలా అమలవుతున్నా యనే విషయాన్ని పరిశీలించడం ఒక స్థాయి విద్యార్థులు బడిలో చేరడంలో, చేరిన వారందరు బడిలో నిలకడగా ఉండడంలో సామాజికంగా ఎదురవుతున్న సమస్యలను పరిశీలించడం మరొక స్థాయి.

6 నుండి 14 ఏళ్లలోపు బాలబాలికలకు ఎలమెంటరీ విద్యను ప్రాథమిక హక్కుగా అందించడమనే రాజ్యాంగ హక్కును అమలు చేయడం కొరకు భారత ప్రభుత్వం 2009లో చేసిన విద్యాహక్కు చట్టం 2010 ఏప్రిల్ ఒకటవ తేదీ నుండి అమల్లోకి వచ్చింది. విద్యార్థులు చక్కగా చదువుకోవడానికి అవసరమైన వసతులను, సౌకర్యాలను కల్పించడానికి చట్టం కొన్ని ప్రమాణాలను నిర్దేశించింది. రాష్ట్ర ప్రభుత్వాలు ఈ ప్రమాణాలను అందుకోవడానికి మూడేళ్ల సమయాన్ని ఇచ్చింది. తరగతి గదుల నిర్మాణం, ఉపాధ్యాయుల నియామకం, తాగునీటి సౌకర్యం, టాయిలెట్ల అందుబాటు, ఆటస్థలం, గ్రంథాలయం, ప్రయోగశాల మొదలైన ప్రమాణాలను చట్టం చెప్పింది. నిర్దేశించిన ప్రమాణాల మేరకు వసతులను కల్పించడం, మెరుగైన ప్రమాణాలతో కూడిన విద్యా బోధనను అందించడం ఉచితంగా జరగాలనేది కూడా ఒక ప్రమాణమే. అయితే విచిత్రంగా డబ్బులు తీసుకొని చదువు చెప్పే, అసలు డబ్బు సంపాదించడమే ధ్యేయంగా చదువు చెప్పడమనే వ్యాపారంలోకి దిగిన ప్రైవేట్ పాఠశాలలను చట్టం నిషేధించలేదు. సరికదా కనీసం నియంత్రించ లేదు. పైగా ప్రైవేట్ పాఠశాలలు తమ సీట్లలో 25 శాతం మేరకు పరిసర ప్రాంతంలోని పేద విద్యార్థులకు ఇవ్వాలని, వారికి అయ్యే ఖర్చును రీయంబర్స్‌మెంట్ రూపంలో ప్రభుత్వమే భరిస్తుందని చట్టం చెప్పింది. చట్టం చెప్పిన విధంగా 25 శాతం సీట్లను ప్రైవేట్ పాఠశాలలు పేద విద్యార్థులకు ఇవ్వడం లేదని నివేదిక పేర్కొన్నది.

ప్రభుత్వమే చట్టంలో ఉన్న ప్రమాణాలను ప్రభుత్వ పాఠశాలలో విధించిన మూడేళ్ల కాల వ్యవధిలో అందుకోలేదని హ్యూమన్ రైట్స్ వాచ్ నివేదిక చెప్పింది. కేవలం 10 శాతం పాఠశాలలే చట్టం చెప్పిన ప్రమాణాలను అందుకున్నాయని చెప్పింది. తరగతి గదులు, తాగునీరు, టాయిలెట్స్ వాటి భౌతిక వసతులను కల్పించలేక పోవడమే కాకుండా, చట్టం చెప్పిన ప్రమాణాల మేరకు 2013 మార్చ్ నాటికి దేశ వ్యాప్తంగా 11 లక్షల మంది ఉపాధ్యాయుల నియామకం జరగవలసి ఉందని కూడా నివేదిక చెప్పింది.

విద్యాహక్కు చట్టం త్వరగా అమలు కావడం కొరకు అనేక వ్యవస్థలను ఏర్పాటు చేసింది. కొన్ని ప్రభుత్వ శాఖలకు, అప్పటికే ఉన్న వ్యవస్థలకు, వివిధ ప్రభుత్వాధికారులకు, స్థానిక సంస్థలకు, పౌర సమాజానికి కొన్ని బాధ్యతలను, అధికారులను కల్పించింది. ఈ వ్యవస్థ లేవి కూడా సక్రమంగా పని చేయడం లేదని ఈ నివేదిక సోదాహరణంగా చెప్పింది. ఇలా ఏర్పాటైన వ్యవస్థల్లో పాఠశాల యాజమాన్య కమిటీ క్షేత్రస్థాయి వ్యవస్థ. ఎస్‌సిలు, ఎస్‌టిలు, మైనారిటీలు, ఇతర బలహీన వర్గాల నుండి ఈ కమిటీలో ప్రాతినిధ్యం ఉండే విధంగా, మొత్తం కమిటీ సభ్యుల్లో సగం మంది మహిళలు ఉండే విధంగా చట్టంలో ఏర్పాటు ఉంది. కాని ఆ విధంగా సభ్యులయ్యే వారిలో నిరక్షరాస్యులు కూడా ఉంటారు. సభ్యులైన తల్లిదండ్రులందరు దాదాపు ఏదో కూలిపని చేసుకొని బతికే వాళ్లు ఉంటారు. ఈ కమిటీలో వారు ఏమి చేయాలో, పాత్ర ఏమిటో వారికి తెలియదు. వారికి వారి పాత్ర గురించి తెలియ చెప్పడానికి ఇచ్చే వారి శిక్షణ తగినంత ఉండకపోవడమో, లోపభూయిష్ఠంగానో ఉంటుంది. చాలా మంది తమకున్న కూలీ పనినో, ఇతర పనులనో వదిలిపెట్టుకుని పాఠశాల యాజమాన్య కమిటీ సమావేశాలకు రారు. వచ్చిన వాళ్లలో చాలా మంది పాఠశాల ప్రధానోపాధ్యాయుడు చెప్పింది విని తలూపడానికే పరిమితమవుతారు. పాఠశాల యాజమాన్య కమిటీల పని విధానం ఉత్తరప్రదేశ్‌లోని గ్రామీణ ప్రాంతాల్లో, ఆంధ్రప్రదేశ్‌లో కొంత మెరుగ్గా ఉందని నివేదిక చెప్పింది. విద్యాశాఖ అధికారులు పథకాలను వల్లించడం తప్ప ఆచరణలో ఏమీ లేదని, డ్రాపౌట్లను గుర్తించడంలో గాని, బాల కార్మికులను బడిలో చేర్పించడంలో గాని, వారికి బ్రిడ్జ్ కోర్సులనో, ప్రత్యేక తరగతులనో నిర్వహించడంలో గాని వివిధ ప్రభుత్వశాఖల మధ్య, అధికారుల మధ్య సమన్వయం లేదని, డ్రాపౌట్లను తిరిగి బడిలో చేర్చుకోవడానికి అనేక చోట్ల ప్రధానోపాధ్యాయుల నుండి, ఉపాధ్యాయుల నుండి వ్యతిరేకత వస్తున్నదని, విద్యాహక్కు చట్టం అమలును పర్యవేక్షించవలసిన నేషనల్ కమిషన్ ఫర్ ది ప్రొటెక్షన్ ఆఫ్ చైల్డ్ రైట్స్ కూడా ఆ పనిని సరిగా చేయలేకపోతున్నదని నివేదిక చెప్పింది. బాల కార్మికులను అందరిని బడిలో చేర్పించిన ఒక విజయవంతమైన ఉదాహరణ నివేదిక ఆంధ్రప్రదేశ్‌లో గుర్తించింది. కర్నూల్ జిల్లా నర్సిపల్లి గ్రామంలో ఎంవి ఫౌండేషన్ నాలుగేళ్లు చేసిన కృషి వలన బాల కార్మికులందరు బడిలోకి వచ్చారని చెప్పింది.

సమాజంలోని వివిధ వర్గాలకు చెందిన ప్రజల హక్కులను కాపాడే విషయంలో అనేక అంతర్జాతీయ ఒప్పందాలు ఉన్నాయి. అలాంటి కొన్ని ఒప్పందాల మీద భారత ప్రభుత్వం సంతకం చేసి, ఆ హక్కులను తన దేశంలో గౌరవిస్తానని, వాటి అమలుకు కృషి చేస్తానని అంతర్జాతీయ సమాజానికి హామీ నిచ్చింది. ఆ హామీలను భారత ప్రభుత్వం నెరవేర్చవలసి ఉందంటూ ఈ నివేదిక అలాంటి కొన్ని ఒప్పందాలను పేర్కొన్నది. ఇంటర్నేషనల్ కొవెనెంట్ ఆన్ ఎకానామిక్, సోషల్ అండ్ కల్చరల్ రైట్స్ 1976 జనవరి 3 నుండి అమల్లోకి వచ్చింది. 1979 ఏప్రిల్ 10 నుండి అమల్లోకి వచ్చింది. 1992 డిసెంబర్ 11 నుండి భారతదేశంలో అమలు కావాలి. కన్వెన్షన్ ఆన్ ది రైట్స్ చైల్డ్ 1990 నుండి సెప్టెంబర్ 10 నుండి అమల్లోకి వచ్చింది. 1992 డిసెంబర్ 11 నుండి ఇది భారతదేశంలో అమలు కావాలి. ఇంటర్నేషనల్ కొవెనెంట్ ఆన్ సివిల్ అండ్ పొలిటికల్ రైట్స్ 1976 మార్చ్ 23 నుండి అమల్లోకి వచ్చింది. 1979 నుండి ఇది భారతదేశంలో అమలు కావాలి. కన్వెన్షన్ ఆన్ ది ఎలిమినేషన్ ఆఫ్ ఆల్ ఫామ్స్ ఆఫ్ డిస్క్రిమినేషన్ అగెనెస్ట్ ఉమెన్ 1981 సెప్టెంబర్ 3 నుండి అమల్లోకి వచ్చింది. 1993 జూలై 9 నుండి ఇది భారతదేశంలో అమలు కావాలి. ఈ ఒప్పందాలన్ని ఎలమెంటరీ విద్యను సార్వజనీనం చేయడం కొరకే నంటే అతిశయోక్తి కాదు. ఎలమెంటరీ విద్యను అభ్యసించడంలో అత్యంత బలహీన వర్గాలకు చెందిన పిల్లలు తీవ్రమైన వివక్షను, వెలివేతను ఎదుర్కొంటున్నారని ఈ నివేదిక ప్రధానంగా ప్రస్తావించిన దానికి సంబంధించి కూడా ఒక అంతర్జాతీయ చట్టాన్ని పేర్కొన్నది. 14 ఏళ్ల లోపు పిల్లలు ప్రమాదకరమైన పరిశ్రమల్లో పని చేయవద్దని నిషేధించిన మన దేశ చట్టాన్ని కూడా ఈ నివేదిక గుర్తు చేసింది. ఈ చట్టాలన్నింటిని, అంతర్జాతీయ సమాజానికి భారత ప్రభుత్వం ఇచ్చిన ఈ హామీలన్నింటిని అమలు పరచవలసిన బాధ్యత భారత ప్రభుత్వం మీద, రాష్ట్ర ప్రభుత్వాల మీద ఉందని నివేదిక చెప్పింది.

*(మిగతా వచ్చే సంచికలో)*

*(రచయిత డిటిఎఫ్ నాయకులు, విశ్రాంత ఉపాధ్యాయులు)* వీ

# ఆదివాసుల హక్కును హరిస్తున్న ప్రభుత్వాలు

***ఖనిజ సంపదను కొల్లగొట్టడానికి ఆదివాసులపై ప్రభుత్వ బలగాలు తీవ్ర హింసకు, అత్యాచారాలకు పాల్పడుతున్నాయనీ, వాటిని సమర్థిస్తున్న న్యాయవ్యవస్థను నిలదీస్తూ ఆదివాసీ ప్రజలకు అండగా నిలవాలనీ అంటున్నారు* ఎం. నాగమణి**

మన్యం ప్రజలమైన సుదీర్ఘ పోరాటాలతో బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పాలనను వదిలించుకున్నారు. మన్యం అనేక ముఠాలు (గ్రూపులు) గా ముఠాదార్ల, మొఖాసీదార్ల (పెత్తందార్లు) పట్టు నుండి విడిపించుకున్నారు. ఆదివాసి ప్రాంతాలు సహజ సిద్ధంగానే సుసంపన్నమైనవి. అందునా తూర్పు కనుమల్లో మన్యం అనబడే విశాఖ ఏజెన్సీ ప్రాంతం ఖనిజ నిక్షేపాలకు పుట్టినిల్లు. అలాంటి మన్యం రూపురేఖలు మారుతోంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సామ్రాజ్య వాదులకు విశాఖ ఏజెన్సీ (మన్యం) ప్రాంతాలను తాకట్టు పెడుతూ మన్యం వాసులను నిర్వాసితులను చేస్తున్నది. ఇక్కడి రాజకీయ పార్టీలు, నాయకులు వాళ్ల అస్తిత్వం నిలుపుకోవడం కోసం ఈ ప్రాంత ప్రయోజనాలను పట్టించుకోవడం లేదు. వాళ్ల వ్యాపారాల్లో, అధికార కాంక్ష మత్తులో వాళ్లు జోగుతున్నారు.

బహుళజాతి సంస్థలు ఈ ప్రాంతంలోని ప్రకృతి సంపదను కొల్లగొట్టడానికి ఈ ప్రాంత స్థానిక సంస్థల ప్రభుత్వాలను తమకను కూలంగా మలుచుకుంటున్నారు. ఎందుచేతనంటే ఈ ప్రాంతంలోని ఖనిజ సంపదను వెలికి తీయాలంటే ఫెసా చట్టం ప్రకారం ఆదివాసి ప్రజలతో కూడిన గ్రామ సభల తీర్మానం పొందిన తర్వాతనే ఖనిజ సంపదను వెలికి తీయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. అందుకే ఈ రాజ్యం షెడ్యూల్డ్ ప్రాంతాలను – నాన్ షెడ్యూల్డ్ ప్రాంతంగా మార్చడానికి కుట్రలు పన్నుతున్నది. దీనిలో భాగంగానే ఆదివాసేతరులకు స్థానిక సంస్థల (ఎంపిటిసి, జడ్‌పిటిసి, సర్పంచ్) ఎన్నికల్లో రిజర్వేషన్లు కల్పించారు. ఏజెన్సీ ప్రాంతాల్లో నివసిస్తున్న ఆదివాసేతరులకు శాశ్వతంగా జీవించే హక్కులు కల్పిస్తామని, వారి నివాస స్థలాలను, సాగు భూములను క్రమ బద్ధీకరిస్తామని విశాఖ ఏజెన్సీ పాడేరు సదస్సుల్లో మాజీ ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి ప్రకటించారు. జల్ – జంగల్ – జమీన్ నినాదంతో పోరాటం సాగించిన ఆదివాసుల ఆశాజ్యోతి కొమురం భీం స్ఫూర్తిని గౌరవించి అటవీ భూములకు పట్టాలిస్తామని హామీ ఇచ్చిన వేదిక నుంచే ఆదివాసేతరులను కూడా ప్రస్తావించడం ఆ పోరాట వీరుని స్ఫూర్తిని పరోక్షంగా అపహాస్యం చేయడమే!

రాజ్యాంగంలోని అధికరణలు 330, 332, 334 ప్రకారం పార్లమెంట్ నుండి కింది స్థాయి వార్డు మెంబర్ వరకు షెడ్యూల్డ్ ఏరియాలో స్థానిక ఆదివాసులకే ఎన్నికల్లో రిజర్వేషన్లు ఉంటాయి. 1/70 చట్టం ప్రకారం ఏజెన్సీ ప్రాంతాల్లో ఆదివాసులు – ఆదివాసేతరుల మధ్య భూ బదలాయింపులు చెల్లవు. అలాగే ఆదివాసేతరులు స్థిరాస్తులు, చరాస్తులు సంపాదించుకునే అవకాశం లేదు. భారత రాజ్యాంగం 5వ, 6వ షెడ్యూల్డ్ ప్రకారం 1996లో 73వ రాజ్యాంగ సవరణ ద్వారా కల్పించిన పంచాయితీరాజ్ షెడ్యూల్డ్ ప్రాంతాల విస్తరణ చట్టం (ఫెసా)ను, అటవీ హక్కుల చట్టం 2006 ప్రకారం ఆదివాసి ప్రాంతాలను ఆదివాసులే పరిపాలించుకునే అధికారం సంక్రమించింది. 5వ, 6వ షెడ్యూళ్లను, రక్షణ చట్టాలను పాలకవర్గాలు బలహీనం చేసేందుకు ప్రయత్నించడం దారుణం. ఇప్పటికే నాన్ షెడ్యూల్డ్ ఏరియాలోని ఆదివాసులు ఆదివాసేతరుల పాలనలో మగ్గుతున్నారు. ఆదివాసి ప్రాంతాలకు ఆదివాసేతరుల (భూస్వాముల, పెత్తందార్ల, ధనవంతుల) ప్రమాదం అంతకంతకు పెరుగుతూనే ఉంది.

మరోవైపు శరవేగంగా మన్యానికి తాకనున్న బాక్సైట్ గనుల ప్రాజెక్ట్స్ రేపో మాపో వెలియనున్నాయి. పచ్చని పంట భూములే కాదు, గుక్కెడు మంచినీళ్లు తాగే వీలులేని ఎడారి కానుంది. తాగేనీరు, పీల్చేగాలి విషతుల్యం కానుంది. ఉపాధి దొరికినా ఉద్యోగం కొన్నాళ్లే! మలేరియా మహమ్మారి మాడ్చి మిగిల్చినవారి కథలూ, వెతలు కడివెల కొద్ది అలానే ఉన్నాయి. వలసలు కొనసాగుతూనే ఉన్నాయి. అన్న పానీయాలు కావలసిన చోట అక్రమ గనుల కేంద్రాలు ఏర్పాటవుతున్నాయి. అయినా ఈ ప్రాంత ప్రజల బాగోగులను ఏ ప్రభుత్వాలు పట్టించుకోవడం లేదు. బాక్సైట్ గనుల వెలికితీత కోసం ఓవైపు ఆదివాసులను అణగ దొక్కడానికి మన్యం నిండా కార్పెట్ సెక్యూరిటీ తరహాలో పోలీసు ఔట్ పోస్టులను ఏర్పాటు చేస్తున్నారు. మరొక పక్క వారి గురించి, వారి సమాజం గురించి మాట్లాడుతుండడం విడ్డూరంగా ఉంటుంది. కనీసం బ్రిటిష్‌కాలంలో చేయబడిన ఆదివాసి అనుకూల చట్టాలను సహితం స్వాతంత్రానంతరం నేటి ప్రభుత్వాలు అమలు చేయడం లేదు. ఆదివాసి ప్రాంతాలు ఆర్థికంగా సంపన్నమైనవిగా భావించడం అక్కడి ప్రజలు మాత్రం భారంగా మిగులుతున్నారు. ప్రభుత్వ, ప్రైవేట్ రంగాలు అనే భేదాలు లేకుండా అన్నీ కూడా ఆదివాసులకు నష్టమే చేశాయి. ఆదివాసులు తమ స్వస్థలాల నుండి గెంటివేయబడుతున్నారు. ఇక్కడికొచ్చిన ఆదివాసేతరులు ధనవంతులయ్యారు.

ప్రకృతి మనకు చాలా ఇచ్చింది. మన్యం భాగ్యసీమ జీవనదులకు, ఖనిజ సంపదలకు, బంగారు పంట భూములకు, ఆరుకాలం కష్టపడే కష్టజీవులకు నిలయం. వెలుగులు విరజిమ్మే 1355 మెగావాట్ల ఉత్పత్తి సామర్థ్యం కలిగిన జల విద్యుత్ కేంద్రాలు, డెల్టా ప్రాంతంల్లోని సుమారు 8.50 లక్షల ఎకరాల ఆయకట్టు భూమికి రెండో పంటకి ప్రధానమైన జలాలనిస్తోంది. ఇలాంటి గొప్ప మన్యసీమ ఎందుకు రాజ్యాంగ ప్రకటిత కనీస లక్ష్యాలకు నోచుకోవడం లేదు? ఎవరి కర్తవ్యం ఎవరిని బలి తీసుకుంటున్నది? మనం తీవ్రంగా ఆలోచించవలసిన, ప్రతిస్పందించ వలసిన సందర్భం. మన్యంలో అనేక తెగలు ఉన్నాయి. భాషలున్నాయి. అమానవీయమైన తెగ పెత్తందారీ వ్యవస్థ పాదుకొని ఉన్నది. సామాజిక, రాజకీయార్థిక అంతరాలున్నాయి. వలసవాదులతో పోరాడి ఈ ప్రాంత వనరుల్ని మన కోసం కాపాడిన ఆదివాసులు ఉన్నారు. ఈ మూలవాసుల

జీవితాలలో కనీసమైన మెరుగుదలను కూడా ప్రభుత్వాలు సాధించలేక పోయాయి. ప్రజల మధ్య తగువులు పెడుతూ వారి భవిష్యత్‌ను రాజ్య వ్యవస్థలతోనే ధ్వంసం చేస్తూ ఒక ఎన్నికల నుంచి మరో ఎనికల వైపు ప్రయాణిస్తున్నారు.

అరవై ఏండ్ల స్వతంత్ర భారతంలో ఆదివాసులు విద్యావంతులు కాలేదు. కనీసం సంపూర్ణ అక్షరాస్యత సాధించలేదు. ఆదివాసి ప్రాంతాల్లో అక్షరాస్యత శాతం పురుషులది 17 శాతం, మహిళలది 8.68 శాతం మాత్రమే. ఆదివాసి స్త్రీల అక్షరాస్యత క్షేత్రస్థాయిలో కూడా రెండంకెల స్థానంలో లేదు. ప్రజల ఆరోగ్యం కాపాడే ఆరోగ్య వ్యవస్థ, ప్రజల ప్రాణాలు కాపాడే ఆహార భద్రత వ్యవస్థ మన్యంలో మృతప్రాయంలో ఉంది. దేశంలో అందరికి సరిపడినంత ఆహారం ఉంది. కానీ విషాదం ఏమిటంటే ఒక పక్క వేలాది, లక్షలాది మంది పిల్లలు, స్త్రీలు, పెద్దలు పోషకాహారలేమితో, కరువుతో అలమటిస్తుంటే, ధనికులు పొట్టల నింపే విధంగా దేశంలో ఆహార వనరులు, పశువులు బందీ అయిపోయాయి.

మన్యంగా పిలవబడుతున్న మహావనంలో దశాబ్ద కాలంలో వేలాది మంది ఆదివాసులు మృత్యువాత పడ్డారు. మలేరియా విష మహామ్మారి వల్ల ఎనిమిదేళ్లుగా ఈ వ్యాధి రోజు రోజుకూ విజృంభిస్తోంది. ఇవాళ్టికి ప్రతిపల్లె, ప్రతిగూడెం నుండి ప్రతిరోజు కనీసం మూడు, నాలుగు శవాలు లేస్తున్నాయి. ప్రతి ఊరు వల్లకాడే! ఖనిజాలపై సర్కారు కన్నుపడిందిగాని, మన గుడ్డి ప్రభుత్వాలకు మలేరియా మహామ్మారి పైకి చూపు ఆనలేదు. ప్రతిపక్షాల నోట ఒక్క మాట పలుకలేదు. చీమ చిటుక్కుమంటే చాలు కన్ను తిప్పే మీడియా కన్ను తెరవనేలేదు. చావుల సెలయేర్లుగా నిశ్శబ్దంగా ప్రవహిస్తోంది. ఢిల్లీలో నిర్భయ ఆకర్షించినంతగా మన వాకపల్లి, భల్లుగూడ అడవి పుత్రికలు తమ ఇండ్ల పెరటిలో తాము అత్యాచారాలకు గురైన ప్రభుత్వాలు కాదు, ప్రజలు మర్చిపోయారు. భర్తలతో వెలియై, ప్రభుత్వాధినేతలతో వెక్కిరించబడ్డ వాళ్లు, న్యాయవ్యవస్థ చీదరింపులకు గురికాబడ్డవాళ్లు ఆవేదనతో ఉన్నారు. రాజ్యాంగానికి కట్టుబడి పని చేస్తామని ఏర్పడిన రాజకీయ పార్టీలు, పెత్తందార్లు హింసోన్మాదాన్ని రెచ్చగొడుతున్నారు. రాజ్య వ్యవస్థల మారణకాండ అమలుకాని చోటు మన్యంలో ఎక్కడైనా ఉందా? మౌలిక సమస్యల నుంచి ప్రజల చూపును తప్పుదారి పట్టిస్తూ ఉన్న పాలకవర్గాల పట్ల మనం అప్రమత్తంగా ఉండవలసిన సందర్భమిది.

నిజంగా మన్యంలో జరుగుతున్నదేమిటి? కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు మన్యం మౌలిక వనరులను, ప్రజల శ్రమ శక్తిని, సమస్త ఆదివాసి జీవనరంగాల మీద జోక్యాన్ని అధికారాన్ని సంపన్న వర్గాలకి, బహుళజాతి సంస్థలకు, సామ్రాజ్యవాదానికి అర్పిస్తున్నాయి. ఇదంతా ప్రపంచీకరణ పేరుమీద ఆదివాసులను చీకటి నుండి వెలుగులోకి తీసుకువచ్చే పేరు మీద, ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ (టిఎంఎఫ్) కనుసైగలతో నడుస్తోంది. ఈ ప్రక్రియను మన్యం మూలవాసులు ముక్త కంఠంతో వ్యతిరేకిస్తున్నందునే రాజ్యం వారిపై కత్తిగట్టింది. ఈ ఎనిమిదేళ్లలో 12 మంది మూలవాసులను బలితీసుకున్నది. 15 మంది ఆదివాసి స్త్రీలపై అత్యాచారాలకు తెగబడింది. వందలాది మంది మూలవాసులపై అక్రమ కేసులు బనాయించి జైళ్లలో నిర్బంధించారు. తోడేళ్ల గుంపు మేకలపై పడిన చందంగా, ఆదివాసి గూడేలపై పోలీసు బలగాలు దాడులు, వేధింపులు నిత్యకృత్యమయ్యాయి. ప్రభుత్వం మూల వాసులపై తలపెట్టిన దాడి ప్రారంభంలోనే ఇంతటి అమానుష కాండ జరిగితే ఇక దాడి ఉధృతం అయితే ఇక్కడి ఆదివాసి జాతి హననం జరుగుతుందనడంలో ఎలాంటి సందేహం లేదు.

ప్రజల మధ్య మత విద్వేషాలు రెచ్చగొట్టి కుల, మత, తెగ ఆధిపత్య శక్తులతో సర్దుబాటు చేసుకుని దేశాన్ని మొత్తంగా తమ చెప్పుచేతలలో నడిపించుకున్న చరిత్ర, అనుభవం, గుణపాఠం సామ్రాజ్యవాదానికి ఉన్నాయి. 1947 తర్వాత ప్రపంచ పరిణామాలలోంచి, వలసవాద వ్యతిరేక పోరాటాలలోంచి, స్థానిక రాజకీయార్థిక జాతీయ ఉద్యమాల చారిత్రక అనుభవాలలోంచి, సామ్రాజ్యవాద ప్రమేయంలో మార్పు వచ్చినట్లు రూపంలో కనిపించిన, 1980, 90ల తర్వాత సారంలో అది అబద్ధమని తేలిపోతూ వస్తున్నది. సామ్రాజ్యవాదానికి ఆదివాసి ప్రాంతాలంటే ప్రజలు కాదు. అపారమైన వనరులు. భారతదేశమంటే సువిశాలమైన మార్కెట్. చవకగా దొరికే శ్రమ మాత్రమే. ఇక్కడి పాలక వర్గాలంటే, సామ్రాజ్యవాదానికి సాష్టాంగపడి నమస్కరించి, ఎర్రతివాచీ పరిచి ఆహ్వానించే దళారీలని అర్థం. దేశంలోని ఆదివాసి ప్రాంతాలపై సామ్రాజ్యవాద ప్రపంచీకరణ పట్టు బిగిస్తున్నకొద్దీ ఆదివాసుల మీద మరింత రాజ్యం విరుచుకుపడే అవకాశం లేకపోలేదు.

దేశాన్ని సర్వసత్తాక, లౌకిక ప్రజాతంత్ర సామ్యవాద దేశంగా తీర్చి దిద్దుకుంటామని ప్రభుత్వాలు ప్రజల ముందు ప్రకటిస్తున్నాయి. కోట్లకు పడగెత్తి మన పార్లమెంట్ శిఖరాల మీద సుఖాసీనులవుతున్న మనదేశ రాజకీయ నాయకులు, పార్టీలు ఈ ఇంగితంతో పని చేయాలి. దేశంలో రాజ్యాంగ ప్రకటిత విలువలు, లక్ష్యాలు సాధించడానికి కృషి జరగాలి. ప్రజల మధ్య స్వేచ్ఛా, సౌభ్రాతృత్వం సాధించే దిశగా ప్రయాణం ఉండాలి. కానీ అలా జరుగుతున్నదా? గత 67 ఏళ్ల స్వతంత్ర పాలనలో అనేక సార్లు ఎన్నికలు జరిగి, అనేక ప్రభుత్వాలు మారిపోయినప్పటికీ ఈనాటికీ రాజ్యాంగ ప్రకటిత విలువలు, లక్ష్యాలను సాధించలేదు. కూడు, గుడ్డ, గూడు వంటి ప్రజల కనీస అవసరాలు కూడా నెరవేరలేదనేది నిజం. నూటికి 95 శాతం ఉన్న పీడిత ప్రజల ఆకలి, పేదరికం, నిరుద్యోగం, అధిక ధరలు, అనారోగ్యం, అవినీతి వంటి సమస్యలతో నిత్యం సతమతమవు తున్నారు. దేశంలో 77 శాతం మంది ప్రజలు రోజుకు 20 రూపాయలు దొరకని దుస్థితిలో జీవిస్తున్నారు. మరోవైపు బడా పెట్టుబడిదార్లు, భూస్వాములు అంతులేని ఐశ్వర్యాలు అనుభవిస్తు న్నారు. అంబానీ, టాటా, బిర్లా, మిత్తల్, జిందాల్ తదితర వంద కార్పొరేట్ రాబందుల సంపదలు దేశ జిడిపిలో ఫావుభాగంగా ఎదిగాయి. పేదలకు, ధనికులకు అంతరాలు ఈ వ్యవస్థలో చెప్పనలవి కాని స్థాయికి పెరిగిపోయాయి. ఈ ఆర్థిక వ్యత్యాసాలు బూటకపు పార్లమెంటరీ ప్రజాస్వామ్యపు వర్గ పీడన స్వభావాన్ని బహిర్గత పరుస్తున్నాయి.

అసెంబ్లీ, పార్లమెంట్‌లు చేసే సాధారణ చట్టాలు ఆదివాసి ప్రాంతాలకు అన్వయించకూడదని రాజ్యాంగంలోని 5వ, 6వ షెడ్యూల్డ్ తెలుపుతున్నాయి. అదే సమయంలో ఆదివాసులకు ఉద్దేశించిన ప్రత్యేక చట్టాలను ఏ ఒక్క ప్రభుత్వం కూడా అమలు చేసిన దాఖలాలు లేవు. అసలు ఆ ప్రజలకు ఈ చట్టాలు తెలియవు. ఏ ప్రభుత్వాలకు కూడా ఆదివాసుల భూములను ఆదివాసేతరులకు ఇచ్చే అధికారం లేదు. సంపన్నమైన ఆదివాసి అటవీ భూములు ఎవరికిస్తున్నారు? అవి ఎవరి అభివృద్ధికి ఉపయోగపడుతున్నాయి? ఈ ప్రాంత మూలవాసుల అభివృద్ధికి కాకుండా మరొకరికి ధారాదత్తం చేస్తూ ఈ ప్రాంత నివాసితులను నిరాశ్రయులు చేయడం దుర్మార్గం. అమానవీయం. సామ్రాజ్యవాద ఏజెంట్లు తమ కమీషన్ల కొరకు, బహుళజాతి సంస్థలు వాటి స్వలాభం కోసం ఆదివాసులను నిర్దాక్షిణ్యంగా వెళ్లగొట్టి ప్రాజెక్టుల పేరుతోనో, కంపెనీల పేరుతోనో, ఇదంతా దేశాభివృద్ధి కొరకని ప్రచారం చేస్తున్నాయి. ఇవాళ అమెరికా పెట్టుబడి ప్రపంచమంతా వ్యాపిస్తోంది.

దాని ఫలితంగా అనేక ప్రాంతాల ప్రజలు తమ విలువైన జీవితాలు కోల్పోతున్నారు. మన్యంలో ప్రభుత్వాలు ఆదివాసి పోరాటాలను అణచివేయడం కోసం పోలీసులను పెద్దఎత్తున వినియోగిస్తున్నారు. ప్రజలపై తీవ్ర స్థాయిలో సాయుధంగా దమననీతిని ప్రదర్శిస్తున్నాయి.

అదివాసి ప్రాంతాలను ఆదివాసులే పాలించుకుంటారు. వారి వారి తెగ సంప్రదాయాలను, కట్టుబాట్లను అనుసరిస్తారు. వాటికి ఉన్నత విలువనిస్తారు. వారికి వేరే చట్టాల గురించి తెలియదు. ఆదివాసి ప్రాంతాలలో సంప్రదాయ వ్యవస్థ కొనసాగుతున్నది. కానీ ప్రభుత్వం వారిపై పంచాయితీరాజ్ వ్యవస్థను బలవంతంగా రుద్దుతున్నది. ఆదివాసులతో చర్చలు జరుపకుండా ఏకపక్షంగా చట్టాలను వారిపై రుద్దడం అప్రజాస్వామికం. ఆదివాసులకు వారి గ్రామ సభలు మన పార్లమెంట్ కంటే గొప్పవి. గ్రామసభల్లో చర్చించకుండా, వాటి అంగీకారం లేకుండానే బాక్సైట్ గనులు అన్‌రాక్, జిందాల్, నాల్కో కంపెనీలకు అప్పగించడం దుర్మార్గం. ప్రభుత్వాలు కారుచవుకగా ఈ ప్రాంత సంపదలను బహుళజాతి కంపెనీలకు స్వంతం చేస్తూ దళారీ పాత్ర పోషిస్తున్నాయి.

ఆది నుంచి సంస్కృతి, సంప్రదాయాలు కలబోసిన జీవన విధానానికి సజీవ దృశ్యమే ఆదివాసి సమాజం. ఎందుకంటే పూర్వ మానవ సంబంధాలు, గోత్రాలతో కూడిన బంధుత్వ వారసత్వాలు. ప్రత్యేక సంప్రదాయ పండగలు, అది కూడా ప్రకృతితో, ఉత్పత్తితో అవినాభావ సంబంధం కలిగి ఉండడం. కానీ నేటి హైందవీకరణ ప్రభావంతో, ఆధునికీకరణ పేరుతో 'ఆది' సంస్కృతికీ విరుద్ధమైన పరాయికరణ మొదలైంది. ప్రపంచీకరణ నేపథ్యంలో త్వరితగతిన అభివృద్ధి చేస్తున్న క్రమంలో దేశ, విదేశీ వ్యాప్త పర్యాటకుల తాకిడి మన్యంలో ఎక్కువగా ఉంది. ఇక్కడ ఆదివాసి తెగల సంస్కృతి, సంప్రదాయాలపై బాహ్య ప్రపంచ ప్రభావం పడుతున్నది. మన్యసీమ ప్రాంతాల్లోని సాంస్కృతిక జీవనం ఆ జీవితంలోకి ప్రవేశించిన ఆధునిక పోకడలు వారసత్వంగా కొనసాగుతున్న దోపిడీ. కొత్తతరంలో వస్తున్న చైతన్యం సంప్రదాయక వారసత్వాన్ని పాతరేసే మత మార్పిడిలు (క్రిస్టియన్, హిందూ) కొనసాగుతున్న అధికార యంత్రాంగం ప్రేక్షక పాత్ర పోషిస్తున్నాయి. అడవిబిడ్డల సంస్కృతిని, సంక్షేమాన్ని గాలికి వదిలేయడం పరిపాటిగా మారింది. తక్షణమే ఆదివాసుల సాంస్కృతిక జీవనాన్ని పరిరక్షించే పనికి ఆదివాసి ప్రేమికులు నడుం భిగించాల్సిన సందర్భమిది.

నేడు మన్యం మూలవాసులు, ఈ భూమి, నీరు, కష్టం మాది. అయితే ఓ సేట్ నీవెవరు? కాగితాలు, దస్తావేజులు, ఎంఒయుల ఆధారంగా నీవు ఈ భూమికి మాలిక్ ఎలా అవుతావని జిందాల్, అన్‌రాక్, నాల్కోలను నిలదీసి ప్రశ్నిస్తున్నారు. ప్రైవేట్ రంగంగాని, ప్రభుత్వ రంగం గాని ఆదివాసుల గ్రామసభలను గుర్తించడం లేదు. గతంలో కూడా విశాఖ ఏజెన్సీ ప్రాంతాలలో నిర్మించిన జల విద్యుత్ ప్రాజెక్టుల విషయంలో మెజారిటీ ప్రజల అభిప్రాయాలను విస్మరించారు. ఫలితంగా లక్షలాది మంది మూలవాసులు విస్థాపితం కాబడ్డారు. ఇప్పటికీ జీవితంలో వారికి స్థిరత్వం ఏర్పడలేదు. 53 నాటి చేదు జ్ఞాపకాలు ఇప్పటికీ వెంటాడుతున్నాయి. నిర్వాసితుల్లో ఏ ఒక్కరికి జల విద్యుత్ కేంద్రాల్లో ఉద్యోగాలు ఇవ్వలేదు. ఇచ్చిన ఒకటి అరా ఉద్యోగాల్లో బానిసలుగా చూస్తున్నారు. తమ జీవితాలను లాభాల కొరకు అమ్మేస్తున్నారంటూ, కనీసం మా జీవితాలు మావిగానే ఉండనివ్వండని మన్యం వాసులు గొంతెత్తి నినదిస్తున్నారు. మరోపక్క భారీ ప్రాజెక్టుల కొరకుగాని, భారీ స్థాయి గనుల ప్రాజెక్టుల కొరకుగాని, భూములు, ఊళ్లకు ఊళ్లే ధ్వంసం చేయబడుతున్న తరుణంలో పునరావాసం కల్పిస్తే సరిపోతుంది కదా! అనే వాదన నేడు బలంగానే ముందుకు వస్తున్నది. ఈ వాదనకు సర్వత్రా ఆమోదం ఉన్నట్లు తెలుపుతున్నయి ప్రభుత్వాలు. కానీ ఈ పునరావాస భావన అన్నది రాజ్యాంగ మౌలిక సూత్రాలకు, మానవ హక్కుల సహజ నియమాలకు విరుద్ధం. ఏళ్ల తరబడిగా ఆ ప్రాంతమే తమ జీవితంగా, మరితర ప్రాంతాల్లో తమ బతుకులు ఇమడలేనంతా ఆయా ప్రాంత సహజ వనరులతో తమ జీవితాలు పెనవేసుకున్న పరిస్థితుల్లో వారిని ఎలా తొలగించి ఎక్కడ పునరావాసం కల్పిస్తారు? వారి సంస్కృతి, జీవనాధారం జీవితం అంతా ఆయా ప్రాంతాలలో కలిసిపోయి ఉన్నప్పుడు వారిని ఎలా నిరాశ్రయులను చేస్తారు? నేడు కోర్టులు కూడా ప్రజా వ్యతిరేకంగాను, ప్రభుత్వనుకూల తీర్పులిస్తున్నాయి. నర్మదా డ్యాంకు సంబంధించి సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పు ప్రజలకు వ్యతిరేకమైనది. నర్మదాసాగర్‌లో ఆదివాసులను ముంచేసి, నది వ్యాపారశక్తులను బలిపించి సామ్రాజ్యవాదులతో జట్టు కట్టించినది. వాకపల్లి గ్రామంలో 11 మంది ఆదివాసి స్త్రీలపై గ్రేహండ్స్ పోలీసులు లైంగిక బలాత్కారానికి పాల్పడిన కేసులో, హైకోర్టు నిరాధారమైన ఆరోపణలు చేశారని ఆదివాసి మహిళలకు చివాట్లు పెట్టింది. ఈ తీర్పు మహిళా లోకానికే తలవంపు. ఆదివాసి ప్రాంతాల్లో స్థానిక సంస్థల ఎన్నికల్లో ఆదివాసేతరులకు రిజర్వేషన్లు కల్పిస్తూ, సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పు రాజ్యాంగ విరుద్ధం. కోర్టులు సూర్యుడిని సూర్యుడు కాదని తీర్పులిస్తే సూర్యుడు సూర్యుడు కాకుండా పోతాడా? సత్యం అసత్యం అవుతుందా? ఆదివాసులకు ఎవరి సహాయం, సహకారం అవసరం లేదు. ఎవరి చట్టాలు అవసరం లేదు. ఆదివాసులతో చర్చించి వారి గ్రామసభల అంగీకారంతో వారికి అవసరమైన రీతిలో, వారి పురోభివృద్ధికి, అభ్యున్నతికి సహాయపడే రీతిలో వారి సహజ హక్కుల సాధన కొరకు పోరాడాల్సి ఉంది. దేశంలోని అధికార వ్యవస్థలు సామాజిక ఆధిపత్య వ్యవస్థలు, కార్పొరేట్ శక్తులకు, వ్యాపార సామ్రాజ్యాలు నిర్మించుకున్న మాఫియాలకు లోబడి అవినీతిలో కూరుకు పోయి, సంక్షేమ చర్యల మీద కాలం నెట్టుకొస్తున్నాయి. మరోవైపు దేశవ్యాప్తంగా ప్రజలు అనేక ఆందోళనలతో రోడ్ల మీదికి వస్తూ నిత్య యుద్ధంగా మనుగడ సాగిస్తున్నారు. భారత రాజ్యాంగం ప్రజలకు చాలా హామీ పడింది. కానీ హామీలన్నీ కాగితాలకే పరిమితమయింది. ఆ కాగితాలన్నీ అరమరల్లో అతుక్కుపోయింది. ఇక ఎంత మాత్రం దానికి చలనం లేదు. దేశంలో లౌకికతత్వాన్ని, ప్రజాస్వామ్యాన్ని, సామ్రాజ్యవాదాన్ని, సౌభ్రాతృత్వాన్ని సాధించడానికి ఎవరు పూనుకోవాలి? ప్రస్తుత అర్ధవలస, అర్ధ భూస్వామ్య వ్యవస్థ మృతప్రాయ మైంది. దీనిని కాపాడుతున్న ఈ దోపిడీ పాలకవర్గాలే సామాజిక అభివృద్ధికి ఆటంకం. వీరిని రక్షించి కాపాడుతున్న ఈ ప్రభుత్వాలే పెద్ద టెర్రరిస్టు. ప్రతిక్షణం హింసను ప్రేరేపిస్తున్నది. కనుకనే 60 సంవత్సరాల స్వాతంత్రానంతరం ఆదివాసుల జీవించే హక్కుకు ఏమాత్రం గ్యారంటీలేని దుస్థితి ఏర్పడింది. అందుకే ఆదివాసులు తమ జీవితాలకు విప్లవోద్యమం మాత్రమే గ్యారంటీ ఇవ్వగలదని బలంగా విశ్వసిస్తున్నారు. ఆ ప్రజా ఉద్యమంతో మమేకమవుతూ పురోగమిస్తున్నారు. ఆకలి, అణచివేతలు లేని సమాజం అవతరిస్తుందని నమ్మిన మూలవాసుల కోరిక సాకారం కావాలనీ కోరుకుందాం. వీ

*(రచయిత ఆదివాసి ఉద్యమ కార్యకర్త)*

# 'స్వతంత్ర భారతం'లో వలస బతుకులు

***ఆదివాసి ప్రాంతాల్లో వలస కూలీలపై కాంట్రాక్టర్ల దోపిడీని వివరిస్తూ, భూస్వాముల చేతుల్లోని భూమిని దున్నేవారికి భూమి ప్రాతిపదికన పంచినప్పుడే ఈ సమస్యకు పరిష్కారం దొరుకుతుందని అంటున్నారు* నటాషా**

ఒడిశా రాష్ట్రంలోని మహానదిపై సంబల్‌పూర్ వద్ద నిర్మించిన హీరాకుడ్ ప్రాజెక్టు ప్రపంచంలోని పొడవైన ఆనకట్టలలో ఒకటిగా ప్రసిద్ధి చెందింది. ఈ ప్రాజెక్టులోకి ప్రతీ సంవత్సరం అక్టోబర్ నెల మధ్యలో యూరప్, పశ్చిమ ఆసియా, సైబీరియా, మంగోలియా, బైకాల్ సరస్సుల నుండి 60 రకాల జాతుల పక్షులు సుమారు 80 వేలసంఖ్యలో వలస వస్తాయి. 4 నెలలు ఇక్కడ గడిపి ఫిబ్రవరి మధ్య భాగంలో తమ స్వస్థలానికి తిరుగు ప్రయాణం కడతాయి. ఈ 4 నెలలకాలంలో తమ స్వస్థలంలో విపరీతమైన గడ్డకట్టుక పోయే చలి బారి నుండి రక్షించుకోవడానికి ప్రతి ఏటా ఇలా వలస వస్తుంటాయి. జీవకారుణ్యానికి పెద్దపీట వేసే మన 'ఘనత' వహించిన ప్రభుత్వాలు పక్షుల్ని వేటగాళ్ల బారి నుంచి రక్షించడానికి ఈ ప్రాంతం లో వేటను నిషేధించాయి. అంతేగాక రక్షణ టవర్లను నిర్మించి రక్షక బటుల్ని మోహరించాయి. పక్షుల రక్షణకోసం రాత్రింబవళ్లు కాపలా కాస్తుంటారు. పక్షుల్ని వేటాడిన వాళ్లకు చట్టంలో కఠిన శిక్షలూ రూపొందించబడినాయి.

ఒడిశా రాష్ట్రం అనేక రకాల సంపదలకు నిలయం. దేశంలోని ఖనిజ సంపదలో 97 శాతం క్రోమైట్ రాళ్లు, 95శాతం నికెల్, 70 శాతం బాక్సైట్, 67 శాతం గ్రాఫాయిట్, 29 శాతం మాంగనీస్, 34 శాతం ఇనుపరాయి కేవలం ఒక్క ఒడిశా రాష్ట్రంలోనే ఉన్నాయి. పచ్చని అడవులు, చల్లని జలపాతాలు, సంవత్సరం పొడవునా పారే జీవ నదులు, 480 కిలోమీటర్ల పొడవైన సముద్ర తీరం, సుందరమైన పర్యాటక స్థలాలు, అన్నింటికి మించి ఆరుగాలం కష్టించే శ్రమ జీవులకు నిలయం. ఇన్ని సంపదల్ని చూసి కండ్లు కుట్టిన బహురాష్ట్రీయ పక్షులు, దళారీ కార్పొరేట్ పక్షులు వందల సంఖ్యలో ఇక్కడకు వలస వస్తున్నాయి. ఇవి తమ రక్షణ కోసమో, సంవత్సరానికి కొన్ని నెలల కోసమో రావడం లేదు. ఇక్కడి సంపదల్ని శాశ్వతంగా భక్షించడానికి వస్తున్నాయి. ఇక్కడి 'రాజ' పక్షులు వాటిని ఎర్ర తివాచీలు పరిచి స్వాగతిస్తున్నాయి. వెన్నెముక లేని 'రాజ' పక్షులు ఇనుప మూతి వలస రాబందుల ముక్కుల్లోంచి కారే రక్తపు చుక్కల కోసం లొట్టలు వేస్తూ వాటి గొంతెమ్మ కోర్కెల్ని తీర్చడానికి ఎంతకైనా తెగిస్తున్నాయి. తాము పుట్టి పెరిగిన మట్టి నుండి జల్, జంగల్, జమీన్ నుండి ఎంత మందినైనా నిర్వాసితుల్ని చేయడానికి వెనుకాడడం లేదు. తాము పుట్టిన మట్టిని రక్షించుకోవడానికై పోరాడుతున్న ప్రజల్ని, వాటికి నాయకత్వం వహిస్తున్న సంస్థల్ని క్రూరంగా అణిచి వేసి కార్పొరేట్, బహు రాష్ట్రీయ పక్షుల 'భక్షణ కార్యక్రమం' సాఫీగా సాగడానికి అవసరమైన రక్షణ కల్పించడానికి కంకణం కట్టుకున్నాయి. అందుకు అవసరమైన నల్ల చట్టాల్ని, ప్రత్యేక శిక్షణ పొందిన వేట కుక్కల్ని తయారు చేసుకున్నాయి. నిరసన గళాల్ని, ధిక్కార స్వరాల్ని, అసమ్మతి గొంతుల్ని వేటాడడానికి అవసరమైన వేట పథకాన్ని (ఒజిఎచ్) రూపొందించి అమలు చేస్తున్నాయి.

ఇన్ని సంపదలున్న ఒడిశా రాష్ట్రంలో 4,09,47,348 మంది జనాభాలో 47.15 శాతం దారిద్ర్యరేఖ దిగువన జీవిస్తున్నారు. జాతీయ నమూనా సర్వే సంఘటన్ (ఎన్ఎస్ఎస్ఒ) 2013లో 7428 గ్రామాలు, 5263 పట్టణాల్లో 1,00,794 కుటుంబాల్ని సర్వే చేసి తయారు చేసిన రిపోర్టు ప్రకారం దేశంలో ఆకలి బాధతో ఉన్న రాష్ట్రాల్లో ఒడిశా రెండవ స్థానంలో ఉంది. 4 శాతం (16 లక్షలకు పైగా) ప్రజలు రోజు ఒక పూట ఉపవాసంతో కాలం వెల్లదీస్తున్నట్లు ఆ రిపోర్టు పేర్కొంది. కానీ వాస్తవానికి ఈ సంఖ్య అనేక రెట్లు ఎక్కువ ఉంటుంది. 50 లక్షల మంది పిల్లలు పౌష్టికాహార లోపంతో జీవిస్తున్నారు. 2000 నుండి 2013 సంవత్సరాల మధ్యనే పాలకుల 'అభివృద్ధి నమూనా' రథ చక్రాల కింద 30 లక్షలకు పైగా ప్రజలు నిర్వాసితులై తమ బతుకుల్ని కోల్పోయారు. పప్పుబాబు (నవీన్ పట్నాయక్ ముద్దు పేరు) మూడు కాలాల పరిపాలనలో 2971 మంది రైతులు ఆత్మహత్యలు చేసుకోగా ఇంకా ఇవి కొనసాగుతూనే ఉన్నాయి. ఇవన్ని సమస్యలు ఇలా ఉండగా రాష్ట్రంలో నిర్వాసిత సమస్య తర్వాత మరో ముఖ్యమైన సమస్యగా పొట్టకూటి కోసం ఇతర రాష్ట్రాలకు వలసపోవడం అనే సమస్య ఉంది. ఈ సమస్య తీవ్రతను పరిశీలించడమే ఈ వ్యాస పరిధి.

తెలంగాణలోని పాలమూరు లేబర్‌లాగా కరీంనగర్‌లోని జగిత్యాల, సిరిసిల్ల కూలీల్లాగా బుక్కెడు మెతుకుల కోసం ఎక్కడ గుప్పెడు పని దొరికితే అక్కడికల్లా పొట్టచేత పట్టుకుని వలస పోతుంటారు ఇక్కడి ప్రజలు. ముఖ్యంగా పశ్చిమ, దక్షిణ ఒడిశా జిల్లాల్లోని బొలంగీర్, నువాపాడ, బర్గడ్, కలహండి, సువర్ణపూర్( సోన్ పూర్) నవరంగ్ పూర్, జార్సిగూడ, బౌద్ధ్, గంజాం మొదలగు జిల్లాల్లో ఈ సమస్య చాలా తీవ్రంగా ఉండగా మిగతా జిల్లాల్లో కొంత హెచ్చుతగ్గులతో ఉంది. ఒక సర్వే రిపోర్టు ప్రకారం ఏటా 50 లక్షల మంది ప్రజలు ఇతర రాష్ట్రాలకు వలస పోతున్నారు. వలస పోవడాన్ని ఒడియా భాషలో 'దాదన్ ఖాటిబా' అంటారు. ప్రతీ సంవత్సరం పంట కోతలు పూర్తవగానే 'నువాఖాయి' అనే పండగా జరుపుకుంటారు. కొత్త ధాన్యం తినడం ఈ పండగతోనే ప్రారంభిస్తారు. ఈ పండగ పూర్తవగానే (నవంబర్ నెల) వలసపోవడం మొదలవుతుంది. తిరిగి జూన్ చివరలో వ్యవసాయ పనులు మొదలయ్యే సమయానికి ఇండ్లు చేరుతారు. అంటే సంవత్సరానికి ఎనిమిది నెలలు చొప్పున పుట్టిన గడ్డకు దూరంగా ఇటుక బట్టి యజమానులు, భవన నిర్మాణ కాంట్రాక్టర్ల చేతికింద అనేక అవమానాల్ని, దౌర్జన్యాల్ని భరిస్తూ జానెడు పొట్టకోసం దయనీయ స్థితుల్లో బతుకులెల్లదీస్తున్నారు.

ఈ వలస ప్రజల్ని మధ్య దళారుల, కాంట్రాక్టర్ల, ఇటుక బట్టీ యజమానుల దౌర్జన్యాల నుండి కాపాడడానికి పాలకుల వద్ద ఎలాంటి పోగ్రాం లేదు. ప్రజలకు ఎలాంటి రక్షణ లేదు. దళారీ కార్పొరేట్, బహు రాష్ట్రీయ పక్షుల మూతులు నాకే పాలకులకు, హీరాకుడ్‌లోకి వచ్చే వలస పక్షులపై జీవకారుణ్యం ఒలకబోసే పాలకులకు వాళ్ల డిక్షనరిలో బహుశా పీడిత ప్రజలు జీవరాశుల జాబితాలోకి రారేమో! ఈ సమస్య పట్ల పాలకుల దృష్టి కోణాన్ని అర్థం చేసుకోవడానికి ఈ చిన్న ఉదాహరణ సరిపోతుంది. 2014 ఎన్నికల ముందరి బిజెడి ప్రభుత్వంలో సీనియర్ మంత్రివర్యులు ఆరోగ్యశాఖ మంత్రియైన దామోదర్ రావుత్ రాయ్ గత సంవత్సరం కలహండి జిల్లాకు చెందిన ఇద్దరు వలస కూలీల చేతులు నరికివేసిన ఘటన సందర్భంగా వలస సమస్యపై తీవ్రంగా చర్చ జరుగుతున్నప్పుడు రాష్ట్రంలో బ్యాండెడ్ లేబర్ పద్ధతి ఎక్కడా అమలు జరగడం లేదనీ నిస్సిగ్గుగా సెలవిచ్చాడు. అంతటితో ఆగకుండా రాష్ట్రం బైటికి కూలికి పోవడమనే సమస్య ఉంది. కానీ అలాంటి వాళ్లంతా ఎక్కువ దబ్బు సంపాదించాలనే పేరాశతో వెళ్తున్నారు అని కూడా అన్నాడు.

వాస్తవానికి రాష్ట్రంలో కొనసాగుతున్న దాంట్లో 90 శాతం పైగా బ్యాండెడ్ లేబర్ (ఒడియాలో దీనిని గోతా శ్రమిక్ ప్రతా అంటారు) పద్ధతే. పశ్చిమ ఒడిశాలో ప్రతీ జిల్లాలో పదుల సంఖ్యలో మధ్య దళారులున్నారు. వీళ్లు ఇతర రాష్ట్రాల్లోని ఇటుక బట్టీల యజమానులకు, భవన నిర్మాణ కాంట్రాక్టర్లకు శ్రామికుల్ని సమకూర్చడం కోసం ముందే ఒప్పందాలు చేసుకుంటారు. ఒక్కో శ్రామికున్ని సమకూర్చినందుకు దళారులకు పది వేల నుండి ముప్పై వేల వరకు డబ్బు ముడుతుంది. పెద్ద దళారులు మూడు నాలుగు గ్రామ పంచాయితీల పరిధిలో ఒకరుండగా వీరి కింద ఐదు నుండి పదిమంది వరకు చిన్న దళారులు ఉంటారు. వీరు గ్రామస్థాయిలో ఉండి ఒక్కో కూలీని సమకూర్చి నందుకు వెయ్యి రూపాయల చొప్పున ముడుపులు పొందుతుంటారు. పంటకోతలకు ముందే కొత్తపాత సందులో దళారులు కూలీల వద్దకు వచ్చి ఐదు నుండి ఇరవై ఐదు వేల వరకు అడ్వాన్సుగా ఇవ్వజూపుతారు. పంటకోతలు ఐపోగానే రావాలనీ మూడు పూటల ఉచిత భోజనం వసతి ఏర్పాటు బాధ్యత మాదేనని అందమైన ఆశలు కల్పిస్తారు. లక్షల సంఖ్యలో ఉన్న వ్యవసాయ కూలీలు, పేద రైతులు చేయడానికి పనుల్లేక గత్యంతరం లేని పరిస్థితుల్లో పొట్టగడవడానికి దళారుల బారిన పడక తప్పడం లేదు. జూలై నుండి అక్టోబర్ వరకు వ్యవసాయ పనుల సీజన్లో ఎంతో కొంత కూలీ పనులు దొరుకుతాయి కాబట్టి ఆ నాలుగు నెలలు మాత్రమే ఇంటి పట్టున ఉంటారు. మిగిలిన ఎనిమిది నెలలు వలస పోక తప్పని పరిస్థితి. ముందు తీసుకున్న అడ్వాన్సు డబ్బును తమ శ్రమతో తీర్చడానికి ఆ ఎనిమిది నెలలు వాళ్లు చెప్పినట్లు చేస్తూ అనేక యాతనలకు గురవుతున్నారు. కూలీల పరిస్థితి బానిసలతో పోల్చదగినంత దుర్భరంగా ఉండగా యజమానులు, దళారులకు ఏటా వంద కోట్ల రూపాయల లాభసాటి వ్యాపారంగా వర్ధిల్లుతున్నట్లు ఒక సర్వే రిపోర్టు.

రాష్ట్రంలో అత్యధికంగా వలస కూలీలున్న జిల్లాల్లో గంజాం జిల్లా అగ్రస్థానంలో ఉంది. ఎయిడ్స్‌లో కూడా ఈ జిల్లాదే ప్రథమ స్థానం. వలసకూ ఎయిడ్స్‌కూ సంబంధం ఉంది. 1860లో వచ్చిన భయంకర మైన కరువు నుండి మొదలైన వలస ఇప్పటి వరకూ కొనసాగుతూనే ఉంది. 1999లో మరోసారి వచ్చిన కరువు వలసల్ని ఇంకా పెంచింది. 2007 'జాతిసంఘ్ వికాస్ కార్యక్రమ్ రిపోర్టు' ప్రకారం కేవలం సూరత్‌లోనే తొమ్మిది లక్షల ఒడియా శ్రామికులున్నారు. అందులో ఆరు లక్షల మంది గంజాం జిల్లా వాసులే. విశ్వబ్యాంక్ నిర్వాసితులపై కేంద్రీకరించి తయారు చేసిన 2009 రిపోర్టు ప్రకారం గుజరాత్ బట్టల మిల్లుల్లో నాలుగు లక్షల మంది ఒడియా శ్రామికులున్నారు. ఇతర సంస్థల రిపోర్టుల్లో ఏడు నుండి పది లక్షలున్నట్లు కూడా రాస్తున్నారు. కాగా ఇందులో మెజారిటీ గంజాం వాసులే. ఈ జిల్లా నుండి గుజరాత్ వలస పోని ఒక్క కుటుంబం కూడా లేదంటే అతిశయోక్తి కాదు. ప్రసిద్ధ ఒడియా పత్రకార్ పి. సాయినాథ్ తన రిపోర్టులో 'పాలు మరిచిన పిల్లల్ని వదిలి గుజరాత్ వలసపోతే తిరిగి వచ్చేటప్పటికి తలెంటికెలు (తల వెంట్రుకలు) నెరిసేవి' అనేది సామెతగా మారిందని రాశాడు. ఇవన్నీ సరిగ్గా తెలిసిన వాడు కాబట్టే నరేంద్రమోడీ ఎన్నికలకు ముందు 2013 జూలై 16న పూరీలో జగన్నాథ్ రథయాత్ర మహోత్సవంలో పాల్గొని ఒడియా భాషలో ఉపన్యసించి చప్పట్లుకొట్టించుకున్నాడు. గుజరాత్ పారిశ్రామికీకరణలో ఒడిశా శ్రామికుల కృషికి (యోగ్ దాన్) కృతజ్ఞతలు చెప్పాడు. చాలా తెలివిగా గుజరాత్ ఒడిశాకు పోలికలు చెపుతూ రెండూ సముద్ర తీర రాష్ట్రాలు, సూర్యోదయపు తొలి కిరణాలు కొణార్క్ సూర్య మందిరాన్ని స్పృశిస్తాయి. సూర్యాస్తమయాన చివరి కిరణాలు గుజరాత్‌లోని మొతేరా సూర్య మందిరాన్ని స్పృశిస్తాయి. కాబట్టి గుజరాతి, ఒడియా భాయి భాయి అని మాట్లాడాడు. మోడీ మాటల వెనుక ఒకే దెబ్బకు రెండు పిట్టల్లా గుజరాత్‌లోని వలస శ్రామికుల ఓట్లు, ఒడిశాలోని ఒడియా ప్రజల ఓట్లు దండుకునే ఎత్తుగడ ఉన్న సంగతి పక్కనబెడితే గుజరాత్ పరిశ్రమల్లో దండుకున్న లాభాల్లో ఒడియా వలస కూలీల చెమట, నెత్తురు ఇమిడి ఉందన్న నిజాన్ని ఒప్పుకున్నాడు.

ఇక్కడి నుండి వలస కూలీలు గుజరాత్, రాజస్థాన్, కేరళ, ముంబాయి, తమిళనాడు, హైదరాబాద్, విశాఖ మొదలగు ప్రాంతాలకు ఎక్కువగా వెళ్తున్నారు. మధ్య దళారులు కూలీ పేరుతో తీసుకెళ్లి కొంతమంది యువతుల్ని వ్యభిచార గృహాల్లో అమ్మేస్తున్న ఘటనలు కూడా జరుగుతున్నాయి. కూలీల దయనీయ పరిస్థితి అర్థం చేసుకోవడానికి కొన్ని ముఖ్యమైన ఘటనల్ని చూద్దాం.

1) 2013 డిసెంబర్‌లో కలహండి జిల్లా జైపట్న ప్రాంతంలోని నువాగూడ, పిపల్ గూడా గ్రామాల నుండి 12 మంది శ్రామికుల్ని 14 వేల రూపాయల చొప్పున అడ్వాన్స్ ఇచ్చి హైదరాబాద్‌లో ఇటుకబట్టీ పని అని చెప్పి దళారులు తీసుకెళ్లారు. మధ్యలో దళారుల గ్రామానికి తీసుకెళ్లి 4, 5 రోజులు వరికోతలు కోయించారు. కూలీలు మాకు ముందుగా చెప్పినట్లుగా హైదరాబాద్ తీసుకెళ్లాలని ఒత్తిడి చేయడంతో తిరిగి రాయపూర్ తీసుకెళ్లారు. ఇక్కడే పని చేయాలని చెప్పడంతో మేం ఇక్కడయితే పని చేయమని పది మంది కూలీలు వాపస్ వెళ్లిపోయారు. మిగిలిన ఇద్దరు కూలీలను దళారులు బందించి అడ్వాన్స్ డబ్బులు తీసుకున్నారు. మేం చెప్పిన పని చేయరా మా వద్ద పని చేయకుంటే ఇంకెవరి దగ్గర పని చేయకుండా చేస్తామని చెప్పి జీపులో బొలంగీర్‌కు కొన్ని కిలో మీటర్ల దూరంలో గల గుట్ట దగ్గరికి తీసుకెళ్లి ఇద్దరు కూలీల రెండేసి చొప్పున చేతుల్ని ముంజేతుల వరకు నరికేశారు. రెక్కాడితే గానీ డొక్కాడని బతుకులు రెక్కలు తెంచిన పక్షిలా అయిపోయాయి.

నీలాంబర్ మాజీ, దయాలు నియాల్ అనే ఈ ఇద్దరికి వాళ్లపైనే ఆధారపడి బతికే భార్యాబిడ్డలున్నారు. ఇదే కలహండి జిల్లాలో దండపాట్ ప్రాంతంలో 13 గ్రామ పంచాయతీల పరిధిలో గత ఆరేళ్ల కాలంలో 40 మంది వలస కూలీలు శవాలై తిరిగి వచ్చారు. అయినప్పటికి తప్పనిసరి పరిస్థితుల్లో వలస పోతూనే ఉన్నారు.

2) బొలంగీర్ జిల్లా పట్నాగడ్ బ్లాక్ కొదిలిముండ గ్రామ పంచాయతి భాలుపిటా గ్రామానికి చెందిన ఎనిమిది కుటుంబాలు టిగ్రపడాకు చెందిన దళారులైన భూతుల్ ఖెగ్రో, మోహన్ మెహేర్‌ల నుండి ముందస్తు బయానాగా రెండువేల రూపాయల చొప్పున తీసుకున్నారు. వలసపోయే రోజు మనిషికి 15 వేలు ఇస్తామన్నారు. దాని ప్రకారం నవంబర్‌లో కర్నాటకలోని గుల్బర్గ జిల్లా ఖాండేర్ యానాపాలి గ్రామంలో ఇటుకబట్టీ యజమాని దగ్గర పని మొదలు పెట్టారు. ముందు చెప్పిన ప్రకారం కాకుండా రోజుకు 75 రూపాయలు మాత్రమే కూలీ ఇస్తుండడంతో తమకు గిట్టుబాటు కాదని వ్యతిరేకించడంతో చిత్రహింసలు పెడుతూ బలవంతంగా పని చేయించారు. తప్పించుకుని రావడానికి చేసే ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. చదువు రాదు. భాష తెలియదు. పారిపోతారని అనుమానం వచ్చిన నుండి గట్టి నిఘా, రోజూ చిత్రహింసలు. ఇదీ తంతు. ఒక రోజు సంతోష్ కుమార్ అనే కూలీ కొడుకు పది సంవత్సరాల సుశాంత్ ను ఇటుకబట్టి యజమాని ఇటుకల్ని ఉల్టా తిప్పి ఆరబెట్టే పని పురమాయించాడు. దానికి సుశాంత్ ఈరోజు ఒంట్లో బాగా లేదు. చేతులు గుంజుతున్నాయి చేయలేనని జవాబిచ్చాడు. దానితో ఉగ్రరూపం ధరించిన యజమాని చేతిలో ఉన్న ఇనుప రాడు తోచితక బాదగా బాలుడి ఎడమ చేయి మోచేతి వరకు నుజ్జు నుజ్జు అయింది. ఘటన వెలుగులోకి వచ్చాక సుశాంత్ కు ప్రభుత్వ ఆసుపత్రిలో చికిత్స జరుగుతున్నది. చేయితొలగించబడి శాశ్వతంగా వికలాంగుడయ్యే అవకాశం ఉంది. ఇలా ఎన్నో అందమైన బాల్యాలు ఏటా ఇటుక బట్టీలకింద నలిగి పోతున్నాయి.

3) బొలంగీర్ జిల్లాలోనే తుర్కేల బ్లాక్ బొడ్ దొగ్గ అనే గ్రామంలో చంద్రయ్య అనే నిరుపేద వ్యవసాయ కూలీ 14 ఏండ్లకింద పెండ్లి చేసుకున్న కొద్ది రోజులకే బ్యాండెడ్ లేబర్గా భార్యతో సహా ఆంధ్ర కూలీకి వెళ్లాడు. ఈ చక్ర వ్యూహంలోంచి బైటపడడానికి అతనికి 14 సంవత్సరాలు పట్టింది. ఖాళీ చేతుల్తో నలుగురు పిల్లలతో ఇల్లు చేరాడు. ఇప్పుడు పొట్ట ఎలాగడవాలనేది సమస్య. ఎటుచూసినా ఏ ఆధారం లేదు. మళ్లీ చక్రవ్యూహంలో తలదూర్చడం తప్ప. (ముందు అడ్వాన్స్ తీసుకున్న డబ్బు తీర్చడానికి కొంతకాలం శ్రమ చేయాలి. ఈ శ్రమ చేసిన కాలమంతా తిన్నందుకు ఆ ఖర్చులు తీర్చడానికి మరో సంవత్సరం కూలీ చేయాలి. ఇలా చక్రవడ్డీలా ఈ చక్రవ్యూహం విస్తరిస్తూనే ఉంటుంది. దీనికి అంతం ఉండదు. యజమానులు, సర్దార్లు (దళారులు) దయదలిచేంత వరకు వాళ్లకు ముక్తి లేదు.

4) శవాన్ని మాయం చేసిన సర్దార్ వబొలంగీర్ జిల్లా మురిబహాల్ బ్లాక్ మాల్ సిరా గ్రామ పంచాయతి డేంకొ పొదర్ గ్రామానికి చెందిన తొపి భగర్తి అతని భార్య ఫొటు. వీళ్లిద్దరికి ఒక కొడుకు ఒక బిడ్డ ఉన్నారు. పిల్లలిద్దర్ని ఇంటి వద్ద వదిలి ముందస్తుగా తీసుకున్న డబ్బు కిందికి దంపతులిద్దరు నిజామాబాద్‌కు కూలీకి వెళ్లారు. కొద్ది రోజులకు తొపి భగర్థికి వాంతులు విరేచనాల జబ్బు చేసింది. నిజామాబాద్ హాస్పిటల్‌కు తీసుకెళ్లితే ఇక్కడ సాధ్యం కాదు హైదరాబాద్ తీసుకెళ్లాలన్నారు డాక్టర్లు. సర్దార్ కాళ్లావేళ్లా పడి ఎలాగోలా హైదరాబాద్ ఆసుపత్రిలో చేర్పించారు. కానీ అప్పటికే ఆలస్యమవడంతో కొద్ది గంటల్లోనే మరణించాడు. ఫొటు భగర్థి భర్త శవాన్ని స్వస్థలానికి తీసుకెళ్లి కొడుకు బిడ్డల సమక్షంలో దహన సంస్కారాలు జరపాలంటుంది. సర్దారేమో ఇదంతా ఖర్చుతో కూడిన వ్యవహారం కాబట్టి శవాన్ని ఏ దోలా వదిలించుకోజూస్తున్నాడు. చివరికి ఫొటుకు తెలియకుండానే శవాన్ని మాయం చేశాడు. పిల్లలిద్దరూ కన్న తండ్రి శవాన్ని కడసారి చూపులకు నోచుకోకుండా చేసింది ఈ దాదన్ వ్యవస్థ.

5) నేను ఈ వ్యాసం రాయడం మొదలుపెట్టాక జరిగిన రెండు తాజా ఘటనల్ని చూద్దాం. నువాపాడ జిల్లా కేంద్రంలోనే విద్యా విభాగం పక్కన ఇల్లు నిర్మించుకుని లక్ష్మీధర్ హోతి కుటుంబం నివాసం ఉంటున్నది. భార్యా ఐదుగురు పిల్లలతో కూడిన కుటుంబాన్ని హోటల్ లో రోజుకూలీగా మేస్త్రీ పని చేస్తూ కుటుంబాన్ని పోషిస్తున్నాడు. ఇటీవల కరియర్ రోడ్‌కు చెందిన ఓ సర్దార్ నుండి ఇటుక బట్టి పనికి వస్తానని 25 వేలు అడ్వాన్స్ తెచ్చాడు. కొద్ది రోజుల తర్వాత నేను వలస కూలీకి రాలేనని చెప్పి డబ్బు తిరిగి ఇచ్చి వేశాడు. అయితే దళారీ మాత్రం అసలుతో పాటు వడ్డీ కూడా ఇవ్వాలనీ లేకుంటే చంపేస్తానని బెదిరించాడు. ఈ విషయాన్ని లక్ష్మీధర్ నువాపాడ పోలీస్ స్టేషన్లో కేసు నమోదు చేయించాడు. అయినా పోలీసులు ఏమాత్రం పట్టించు కోలేదు. జూన్ నాలుగు రాత్రి సర్దార్ తన గుండాల్ని పంపి లక్ష్మీధర్ ఇంటిని తగులబెట్టించాడు, ఇప్పుడు ఈ కుటుంబం ఇల్లు కోల్పోయి వీధిన పడింది.

6) కలహండి జిల్లా గొల్లముండ బ్లాక్ ఖొలియాపల్లి పంచాయతి ఉదేపూర్, కొన్ పూర్ గ్రామాలకు చెందిన 38 మంది కూలీలు కరీంనగర్ జిల్లా రాంపల్లి గ్రామంలో ఇటుకబట్టి పని చేయడానికి గత డిసెంబర్లో వెళ్లారు. కొద్దిరోజులు గడిచాక ఇటుక బట్టి యజమాని ఎన్. కేనా కూలీలపై శారీరక మానసిక హింసలు పెట్టడం ఎక్కువయింది. మహిళా కూలీలపై శారీరక దోపిడి తీవ్రతరమయింది. తినడానికి సరైన ఆహారం కూడా ఇవ్వక పోవడంతో కొంతమంది కూలీలు పారిపోయి వచ్చారు. దాంతో మిగిలిన వాళ్లను పారిపోకుండా బందించి బలవంతంగా పని చేయిస్తున్నారు. మీ సర్దార్ మిమ్మల్ని ఒక్కొక్కరిని 25 వేలకు నాకు అమ్మాడు. కాబట్టి మీరు ఒక్కొక్కలు 50 వేల పని చేసే దాకా వదిలి పెట్టనని బూతులు తిడుతూ కొట్టడంతో జూన్ రెండు తారీఖు కాలియా భోయి అనే కూలీ మరణించాడు. 24 మంది కూలీలు ఇంకా ఆ యజమాని చేతుల్లో బంధీలుగా ఉన్నారు. పోలీస్ స్టేషన్లో రిపోర్టు ఇచ్చినా ఎలాంటి మద్దతు దొరకలేదు. ఎందుకంటే సర్దార్లంతా పోలీసులతో కుమ్మక్కై వాళ్లను ప్రసన్నం చేసుకోవడానికి ముందే ముడుపులు చెల్లించుకుంటారు. కనుక పోలీసు వ్యవస్థ, ప్రభుత్వ యంత్రాంగం, రాజకీయ నాయకులు నిమ్మకు నీరెత్తినట్లు ఉండడం వెనుక మతలబు ఇదే మరి. అందుకే ఏటా వంద కోట్ల వ్యాపారంగా ఇది వర్ధిల్లగలుగుతున్నది. సంవత్సరంలో ఎనిమిది నెలలు ఇలాంటి హృదయవిదారక మైన ఘటనలు పదుల సంఖ్యలో వెలుగు చూస్తుంటాయి. వెలుగు చూడని ఘటనలెన్నో చెప్పజాలం. ఇవన్నీ

వింటుంటే మనం 21వ శతాబ్దంలో ఉన్నామా లేక బానిస యుగంలో ఉన్నామా అనిగానీ భారతదేశంలో ఉన్నామా లేక దక్షిణాఫ్రికాలో ఉన్నామా అని గానీ సందేహం వస్తే తప్పు నాది కాదు. నాకైతే ఏడుతరాలు నవలలోని కుంటెకింటేల్లాంటి వాళ్లు అనేక మంది కనబడుతున్నారు. తేడా ఏమిటంటే ఏడు తరాల్లోనివి దక్షిణాఫ్రికా అడవులు ఇవి తూర్పు భారతంలోని అడవులు. అక్కడ అమెరికా వాడు నల్లజాతీయుల్ని అపహరించుకుని ఓడల్లో తీసుకెళ్లి తమ దేశంలో బానిసలుగా ఉంచుకుని శ్రమ దోపిడి చేశాడు. ఇక్కడ ముందస్తుగా కొంత డబ్బు చెల్లించి ఒప్పందాల కోరల్లో ఇరికించి వాహనాల్లో తీసుకెల్తున్నారు. శారీరక, మానసిక హింసలు సరేసరి. తప్పించుకుని పారిపోజూస్తే మరోచోట పని చేసుకుని బతికే అవకాశం లేకుండా చేతులు నరికి వేసి అంగ వికలుల్ని చేయడం. ఇక్కడి పాలకులు తమాశా చూస్తుండడం. ఇంతే తేడా.

ఈ సమస్య పట్ల పాలకుల అవగాహన ఏమిటో పైననే చూశాం. ఇక పాలకుల చేతుల్లో కీలుబొమ్మయైన కార్పొరేట్ మీడియా భూన భోంతరాలు దద్దరిల్లేలా రాత్రింబవల్లు ప్రచారం చేస్తున్న 100 రోజుల పని దినాలు కల్పించడం అనే మన్ రేగా పథకం ఏ మూలన గుడ్లు పెడుతున్నట్లో!

గవర్నర్ ఎస్.ఎస్. జమీర్ 2012 డిసెంబర్లో రోజ్ గార్ పనుల గురించి విధాన సభలో ఇచ్చిన రిపోర్టు ప్రకారమే ఆ సంవత్సరం పదమూడు వేల కోట్ల రూపాయల రోజ్ గార్ పనులు కల్పించాల్సి ఉండగా 618 కోట్లు మాత్రమే ఖర్చు చేసినట్లు చెప్పాడు. రాష్ట్ర వ్యాప్తంగా 60 లక్షల మంది జాబ్ కార్డు దారులుండగా అందులో 13 లక్షల మందికే పని దొరికింది. కాగా ఇందులో కూడా 16 వేల 949 కుటుంబాలకు మాత్రమే 100 రోజుల పని దొరికింది. మిగతా కుటుంబాలకు 2 వారాలకు మించి పని దొరుక లేదు. ఇవి స్వయంగా విధాన సభలో గవర్నర్ చెప్పిన లెక్కలే.

నువాపాడ జిల్లాలో1, 18, 397 కుటుంబాలు జాబ్ కార్డు కలిగి ఉండగా ఆ కుటుంబాల్లో మొత్తం కలిపి 3,79,021 మంది కూలీ లున్నారు. ఇందులో కొన్ని వేల మందికి మాత్రమే నెలరోజుల లోపు పని దొరికింది. బొలంగీర్ జిల్లాలోని దేవ్‌గాం బ్లాక్‌లో 23 గ్రామ పంచాయితీల్లో 17797 కుటుంబాలకు జాబ్ కార్డులుండగా 5973 కుటుంబాలకు కొద్దిగానైనా పనులు కల్పించబడగా 86 కుటుంబాలకు మాత్రమే వంద రోజుల పని దొరికింది. ఒక సర్వే ప్రకారం బొలంగీర్ జిల్లాలో జాబ్ కార్డులున్న కుటుంబాల్లో 11శాతం కుటుంబాలకు, కలహండి జిల్లాలో 5 శాతం కుటుంబాలకు మాత్రమే వంద రోజుల పని దొరుకుతున్నది. అంటే జాబ్ కార్డులున్న కూలీల్లోనే 90 శాతం మందికి కూలీ దొరకడం లేదనేది నగ్న సత్యం. కాగా గ్రామీణ ప్రాంతాల్లో జాబ్ కార్డులున్నా పని దొరుకుతుందనే విషయంపై నమ్మకం కలుగక చాలా మంది కూలీలు జాబ్ కార్డులు చేయించుకునే ప్రయత్నమే చేయలేదు. ఇలాంటి కూలీల సంఖ్య కూడా తక్కువేం ఉండదు. వీటన్నింటిని బట్టి పాలకులు మన్ రేగా, వందరోజుల పని దినాల గురించి సొంత డబ్బా వాయించుకునేదంతా ఉట్టి పొగ బాణం లాంటిదే అనే సంగతి అర్థం చేసుకోవడానికి పెద్దగా కష్టపడనక్కర లేదు.

ఇక మన్ రేగా కింద నడుస్తున్న పనుల్లో మెజారిటీ రోడ్ల నిర్మాణం పనులే. మన్ రేగా నియమాల ప్రకారం ఒక పని మొత్తం ఖర్చులో 25 శాతం కూలీలకు వేతనంగా ఇవ్వాల్సి ఉండగా ఒడిశా ప్రభుత్వం దానిని 5శాతానికి తగ్గించి కూలీల కడుపుకొట్టి కాంట్రాక్టర్ల జేబులు నింపే ఘనకార్యం చేసింది. పెద్ద పనుల్ని చిన్న చిన్న ముక్కలుగా విడగొట్టి చిన్న కాంట్రాక్టర్లకు ఇవ్వడం కాకుండా చిన్న పనుల్ని కలిపేసి పెద్ద వర్కుగా టెక ఇస్తుండడంతో బడా కాంట్రాక్టర్లకు ప్రయోజనం కల్గుతున్నది. వీళ్లు పనులన్నీ యంత్రాలతో ఎక్కువగా నిర్వహిస్తుండడం తో కూలీలకు పనులు దొరకడం లేదు. ఇతర రాష్ట్రాల్లో రోజు కూలి రెండొందల నుండి మూడొందల వరకు ఇస్తుండగా ఒడిశాలో మాత్రం 80 నుండి 150 రూపాయల వరకే ఇస్తున్నారు. చేయడానికి చేతి నిండా పనుల్లేక, దొరికిన పనులకు ఇచ్చే తక్కువ వేతనాలతో కడుపు నిండక గత్యంతరం లేని పరిస్థితుల్లో తెలిసీ పులి నోట్లో తల పెట్టినట్లుగా బ్యాండెడ్ లేబర్ చక్ర వ్యూహంలోకి వెళ్తున్నారే తప్ప అధిక సంపాదన పేరాశతో కాదు. అలా అనడం కంటే క్రూరమైన జోక్ మరొకటుండదు.

రాష్ట్రంలోకి మరింత పెద్ద మొత్తంలో సిబిబి, ఎంఎన్‌సిల పెట్టుబడుల్ని ఆహ్వానించి పెద్ద ప్రాజెక్టుల నిర్మాణం, విద్యుత్ ప్లాంట్లు, అల్యూమినియం కంపెనీలు, బాక్సైట్ గనుల్ని తెరవడంతో ఉపాధి అవకాశాలు పెరుగు తాయనీ, వారి నుండి వచ్చే రాయాల్టీలతో రాష్ట్రాన్ని అభివృద్ధి చేయొచ్చుని పప్పు బాబు చెప్తున్న అభివృద్ధి నమూన ఉట్టి పగటి మోసమని గత అనుభవమంతా చెపుతున్నది. ఇప్పటికే యాభైకి పైగా ఇలాంటి కంపెనీ లున్న జిల్లాల్లో కూడా నిరుద్యోగ సమస్య ఏమాత్రం తగ్గక పోగా అక్కడ కూడా వలసపోవాల్సిన దుస్థితిలోనే ప్రజలున్నారనేది కఠోరమైన వాస్తవం. అల్యూమినియం, బాక్సైట్ కంపెనీల మూలంగా ప్రజలకు ఒరిగేది ఏమీ లేదు. ప్రజా జీవితాల్ని, పర్యావరణాన్ని విధ్వంసం చేయడం తప్ప.

నూటికి 80 శాతం మంది ప్రజలు భూమిని నమ్ముకుని బతికే ఈ దేశంలో భూమి సమస్య పరిష్కరించబడకుండా మెజారిటీ ప్రజల సమస్యను పరిష్కరించలేం. ఇప్పటికీ ఒడిశా గ్రామీణ ప్రాంతంలో పాతకాలపు రాజ కుటుంబాలు, జమీందారు కుటుంబాలు, గోంటియా (గ్రామ పటేల్)లు, జాంకొర్ల (పూజారులు) చేతుల్లో వంద లాది ఎకరాల భూములు కేంద్రీకృతమై ఉన్నాయి. మరోపక్క పెద్ద సంఖ్యలో భూముల్లేని కుటుంబాలు, నామమాత్రపు భూములు కలిగిన కుటుంబాలు ఉన్నాయి. భూస్వాముల కబ్జాలో ఉన్న భూమిని దున్నే వాడికి భూమి ప్రాతిపదికన పునర్ పంపకం చేయకుండా ప్రజలకు ఉపాధి కల్పించడం గురించి మాట్లాడడమంటే ఇరుసు లేని బండికి జోడెద్దుల్ని కట్టి ఎడ్లబండ్ల పోటీలో విజయం సాధిస్తానని కలలుకనడం లాంటిదే. మొదట భూమి సమస్యను పరిష్కరించి తర్వాత వ్యవసాయ ఆధారిత పరిశ్రమల్ని నెలకొల్పడం ద్వారా చాలా వరకు గ్రామీణ ప్రజల ఉపాధి సమస్యను పరిష్కరించగలం. అప్పుడే వలస సమస్యకు కూడా సరైన పరిష్కారం లభించగలదు. ఇదంతా నూతన ప్రజాస్వామిక విప్లవం ద్వారానే సాధ్యం. ఈ దిశలో ప్రజల్ని చైతన్యవంతం చేసే విజన్ కలిగి ఉంటూనే తక్షణం 'దాదన్' శ్రామికులు ఎదుర్కొంటున్న సమస్యలపై బలమైన ప్రజా ఉద్యమాన్ని నిర్మించాల్సిన అవసరం ఉంది.

*(రచయిత సామాజిక కార్యకర్త)*

వీ

# ఎన్నటికీ తీరని రుణం

- మాదిరాజు రాంబాబు

**'నా** ఆదర్శాలను పంచుకొని, అమిత కష్ట నష్టాలకు ఓర్చుకుంటూ, ఆహారం కంటే అమూల్యమైన ఆశ్రయం కల్పించిన వారికి (వారి రుణం-ఎప్పటికీ తిరిగి చెల్లించలేనిది) బాకీ పడ్డాను' అంటూ తన రచనలను ప్రజలకు అంకితమివ్వడం ద్వారా విప్లవ రుణ 'విముక్తి'కి ప్రయత్నించిన విప్లవ కురువృద్ధుడు సునితి కుమార్ ఘోష్ మనకిక లేరు. నక్సల్‌బరీ పోరాట సిద్ధాంత కర్త, విప్లవ కమ్యూనిస్టు దార్శనికుడు కామ్రేడ్ ఘోష్ 96 ఏళ్ల వయసులో మే 11న సాయంత్రం పశ్చిమ్‌బంగా (పశ్చిమ బెంగాల్) రాష్ట్రంలోని అసన్‌సోల్‌లో మరణించారు. 1967లో ఉత్తర పశ్చిమబెంగాల్ సిల్‌గురి డివిజన్‌లోని నక్సల్‌బరీలో సాయుధ తిరుగుబాటుతో ప్రారంభమైన విప్లవ కమ్యూనిస్టు ఉద్యమ కేంద్ర నాయకత్వంలో ఆయన బాధ్యతలు నిర్వహించారు. చైనా, సోవియట్ రష్యా దేశాల మధ్య మహా సిద్ధాంత సంగ్రామం (గ్రేట్ డిబేట్), చైనా సాంస్కృతిక విప్లవానికి కేంద్ర నినాదమైన 'కేంద్రాన్ని బద్ధలు కొట్టండి' స్ఫూర్తితో ఆ పోరాటం తలెత్తింది. వర్గ పోరాటాన్ని ముందుకు తీసుకెళ్లేందుకు సంశయిస్తున్న సిపిఐ, సిపిఎం అగ్రనాయకత్వాన్ని ధిక్కరిస్తూ భారత సామాజిక, రాజకీయ యవనికపై వసంతకాల మేఘ ఘర్జనగా జనించిన నక్సల్‌బరీ పోరాటం విప్లవోద్యమ దిక్సూచిగా నిలిచింది. భూస్వామ్య విధానాన్ని, సామ్రాజ్యవాద స్వరూప స్వభావాలను గుర్తించిన సిపిఐ, సిపిఎంల నుంచి తెగదెంపులు చేసుకున్న విప్లవ కమ్యూనిస్టు తరం నక్సల్‌బరీ ఉద్యమానికి ఊపిరిలూదారు. నక్సల్‌బరీ ఉద్యమ వెలుగులో దేశవ్యాప్తంగా రైతాంగ సాయుధ తిరుగుబాట్లు ఉనికిలోకి వచ్చాయి. వీటన్నిటినీ అనుసంధానిస్తూ నూతన విప్లవ కమ్యూనిస్టు పార్టీ (ఆల్ ఇండియా కమ్యూనిస్టు కో ఆర్డినేషన్ కమిటీ-ఎఐసిసిఆర్) చారుమజుందార్ నాయకత్వంలో 1968లో నిర్మాణం జరిగింది. అత్యంత ప్రతిష్ఠాత్మకమైన ఈ కమిటీలో ఘోష్ సభ్యునిగా బాధ్యతలు నిర్వహించారు. 1970లో చారుమజుందార్ ఛైర్మన్‌గా ఏర్పడిన సిపిఐ (ఎంఎల్) పార్టీ వ్యవస్థాపక సభ్యులుగా ఆయన కీలక పాత్ర పోషించారు.

ఎఐసిసిఆర్, ఆ తర్వాత సిపిఐ (ఎంఎల్) విప్లవ కార్యాచరణకు మార్గదర్శకత్వం వహించే పార్టీ అధికార పత్రిక 'లిబరేషన్' (విముక్తి) తొలి సంపాదకునిగా ఘోష్ బాధ్యతలు నిర్వహించారు. నక్సల్‌బరీ నిర్మాత చారుమజుందార్ 1972లో మరణించిన అనంతరం సిపిఐ (ఎంఎల్) ముక్కలు చెక్కలైంది. అనంతరం 1972లో ఏర్పడిన సెంట్రల్ ఆర్గనైజింగ్ కమిటీ (సిఒసి), సిపిఐ (ఎంఎల్) సంస్థలకు ఘోష్ నాయకత్వం వహించారు. 1977లో సిఒసి రద్దయి పోయేంత వరకు ఆయన రాజకీయ కార్యకలాపాల్లో నిమగ్నమై ఉండేవారు. విప్లవోద్యమంలో క్రియాశీలంగా పనిచేస్తున్న కాలంలో ఆయన కుటుంబం అనేక కష్టాలను అనుభవించింది. ఆ తర్వాతి కాలంలో ఆయన తన దృష్టంతా సైద్ధాంతిక రచనలు, నక్సల్‌బరీ కాలంలో రూపొందిన వివిధ డాక్యుమెంట్లను సంకలనం తీసుకురావడంపై కేంద్రీకరించారు. 1967-72 మధ్య కాలంలో లిబరేషన్ పత్రికలో వివిధ విషయాలపై వచ్చిన వ్యాసాలను ఆయన 'ఎ లిబరేషన్ ఆంథాలజీ' పేరుతో 1992 - 93లో రెండు సంకలనాలుగా తీసుకొచ్చారు. ఆయన భారత విప్లవ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రపై వివిధ రచనలతో సహా సమకాలిన భారతచరిత్ర, రాజకీయార్థ శాస్త్రంపై అనేక పుస్తకాలు రాశారు. 1985లో 'భారత బడా బూర్జువాజీ పుట్టుక, అభివృద్ధి, స్వభావం' అనే అత్యంత ప్రతిష్ఠాత్మకమైన పుస్తకాన్ని ఆయన రచించారు. 'భారత రాజ్యాంగం, దానిపై సమీక్ష', భారత్‌లో అభివృద్ధి ప్రణాళిక లంపెన్ - అభివృద్ధి, సామ్రాజ్యవాదం' తదితర విశిష్ట వ్యాసాలను రీసెర్చ్ యూనిట్ ఫర్ పొలిటికల్ ఎకానమీ (ఆర్‌యుపిఇ) సంస్థ ప్రచురించింది. దేశంలో కొనసాగుతున్న జాతుల సమస్యను విశ్లేషిస్తూ 'భారత జాతుల సమస్య, పాలక వర్గాలు', హిమాలయ సాహసం 1962 ఇండియా - చైనా యుద్ధం - కారణాలు, పర్యవసానాలు', నక్సల్‌బరీ ముందు, వెనకా స్మృతులు, మదింపు' (2009), 'ఇండియా, రాజ్-1919-1947', 'ప్రతిష్ఠ, సిగ్గుచేటు, బానిసత్వం', 'భారత వ్యవసాయరంగంపై పట్టు బిగిస్తున్న సామ్రాజ్య వాదం', బెంగాల్ విభజన విషాదం' వంటి ముఖ్యమైన రచనలతో పాటు ఆయన అనేక కీలక సమస్యలపై అసంఖ్యాకమైన వ్యాసాలు, కరపత్రాలు, బుక్‌లెట్స్ రచించారు. 'యాస్పెక్ట్స్ ఆఫ్ ఇండియా ఎకానమీ', బులెటిన్ కన్‌సర్డ్ ఆఫ్ ఆసియన్ స్కాలర్స్', ఇపిడబ్ల్యు', ఫ్రాంటియర్, మంత్లీ రివ్యూ, విశ్వభారతి క్వార్టర్లీ' తదితర విశ్లేషణాత్మక పత్రికలకు ఆయన వివిధ సందర్భాల్లో వ్యాసాలు రాసే వారు. ఆయన ఇంగ్లీష్‌లోనే కాకుండా బెంగాలీలో కూడా రచనలు చేసేవారు. ఆయన రచనలు తమిళ్, మలయాళం, హిందీ, తెలుగు భాషల్లోకి తర్జుమా అయ్యేవి.

1946-47 మధ్య కాలంలో బెంగాల్‌లో కౌలు రైతులు చేసిన తెభాగా ఆందోళన కాలం నుంచి ఘోష్ కమ్యూనిస్టు ఉద్యమంతో పరిచయం కొనసాగింది. తెభాగా ఉద్యమం బంగ్లాదేశ్, పశ్చిమ్‌బంగా ప్రాంతాల్లో బాగా విస్తరించింది. 1956లో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 20వ కాంగ్రెస్ తర్వాత ఆయన సిపిఐ నుంచి తప్పుకున్నారు. 1962లో నడచిన చైనా యుద్ధ సమయంలో తిరిగి రాజకీయాల్లోకి రావాలని ఆయనకు అసక్తి కలిగింది. ఆనాడు మార్క్సిజం-లెనినిజంను బతికించే ఉద్దేశంతో 1964లో ఏర్పడిన ఆయన సిపిఎంలో చేరి పనిచేశారు. అయితే 1966 కల్లా ఆయన సిపిఎంతో తెగదెంపులు చేసుకున్నారు. సునితికుమార్‌ఘోష్ తన చివరి శ్వాస వరకు మార్క్సిజం - లెనినిజంకు నిజాయితీతో కట్టుబడి ఉన్నారు. భారత్‌లో స్వతంత్రం తర్వాత భూస్వామ్యం అంతరించి పోయి రైతాంగం మిగిలిందని, టాటా, బిర్లా, మఫత్‌లాల్ వంటి పారిశ్రామిక వేత్తలు జాతీయ బూర్జువాలుగా మారారని వామపక్షాలు అంచనా వేశాయి. సామ్రాజ్య వాద వ్యతిరేక పోరాటంలో వీరిద్దరూ (రైతాంగం, జాతీయ బూర్జువాలు) కమ్యూనిస్టు ఉద్యమానికి అనుకూలంగా ఉంటారని, సాయుధ పోరాటం అవసరం లేకుండానే ఎన్నికల ద్వారా సోషలిజాన్ని విజయవంతం చేయగలమని అవి తీర్మానించాయి.

# 21వ శతాబ్దంలో ప్రజాస్వామ్యం - సామ్యవాదం

- ప్రతాప్

**'21**వ శతాబ్దంలో ప్రజాస్వామ్యం, సామ్యవాదం' అనే పేరిట 2014 మార్చ్ 7 నుంచి 10 వరకు హైదరాబాద్‌లో నాలుగు రోజులు ప్రపంచ సదస్సు జరిగింది. ఇందులో వివిధ రకాల సిద్ధాంతాలను అనుసరించే వ్యక్తులు, సంస్థలు, పార్టీల నాయకులు పాల్గొన్నారు. అనేక మంది స్వచ్ఛంద సంస్థల నాయకులు కూడా పాల్గొన్నారు. ప్రధానంగా ప్రస్తుతం లాటిన్ అమెరికా దేశాల్లో జరుగుతున్న ఉద్యమాల నుండి వస్తున్న అనుభవాలను ఈ సదస్సులో కేంద్రంగా చర్చించారు. తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రెండు రాష్ట్రాలుగా త్వరలో విడిపోతున్న సమయంలో రేపు తెలంగాణలో ప్రారంభమయ్యే పునర్నిర్మాణం ఎలా ఉండాలో కూడా ఈ సదస్సు మార్గ నిర్దేశం చేస్తుందనే ఆశాభావంతో కొంతమంది వక్తలు మాట్లాడడమే గాక, ఈ సదస్సును అదే కోణంలో చాలా మంది చూశారు కూడా. లాటిన్ అమెరికా దేశాల్లో ముందుకు వస్తున్న సిద్ధాంతాలపై మా పార్టీ చాలా సార్లు అభిప్రాయాలు తెలియచేసినప్పటికీ, తెలంగాణ పునర్నిర్మాణం ముందుకొచ్చిన సందర్భంలో 'లాటిన్ అమెరికా సోషలిస్టు నమూనా'పై మరొక్కమారు ఇక్కడ చర్చిస్తున్నాం.

21వ శతాబ్దంలో సోషలిజం అనే అంశంపై వివిధ కోణాల్లో చర్చించాల్సిన అవసరమెంతో ఈ రోజు ఉంది. ఈ విస్తృతమైన అంశాన్ని చర్చించడానికి సుమారు 150 ఏళ్ల విప్లవోద్యమ చరిత్రతో పాటు మొట్టమొదటిసారి ప్రపంచంలోనే సోషలిజం ఉనికిలోకి వచ్చిన సోవియట్ యూనియన్ మొదలు ఈ రోజు వరకు చర్చించాలి. ముఖ్యంగా సోవియట్ యూనియన్, జన చైనా అనుభవాలను విశ్లేషించాలి. ప్రపంచంలో కొన్ని పార్టీలు, వ్యక్తులు ఈ విషయంలో కొంత మేరకు ప్రయత్నం చేసినప్పటికీ ఇప్పటికీ సమగ్రమైన పాఠం ఏమీ లేదు. మార్క్సిజం ప్రపంచంలో జరుగుతున్న మార్పులను శాస్త్రీయంగా విశ్లేషించే పనిముట్టుగా ఉపయోగపడే సిద్ధాంతం. ప్రపంచ నలుమూలల్లో ఎక్కడ నుండైనా విప్లవోద్యమంలో కొత్త ప్రయోగాలు జరిగినప్పుడు వాటి నుండి నేర్చుకోవడానికి మనం ఎల్లప్పుడు సిద్ధంగా ఉండాలి. అయితే మార్క్సిజం అందించిన మూల సూత్రాలకు అవి అనుగుణంగా ఉన్నాయా లేదా అని పరిశీలించు కోవడం అవసరం. లాటిన్ అమెరికన్ దేశాల అనుభవాలను పరిశీలిస్తే మార్క్సిస్టు – లెనినిస్టు

భారతదేశ మౌలిక సామాజికార్థిక స్వభావంపై వామపక్షాలు వేసిన అంచనాతో ఘోష్ తీవ్రంగా విభేదించారు.

భారత బూర్జువా వర్గం అటు సామ్రాజ్యవాదంతోనూ, ఇటు భూస్వామ్య వర్గంతోనూ పెనవేసుకుని ఉందన్న నక్సల్‌బరీ సైద్ధాంతిక అవగాహనను ఘోష్ తన రచనలలో చక్కగా వివరించారు. వామపక్ష పార్టీల అవగాహనకు భిన్నంగా దేశీయ బూర్జువావర్గం స్వతంత్ర స్వభావాన్ని కలిగిలేదని, అది సామ్రాజ్యవాద పెట్టుబడికి తాబేదారుగా ఉంటూ తనవంతు లాభాలను సొంతం చేసుకుంటుందని ఆయన విశ్లేషిస్తున్నారు. ఈ నేపథ్యంలో సామ్రాజ్యవాదులకు, వారి కార్పొరేట్ వ్యాపారాలకు దేశీయ కొనసాగింపుగా, స్థానిక సిఇఒలుగా వ్యవహరించే టాటా, బిర్లా వంటి పెట్టుబడిదారులను దళారీ బూర్జువాలుగా పరిగణించాలన్న విప్లవోద్యమ అవగాహనను ఆయన స్పష్టంగా విశదపరిచారు. అదే సమయంలో భారత సమాజంలో భూస్వామ్యం బ్రిటిష్ వలస పాలనలో విరూపం చెందిందని, స్వతంత్ర అనంతరం అది దళారీ బూర్జువావర్గంతో చేతులు కలిపి అధికారంలో, లాభాల్లో భాగం పంచుకుంటుంది. దేశీయ పారిశ్రామిక వర్గానికి అధిక మొత్తాల్లో పెట్టుబడి అవసరమయ్యే భారీ పరిశ్రమలను నిర్మించలేని బలహీనతలో ఉన్నందున, ప్రభుత్వమే ప్రజల నుంచి వసూలు చేసిన పన్నుల డబ్బును పెట్టుబడిగా పెట్టింది. ఈ భారీ పరిశ్రమలకు అనుబంధంగా దేశ పారిశ్రామిక వర్గం వర్తక, వాణిజ్యాల ద్వారా భారీ లాభాలను మూటగట్టుకుంది. మిశ్రమ ఆర్థిక వ్యవస్థ పేరుతో ప్రజా ధనంతో నిర్మించిన ప్రభుత్వ రంగ పరిశ్రమలను దివాళా తీయించి, ప్రైవేట్‌రంగం తెగ బలిసి పోవడానికి రాజకీయ ప్రతినిధులు, బ్యూరాక్రట్లు అత్యంత కీలక పాత్ర పోషించారు. భారత ఆర్థిక రంగంలో ప్రభుత్వం ఒక కీలక ఆర్థిక సాధనంగా పనిచేసింది. దళారీ పెట్టుబడిదారులు, ప్రభుత్వాధినేతలు, అధికారులతో మిలఖతై భూస్వామ్యం వర్గం నీటి ప్రాజెక్టుల తదితర మౌలిక సదుపాయాల రంగంలోకి చొరబడింది. అయితే మొత్తం ఎగుమతులు, దిగుమతుల తో కూడిన దేశ ఆర్థిక వ్యవస్థ సామ్రాజ్యవాద సంస్థల పెట్టుబడికి పెంపక కేంద్రంగా తయారైంది. ఈ నేపథ్యంలో సామ్రాజ్యవాద కార్పొరేట్ సంస్థల, దళారీ పారిశ్రామిక వేత్తల, భూస్వాముల మదుపు, ప్రభుత్వ మదుపుతో సంశ్లేషితమైన మిశ్రమ పెట్టుబడి దేశ ఆర్థిక వ్యవస్థను శాసిస్తోందన్న సత్యాన్ని ఆయన తన రచనల్లో అద్భుతంగా ఆవిష్కరించారు. ఈ మిశ్రమ పెట్టుబడికి ప్రాతినిధ్యం వహిస్తున్న భారత పాలకవర్గాలను 'ఇండియన్ బిగ్ బూర్జువాజీ' అని ఆయన నామకరణం చేశారు. ఈ మిశ్రమ పెట్టుబడిని ప్రస్తుతం 'బ్యూరాక్రటిక్ క్యాపిటల్' (బ్యూరాక్రటిక్ పెట్టుబడి) అని, దేశంలో కొనసాగుతున్న ఆర్థిక విధానాన్ని 'బ్యూరాక్రటిక్ పెట్టుబడి దారీ విధానం' అని పిలుస్తున్నారు. మరికొందరు పాశ్చాత్య దేశాల్లో కొనసాగే ఆశ్రిత పెట్టుబడిదారీ విధానానికి భిన్నంగా భారతీయ విశిష్టతలతో కూడిన ఆశ్రిత పెటుబడిదారీ విధానంగా పరిగణిస్తున్నారు.

చివరి క్షణం వరకు సునుతి కుమార్ ఘోష్ విప్లవాన్ని స్వప్నించారు, సమర్థించారు. భారత విప్లవోద్యమ పునర్నిర్మాణంలో ఎదురవుతున్న సమస్యలు, కష్ట నష్టాలతో ఆయన నిరంతరాయంగా పోరాడుతూనే ఉన్నారు. ఆయన రచనల నుంచి విప్లవ కమ్యూనిస్టులకు పాఠాలు నేర్చాయి. కమ్యూనిస్టు విప్లవ భావజాలకర్తగా చివరి శ్వాస వరకు పోరాడిన సునితికుమార్‌ఘోష్ భావజాలంతో పీడిత ప్రజలవిముక్తి కోసం రాజీలేని పోరాటం చేయడమే ఆయనకు మనమిచ్చే ఘనమైన నివాళి. వీ

*(రచయిత పాత్రికేయులు)*

సిద్ధాంతాలలో ముఖ్యమైన అంశాలైన 'పార్టీ – వర్గ పోరాటం – కార్మిక వర్గ నియంతృత్వం' అనే విషయాల్లో 21 శతాబ్దం లో తలెత్తిన నూతన పరిస్థితుల పేరిట, వీటిని పలచన చేయడమో లేదా వదిలివేయడం జరుగుతున్నది.

సామ్రాజ్యవాదం అనుసరిస్తున్న గ్లోబలైజేషన్, నయా ఉదారవాద విధానాల వలన కార్మికవర్గం, రైతాంగం, మధ్య తరగతి, ఇతర సెక్షన్ల ప్రజలు ఎన్నో ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. పర్యావరణంతో పాటు అనేక రంగాలు దెబ్బతింటున్నాయి. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఈ ప్రజలనందరిని సమీకరించి పోరాటాలు చేయాలి. లాటిన్ అమెరికా దేశాల్లోని పార్టీలు పై వర్గాలు సెక్షన్లతో పాటు క్రిస్టియన్ సంఘాలు, మానవతావాద సంస్థలు, పర్యావరణవాదులతో పాటు అనేక సంస్థలను కలుపుకొని ప్రజా ఉద్యమాలు నిర్మిస్తున్నాయి. ఇలాంటి ప్రయోగాలన్నింటి నుండి నేర్చుకొని ఆయా దేశాల్లో ఉన్న ప్రత్యేక పరిస్థితులకు అన్వయించి ప్రజా ఉద్యమాలను పెంపొందించాల్సిన అవసరముంది. కాని '21వ శతాబ్దంలో శాస్త్ర, సాంకేతిక, సమాచార విప్లవం శాసిస్తున్నదనే సూత్రీకరణతో విప్లవోద్యమం అనుసరించాల్సిన మౌలిక విషయాలను ఇక్కడి పార్టీలు లేదా సిద్ధాంతకర్తలు తృణీకరిస్తున్నారు.

21వ శతాబ్దంలో మన ముందుంచిన కొత్త సవాళ్లను ఎదుర్కొన డానికి సమాజంలోని విశాల సెక్షన్ల ప్రజానీకాన్ని ఒకే పోరాట ప్రమాణాల చుట్టూతా సమీకరించగలిగే ఒక జాతీయ కార్యక్రమాన్ని ముందుకు తీసుకపోగలిగే రాజకీయ నిర్మాణం అవసరం అని చెపుతూ, పార్టీ ఎలా ఉండాలో ఈ విధంగా చెపుతున్నారు. ఈ రాజకీయ నిర్మాణం పార్టీకి నిబద్ధత కనపరిచే సభ్యులతో పని చేయడానికి మాత్రమే పరిమితం కాకుండా సభ్యులు కాని వారికి కూడా స్థానం కల్పించాలని అంటున్నారు. ఈ అవగాహనను 1902లోనే పార్టీ నిర్మాణం ఎలా ఉండాలనే విషయంలో లెనిన్ చేసిన బోధనకు విరుద్ధంగా ఉంది. వీరు చెపుతున్నట్టు 'పార్టీ అనేది అనేక సిద్ధాంత ప్రవాహాలు కలగలసిన ఇంద్ర ధనస్సు వంటిది కాదు. కార్మికవర్గ అగ్రగామిగా పార్టీ అత్యంత సంక్షోభిత సమయాల్లో ప్రజలనందరిని ఐక్యం చేసి పెట్టుబడిదారీ విధానాన్ని కూల్చే శక్తివంతమైన సాధనం. అలాగే కేంద్రీకృత ప్రజాస్వామ్య సిద్ధాంతంపై ఆధారపడి నడిచే పార్టీని వీరు కోరుకోరడం లేదు. లెనినిస్టు పార్టీ లేకుండా విప్లవోద్యమం విజయ వంతం కాదు. ఒకవేళ అయినా అది నిలబడలేదు.

వీళ్లు వర్గ పోరాటాన్ని కేంద్ర బిందువుగా తీసుకోకుండా సామ్రాజ్య వాదం – భూస్వామ్యం ద్వారా తలెత్తే మానవాళి ఎదుర్కొనే అనేక సమస్యలతో కలగాపులగం చేస్తూ స్పష్టమైన మార్గాన్ని నిర్దేశించ లేకపోతున్నారు. వెనిజుల, చీలీ, బ్రెజిల్, అర్జెంటీనా, ఉరుగ్వే, బొలివియా దేశాల్లో అధికారంలోకి వచ్చిన ప్రభుత్వాలు, స్థానిక సంస్థలకు – ప్రభుత్వాలకు పెద్దపీట వేస్తున్నాయి. పైన ప్రభుత్వాలు మాత్రం బ్యూరాక్రసీతో నిండి, విదేశీ ద్రవ్య పెట్టుబడిపై ఆధారపడి దేశాన్ని నడిపే వ్యవస్థగానే ఉన్నాయి. ఈ దేశాల్లోకి ఇబ్బడిముబ్బడిగా అమెరికా, యూరోపియన్ పెట్టుబడులే గాక రష్యా, చైనా పెట్టుబడులు కూడా ప్రవహిస్తున్నాయి.

కాబట్టే ఈ దేశాలు కూడా ఏదో కోణంలో సామ్రాజ్య వాదుల మధ్య జరుగుతున్న ప్రచ్ఛన్నయుద్ధంలో భాగస్వామ్యం వహించక తప్పడం లేదు. సిరియా యుద్ధంలో లాటిన్ అమెరికా దేశాల పాత్ర ఇదే విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. పెట్టుబడికి ఉన్న లక్షణాల్లో యుద్ధం, ఫాసిజం అనే కోణాల్లో కూడా ఇవి తప్పించుకో వాలంటే సామ్రాజ్యవాద పెట్టుబడికి వ్యతిరేకంగా తీవ్రంగా పోరాడాల్సిందే. అయితే స్థానిక ప్రభుత్వం చొరవతో వీటిని అరికట్ట గలమనే భ్రమల్లో ఇక్కడి పాలకవర్గాలు ప్రజలను నిజమైన విప్లవ మార్గం నుండి పక్కదారి పట్టిస్తున్నాయి.

సామ్రాజ్యవాదాన్ని, భూస్వామ్యాన్ని కూలదోయాలంటే బల ప్రయోగం అవసరం లేదని కూడా ఇక్కడ సిద్ధాంతకారులు చెపుతు న్నారు. ఇప్పటి వరకు ప్రపంచంలో ఏ విప్లవం కూడా బల ప్రయోగం లేకుండా విజయవంతం కాలేదు. పెట్టుబడిదారీ విధానం బల ప్రయోగం ద్వారానే కూల్చివేయబడుతుంది. తుపాకి చేతబట్టి హింసా మార్గం ద్వారానే తమ అధికారాన్ని కాపాడుకుంటున్న పెట్టుబడిదారీ విధానాన్ని కూల్చడం నిరాయుధులైన ప్రజలు ఎంత సంఘటితంగా పోరాడిన సాధ్యం కాదు. అందుకు ప్రజలు కూడా సాయుధ ప్రతిఘటనకు సిద్ధం కావాల్సిందే. అంతెందుకు ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర సాధనలాంటి రాజ్యాంగ ప్రక్రియను కూడా సాధించడానికి కోస్తాంధ్ర, రాయలసీమ పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా యావత్తు తెలంగాణ ప్రజలు అనేక బలిదానాలు లేకుండా సాధించుకోలేక పోయారు. పెట్టుబడిదారుల అధికార స్వర్గధామాన్ని కూల్చడానికి ఎన్నో త్యాగాలు, ఎంత బల ప్రయోగం అవసరమో ప్రపంచ చరిత్ర నిండా అనుభవాలున్నాయి.

తెలంగాణ రాష్ట్రంలో అధికారంలోకి వచ్చే పార్టీలు సామ్రాజ్యవాద అనుకూల దళారీ నిరంకుశ బూర్జువా – భూస్వామ్య వర్గాలే. ఎన్నికల్లో వీరు ఎన్ని కబుర్లు చెప్పినా ఇంతకాలం సాగిన పాలనకు భిన్నంగా ఏ మాత్రం ఉండదు. ప్రజల నిజమైన ఎజెండాను ముందుకు తీసికొని పోయి ఆకాంక్షలు నెరవేర్చుకోవాలంటే నూతనంగా అధికారంలోకి వచ్చే పాలక పార్టీలతో పోరాడాల్సిందే. అందుకు తెలంగాణ ప్రజలు నూతన రాష్ట్రాన్ని పునర్నిర్మాణం చేసుకోవడానికి తెలంగాణ రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, సామాజిక, వర్గ పోరాట చరిత్రను అధ్యయనం చేయాలి. స్వావలంబన, వికేంద్రీకరణ, స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, ప్రజా స్వామ్యం ప్రాతిపదిక మీద ప్రజలు గట్టిగా నిలబడి పోరాటం చేయాలి. సామ్రాజ్యవాద పెట్టుబడి (ప్రపంచ బ్యాంకు) కి వ్యతిరేకంగా పోరాడాలి. అంతర్గతంగా తెలంగాణలో కుళ్లిపోయిన భూస్వామ్య విధానానికి వ్యతిరేకంగా పోరాడాలి.

ఎన్నికల పార్టీలు తమ గెలుపు కోసం వివిధ సామాజిక సెక్షన్ల ఓట్లు దండుకోవడం కోసం వివిధ రకాలైన వాగ్దానాలు చేస్తున్నాయి. వీటికి మోసపోకుండా ఈ సామాజిక సెక్షన్లన్నీ ఐక్యమైన తమ డిమాండ్ల సాధన కోసం పోరాడాలి. కార్మికులు, ఉద్యోగులు, ఉపాధ్యాయులు, విద్యార్థులు, మేధావులు, ప్రజాస్వామిక వాదులు వివిధ సామాజిక సెక్షన్లు, మహిళలు, కళాకారులు అందరూ కలిసి కింది నుండి, స్థానిక స్థాయి నుండి ఐక్యమై సమరశీల పోరాటాలకు సిద్ధం కావాలి. అప్పుడే మనం ఆంక్షలు లేని ప్రజాస్వామిక తెలంగాణను నిర్మించుకోగలం

*(రచయిత ప్రజా ఉద్యమ నాయకులు)*

వీ

## రోడ్డు ప్రమాదంలో కేంద్ర మంత్రి మృతి

కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖ మంత్రి గోపినాథ్ ముండే (64) జూన్ 3న రోడ్డు ప్రమాదంలో మృతి చెందారు. ఢిల్లీ నుంచి ముంబాయి వెళ్లడానికి విమానాశ్రయానికి బయలుదేరి వెళుతుండగా కారు ప్రుథ్వీరాజ్ రోడ్ కూడలి వద్దకు చేరుకున్న సమయంలో వెనుక నుంచి ఇండికా కారు వేగంగా వచ్చి ముండే కారును ఢీ కొట్టింది. ప్రమాదం జరిగిన వెంటనే ఆలిండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్ (ఎఐఐఎంఎస్)కి తీసుకెళ్లగా ఆయన అప్పటికే మృతి చెందినట్లు డాక్టర్లు ధృవీకరించారు.

## లోక్‌సభ స్పీకర్‌గా సుమిత్రా మహాజన్

బిజెపి పార్లమెంటు సభ్యురాలు సుమిత్రా మహాజన్ 16వ లోక్‌సభకు స్పీకర్‌గా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. ఈ పదవికి సుమిత్రా మహాజన్ పేరును ప్రతిపాదిస్తూ ప్రధాన మంత్రి నరేంద్రమోడీ ప్రవేశపెట్టిన తీర్మానాన్ని బిజెపి నేత ఎల్.కె. అద్వానీ, వివిధ రాజకీయ పార్టీల నేతలందరూ సమర్థించారు. ఆమెకు ఏకగ్రీవంగా మద్దతు పలుకుతున్నట్లు చెప్పడంతో సుమిత్రా మహాజన్ లోక్‌సభ స్పీకర్‌గా ఎన్నికైనట్లు ప్రోటెం స్పీకర్‌గా ఉన్న కమల్‌నాథ్ జూన్ 6న ప్రకటించారు.

## స్వర్ణ దేవాలయంలో ఘర్షణలు

ఆపరేషన్ బ్లూస్టార్ జరిగి 30 సంవత్సరాలు అవుతున్న సందర్భంగా జూన్ 6న జరిగిన కార్యక్రమంలో ఉద్రిక్తత చోటుచేసుకున్నది. కార్యక్రమానికి హాజరైన వారిని ఉద్దేశించి ఆకాల్ తఖ్త్ అధిపతి ప్రసంగిస్తుండగా, మాన్ ఆయనను అడ్డుకోవడానికి ప్రయత్నించాడు. ఈ సందర్భంగా గందరగోళం ఏర్పడడంతో శిరోమణి అకాలీదళ్ అమృత్‌సర్ కార్యకర్తలకూ, శిరోమణి గురుద్వారా ప్రబంధక్ కమిటీ (ఎస్‌బిపిసి) రక్షక భటులకూ మధ్య గొడవ అయిందని వివరించారు. ఈ ఘర్షణలో ఖడ్గాలను ఝులిపించడం మూలంగా ఐదుగురు ఎస్‌జిపిసి టాస్క్‌ఫోర్స్ సిబ్బందికి గాయాలయ్యాయని అమృత్‌సర్ పోలీస్ కమిషనర్ జితిందర్ సింగ్ ఔలఖ్ తెలిపారు.

## వసతులు లేవంటూ వైద్య సీట్ల రద్దు

వైద్య కళాశాలల్లో భారత వైద్య మండలి (ఎంసిఐ) నిబంధనల మేరకు ఆయా వైద్య కళాశాలల్లో కనీస వసతులు లేనందున 700 సీట్లను రద్దు చేస్తున్నట్లు జూన్ 5న ఎంసిఐ తెలిపింది. వసతుల పెంపుకు తాము సమయం ఇచ్చినప్పటికీ ఎలాంటి మార్పు లేనందున గతంలో పెంచిన సీట్లకు 2014 – 15 సంవత్సరానికి అనుమతి ఇవ్వకూడదని కేంద్ర ప్రభుత్వానికి సూచించింది. మే 9న జరిగిన పాలక మండలి సమావేశంలో 450 సీట్లు రద్దు చేయాలని తీర్మానించగా గత ఏప్రిల్‌లో జరిగిన సమావేశంలో 250 సీట్ల పెంపుకు అనుమతి నిలిపివేయాలని పేర్కొంది. దీంతో మొత్తం 700 సీట్లను రద్దు చేశారు.

## ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా చంద్రబాబు

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర తొలి ముఖ్యమంత్రిగా జూన్ 8న గుంటూరు జిల్లా నాగార్జుననగర్‌లో గవర్నర్ ఇ.ఎస్.ఎల్.ఎన్. నరసింహన్ చంద్రబాబు నాయుడుతో ప్రమాణ స్వీకారం చేయించారు. ఈ కార్యక్రమంలో మరో 19 మంది మంత్రులు ప్రమాణ స్వీకారం చేశారు. ఈ కార్యక్రమానికి బిజెపి నేతలు ఎల్.కె. అద్వానీ, కేంద్ర హోం మంత్రి రాజ్‌నాథ్ సింగ్, ముఖ్యమంత్రులు వసుంధర రాజే సింధియా (రాజస్థాన్), రమణ్‌సింగ్ (ఛత్తీస్‌గఢ్), మనోహర్ పారికర్ (గోవా), ఆనందిబెన్ పటేల్ (గుజరాత్), జలింగ్ (నాగాలాండ్) ఎన్‌డిఎ కూటమిలోని నాయకులు హాజరయ్యారు.

## బూటకపు ఎన్‌కౌంటర్ కేసులో యావజ్జీవ శిక్ష

బూటకపు ఎన్‌కౌంటర్ కేసులో ఉత్తరాఖండ్‌కు చెందిన 17 మంది పోలీసులకు ఢిల్లీలోని సిబిఐ ప్రత్యేక న్యాయ స్థానం జూన్ 9న యావజ్జీవ శిక్ష విధించింది. 2009, జూలై 3న 22 సంవత్సరాల ఎంబిఎ విద్యార్థి రణబీర్ సింగ్‌ను ఎన్‌కౌంటర్ పేరుతో చంపిన కేసులో కోర్టు వీరిని దోషులుగా తేల్చింది. ఇది అత్యంత అరుదైన కేసు కాదు కాబట్టి దోషులకు మరణ శిక్ష వేయలేమని సిబిఐ న్యాయ వాదుల వాదనలపై వ్యాఖ్యానిస్తూ జూన్ 9న తీర్పు వెలువరించింది.

## కేదర్‌నాథ్ సింగ్‌కు జ్ఞానపీఠ్ అవార్డు

ప్రముఖ హిందీ కవి కేదర్‌నాథ్ సింగ్ (80) 2013 సంవత్సరానికి గాను 49వ జ్ఞానపీఠ్ అవార్డుకు ఎంపికయ్యారు. ఇప్పటివరకు ఈ ప్రతిష్టాత్మక అవార్డును అందుకున్న హిందీ కవుల్లో కేదార్‌నాథ్ ఏడో వ్యక్తి. ఉత్తరప్రదేశ్‌లోని బలియాలో జన్మించిన ఆయన పలు వ్యాసాలు, కథలు రాశారు. ఆయన రాసిన వాటిలో 'అఖీ బిల్‌కూల్ అఖీ' 'యహాన్ సే దేఖో' రచనలు ప్రముఖమైనవి.

## పోలీసు కాల్పుల్లో నక్సల్స్ మృతి

ఆంధ్రప్రదేశ్‌లోని ప్రకాశం, గుంటూరు, మహబూబ్‌నగర్ సరిహద్దు ప్రాంతం పాలుట్ల వద్ద జూన్ 19న గ్రేహౌండ్స్, నక్సల్స్ మధ్య కాల్పులు జరిగాయని, ఈ కాల్పుల్లో జాన్ బాబా, విమల, నిర్మల మృతి చెందినట్లు గుంటూరు ఐజి సునిల్ కుమార్ తెలిపారు. నల్లమల ప్రాంతంలో గ్రేహౌండ్ దళాలు కూంబింగ్ నిర్వహిస్తున్న సమయంలో మావోయిస్టులు ఎదురుపడగా ఈ ఘటన జరిగినట్లు తెలిపారు. ఈ ఘటనపై హక్కుల సంఘాలు అనుమానాలను వ్యక్తం చేస్తూ, లొంగిపోవడానికి వచ్చిన ముగ్గిరిని కాల్చి చంపారని అంటున్నారు.

## పెరిగిన రైల్వే చార్జీలు

రైల్వే శాఖ జూన్ 20న అన్ని తరగతుల చార్జీలను 14. 2శాతం పెంచింది. సరుకు రవాణా 6.5 శాతం పెంచింది. పెంపు జూన్ 25 నుంచి అమల్లోకి వస్తుంది.స్లీపర్ తరగతి చార్జీలు కనిష్టంగా రు. 30, గరిష్టంగా రు. 80 పెరగనున్నాయి. ఎసి తరగతుల్లో కనిష్టంగా రు. 90, గరిష్టంగా రు. 540 పెరుగనున్నాయని రైల్వే శాఖ మంత్రి సదానందగౌడ్ తెలిపారు.

## బియాస్ నదిలో ప్రమాదం

హిమాచల్‌ప్రదేశ్‌లోని బియాస్ నదిలో హైదరాబాద్ నుంచి వెళ్లిన విజ్ఞాన్‌జ్యోతి ఇంజనీరింగ్ కళాశాల విద్యార్థులు 24 మంది జూన్ 8న నీటి ప్రవాహంలో కొట్టుకుపోయారు. వీరు మనాలీ – కిరాత్‌పూర్ హైవేపై థాలోట్‌కు సమీపంలో బియాస్ నదీతీరంలో ఫొటోలు దిగుతున్నారు. అదే సమయంలో నదికి పైన ఉన్న 126 మెగావాట్ల లార్జ్ జల విద్యూత్ కేంద్రానికి సంబంధించిన జలాశయం నుంచి  అధికారులు నీటిని వదలడంతో అకాస్మాత్తుగా నీటి ఉధృతి పెరిగి 24 మంది విద్యార్థులు ప్రవాహంలో కొట్టుకుపోయారు. జూన్ 26 నాటికి  జరిపిన వెతుకులాటలో 19 మంది మృత దేహాలు లభించాయి.

## తూర్పు గోదావరిలో గ్యాస్ ప్రమాదం

ఆంధ్రప్రదేశ్‌లోని తూర్పుగోదావరి జిల్లా నగరం గ్రామంలో జూన్ 27న ఉదయం గ్యాస్ పైప్‌లైన్ పేలి 12 మంది అక్కడికక్కడే మృతి చెందగా ముగ్గురు చికిత్స పొందుతూ మృతిచెందారు. 23 మంది తీవ్రంగా గాయపడి ఆసుపత్రుల్లో చికిత్స పొందుతున్నారు. మృతుల సంఖ్య పెరిగే అవకాశం ఉంది. ఈ సంఘటనలో 14 ఇళ్లు, పెద్ద సంఖ్యలో కొబ్బరి చెట్లూ కాలిపోయాయి. గ్యాస్ సరఫరా ఒత్తిడిని పైప్‌లైన్ తట్టుకోలేక, నాసిరకంగా ఉన్నచోట లీకై పైపు పేలిపోయిందంటున్నారు. వీ

## ఇరాక్‌లో కొనసాగుతున్న అంతర్యుద్ధం

ఇరాక్‌ను షియా ప్రభుత్వం నుండి విముక్తి చేయడానికి ఇస్లామిక్ స్టేట్ ఆఫ్ ఇరాక్ లెవెంట్ (ఐఎస్ఐఎల్) సున్నీ ఇస్లామిక్ సంస్థ బాగ్దాద్ స్వాధీనంకోసం ప్రభుత్వ బలగాలతో పోరాడుతోంది. తిరుగుబాటు దారులు ఒక్కొక్క నగరాన్ని స్వాధీనం చేసుకుంటూ బాగ్దాద్ వైపు కదులుతున్నారు. ఇరాక్ సంక్షోభ నివారణకు ఏ ఇతర అన్యదేశాల జోక్యాన్ని సహించేదిలేదని ఇరాక్ ఇస్లాం మతాధిపతి అలీఖమేని హెచ్చరించారు. ఇరాక్‌లోని ఇతర దేశాల రాయబార కార్యాలయాలను రక్షించుకునేందుకు ఆయా దేశాలు స్వంత బలగాలను మోహరించాయి.

## ఉక్రెయిన్‌లో తిరుగుబాటు

ఉక్రెయిన్ తూర్పు ప్రాంతంలో సైన్యం చేపట్టిన సైనిక చర్యలో 59 మంది సైనికులతో సహ 181 మంది మరణించగా 293 మందికి గాయలయ్యాయని ఆ దేశ ప్రాసిక్యూటర్ జనరల్ తెలిపారు. ఉక్రెయిన్ రాజధాని లుగాన్స్క్‌లో తిరుగుబాటుదార్లు ప్రభుత్వ ప్రధాన కార్యాలయాన్ని పేల్చివేసిన ఘటనలో ఎనిమిది మంది మరణించారు. తూర్పు ఉక్రెయిన్‌లో సైనిక కుట్ర అనంతరం అధికార పగ్గాలను చేపట్టిన ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఏప్రిల్‌లో ప్రారంభమైన తిరుగుబాటుపై కివ్ సైన్యం ఉగ్రవాద నిరోధక చర్యల పేరుతో స్థానిక మిలిటెంట్లపై ఉక్కుపాదం మోపుతుంది.

## నైజీరియాలో బాంబు పేలుళ్లు

నైజీరియా బోకోహరామ్ ఇస్లామిస్ట్ సంస్థ వరుస బాంబు పేలుళ్లకు పాల్పడుతోంది. దేశ రాజధాని అబుజాలో ఒక షాపింగ్ మాల్‌లో జూన్ 25న బోకోహరామ్ మిలిటెంట్లు బాంబు దాడులు చేశారు. ఈ దాడిలో 21 మంది చనిపోగా, 17 మంది గాయపడ్డారు. ఈ దాడి దేశ పార్లమెంట్‌కు అతి దగ్గర ఉన్న ఎమాబ్ ప్లాజాలో జరిగింది. రాత్రి సమయం కావడంతో షాపింగ్ మాల్ జనంతో కిటకిటలాడుతోంది.

## మహిళా హక్కుల కార్యకర్త కాల్చివేత

లిబియా దేశంలోని బెంగాజీ నగరంలో ప్రముఖ మహిళా హక్కుల కార్యకర్త, న్యాయవాది అయిన సల్వాబుగాయిఘిస్‌ను జూన్ 25న గుర్తు తెలియని వ్యక్తులు కాల్చి చంపారని అధికార వార్త సంస్థ లానా తెలియ చేసింది. ఆమె 2011లో జరిగిన ఉద్యమంలో మిలిటెంట్లకు, ఇస్లామిక్ ఉగ్రవాదులకు వ్యతిరేకంగా పోరాడారు.

## యెమెన్ విమానాశ్రయంపై ఆల్‌ఖైదా దాడి

యెమెన్ దక్షిణ ప్రాంతాన ఉన్న హద్రామాత్ ప్రావిన్స్‌లోని సయోస్ విమానాశ్రయంపై జూన్ 26న ఆల్‌ఖైదా మిలిటెంట్లు దాడి చేశారని అధికారులు వివరించారు. మొదట విమానాశ్రయంపై దాడి చేసి అక్కడికి దగ్గరలో ఉన్న ఎయిర్‌కంట్రోల్ టవర్‌పై బాంబుల వేశారని యెమెన్ భద్రతా అధికారులు తెలిపారు.

## ఈజిప్టు అధ్యక్షుడిగా అబ్దుల్ ఫతా

ఈజిప్టు మాజీ సైన్యాధిపతి అబ్దుల్ ఫతా అల్ సిసి నూతన అధ్యక్షునిగా ఎన్నికయ్యారు. రాజ్యాంగ కోర్టు ఆవరణలో జూన్ 8న రాజ్యాంగ న్యాయస్థానం డిప్యూటి హెడ్ మహెర్ అబ్దుల్ ఫతా అల్ సిసి చేత దేశ అధ్యక్షునిగా ప్రమాణ స్వీకారం చేయించారు. ఆయన ఈ పదవిలో నాలుగు సంవత్సరాలు కొనసాగుతారు. గత నెలలో జరిగిన అధ్యక్ష ఎన్నికల్లో సిసికి 96.9 శాతం ఓట్లు లభించగా ఆయన ఏకైక ప్రత్యర్థి హామ్దీన్ సబాహీకి 3.1 శాతం ఓట్లు మాత్రమే వచ్చాయి.

## కరాచీ విమానాశ్రయంపై దాడి

కరాచీలోని విమానాశ్రయంలో గల శిక్షణా కేంద్రంపై తాలిబాన్ మిలిటెంట్లు జూన్ 10న దాడిచేశారు. కరాచీ అంతర్జాతీయ విమానాశ్రయంపై దాడి చేసిన రెండు రోజులకే తాలిబన్లు మళ్లీ ఈ దాడి చేశారు. అయితే ఇది పూర్తి స్థాయి దాడి కాదని, ఎలాంటి హింస జరగలేదని విమానాశ్రయం భద్రతా అధికారి కల్నల్ తాహెర్ తెలిపారు.

## బ్రెజిల్‌లో రవాణా కార్మికుల సమ్మె

బ్రెజిల్ కార్మికుల 12.2 శాతం వేతన పెంపును గవర్నర్ గెరాల్డో అలెక్మి తోసిపుచ్చారు. దీంతో కార్మికులు జూన్ 10న నిరవధిక సమ్మెకుదిగారు. కార్మికులు సమ్మెకు దిగడంతో మెట్రో రవాణా వ్యవస్థ పూర్తిగా స్తభించింది. ఈ నిరసనలో కార్మికులపై మిలిటరీ బలగాలు బాష్పవాయు, రబ్బర్ బుల్లెట్లు, సౌండ్ గ్రెనేడ్స్ ప్రయోగించి కార్మికులను చెదరగొట్టె ప్రయత్నం చేశారు.

## పాక్‌లో వాయుసేన దాడులు

పాకిస్థాన్‌లోని వాయవ్య ప్రాంతంలోని గిరిజన ప్రాంతాల్లో వాయుసేన యుద్ధ విమానాలు జూన్ 13న జరిపిన దాడుల్లో ఉగ్రవాదులకు చెందిన 9 స్థావరాలు పూర్తిగా ధ్వంసం కాగా, 15 మంది మిలిటెంట్లు మరణించారు. కరాచీలోని జిన్నా అంతర్జాతీయ విమానాశ్రయంపై తాలిబన్లు రెండోసారి దాడి చేసిన మరుసటి రోజే ఈ దాడులు జరిగాయి.

## సోమాలియా పార్లమెంట్‌పై మిలిటెంట్ల దాడి

మే చివరి వారంలో షెబాబ్ తిరుగుబాటుదారులు సోమాలియా పార్లమెంట్‌పై దాడిచేసిన సంఘటనలో నలుగురు భద్రతా సిబ్బంది, నలుగురు తిరుగుబాటుదారులు మరణించారు. మరో సంఘటనలో కెన్యా తీరప్రాంతంలో ఉన్న చిన్న పట్టణమైన ఎంపెకెటోనిలో సోమాలియా మిలిటెంట్లు పోలీస్ స్టేషన్‌పై దాడిచేశారు. రెండు హోటళ్లకు నిప్పు పెట్టారు. ఈ ఘటనల్లో 48 మంది చనిపోయారని అధికారులు తెలిపారు. ఈ దాడి జూన్ 15 సాయంత్రం నుంచి జూన్ 16 ఉదయం వరకు జరిగిందని తెలిపారు.

# అసహజ మరణాల సూచి

సంకలనం : వై.రామచంద్రం, ఎ.మల్లేశ్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుదుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(1 మే నుండి 31 మే 2014 వరకు జిల్లాలలో 12 అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1354)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు స్త్రీ | ఇతరాలు పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 2 | – | 15 | 13 | 4 | 4 | 3 | 2 | 1 | 2 | 2 | 1 | 1 | 23 | 28 | – | – | – | 4 | 4 |
| హైదరాబాద్ | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| కరీంనగర్ | 1 | 5 | 4 | 10 | 15 | 9 | 7 | 4 | 9 | 10 | 11 | 13 | 2 | 1 | 25 | 8 | – | – | – | – | 45 |
| మహబూబ్‌నగర్ | – | 2 | – | 17 | 10 | 4 | 2 | – | – | 1 | 7 | 16 | 30 | 18 | 45 | 10 | 2 | – | – | – | 9 |
| మెదక్ | 3 | 22 | 1 | 9 | 12 | 4 | 9 | 9 | 2 | 3 | 3 | 5 | 2 | 3 | 4 | 4 | – | – | – | 2 | 2 |
| నల్గొండ | – | 1 | – | 8 | 7 | 2 | 2 | – | – | 7 | 2 | 4 | – | 6 | 57 | 32 | – | – | – | 6 | 46 |
| ఖమ్మం | – | – | – | 11 | 16 | 4 | 3 | – | – | 1 | 3 | 1 | – | 2 | 15 | 25 | – | – | – | – | 14 |
| నిజామాబాద్ | – | – | – | 14 | 30 | – | – | – | – | 10 | 3 | 5 | 2 | 5 | 31 | 16 | – | – | – | – | 5 |
| వరంగల్ | – | 5 | – | 2 | 3 | 5 | 6 | 4 | – | – | – | – | 2 | 9 | 21 | 9 | – | – | – | – | 14 |
| అనంతపురం | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| చిత్తూరు | – | – | – | 9 | 8 | – | – | – | – | – | 7 | 9 | 16 | 4 | 44 | – | – | – | – | – | 7 |
| కర్నూలు | – | 4 | – | 7 | 4 | 6 | 6 | 8 | 5 | 3 | 5 | 6 | 5 | 2 | 20 | 16 | – | – | – | – | 6 |
| శ్రీకాకుళం | – | – | 1 | – | 9 | 3 | 8 | – | 1 | 2 | – | – | 2 | 7 | 35 | 11 | – | – | – | – | 3 |
| విశాఖపట్నం | – | – | – | 3 | 16 | – | 3 | 1 | 2 | 4 | – | 5 | 2 | 1 | 27 | 18 | – | – | – | 6 | 5 |
| **మొత్తం** | **4** | **39** | **6** | **105** | **143** | **41** | **50** | **29** | **21** | **42** | **43** | **66** | **64** | **59** | **347** | **117** | **–** | **–** | **–** | **18** | **160** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

## ఆర్థిక వ్యవస్థ – సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 75 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం – ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| సామాజిక విద్య – ఒకమిథ్య | ఎ. నర్సింహారెడ్డి | 100 |
| ప్రజా ఎజెండా లేని పార్లమెంటరీ రాజకీయాలు | ఎ. నర్సింహారెడ్డి | 40 |
| ఒక ప్రేతాత్మక కథ | అరుంధతీ రాయ్ | 25 |
| సమాధిలోకి సామ్రాజ్యవాదం | డి. పాపారావు | 200 |
| కొత్తకోణం | ఎనిశెట్టి శంకర్ | 80 |
| ఫారన్‌హీట్ 451 | ఎనిశెట్టి శంకర్ | 90 |
| నిత్యజీవితంలో సోషలిజం | భూసారం శివన్న | 100 |

## తెలంగాణ

| | | |
|---|---|---|
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 100 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |

## శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ – పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం – సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

## కులం–మతం

| | | |
|---|---|---|
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 30 |
| ఎస్సి, ఎస్టీ నిధులు, విధిలింపు - మళ్లింపు | బొజ్జా తారకం | 40 |
| ఎస్సి, ఎస్టిలపై అత్యాచారాలు | బొజ్జా తారకం | 50 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా పూలే | 40 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 30 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| దళితులు – రాజ్యం | అంబేద్కర్ | 25 |
| శూద్రులు – ఆర్యులు | అంబేద్కర్ | 8 |
| ఆధునిక భారతదేశంలో అంటరానితనం | అంబేద్కర్ | 25 |
| దాస్య విముక్తి కోసం | అంబేద్కర్ | 15 |
| భారతదేశం ప్రజాస్వామ్యం | అంబేద్కర్ | 12 |
| ఆంగ్లేయపాలకులు – అంటరానివాళ్లు | అంబేద్కర్ | 20 |
| రాష్ట్రాలు – మైనారిటీలు | అంబేద్కర్ | 40 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 70 |
| నేను హిందూవు నెట్లయిత? | కంచె ఐలయ్య | 80 |

## సాహిత్య విమర్శ – వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| పరామర్శ | నల్లూరి రుక్మిణి | 80 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–1 | శారదాంబ స్మారక కమిటీ | 300 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–2 | శారదాంబ స్మారక కమిటీ | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–3 | శారదాంబ స్మారక కమిటీ | 250 |
| సాహిత్య సమాలోచన | కృష్ణాబాయి | 300 |
| సందిగ్ధ సందర్భం | సి.వి. సుబ్బారావు | 40 |
| సామాజికం | వి. చెంచయ్య | 30 |
| స్త్రీవాద సాహిత్యం | డా. నళిని | 70 |

## చరిత్ర–జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| కశ్మీర్‌లో ఒక నిషిద్ధ రాత్రి | బషారత్ పీర్ | రు. 150 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 40 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 50 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 80 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 100 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 70 |
| కన్నబీరన్ | వ్యాస సంకలనం | 50 |
| చేగువేరా | కాత్యాయని | 80 |
| ఒక సెక్స్ వర్కర్ ఆత్మ కథ | నళినీ జమీలా | 50 |
| పరాయి పాలనను ఎదిరించిన ఝాన్సీ | మహాశ్వేతాదేవి | 150 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| పరిచయాలు | ఎన్. వేణుగోపాల్ | 50 |
| నా ప్రజాజీవితం | పెండ్యాల రాఘవరావు | 50 |
| ఆర్.ఎస్.రావు స్మృతిలో | వ్యాస సంకలనం | 50 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| టాల్‌స్టాయ్ పరిచయ వ్యాసాలు | యన్.వి.ఎస్. నాగభూషణాచార్యులు | 30 |
| నూరేళ్ల కాళోజీ | వరవరరావు | 60 |
| ఆకుల భూమయ్య రచనలు | తెలంగాణ విద్యార్థి గళం | 40 |

## తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | 100 |
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం-లెనినిజం-మావోయిజం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 100 |
| లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణలు అన్ని | | |

## విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 30 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| జనహృదయం జనార్దన్ | సూరపనేని మోహనరావు | 60 |
| కోటి జ్ఞాపకాలు | విరసం ప్రచురణ | 50 |
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్–1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్–2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| రివిజనిజం | విరసం ప్రచురణ | 75 |
| జనతన జైత్రయాత్ర | విరసం ప్రచురణ | 20 |
| అంతర్యుద్ధంలో ఆదివాసులు | విరసం ప్రచురణ | 20 |
| ఆదర్శ జీవులు ఆమరులు | విరసం ప్రచురణ | 30 |

## కథ – నవల

| | | |
|---|---|---|
| దండకారణ్యంలో కథలు(2005–2012) | విరసం ప్రచురణ | 100 |
| రేపు కథ | వెర్నన్ గొంజాల్విస్ | 20 |
| మిగిలేటోళ్లు | బాసిత్ | 50 |
| కాంత పున్నం వెన్నెల | పద్మకుమారి | 20 |
| గంగానమ్మ | విజయ | 15 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 80 |
| కథలగూడు | దేవులపల్లి కృష్ణమూర్తి | 60 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| చంద్రగిరి శిఖరం | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 50 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| నేల నాగలి – మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| పంచతంత్రం | బొజ్జాతారకం | 100 |
| ఇస్మత్ చుగ్తాయి కథలు | ఇస్మత్ చుగ్తాయి | 100 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 80 |
| రేపటి కల | రిచర్డ్ రైట్ | 50 |
| ఒంద్రుమట్టి | నల్లూరి రుక్మిణి | 170 |

**వీక్షణం,** మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email: veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 156 - July 2014 ı ISSN 2231-6892
ı RNI Regn.No.APTEL/2003/11482 ı Published on 27/06/2014 ı Postal Regn. No. L II/RNP/HD/1100/2014-16

# వేలాది మంది అభిమానుల కోరిక
# వీక్షణంను కాపాడుకుందాం
# ఎందరో శ్రేయోభిలాషులు చాస్తున్న స్నేహహస్తం
# వీక్షణం మనుగడ కోసం శాయశక్తులా కృషి చేద్దాం,
# మూలనిధి ఏర్పాటు చేద్దాం

**వీక్షణం ఆర్థిక సమస్యల నుంచి గట్టెక్కి చిరకాలం కొనసాగాలంటే చందాదారులు, పాఠకులు పెరగాలి. ప్రతినెలా కనీసం మూడు పేజీల ప్రకటనలు రావాలి. శక్తి ఉన్న దాతలు ఇతరులకు కానుకగా చందాలు, విరాళాలు ఇవ్వాలి. వీక్షణం చిరకాలం మనుగడ సాగించడానికి వీలుగా మూలనిధి ఏర్పడాలి. ఈ విశాల సహాయ చర్యలలో భాగంగా:**

- వీక్షణం పాఠకులలో ప్రతి ఒక్కరమూ కనీసం మరొక చందా చేర్పించవచ్చు
- వీక్షణం పాఠకులలో ప్రతి ఒక్కరమూ మన చందాతో పాటు కనీసం రు. 100 వీక్షణం మూలనిధికి విరాళంగా ఇవ్వవచ్చు
- కళాశాలలను, విద్యాసంస్థలను, ప్రభుత్వ, ప్రైవేటు గ్రంథాలయాలను వీక్షణం చందాదారులుగా చేర్పించి వీక్షణం మరింత మంది పాఠకులకు చేరువయ్యేలా చూద్దాం
- ప్రతి న్యూస్ ఏజెంట్ దగ్గరా వీక్షణం విడిప్రతులు అమ్మకానికి ఉండే ఏర్పాట్లు చేయవచ్చు
- ఆర్థిక పరిస్థితి మెరుగ్గా ఉన్న వీక్షణం పాఠకులు తమ బాధ్యతగా వారి సంవత్సరాదాయంలో కనీసం ఒక శాతం వీక్షణం మూలనిధికి విరాళంగా ఇవ్వవచ్చు
- సామాజిక జీవితంలో క్రియాశీలంగా ఉన్న, విస్తృత పరిచయాలు ఉన్న వీక్షణం అభిమానులు తమకు తెలిసిన దాతల నుంచి వీక్షణం మూలనిధికి విరాళాలు సేకరించవచ్చు
- విద్యాసంస్థల, ఆరోగ్య సంస్థల, సాధారణ వ్యాపార సంస్థల నిర్వాహకులతో పరిచయాలు ఉన్న అధ్యాపకులు, మిత్రులు, సామాజిక కార్యకర్తలు వీక్షణం కోసం ఆయా సంస్థల వ్యాపార ప్రకటనలు సేకరించవచ్చు
- వీక్షణం ప్రచారం కోసం, ఆర్థిక సహాయం అర్థించడం కోసం మీ ప్రాంతాలలో సమావేశాలు ఏర్పాటు చేయవచ్చు

**వివరాలకు**

**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029. ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao